సరస్వతీ గ్రంథమండలి :



# 20 వ శతాబ్ది
# అమెరికాలో మతం

రచన :
హెర్బర్ట్ వాలస్ షినీడర్

అనువాదం :
తిరుమల రామచంద్ర

సరస్వతీ గ్రంథమండలి:

# 20 వ శతాబ్ది అమెరికాలో మతం


రచన:

హెర్బర్ట్ వాలస్ షినీడర్

అనువాదం:

తిరుమల రామచంద్ర



పబ్లిషర్సు: అద్దేపల్లి అండ్ కో

సరస్వతీ పవర్ ప్రెస్

రాజమహేంద్రవరము

# 20 VA SATABDI AMERICALO MATHAM

(Religion in 20th Century America)

by
HERBERT WALLACE SCHNEIDER



Translated by
THIRUMALA RAMACHANDRA

First Edition - July 1962 - Price Rs. [illegible]



Publishers : ADDEPALLY & Co.
SARASWATHI POWER PRESS
RAJAHMUNDRY (A. P.) India

# ముందుమాట

అమెరికా మత చరిత్రలూ, మత సంబంధమైన సాంఘిక మనస్తత్వ మానవజాతిపరిణామాధ్యాత్మిక శాస్త్రాలూ పెక్కు ఉన్నవి. ఈ గ్రంథాన్ని ప్రామాణికమైన పరిశోధనలు, విజ్ఞానశాస్త్రాలూ ఆధారంగా వ్రాసినప్పటికీ, ఇది వాటిలో ప్రత్యేకించి ఏ కోవకూ చెందదు. ఇది ముఖ్యంగా ఒక స్మృతి చిహ్నం వంటిది. ఈ శతాబ్ది ప్రారంభంలో మతం ఎలా ఉండేదో జ్ఞాపకం పెట్టుకొని, చరిత్రకారులవలె సాహిత్యావశేషాల, తదితరాధారాలదృష్ట్యా కాకుండా, ఆనాటి ప్రజలకు సర్వసామాన్యంగాను, నేటివారికి విపరీతంగాను కనిపించే సంఘటనలను, ఉద్దేశాలనూ, నాటి ప్రజలు ఊహించనట్టి నేటి ప్రజలకు సర్వసామాన్యమైనట్టి సంఘటనలు, ఉద్దేశాలూ ఆధారంగా అప్పటి మతాన్ని నేటిమతంతో పోల్చి చూడగల వారి తరం త్వరితంగా క్షీణిస్తున్నప్పటికీ, వారు ఇంకా కొందరున్నారు. సర్వసామాన్య మనేది తరచుగా తికమక పెట్టే పదం. దీనికి అర్థం అందరికీ తెలిసిందేనని చెబితే చాలునని మనం భావిస్తాము. కాని, ఈ సర్వసామాన్యమైనది వింతగా మారినప్పుడు, దాన్ని గురించి కొంతవరకు వివరించి చెప్పవలసి ఉంటుంది. కడచిన అర్థశతాబ్దిలోను మన అలవాట్లూ, భావాలూ, వ్యవస్థలూ ఎంతో మార్పు చెందినవి. అందువల్ల మన తరంలో సంభవించిన మార్పులను మననం చేసుకొని వాటి కారణాలను సాధ్యమైనంతవరకు వివరించడం ప్రత్యేకంగా సమంజసమే కాక ముఖ్యంకూడ. ఈ మన మతవిప్లవ చిత్రణం పైన పేర్కొన్న సిద్ధాంతాలు ప్రాధాన్యమిచ్చిన సమస్యలను వివరించడానికి పూనుకొనజాలదు గాని, ముందుతరాల వారికి లాభదాయకంగా ఉండే విధంగా కనీసం ఒక తరంలో అమెరికా మతంలో సంభవించిన మార్పులను తెలియజేయగలదు. 1950 వ సంవత్సరం నుంచి నూతనంగా తమ విశ్వాసాలను భక్తి భావాలనూ ఏర్పరచుకొన నారంభించే తరంవారు తప్పకుండా, 20 వ శతాబ్ది మధ్య భాగం తమకు ప్రారంభ దశగా కాకుండా ఒక విజయంగానో, పరాజయంగానో భావించే తరం వారు చెప్పుకొనిన దానికి విలక్షణమైన పద్ధతిలో మతా

నికి నిర్వచనం చెప్పుకోనవలసి ఉంటుంది. ఈ మతపరిణామాలను చూచి అనుభవించడం వల్ల మతానుభవానికి ఒక ప్రత్యేకమైన ప్రాధాన్యం, ఒక విధమైన విషాద దృక్పథం కలుగుతవి. అటుపిమ్మట ఎన్ని హేతువాదాలు చేసినా, ఆ లోటు తీరదు.

అందువల్ల దానికి అనుగుణంగా ఈ పర్యాలోకనంలో మతానుభవమే మన ప్రధాన విషయం; ఇది మత జీవితానికి సంబంధించినదే కాని, అమెరికా మత సంప్రదాయాలకూ, సాంఘిక వ్యవస్థలుగా చర్చిలకూ, ఆధ్యాత్మిక తత్త్వవిభేదాలకూ సంబంధించినది కాదు. అమెరికా మతజీవితం మత నిష్ఠిత మని, మతానుభవ మనేది రహస్య గర్భితమైన ఏకాంతవాసమని అనుకుంటే, ఒక దాని వెంబడిని మరొకటిగా వెలువడనున్న ఈపుస్తకాలలో వివరించే "అమెరికా నాగరకత" పై మనం చేసే మత పరిశీలన ప్రభావం చాల తక్కువగా ఉండవలసి వస్తుంది. అమెరికాలో మతసంబంధమైన సంస్కృతి ఏదో ఒక ప్రత్యేకమైన ఉద్దేశంతో ఎవరో నిరంకుశంగా సృష్టించినదిగానీ, ఒక సంపాదకీయ విధానం వల్ల ఏర్పడినదిగానీ కాదు; అది అమెరికా మతానికి అతి సహజమైనది. ఒక ప్రత్యేక నాగరకతనుంచి కాని, సర్వ సామాన్యమైన నాగరతనుంచి కాని మతాలను, చర్చిల పరిపాలన వ్యవస్థలను, ఛాందసాలను, యోగులను, ఆరాధనలను విడదీయడం సాధ్యం కావచ్చు. మతం ఒక జీవిత విధాన మనే దృష్టితో కాకుండా మతదృష్టితో జీవితాన్ని పరిశీలించడం కూడ సాధ్యపడవచ్చు; అయితే ఆవిధంగా విభాగించడం అమెరికా సంస్కృతికీ, అనుభవానికీ హానికరం. మానవుల నాగరక జీవితంతోను, మానవ సంబంధమైన ఇతర "శాస్త్రేతర విషయాలతోను" ఎడతెగని సంబంధంగలదే మతం. అందువల్ల మతమంటే ఏమిటో స్పష్టంగా చెప్పాలంటే, మతాన్ని మానవజీవితంలో ఒక అంశంగా వివరిస్తూ, మానవజీవితంలోని ఇతరాంశాలతో దీనికి గల సంబంధాలను విశదం చేయవలసి ఉంటుంది. మతమే "సర్వస్వం" అనే నిరంకుశ నిర్వచనంతోగాని, మతం మానవుని ఉత్పత్తులలోనో, మానవుని పరిపాలనలోనో అనుషంగికంగా ఏర్పడినదనే, ఊహలతోగాని మనకు

అవసరం లేదు. సంస్కృతి వికాసంలో మతమే ప్రధానమైన శక్తిగా ఉండాలనే మత సంస్థలవారి అభిప్రాయాన్నిగాని, సంస్కృతి పరిణామంలోని ఒక దశను ప్రతిబింబించేది మాత్రమే మత మనే మార్క్స్, ఫ్రాయిడ్‌ల ఊహాలనుగాని మనమిక్కడ చాల ముఖ్యమైనవిగా తీసుకోవలసిన అవసరంలేదు. ఒకానొక చర్చిగాని సిద్ధాంతంగాని రాజకీయార్థిక రంగాలలో నిర్వహించిన పాత్ర ఎటువంటిదైనప్పటికీ, మతప్రబోధకులు, వారి అనుయాయులు చెప్పుకొనే స్వోత్కర్షలు ఎలా ఉన్నప్పటికీ, ఏమతంకూడా దాని పరిసరసంస్కృతికి మించినదిగానో, వెనుకబడినదిగానో ఉండజాలదు; అంటే పరిసర పరిస్థితులలో మతమూ ఒక అంతర్భాగం. నాగరకతాభివృద్ధికి పరిసరాలలోని ఇతరపరిస్థితులు ఎంత నిర్మాణాత్మకమైన దోహద మిస్తాయో మతం కూడ అంత దోహద మిస్తుంది. నేను తత్త్వశాస్త్ర చర్చలో పాల్గొన్నట్టయితే, మానవుడు నమ్మి కొలిచినవాడే దేవు డవుతాడు గాని యాదృచ్ఛికంగా ఏర్పడినవాడు కాడని తార్కికంగా నిరూపించేవాడిని. దీనినే మరికొంత ఉత్తమమైన విధంగా ఆధ్యాత్మిక దృష్టితో చూస్తే, మతం — అది నేడున్న స్థితిప్రకారం స్వయంపోషకమైనది కాదని, అది సమ్మిళిత మానవ వ్యవస్థలలోను, మానవుల ఆశయాలకు అవసరాలకు అనుగుణంగాను ఉన్నదని, వీటి నది తన ప్రాబల్యంలో ఉంచుకున్నా, లేక వాటిలో అంతర్లీనమై ఉన్నా, ఎలాగైనా ఇవన్నీకూడ దాని ఉనికికి అత్యవసరమైనవనీ చెప్పడం సబబుగా ఉంటుంది. ఈ 20 వ శతాబ్ది అమెరికా మతస్వరూప చిత్రణంలో మతజీవితానికి ఏవేవి అవసరమో వాటిపై దృష్టిని కేంద్రీకరించడం మనకర్తవ్యం. ఒకే పోలికలుగల మతవిశ్వాసా లనేకం ఉన్నవి. చర్చిలకర్తవ్యాలలో గూడ మతప్రసక్తిలేనివి అనేకం ఉన్నవి. కళల అభివృద్ధికి దోహదం కలిగించిన మతసంబంధమైన వ్యవహారాలూ చాల ఉన్నవి; ఇవన్నీ అమెరికా సంస్కృతిలోని ముఖ్యాంశాలుగా ఉండవచ్చు; అయితే మన మిక్కడ అమెరికా జీవితంలో ఒక భాగమైన మతం తదితరభాగాలకంటే ఎంత విలువైనదనే విషయానికంటే, మతానికి ఏమి సంభవించినదనే విషయానికే ఎక్కువ ప్రాధాన్యమిచ్చి వివరించదలచుకొన్నాము గనుక, పైనపేర్కొన్నవి

గూడ మన అంశానికి ఏమాత్రం తక్కువ ప్రాముఖ్యం గలవి కాదు.

మతానికి సారభూతమైనది లేదా జీవనాడి శాశ్వతమైనది, కాలాతీతమైనది, పరిణామాతీతమైనది అని ప్రబోధించే తాత్త్వికసిద్ధాంతం ఉంది. దీనిని ఎంత విరివిగా ప్రబోధిస్తూ వచ్చినా, త్రోసిరాజనడం నిత్యమూ జరుగుతూనే ఉన్నది. ప్రస్తుతం మన ఆశయం సాధ్యమైనంతవరకు మతానికి సారభూతమైన దాని సమీపానికి చేరుకొని ఒక తరానికీ ఇంకొక తరానికీ మధ్య కాలంలో ఇది ఏవిధంగా మార్పు చెందుతున్నదో చూపించడమే. మతప్రబోధకులు తరచు ప్రబోధించే విధంగా మత జీవితం స్థిరమైనదీ, విగ్రహారాధన సంబంధమైనదీ, స్వయంపోషకమైనదీ అయితే, ఆ విషయమై ప్రచారం చేయవలసిన ఆగత్యం ఏమంత ఎక్కువగా ఉండదు; దాన్ని సాంస్కృతికంగా అర్థంచేసుకొనడానికి ప్రయత్నించ వలసిన అవసరం కూడా ఏమంతగా ఉండదు. అందువల్లనే వాస్తవాలు, మతవిషయక వాస్తవాలు ఈ హేతువాదరహిత సిద్ధాంతాన్ని స్పష్టంగా వ్యతిరేకిస్తున్నాయి. ఈ విషయాన్ని గతితార్కికరీత్యా చర్చించడం వృథాప్రయాస కనుక, మత పరిణామాలకు కారణమైన వాస్తవాలే దీనిని వివరించుగాక !

రచయిత

# 20 వ శతాబ్ది
# అమెరికాలో మతం

# విషయసూచిక

# విప్లవాత్మక యుగంలో మతం

## విరామ దిన స్వరూపంలో విరిసినమార్పు

వర్తమాన శతాబ్దంకంటె నేను వయసు ముదిరినవాడిని కావటంచేత భౌగోళికంగాను, సాంస్కృతికంగానుకూడా "మిడిల్ టౌన్" కు సన్నిహితమైన మా గ్రామం పెద్దబజారులో తొలిసారిగా మోటారు బండి సందడిచేస్తూ రావడం జ్ఞాపకం తెచ్చుకోగలను. మరి తొలిసారిగా పేట మీదికి సినిమా వచ్చిపడటమూ నాకు జ్ఞాపకమే. ఆ రోజుల్లో పేటలో వాళ్ళకు నాటకాలంటే చాలావరకూ పడేదికాదు; ఏమంటే, ఈ "ప్రొద్దుపోని ప్రదర్శనం" స్పష్టంగా చర్చిలో ప్రార్థనకంటె అహ్లాదకరంగా ఉండేది! సోమారి వ్యర్థనృత్యాలు, త్రాగుడు, పందేలు, జూదం (లేదా సరదాకు ఆడుకునే పేకాటలే కానియ్యండి) లాగ అంత పాపిష్ఠిది కాకపోయినా నాటకరంగం ముఖ్యంగా "లౌకికం"గా అనగా నిరర్థకంగా ఉండేది. ఈ పల్లెపట్టున బ్రదికేవారు (తమకున్న) శక్తిని ఫలవంతంగా, తెలివిగలుగునట్లుగా, పనికివచ్చేటట్లుగా వినియోగించడం, పలువిధాలయిన ఆటపాటలకు ఉద్రేకాలకు వినియోగించడం అనే ఈ రెంటిని ప్రధానంగా నైతిక దృష్టితో వింగడించి చూచేవారు. ఈ ఆటపాటలు ఉద్రేకాలు కేవలం సమ్మోహపెట్టేవి కావటంచేతనే వాటిని ఆకర్షణలుగా, అంటే గంభీరమైన జీవిత వ్యావృత్తిమీది మనసును చెదరగొట్టేవిగా పరిగణించేవారు. మన మతసంస్థలుగాని, విద్యాసంస్థలుగాని "మోహనం"గా ఉండేవి కావు; ఉండదలచనూలేదు. ఆ రెండూ గంభీర వ్యాపారాలు. విద్య ఫలదం గనుక గంభీరంగా ఉండేది; మతం గాంభీర్యాన్నే సాధనం చేయించేది గనుక గంభీరంగా ఉండేది.

పేటలోకి సినిమా, మోటారుబండి వచ్చినప్పుడు పేటంతా ఉడికిపోయింది. మొదట మొదట వాటి నెవరూ అంత తీవ్రంగా పట్టించుకొనేవారు కారు. అయితే వాళ్లను అనికూడా ప్రయోజనం లేదు. అప్పట్లో

వాళ్లు చాల అమాయకులు మరి. వ్యాపారం, నీతినియమాలు, విద్య, మతం - అనేవాటిలో వీటివల్ల కొన్ని తీవ్రఫలితాలు కలుగుతా యని గొప్ప ఊహాపోహాలు గల ఏ కొందరో అభ్యూహించినా అత్యధిక సంఖ్యా కులు అవేవో తప్పనిసరి అన్న కారణంచేత ఆమోదించారు.

అయోవాలోని మతదృష్టి ప్రజాదృష్టి గల అమానా గ్రామంవారు జనసంఘంలోని యువతీయువకులు త్వరలోనే చర్చి ప్రార్థనలమీదకంటె సినిమాలమీది శ్రద్ధలో పడతారని స్పష్టంగా వెంటనే గమనించి, అదే కారణం చూపి తమ సంఘంలోకి సినిమాను రానియ్యలేదు. ఇట్లాంటి వర్గాలు కొన్ని ఉండేవి. మతంమీద భక్తిశ్రద్ధలున్న వీళ్లు ఇరవై ముప్ఫై సంత్సరాల కాలం తమ పిల్లలంతా సినిమాలున్న పేటలకు తరలిపోతూ ఉండడం చూచారు. ఇట్లా ఈ పాత తరం వాళ్లు తగ్గకుండా చివరంటా పోరాడినారు. కాని ఆస్తికులైన అమెరికన్లలో అత్యధిక సంఖ్యాకులు తమకు తెలియకుండానే తమలోఉన్న లోకజ్ఞతను ఉపయోగించుకున్నారు. సినిమాను, మోటారుబండ్లను అమాయికంగానే అయితేనేమి కానున్నది కాక మానదనే అభిప్రాయంతో అయితేనేమి ఆమోదించుకొన్నారు. మొన్నమొన్న "ఆదివారం పత్రికలు" జనరంజకమైన కాల్పనిక సాహి త్యం, గ్రామఫోను, జాజ్ సంగీతం (దానిప్రక్క వాద్యాలు). విమాన యానం, రేడియో, టెలివిజన్‌లమీద గబగబా పెరిగిన ఆసక్తిని వీళ్లు ఎదుర్కొన్నవైనం విషయంలో గూడా ఇట్లాగే జరిగింది. వీటికి ఆక పెట్టాలనడం, వీటివల్ల ఏమి వస్తుందోనన్న భయం, జుగుప్స, దైవచింత గలవారి మధ్యనుంచి చెదరుగాను, కలసికట్టుగాను సహజంగానే వచ్చి నవి. కాని, మొత్తమీద ఏంజరిగిందీ సాధారణంగా నలుగురికీ తెలిసిరాక ముందే, వీటివల్ల నీతినియమాల్లో మతంలో రాగల విప్లవాత్మక ఫలితా లనుబట్టి వీటిని సంచలనదృష్టితో చూడకముందే ఈ యిరవయ్యో శతా బ్దంలో కనిపెట్టిన ఇవన్నీ అమెరికన్ గ్రామీణ పద్ధతులను, ఆశయాలని, ఆసక్తులను విప్లావితం చేసినవి.

ఈశతాబ్దం మలుపున ఉండిన ఉదారాశయుడైన ఒక గొప్ప మత ధర్మోపన్యాసకుడు 1905 విశేషంగా ప్రకటనకు వచ్చిన ఒకానొక ధర్మో పన్యాసంలో "మారుతున్న మతిరూపాలూ-మతముయొక్క శాశ్వత సారము" అనేవాటిని పరిశీలిస్తూ ఇలా అన్నాడు:

"1794లో మానాన్న పుట్టినప్పుడు ఆనాడు బ్రదికున్నవా రెవరూ అబ్రహాం కంటే త్వరగా ప్రయాణం చేయలేకపోయేవారు. నాటినుంచి ఈ అద్భుతమైన మార్పులన్నీ వచ్చాయి. కానీ మరిగంటకు నాలుగో ఆరో పదో మైళ్ళుకాకుండా గంటకు యాభై మైళ్ళ వంతున నే నెందుకు ప్రయాణం చేయాలి ? చేయగలగటం చాలసౌకర్యమే. కాని అంతమాత్రం చేత నేను తప్పనిసరిగా మరింత మంచివాడి నైనాననిగాని నేను వెళ్ళే చిన్నచిన్న పనుల్లో తప్పనిసరిగా మరింత దయ, న్యాయం, మనుష్య ధర్మం ఉన్నాయనిగాని చెప్పడానికి వల్లగాదు. మన అసలు స్థితినిబట్టి మన నాగరకత వ్యక్తమవుతుందిగాని మనమేమి, ఎంతత్వరగా, ఎంత ఆశ్చర్యకరంగా చేయగల మన్నదానిని బట్టికాదు.

డాక్టర్ శావేజ్‌గారి ఈ పాతకాలపు నాగరికతకు నిశ్చితమైన నీతి నియమాలను చూచి మనం లోలోపల నవ్వుకోవచ్చు; కాని ఈ నాటికీ మనం అదే పద్ధతిలో. మన అంతస్స్వరూపాన్నీ మనచేతలను విడివిడిగా ఉంచే నీతులు చెబుతున్నాం. న్యాయంతో వేగానికిగాని దయతో చౌక బారు విలాసాలకుగాని ఏమి సంబంధం ఉన్నది? కేవలం లౌకిక సంబం ధులుగా కనిపెట్టబడిన వాటిని తాము పరిగణించమని చెప్పుకుంటూ వస్తుతః ఏదీ మారలేదని తలుస్తున్న మతాధికారులు ఈ నాటికీ ఉన్నారు. ఈ కనిపెట్టబడినవన్నీ వస్తుతః భౌతికవస్తువులు, బాహిరవస్తువులు, వట్టి ఉపకరణాలు అనేది నిజమే. కాని ఈ ఉపకరణాల పరిణామంగా మన లను మనం వ్యక్తంచేసుకొనే విధంమాత్రమే కాక మన విశ్వాసాలలోను చేతలలోనుకూడా మార్పులు వచ్చినవని ఈ సరికి ప్రతి ఒక్కరికీ తెలుసు. ఈ ఉపకరణాలు మనకు కల్పించిన క్రొత్త అవకాశాలు, చూపిన క్రొత్త దారులు మన ఆశక్తిని విస్తృతం చేసినవి; లక్ష్యాన్ని మార్చివేసినవి.

ఈ క్రొత్తగా కనిపెట్టిన వస్తువులు అమెరికన్ సంస్కృతిలో సర్వత్ర సృష్టించిన విప్లవాన్ని నేను వర్ణించనక్కరలేదు - ఏమంటే దానికి సంబం ధించిన యథార్థవిషయా లందరూ బాగా ఎరిగినవే. మరి యీ క్రొత్తగా కనిపెట్టిన వస్తువులు లేనప్పుడు జీవితం ఎట్లుండేదో నేను స్మరింపబోవడం లేదు, ఎందుచేతనంటే జ్ఞాపకాలమీది మమకారంతో నాకు జ్ఞాపకం వస్తు న్నట్లు తోచే ఆ "నిరాడంబర జీవితా"న్ని పొగడడంలో పడిపోవచ్చు. అశేష వస్తుసంచయంమీది విపరీత కామనవల్ల మనలో సద్వస్తువుమీది

ఆదరం అంతరించిందన్న నా మిత్రుడు జోసెఫ్ మారూటునియన్ మాట లతో నే నేకీభవించవచ్చు. పెరిగివచ్చిన మన కొనుగోలుశక్తి నుపయో గించుకోటానికి కావలసినన్ని కొత్త మెరుగైన అవకాశాలు విడువకుండా వచ్చి పడుతున్నప్పుడు నిజంగా మనం ఆధునికులంగా ఉండాలని అభిల షిస్తున్నామా అనే ప్రశ్న కాలగతిలో అందని పొందని ప్రశ్నే అవు తుంది. ఏమంటే, సమకాలపు నాగరకతను కాదన్నవాడు తా నెట్లా నాగరకుడు అవుతాడు? భౌతిక వస్తుసంచయం కోసం మనంపెట్టే ఉరు కులు పరుగులవల్ల నిలకడైన తృప్తిని సాధించడంలో మనసు చెదురు తున్నదన్నప్పుడు గడచిన కాలంనాటి నిరాడంబరతను నిజాయితీని గొప్పగా చెప్పుకుంటూ వెనక్కు పారజూస్తాము. అతిగా నీతులు పలికే చాలచోట్ల జాలిగొలుపుతూ వినవచ్చే విషయ మిదే. మన మున్నచోటుగాక మరెక్క డనో మనకు శాశ్వతమైన అథవా నిజమైన వ్యక్తి కనబడతాడని అను కుంటాము; మన ఆంతరవ్యక్తి మన చేత అంతగా అపమార్గం పట్టలేదని ఊహిస్తాము. అయితే మరి యిప్పుడు నీతులు పలకటం నా ఉద్దేశంకాదు. మన మతం, శాశ్వతత్వంపట్ల మన ఆసక్తి నేను ఎట్లా కాలప్రభావానికి లొంగిపోయినాయో మాత్రమే నేను నివేదిస్తున్నాను.

మొదలు పెడుతూనే నేను సర్వసాధారణంగా అందరికీ తెలిసిన ఈ శతాబ్దంలో కొత్తగా కనిపెట్టిన వస్తువులనే ముఖ్యంగా పేర్కొన్నాను. కారణ మేమంటే కేవలం ఆ వస్తువులే మతాన్ని విప్లావితం చేసి ఉండవచ్చు. కాని, ఈ కొత్తగా కనిపెట్టినవన్నీ మన మనస్సుల్లో ఏర్పడినవాటి పర్యవ సానములైన మార్పులకు, కొత్తగా తెలియవచ్చినవాటికి, కొత్త చరిత్రకు, కొత్త లక్ష్యాలకు, మారిన తాత్వికమార్గాలకు చిహ్నాలు; వాటిఫలాలు. అంతస్సులోని ఈ కదలికలు మతంమీద వీటి ఫలితాలు ముందుముందు, ప్రకరణాల్లో మన మాలోచించే విషయాలు. సాంకేతిక యంత్ర విద్య లోను, ఆర్థికంగాను వచ్చిన విప్లవాలు మతానికి ఏ ఫలాలు కట్టబెట్టినవో ఇక్కడ వివేచించుదాము.

చర్చి కార్యకలాపాల్లోని మతసంబంధమైన "బాహ్య విషయాలు" చర్చికి వెళ్ళే అలవాట్లు, విరామదిన పరిపాలనం అనేవాటితో ఆరంభి స్తాను. క్రీ. శ. 1800, 1700 లో లాగే 1900 లోను మతాచారపరులైన అమెరికనులు దగ్గర చాపులనున్న చర్చికి నడిచికాని, బండ్లలోగాని వారా

నికి పలుసార్లు వెళ్లి వచ్చేవారు. చర్చిమందిరం ప్రాంతీయ సమాజానికి భౌతికమైన కేంద్రస్థానంగా ఉండేది; పారిష్ మత కార్యకలాపాలకు పటిష్ఠమైన కేంద్రసంస్థ, జీవగర్ర. చిన్నపల్లెలకుగూడ దగ్గరలో కనీసం రెండుమూడు చర్చిలన్నా ఉండేవి. కాని ఈ తెగలవారీతనం అథవా మత సంబంధమైన ఈ బహుళత్వం చర్చికి లేదా యూదు ప్రార్థనామందిరానికి ఉన్న "ప్రాంతీయ సమాజానికి కేంద్రస్థాన" మనే లక్షణాన్ని పాడు చెయ్యలేదు. ఒక పేట కలిసికట్టుతనం ఏకైకంగా స్థాపించబడ్డ "సమావేశ మందిరం"లో కేంద్రీకృతం కాకపోయినా, దాని కిది చిహ్నమని భావిస్తూ ఉండిన న్యూ ఇంగ్లండ్ రాష్ట్రంలోకూడా క్రమంగా పెద్దపెద్ద పేటల్లో ఏర్పడుతూ వచ్చిన ఇతరములైన ప్రొటెస్టెంట్ చర్చులు, రోమన్ కాథలిక్ చర్చులు, యూదుల ప్రార్థనా మందిరాలు, భగవత్ప్రశక్తిని చాటే మందిరాలుగా ఉంటూనే ఆయా ప్రాంతీయ సమాజంలోని వ్యక్తులకు రచ్చపట్టులుగా ఉండేవి. ప్రాంతీయ సమాజాలకు పల్లెటూరు ఇట్లా ఇరుగుపొరుగైంది. ఇరుగు పొరుగువారు వేరువేరు చర్చులకు పోవచ్చు. ఏదో ఒక చర్చికి పోతున్నంతవరకూ నలుగురితో పాటుగా నడచుకుంటూ మతంపట్ల భక్తిశ్రద్ధలు చూపినట్లే. నాలుగు వేలకుపైగా/జనమున్న మా ఊరిలో ఏడు చర్చులుండేవి. మతసంబంధమైన భేదాలున్నా ఊరివారిలో చాలా మందిలో సంఘీభావ ముండేది. ఏ చర్చికీ పోని కొద్దిమంది ఎవరైనా ఉంటే, వారితో పొచ్చెంగానే ఉండేవారు. తమ ప్రాంతంలోని ఇరుగు పొరుగులతో పరస్పర పరిచయం కావాలనే వాస్తవాసక్తి గలవారై ఇట్లాంటి "మల్టి పారిష్" సమాజాల్లో, అవి నగరసమాజాలుగాని, గ్రామీణసమాజాలుగాని, పల్లెపట్టు సమాజాలేగాని, ఉండేవారు. ఈ జనమంతా "మీటింగ్"కు వెళ్లినప్పుడు (ఆ మాటకువస్తే మాస్‌కు వెళ్లినా) వీళ్లే నిజమైన పౌరసంఘం అయ్యేవారు. బహిరంగ దైవసంకీర్తనం సామాన్య పూజకంటె ఎక్కువ. ఒక ప్రాంతలోని ఇరుగుపొరుగువారి నందరిని ఒకచోటికి చేర్చేది అది. వారం పొడుగునా ఈ ఇరుగుపొరుగుల వాళ్లల్లో ప్రతి ఒక్కడూ తన పనిపాటల్లో మునిగి తేలేవాడు. విరామ దినంనాడు వాళ్ళు తమ స్వంత పనులు మానుకొవడమే కాదు, మన వ్యాపారపు పలుకుబడిలో "పబ్లిక్ రిలేషన్స్" అనబడే జనసాంగత్యాన్ని పెంపొందించుకొనేవారు. వారాని కొక సమావేశం చాలదని వారి సాధారణ నిశ్చయం. ఆదివారంనాడు

ఉదయం, సాయంత్రం విధిగా చర్చిలో ప్రార్థన ఉండవలసిందే. దీనికితోడుగా "ఆదివారపు బడి" పిన్నల సమావేశాలు ఉండేవి. వారం మధ్యలోగూడ చర్చిలో ఒక ప్రార్థన మాత్రమేకాక కమిటీ మీటింగులు, కాయిర్ రీహార్సల్స్ మొదలయినవి ఉండేవి. జనుల విశ్రాంతి కాలంలో చాలాభాగం చర్చి తీసుకొనేది. ఆదివారం, అనగా విరామదినంనాడు నలుగురిలో కనుపించడమేకాక సాధారణంగా ఆడంబరంలేని కలుపుగోలుతనం వివేకశాలిత పాటించేవారు. గోలగా ఉండే ఆటలు, పోటీలు మానివేసేవారు. చర్చి విధులన్నీ చేసినపిదప ఏదన్నాకాస్త వ్యవధిఉంటే వాహ్యాళిపోవడం, ఎవరింటికైనా వెళ్లి యోగక్షేమా లరసిరావడం, చదువుకోవడం, ఇంట్లో పాడుకోవడం వంటివాటితో సరిపోయేది. ఈ చర్యలలో ఒక క్రమపద్ధతి అంటూ ఏమీలేదు. ఏదో ఒకవిధంగా వారంలో ఈ రోజు మతసంబంధమయిన కార్యక్రమాలలో అయినా, కుటుంబంలో వారితో కలిసి అయినా గడిపేవారు. యూరోప్‌లో విరామదినానికి ఇంత ప్రాధాన్య మివ్వని కేథలిక్కులలోగూడ ఈ రకమైన పరిపాటి త్వరలోనే ఆచారమై పోయింది.

విరామ దినంనాడు ఆధ్యాత్మికమైన కార్యాలు చేసుకోవాలనేది సామాన్యసూత్రం. నిర్దిష్టంగా చెప్పాలంటే, మతసంబంధమైన కార్యాలు, "లోకం" నుంచి విమోచనం పొందడంలో ప్రధాన భాగమైనా, ఒక భాగం మాత్రమే "లౌకిక" కార్యకలాపాలలో రాజకీయాలు ఆటపాటలు మాత్రమేకాదు వ్యాపారంకూడా ఉన్నది. ఆదివారంనాటి కార్యకలాపాలుమట్టుకు అలౌకికమైనవి. విరామ మెరుగని నిత్యజీవితానికి సంబంధించిన బ్రతుకు చిక్కులకు, ఆసక్తులకు, వ్యాపారవృత్తులకు అంటని వీను. వినోదం, నైతికాధ్యాత్మికోన్నతి సాధించిడం, విరామదినంనాటి సద్దుమణగిన ప్రశాంతతకు లక్ష్యాలు; మరి వాటిని లౌకికమైన పనుల వలెనే అంతే శ్రద్ధాశక్తులతో సాధింప యత్నించేవారు. "ప్రొద్దుపోని వినోదానుభవం" గాని వట్టి ఆటపాటలుగాని ఉండేవికావు.

ఇట్లాంటి మతాచారాల సామాజిక పరిపాటిలోకి ముందుచెప్పిన ఈ లేనిపోని కొత్తలన్నీ వచ్చినాయి; అయితే అవి ఈ మతాచారాలకు మించిన శక్తి కూడగట్టుకొని వచ్చినాయి. ఇరవయ్యో శతాబ్దిలో కనిపెట్టిన ఈ ప్రధానమైన కొత్తవస్తువులు తమ శక్తిని పూర్ణంగా చూపిన

ఈ పారిష్‌లు ఎట్లా మారిపోయాయో తొలుత వివేకించుదాము. పట ణాలు పెరగడమనేదే ఒక విప్లవాత్మకమైన మార్పయినప్పటికీ ఇట్లాంటి పారిష్‌లు దేశమంతటా పట్నంలోను పల్లెపట్టులోను కన్పించేవి వాటిలో చెప్పదగిన కొన్ని ప్రాంతీయ భేదాలున్నాయి. వాటిని తరువాత పరిశీ లించుదాము. కాని ప్రధానమైన మార్పుల ప్రభావం ప్రాంతాలవారిపైన పడింది అందుచేత భౌగోళికంగా ఒక్కటిగా ఉన్న ప్రాంతం ఎల్లలకు లోబడి ఉన్నవే ప్రధానంగా చెప్పుకోదగిన భేదాలు. అయితే అవి "వర్గ" భేదాలు మాత్రం కాదు.

## "స్వదేశ అక్రైస్తవులలో" అతిశయమైన రకాలు

మత సంబంధంగా అత్యంతము అతిశయమైన ఆర్థిక వ్యత్యాసాలు మాత్రమే ముఖ్యం. కార్లు, రేడియోలు, ఇంకా సౌకర్యంకోసం నేను పాతపద్ధతి మత సంబంధమైన మాటలో "లౌకిక" అవసరాలు అనబడే మిగత వస్తువులు కొనడానికి శక్తిచాలనివాళ్ళు, కొనగలిగి కొనే వాళ్ళ కంటె చాల భిన్నంగా ఉంటారు. తప్పనిసరిగా ఈ రకరకాలయిన ఉరివిడి వస్తువులన్నీ ఒకదాన్ని అనుసరించి ఒకటి ఉంటాయి. అనగా, వీటిలో ఒక్కటి కొనుక్కోగల మనుకొనేవాళ్లు ఇవన్నీకూడా "ఆధునికమైన" అవసరాలు అని విశ్వసిస్తారు. నాగరకంగా బ్రతకడానికి అవసరమైన వస్తువులకు శక్తిచాలని నిజమైన "బీదవారు" యింటింటికి వెళ్ళి మత ప్రచారం చేసే సంఘాలకు, ఉద్ధారకార్యకలాపాలకు లేదా మఠస్థులు క్రమబద్ధంగా ఏర్పాటుచేసిన దానధర్మాలకు ఆస్పదులవుతారు. లౌకిక మైన దానధర్మాలు వారికి అక్కరవున్నా సరే, లేకపోయినా సరే. వాళ్లను చూచి అయ్యోపాపం అంటారు. వాళ్ళను చర్చికి ఆహ్వానిస్తారు. కాని, వారికన్నా బాగా ఉన్నవాళ్ళకు ఆ మతసమాజంలో ఉన్న ప్రాముఖ్యం తమకు లేదే అని వాళ్ళు అనుకునేట్లు చేస్తారు. వాళ్ళు కూడా బహుశా అట్లానే అనుకోవచ్చు. మతసంబంధమైన ఈ సామాన్య ప్రజ ఎప్పుడూ ఉంటున్నదే ఇది పట్నాలకు సంబంధించింది కాదు. పల్లె లకు సంబంధించినదీకాదు. ఈ నాటిదీకాదు. ఇది విశ్వజనీనం. కాని, అమెరికనుల యిరవయ్యావ శతాబ్దపు జీవనప్రమాణాల క్రింద సంపన్నులకూ బీదవారికీ మధ్య ఉన్న సంస్కృతి సంబంధమైన వ్యత్యాసాలు అతిశయ

మయాయి. బొత్తిగా ఏమీ లేనివారు, ఆధునికులు కనిపెట్టిన వస్తువులతో ప్రాథమికమైన సాంస్కృతిక "విశేషాధికారాలు" అనుభవించలేకున్న వారు, సంప్రదాయ సిద్ధమయిన మతానికిగాని అథవా విప్లవాత్మకమైన రాజకీయాలకుగాని పనికివస్తారన్న ఆశలేదు. పేరులేకున్నా బానిసత్వం పూర్తిగా ఉండే నీగ్రో సమాజాలలోవలె ప్రత్యేక సందర్భాలలో తప్ప వీళ్ళంతా తమకు వేరుగా తమకు చర్చులు ఏర్పాటు చేసుకోడం అరుదు. వీళ్ళకు చెప్పదగిన మతప్రయోజనా లేమీ ఉండవు. "తెల్లవాళ్లయిన చిల్లరజనం" నీగ్రోలకంటె నిశ్చితంగా స్పష్టంగా మతదృష్టి తక్కువయిన వాళ్లే. మత ప్రచారసంఘాల వాళ్ళు ఎక్కువగా వీళ్లను గురించే శ్రద్ధ తీసుకుంటారు. అయినప్పుడు అత్యంతము నిమ్నవర్గాలయిన వీళ్ళను "స్వదేశ అక్రైస్తవులు" అనవచ్చును. వీళ్ళ అక్రైస్తవతను వీళ్ళ అవి శ్వాసంతోకంటే, వీళ్ళకు విశేషాధికారాల లేమిడిద్వారా మెరుగుగా నిర్వచింపవచ్చు. నిరాశపడవలసిన పరిస్థితులలో లేకపోయినా వీళ్ళు మతవిషయకంగా పరాయివా రవుతారు. నగర జీవితంలోనేమి, గ్రామ జీవితంలోనేమి వీళ్ళు సమంగానే కనబడిపోతారు. నాగరకులైన ఇరుగు పొరుగువాళ్ళ దృష్టిలో వీళ్లు అలాగే లెక్కకూరారు. అదృష్టవశాత్తు వీళ్లు ఈ శతాబ్దంలో తదితరులతో పోల్చిచూస్తే చిన్న "వర్గం" గానే ఉంటున్నారు.

సాంఘికమైన అంతస్తులలో అవతలికొసన కథలలో చెప్పుకొనే లక్షాధి కార్లున్నారు. వాళ్లుకూడా క్రమబద్ధమైన మతావరణకు అవతల ఉండే వాళ్ళే. ఇతరుల దానధర్మాలతో వీరికి నిమిత్తమేమీలేదు. కాని వీరి దృష్టికి యితర మానవులందరూ తమ దానధర్మాలకు పాత్రులయినవారే. వీరు "పుణ్యపురుషులు", లేదా మతసంస్థలకు పోషకులు. అయితే తాము పోషించే సంస్థలకంటే తాము గొప్పవాళ్లమని వీళ్లు సాధారణంగా అను కుంటారు. మనం చర్చిస్తూవచ్చిన కొత్తగా కనిపెట్టినవన్నీ సందర్భవశంగా లభించిన సుఖాలుమాత్రమే. వీళ్ళ ఆసక్తి లౌకికమే అయినా సామాన్య మయినదానిని అతిక్రమించేది గనుక ఈ అదనపు సౌకర్యాలవల్ల వీళ్ళ ప్రమాణాలు తీవ్రంగా మారిపోవు. అలాటివ్యక్తులు సహాయానికి తగినవని నమ్ముతూ పాఠశాలలమీద, ఆస్పత్రులమీద చూపినట్టుగానే చర్చిలమీద కూడా ఉదారదృష్టితో శ్రద్ధ చూపుతారు. ఎప్పుడైనా చర్చులు "చూడ

వచ్చినప్పుడు" ఉదారమైన దృష్టితోగాని లేక అసాధారణమైన అవసరం ఏర్పడి వచ్చిన రోగులుగా గాని ఆస్పత్రికి వచ్చినట్టుగా చూడవస్తారు. చర్చులకంటె గ్రంథాలయాలు మరింతగా అందరికీ ఉపయోగపడే ఉదార సంస్థలని సర్వాత్మనా తలపోసిన ఆండ్రూ కార్నిజీవంటి దాతలు నిజంగా నేడు చాల అరుదు. ఒక "ఉపకారాధార సంస్థకు" తనకు అర్హమని తోచిన పనులకే సహాయంచేసే అధికారం ఉందిగనుక అట్లా చేయవచ్చు. కాని ఉపకారం చేయడమే వృత్తిగా పెట్టుకోని దాత సాధారణంగా నలుగురూ ఏది ఉపయోగకరం ఏదికాదు అంటారో దాన్ని ఆమోదించ డానికే మొగ్గుజూపుతాడు. మొత్తంమీద అతని దృష్టిలో తన ఈ బాధ్యతా భారాన్ని కొంతమట్టుకు వహించడానికి వచ్చిన సమాజనిధి ఈ మధ్య కనిపెట్టబడిన విషయాలన్నింటిలోకి గొప్పది. ఎందుచేతనంటే దానివల్ల అతనికి చిన్నచిన్న ఉద్యమాలవల్ల ఒత్తిడి లేకుండా పోతుంది.

బాగా ధనవంతుడైన వ్యక్తి మనఃపూర్తిగా (పోషకుడు గాకుండా) మతసంబంధమైన సాధన నిష్ఠతో చేసుకొనదలచుకొన్నట్లయితే అతడు సహజంగానే ఒంటరిగానే తానా విధంగా చేసుకోవచ్చు. అంతేకాని అట్టివ్యక్తి మతాశక్తిగల జనసమాజ జీవితంలో చురుకుగా పాల్గొనడు. యోగం, వైరాగ్యమతం, వేదాంతశాస్త్రం, దివ్యజ్ఞానమంత, ఆధ్యాత్మిక సాధన - ఇవన్నీకూడా ధ్యానమార్గాలను ఏకాంతంగా గాని ఏ తెలిసిన కొందరి మధ్యగాని సాధన చెయ్యడానికి అమెరికన్ బ్రాహ్మణులకు వివిధ ములైన అవకాశా లిస్తున్నాయి. సంపన్నులలో ఇలాటి మతసంబంధమైన వైయక్తికత కొత్తదేమీ కాదు గనుక ఇరవయ్యో శతాబ్దపు లక్షణాలు వెదకడంలో మనం దానిని పరిశీలిస్తూ కూర్చోవలసిన పనిలేదు. పందొమ్మిదో శతాబ్దంకంటే ఇరవయ్యో శతాబ్దిలో ఐశ్వర్యవంతులయిన అమెరికనులకు మతదృష్టి తగ్గిపోయిం దనడానికి నిదర్శనముందిగాని ఈ చాలు - ఇది ఒకచాలే అయితే - ఆధునిక సాంకేతిక యంత్రవిద్యా వ్యాప్తియొక్క ప్రత్యక్ష ప్రభావమే అని చెప్పడం కష్టం. విశిష్టమైన మతవిశ్వాసాలు కారణమా అంటె అంతకంటెకాదు. సంపన్నుల మతవిశ్వాసాలు పలుసలు విధాలుగా ఊహించి చెప్పడానికి వీల్లేకుండా ఉంటాయి. గనుక ప్రత్యేకంగా వింగడించడానికి తగినవికావు. ఆండ్రూ కార్నిజీ వ్రాసిన "సంపత్సువార్త"

(Gospel of wealth) అనే గ్రంథంలో అద్వితీయంగా వ్యక్తం చేయ బడిన ఒక రకమైన దాత అంతరాత్మ ఒకటి ఉంది. ఇప్పటికీ కార్నిజీ దినాల్లో ఉన్నట్టుగానే ఉన్న ఈ సంపత్సువార్త డబ్బున్నవాడి మతం కాదు, కేవలం వాడి అంతరాత్మ మాత్రమే. అతని మతం కొంత సంప్రదాయ భిన్నంగా, బొత్తిగా ఆచరణసాధ్యం కానిదిగా, చాల వ్యక్తిగతంగా ఉన్నది.

## ఆధునిక నగరాల్లోని చర్చులు

సాంప్రదాయకంగా "మతాభిమానంగల వర్గా"లని అనబడే మత సంఘాల లేదా ప్రాంతీయ జనసమాజాలలోని వారి విషయం అలోచిద్దాం. మొదట నగరాల్లోని పెద్ద చర్చులను చూద్దాం. ఈ చర్చులలో సభ్యులు వ్యక్తిగతంగా సంపన్నులని సూత్రీకరించవచ్చు. వీళ్ళ సభ్యత్వం సాంస్కృతికంగా ఆధునికమైనది. అయితే ఈ కుటుంబాలవాళ్లు పుట్టి పెరిగిన వాతావరణంవల్ల వీళ్ళకు తమ జీవనపద్ధతికీ తమ తాతతండ్రుల జీవనపద్ధతికీ మధ్యగల భేదం మరపు రావడంలేదు. ఇలాంటి సభ్యులుగల చర్చులు ఇరవయ్యవ శతాబ్దం మత విషయకంగా ఏమి సృష్టించిందీ, (నాశనం చేసిందీకూడా) గ్రహించడానికి చక్కగా ఉపయోగపడగలవు. ఇవి గొప్ప చర్చులు. కారణమేమంటే వీటిలోని సభ్యులు ప్రార్థనాదికాలకు దూర దూరాలనుంచి, సాధారణంగా కార్లమీద వస్తుంటారు. ఈ రకం దిగువ పేటలో ఉండే చర్చి సాధారణంగా "హోం మిషన్స్" అనే పేరుతో ఆ చుట్టుపక్కల ప్రాంతాలవారికి అక్కరకు వచ్చినా దాని సభ్యులు మాత్రం దూరంగాఉండే పేటలకు శివార్లకు చెందినవారుగా ఉంటారు. మరి సాధారణమైన పల్లెటూరి చర్చిపేటలో బాగా సంపన్నులైన వాళ్ళను మాత్రమే కాక చుట్టుప్రక్కల కొన్ని మైళ్ళలో ఉన్న సంపన్న వ్యవసాయదారులను కూడ కలుపుకొంటుంది. ఇలాటి చర్చులు "సొసైటీలు" లేదా సంఘాలు అవుతాయేగాని సామాన్య జనసమాజా లనిపించుకోవు. అవి అందరిని ఒక చోట చేర్చేవేకాని స్థానికులకు పరిమితమైనవి కావు. చర్చికోసం పనిచేయ డానికని వీరంతా వచ్చి కలుస్తారు. లేకుంటే ఒకరికొకరు అపరిచితులే. స్థానిక ప్రజలకూటంగా ఉండదీ చర్చి. వ్యక్తులను చేర్చి ప్రత్యేకంగా ఒక సమితిని సృష్టిస్తుంది. అది వినా వీళ్ళంతా ఒక గుంపుగా చేరరు. ఇలాటి సభ్యులు చెల్లాచెదరుగా అక్కడ కొందరు ఇక్కడ కొందరు ఉండడమేకాక,

ఒకచోట స్థిరంగా ఉండక మారుతుంటారు; చర్చిమీద వీళ్లశ్రద్ధ అంత గాఢంగా ఉండకపోవడం కద్దు. దానికి ఫలితంగా చర్చి కార్యకలాపాలను ఆదుకోడానికి ఎక్కువమంది కావలసి వస్తుంది. ఈ పరిస్థితులలో సహజమైన ఆర్థిక కారణాన్నిబట్టి చర్చి వ్యవస్థను, సభ్యుల సంఖ్యను విస్తరింప జెయవలసివస్తుంది. చర్చి పెద్దదయ్యేకొలది చర్చి కార్యకలాపాలలో పాల్గొనక ఊరక వచ్చేపోయేవారిని అది అంతగా ఆకర్షిస్తూ ఉంటుంది. ఇందువల్ల స్థానికమైన చిన్నసమాజాలు లేదా పారిష్‌లను ఆ స్థాయికి లోపల వెలుపల స్థిరపరచడానికి ప్రోత్సాహం లభిస్తుంది. మతోద్యోగులు తక్కువవుతున్నారని చాల చర్చులు గోలపెట్టడానికి ఈ పరిస్థితులు కారణమా లేక వాటి ఫలితమే ఇదా అనేది తేల్చిచెప్పడం కష్టం. కారణమేమైనా స్థానికమైన చిన్నసమాజాలు చేస్తూఉండిన పనికంటె అధికంగానే ఆధునిక పరిస్థితులలో కొద్ది పెద్దచర్చులు చేస్తూఉన్నవి.

దానితోబాటు మతంతో నిమిత్తంలేని విషయాలలో అభివృద్ధిని గణించడానికి ఉపయోగించే మామూలు గీటురాళ్ళను ఉపయోగించి చూస్తే చర్చి కార్యకలాపాల నిర్వహణస్థాయి అభివృద్ధి చెందినదని చెప్పకతప్పదు. చర్చి కార్యకలాపాల నిర్వహణం వృత్తిగా స్వీకరించి, శిక్షణపొంది, అధికమైన వేతనాలుపొందే మతోద్యోగులు, పనివారు ఎక్కువైనారు. ప్రతి చర్చికి "స్టాఫ్" మినిస్టర్ లేక పురోహితుడు "సహాయోద్యోగి" జీతం తీసుకొని పనిచేసే గాయకబృందం, విద్యా సంబంధమైన ఉద్యోగులు, సంఘ సేవకులు మున్నగువా రున్నారు. చర్చి ఒక "సంస్థ" అయింది. ఆయవ్యయాలు విశేషంగా పెరిగాయి. పూర్వతోధిక సంఖ్యాకులయిన సభ్యులు - అందునా ప్రతి ఒక్కరు వహించే భారం తక్కువ - మరింత నిపుణంగా జరిగే చర్చి కార్యకలాపాలకు డబ్బు చెల్లిస్తున్నారు. వివిధ సామాజిక కార్యకలాపాలలో పాల్గొనడానికి సభ్యులను ప్రోత్సహించడానికి జీతాలు తీసుకొనే పనివారు నిరంతరమూ ప్రయత్నిస్తునే ఉన్నారు. అయినా సభ్యుల సహకారం అంతకంతకు అధికంగా ధనరూపంలోనే లభిస్తూ ఉన్నది. బహిరంగ ప్రార్థనాదికాలలోకూడ సభ్యులు మునుపటికన్నా అనాసక్తంగా పాల్గొంటున్నారు. ప్రజలు క్రమక్రమంగా పాటకచేరీలకో నాటకప్రదర్శనకో హాజరయినట్టుగా చర్చి కార్యకలాపాలకు హాజరవుతున్నారు. మత సంబంధమయిన కార్యకలాపాల నిర్వహణం నానాటికీ అధికంగా జీతాలు

తీసుకునే ఉద్యోగుల విధ్యుక్తధర్మ నిర్వహణ ప్రదర్శనం అవుతున్నది. సమాజంలో అందరూ కలిసి పాల్గొనేదిగానూ ఉండదు. జానపదకళకూడాకాదు. "మినిష్టర్" మీద లేక పూజారిమీద అత్యధికమైన బాధ్యత మోపుతున్నారు. విధ్యుక్తధర్మ నిర్వహణంలోనేకాక విస్తృతమైన రంగాలలో నాయకత్వం వహించడంలోకూడా ఆతనివద్దనుంచి అధికంగా ఆశిస్తున్నారు. సాహిత్యం, నాటకం, సంగీతం, వాస్తుశిల్పం, తదితర కళలలో సవిమర్శన దృష్టి విస్తృతం కావడంతో తక్కిన కళలతోపాటు చర్చికూడ నిర్భందంగా రస రమణీయకానికి సంబంధించిన పోటీలో పాల్గొనవలసి వచ్చినది. డౌలుగా అవకతవకగా ఆశువుగా జరిపే ప్రార్థనాదికాలను ఇప్పుడు ఎవరూ అంగీకరించరు. ఈ విధంగా జనరంజకమైన లౌకికకళలు మత సంబంధమైన నాయకత్వానికి మరింత కఠినమైన అభిరుచి ప్రమాణాలను విధించాయి.

సంపన్న సదస్యుల సంఘాలు, ఆయా సంఘాల మతాధికారుల నాయకత్వ ప్రమాణాలు "దిగువ మధ్యతరగతివారి" ప్రమాణాలపై తమ ప్రభావం చూపుతున్నవి. ఆ విధంగా ఉన్నతవర్గాలవారి ప్రమాణాలకు అనుగుణంగా వారి చర్చుల ప్రమాణాలుకూడ పెరుగుతున్నవి: వారికి కూడా పోటీ ఒత్తిడి తగులుతుంది. ఏమంటే సామాన్యమానవుని అభిరుచి సవిమర్శం కాకపోయినప్పటికీ, ఆధుని కోపకరణాల ప్రభావానికి గురి అవుతూఉన్న కారణంచేత సామాన్య పౌరుడుగూడ మరింత ఉదాత్తంగా వ్యవహరించవలసి వస్తున్నది. ఈ నూతన ప్రమాణాలను అర్థం చేసుకొనక పోయినప్పటికీ ఆధునిక నాయకత్వం అనుకరించి సమర్థించక పోయినట్లయితే కాలానికి వెనుకబడిపోయినట్టు లేదా తక్కినవారికన్నా తక్కువ స్థితిలో ఉన్నట్టు సామాన్యపౌరుడు తనకు తెలియకుండానే భావిస్తాడు, ప్రమాణీకరణం అధికమయ్యేకొలది బలాన్ని మూలధనాన్ని కూడగట్టుకొని స్థిరపడాలనే కోరిక అత్యధిక మవుతుంది. చర్చులకు పేర్లలోగల భేదాలు అడ్డంకులు బలహీనమై సడలిపోతవి. తత్ఫలితంగా సమాజాలలో కెల్లా అధికంగా చదువుకొని విమర్శజ్ఞానం గలవారి సంఘాలలో ప్రతిష్ఠితమైన పద్ధతులు సాధారణంగా "మిడిల్ టౌన్" కుగూడా ప్రమాణాలవుతాయి.

"పెద్దవి, శ్రేష్ఠమయినవి, అల్పసంఖ్యాకమైనవి" అయిన ఈ చర్చ్‌ల విషయంలో చర్చ్‌లకు వెళ్లే అలవాట్లలో చెప్పుకోదగిన మార్పువచ్చింది. వారాని కొకసారి బండిలో (మోటారు బండిలో) వెళ్లడం ఈ నాడు విడువకుండా చర్చికి హాజరుకావడంగా పరిగణించబడుతున్నది. సామాన్య మైన సభ్యుని తీరికసమయంలోను, శక్తిలోను చాలతక్కువ భాగం మాత్రమే ఈ నాడు చర్చి కార్యకలాపాలకొరకు వినియోగింపబడు తున్నవి. వారమంతా సామాన్యుడైన వ్యాపారస్తుడు, ఉద్యోగి, (ఆ మాటకు వ్యవసాయదారుడుకూడా) 1900 సంవత్సరం ప్రాంతంలో ఉన్నంతగా ప్రజాజీవితానికి దూరంగా ఉండడంలేదు. కార్ఖానాలలో పనివారు ఈ నాడు పూర్వంకన్నా అధికంగా కలసిమెలసి ఉంటున్నారు. సరకుల తయారీ యిప్పుడు పూర్వంకన్నా అధికంగా సంస్థలద్వారా సాగుతున్నది. ఆర్థిక ప్రయోజనాలు సామాజిక వ్యవహారాలకు మరింత సన్నిహితంగా ఉంటున్నవి. లౌకికవ్యవహారాల నిర్వహణంలో లభించే తీరికసమయం పదుగురితో కలసి వినియోగించడం జరుగుతున్నది. తత్ఫలితంగా ఆదివారం అందరితోను కలిసి ఉండవలసిన అవసరం తగ్గిపోయినది. ఆదివారంనాడు ఇంటివద్ద ఉండాలని, వనభోజనాలకు పోవాలని, లేదా ఇతరవిధాలుగా ఏకాంతంగా ఉండాలనే కోరిక అధికమైంది. శని వారం అపరాహ్ణం, రాత్రి లభించే విరామసమయం గడపడానికి ముఖ్యంగా నగరాలలోనివారికి అంతకంతకు హెచ్చుగా ప్రబలమైన ఆకర్షణలు (జాజ్ సంగీతం, సామూహిక నృత్యం, సినిమాలు, నాటకాలు) రూపొం దుతూ ఉన్న కారణంచేత ఆదివారం ఉదయం పూర్తిగా విశ్రాంతి తీసుకోడంలోగాని, కేవలం సోమరిగా ఉండడంలోగాని గడపడం సంభ విస్తున్నది. అంతేకాని ఆత్మవికాసంకోసం ఉద్దేశించబడిన సామూహిక కార్యకలాపాలలో గడపడంలేదు. ఆదివారం పత్రికలలోను, రేడియో లోను. సినిమాలోను - వాటిని కేవలం వినోదంగా పరిగ్రహించినప్పుడు సామాన్యుని అంతరాత్మ సంతృప్తిచెందడానికి చాలినంతమాత్రమే ఆత్మ వికాసానికి ఉపకరించేది లభిస్తుంది. సామూహిక ప్రార్థనకు సంబంధించిన అలవాట్లపై రేడియోకు టెలివిజన్‌కు ఉండే ప్రభావం నిర్ణయించడం బహుశః ఇప్పుడప్పుడే వీలుకాదేమో! కాని రేడియోలో చర్చి కార్య క్రమాల ప్రసారం ఇప్పటికే అధికంకావడం వల్లను, మామూలుగా

చర్చులలో జరిగే ప్రార్థనలకన్న మెరుగైనవి అధికంగా లభ్యంకావడం వల్లను అసలు ప్రార్థనంటూ ఎవరైనా చేసేపక్షంలో ఇంటివద్దను, అందునా అంతరంగికంగానూ ప్రార్థనచేసే అలవాటు అంతకంతకు పెరుగుతున్నట్టు రుజువవుతుంది. ఈ విధంగా ఈ నూతన సృష్టుల ఫలితంగా నిర్విరామంగా సాంప్రదాయికమైన ప్రార్థనాపద్ధతులు, అలవాట్లు, చర్చి కార్యకలాపాలు నశించకపోయినా మార్పు చెందుతున్నవి.

సాంప్రదాయకమైన మతపద్ధతులకు సాధనలకు సంభవించిన బాహిరమైన ఈ ప్రమాదంకన్నా ఈ పరిస్థితులలో విధవిధాలుగా మతంలో కలుగుతున్న పరిణామాలే మతానికి మరింత ముఖ్యమైనవి. వాటిలో ముఖ్యంగా గమనింగదగినవి పూర్వపువారికన్నా బాగా చదువుకొన్నవారు మతోద్యోగులుగా ఉండడము; మతోపన్యాసాలలో లౌకికవిషయాలు అధికంగా ఉండడము; సాయంకాల ప్రార్థనలు (ఇవి పూర్తిగా వినోదాలే) అధికంగా లౌకికమైనవిగా ఉండడము; నాటకరంగం మాదిరి ఏర్పాట్లు చేయడము, సమకాలిక కల్పనా సాహిత్య సమీక్షలు; ప్రజలందరికీ సంబంధించిన లౌకిక సమస్యలగురించి చర్చించడము; బైబిల్ పాఠశాలల స్థానంలో మతంతో అస్పష్టమైన సంబంధంగల విద్యాబోధన; విశాలమైన దృక్పథంతో మతంగురించి ప్రస్తావించే పత్రికలు. అనేకవిధాలుగా సూక్ష్మంగా మాత్రమే ఆధునిక జీవితవిధానాలను అంగీకరించింది. ఈ విధానాలను మనం ముందుముందు మరింత విశదంగా పరిశీలించవలసి ఉంది. వేరొకవిధంగా చెప్పాలంటే, 1900 ప్రాంతంలో ఐహికమైనవిగా పరిగణింపబడి ఉండేవాటిలో అధికభాగం ఈ నాడు ఉదారమైన మతానికి సంబంధించిన సాంప్రదాయక రూపాలలోను, అలవాట్లలోను చేరిపోయినది. నేనిప్పుడు తత్త్వశాస్త్ర సంబంధమైన ఆధునికతను గురించి మాట్లాడడంలేదు. అంటే సిద్ధాంతంలోగాని, నమ్మకంలోగాని వచ్చే మార్పుమాట అటుంచి లౌకిక జీవనానికి సంబంధించిన శక్తులు నూతన సృష్టులకు అనుగుణంగా మతవ్యవహారాల నిర్వహణం, కార్యకలాపాలు మారడం, వాటితో సర్దుకొనిపోవడం జరిగాయని నా యభిప్రాయం. ఈ సమాధానపడి సర్దుకొనిపోవడం ఆచరణలో మతానికి ఉన్నఅర్థం, మత ప్రభావం పూర్తిగా మారిపోయేటంతగా జరిగింది. మతసంస్థలు, ఆచారాలు కేవలం లౌకికమైన నూతన సృష్టుల - అందునా సంబంధంలేనివిగా

కన్పించే వాటిపరిణామాలను అంగీకరించడమేకాక వాటిని ఇష్టమున్నా లేకపోయినా నిర్బంధంగా స్వప్రయోజన సాధనకు వినియోగించవలసి వచ్చినది.

## హరవాది మతవిధాలు

తరువాత అంతగా ఆధునిక స్వరూపం సంతరించుకొనని మతం పరిశీలించుదాము. అధునాతన జీవితంలో వచ్చిన బాహిరమైన మార్పులవల్ల మతానికి సంబంధించిన ప్రధానవిషయాలలో అంతగా మార్పులు ఎరుగని వర్గాలు, ప్రాంతాలు ఉన్నాయి. అమెరికాలో "దిగువ మధ్యతరగతి" వర్గాలు అనబడేవి ఆర్థికంగా తక్కువ స్థితిలో లేవు; కనీసం కనిపించేటంత తక్కువస్థితిలో లేవు. ఈ వర్గాలవారుకూడ ప్రాథమికమైన "లౌకిక సౌకర్యాలు" అనుభవిస్తున్నారు. వారికి ప్రాథమికవిద్యకూడా ఉన్నది. అయితే ఈ వర్గాలవారికి ప్రాథమిక దశకు మించిన వేమీలేవు. ప్రాథమికము అన్నదానిని గురించి వారి భావనకూడ తరతరాలుగా వారికి సంక్రమిస్తున్న సంస్కారంలో ఒకభాగం. వారు ఎంత సుఖంగా బ్రతుకుతున్నారో అంతగానూ సంతృప్తి చెందుతున్నారు. ఇరవయ్యో శతాబ్దంలా విప్లవాత్మకమైనది ఏమైనా సంభవించినదని తెలుసుకోకుండానే ప్రాథమికవిద్య, ఉన్నతవిద్య లేదా కళాశాలలో బోధించే ఉన్నతవిద్య నేర్చిఉండడం సాధ్యమే. అనేకమైన వార్తాపత్రికలు, మాగజీనులు, పుస్తకాలు చదివికూడ పాఠశాలలు చెప్పే చదువుకుమించి మరేమీ తెలుసుకొనకపోవడంకూడ సాధ్యమే. విజ్ఞానశాస్త్ర ప్రయోజనం నిర్మాణపద్ధతులు తెలుసుకొనడమేనని, ఆ పద్ధతుల ప్రయోజనం కేవలం మనుష్యులకు సుఖంకూర్చే ఉపకరణాలు అమర్చడమేనని భావించడమూ సాధ్యమే. అలాటి భావాలు ఆధారంచేసికొని నిశ్చింతగా ఉండమని సభ్యులను ప్రోత్సహించే మతసంస్థలలో చేరిఉండడంకూడా సాధ్యమే.

ఇలాంటివారికి జీవితంలో ఆధ్యాత్మిక సంబంధమయినదంతా వారి కుటుంబం పొదుపు చేసినదానితోను, పెట్టుబడి పెట్టినదానితోను కలుపుకొని వారికి సంక్రమించిన పైతృకమైన సంస్కృతికి చెందినదే. వారికి మతమంటే వారి తండ్రితాతల నమ్మకాలకు మించినదేమీ కాదు. సంస్కృతి అంటే సంప్రదాయాన్ని అనుస్యూతంగా కొనసాగించడానికి

మించిన దేమీకాదు. పాటకచేరీలకు వెళ్ళినట్టుగానే సభ్యసమాజంలోని వారి హుందాతనంతో సంతృప్తితో వారు చర్చికి వెళ్లుతారు. నియమంగా స్నానంచేసినట్లుగానే మతోద్యోగుల సమక్షంలో తాము చేసిన పాపపుణ్యాలు నివేదించడానికి వెళ్ళుతారు. వారిలో అధికంగా ఆత్మవివేచనం చేసుకొనేవారు ఇతర ప్రాచీనవస్తువులను చూచి ఆనందించినట్టుగానే మతాన్నికూడా చూచి ఆనందిస్తారు. మన్నించదగినవి, ఇంకా ఉపయోగపడేవి, ఘనమైనవి, పవిత్రంగా ఆదరించదగినవి అయినవాటిలాగే వారికి మతమూను. అయితే వారిలో అధికసంఖ్యాకులు సంస్కృతి విషయంలో ఆత్మవివేచనం చేసుకోదగినవారు కారు. అమరత్వం సాధించడానికి ప్రాతిపదికగా అదేదో చక్కని రాజమార్గ మయినట్టుగా వారు ఆసక్తితో ఉత్సాహంతో సమకాలిక జీవనంలో పాల్గొంటారు. అయినప్పటికీ వారు తమ అభిప్రాయాలలో అవశ్యం సనాతనులు కారు. కాని, తమ విలువలకు భగవంతుడే శాశ్వతత్వం చేకూర్చుతున్నాడని వారు విశ్వసిస్తారు. చెడువులు అంటే వారికి బొత్తుగా గిట్టవు. వాటిని అవే పరిహరిస్తాయి గనుక అవశ్యము అవి నశించగా చూడగలమని భావిస్తారు. నిలకడ అయిన మంచి నిత్యమైనది. ఆర్థికమాంద్యం, యుద్ధం, ఇతర ఉపద్రవాలు ఏమిసంభవించినా అది నిలిచేదే. వాచరిర్పులు అంత నిష్కపటంగా సాంప్రదాయికమైనవి. అయితే ఇటీవల సంప్రదాయము స్థిరత్వాల ప్రతిపత్తి మార్పుచెందిన విషయం వారికి తెలియదు.

ఈ వర్గంవారు ఊహాశక్తి లేనివారు; ఉన్నదానితో సంతృప్తి పడేవారున్నూ, వారు 1900 తరువాత వచ్చిన మార్పులు కేవలం బాహిరమైనవని, పైపైవని భావించి సమాధానపడుతారు. కాని, వారే అమెరికా ప్రజలలో కీలకవర్గం అయిఉన్నారు. అమెరికా ప్రజల మతసంబంధమైన ఆచారవ్యవహారాలు, భావాలు మొదలయిన వాటిలో సగానికి మించి వారే బాధ్యులు. గణనాంగ వివరాలదృష్టితో ఈ వర్గంవారు ఒకతరహాకు చెందినవారు. సాంఘిక శాస్త్రవేత్తలలో కొందరు "సాంస్కృతికంగా వెనుకబడడం" అని పేర్కొనే తత్వానికి వారు తార్కాణం. ఈ తరంవారు ఏ ప్రాథమిక సంఘటనలతో సమాధానపడి జీవిస్తున్నారో, ఏ సౌఖ్యాలు అనుభవిస్తున్నారో అవి ఈ వరకె వారి భౌతిక జీవనస్వరూపం మార్చివేసినవి. కాని తదనుగుణంగా విలువలు గుర్తించే స్వభావం వారిలో కలుగ

జేయలేకపోయినవి. ఇప్పటి అర్థాలు పరివర్తన చెందిన భవితవ్యానికి సూచన ప్రాయమైన "కాల లక్షణాలు" కాలేకపోయినవి ఇంకను. కొత్తవిషయాలు నూతనభావాలను కలుగజేయలేక పోయినవికూడా. ఈ పరిస్థితిలో మత సంప్రదాయాలకు, స్థిరత్వానికి సర్వవ్యాప్తమైన సాంస్కృతిక స్థిరత్వం ఏర్పడిన కాలాలలో ఉండే అర్థాలు ఉండవు. అతి సంకుచితమైన దృక్పథంతో ఈ కీలక మతాచారాలపై తమ దృష్టిని కేంద్రీకరించిన సామాజిక తత్త్వవేత్తలు వైయక్తికంగాను సాంస్కృతికంగాను కూడ స్థిరత్వం చేకూర్చే బాధ్యత మొత్తంమీద మతానికి ఉన్నదని అభిప్రాయపడినారు. ఏమైనా, స్థూలంగా ఈ సిద్ధాంతం మరి యే యితర వ్యవస్థ విషయంలోను నిజంకానట్లే, మతవిషయంలోనుకాదు. స్థూలంగా వ్యవస్థలన్నిటికీ వర్తించే సాంస్కృతికలోపం ఈ రకమైన మతంలో ద్యోతకమవుతుందని చెప్పడం మరింత సబబుగా ఉంటుంది. ఇది గణాంక వివరాలనుబట్టి ఒక తరహా తత్వమే అయినప్పటికి, దాని మతవిషయకమైన సహజస్థితికి ఆలవాలమైనదిగా భావించరాదు.

ఆఖరుని మతవిషయంలో ఉదాసీనంగా ఉండనివారు, ప్రజలలో అధిక సంఖ్యాకులు అయినవారిని పరిశీలిద్దాం. ఈ వర్గంవారు తమ అశాంతిని బూజుపట్టిన మాటల్లో వ్యక్తపరుస్తారు. ఇది వీరసనాతనత్వం. ఇది ఆర్థికమైన అశాంతిలోఉన్న ప్రజలకు సన్నిహితంగా సంబంధించింది కాదు. రాజకీయమైన లిబరిజంతోనో, లేక కన్జర్వేటిజంతోనో, అథవా లౌకికమైన ఏ యితర వైఖరితోనో దీనిని సమన్వయించడానికి చేసిన ప్రయత్నాలన్నీ విఫలమయాయి. ఈ వర్గంలోని వ్యక్తులందరికీ ఇప్పుడు మనం వివరించుకొన్న విద్యాబుద్ధుల పరిధుల దోషం ఉంది. కాని, మొత్తంమీద వీళ్ళు "వారసత్వంలేకుండా పోయినవారు" కారు; భద్రత ఉన్నవారూ కారు. మరి కేవలం పందొమ్మిదో శతాబ్దపు మనుష్యులూ కారు. వీర సనాతనత్వం 20వ శతాబ్దంలోవచ్చిన నిరసన అశాంతి కలిగించిన ఉద్యమం- ఇది (సెయింట్ జాన్) దర్శనమార్గం వంటిది; భవిష్యద్వాణి వినిపించేది; ఆధునిక జీవితాన్ని విమర్శించేది; భవిష్యత్తును శంకించేది.

"బైబిల్ క్రైస్తవుల్లో" తొలితరాలవాళ్ళు దేహాత్మల మధ్య ద్వైత భావము సర్వత్ర గుర్తించిన యథార్థ విషయంగా అంగీకరించారు. ఈ

యథార్థవిషయాన్ని ఆచరణలో పెట్టిన సంప్రదాయంలో పెరిగారు గనుకనే వారు లోకానికి వెలిగా కాకుండా లోకం లోపల ఉండడం ఎలాగో అనుభవపూర్వకంగా తెలుసుకున్నారు. వారికి రెండులోకా లుండేవి; ఒకటి నశ్వరం, రెండవది అనశ్వరం. కనుకనే వారి మత సంబంధమైన ఆసక్తి లౌకికమైన ఆసక్తికి వేరుగా, చర్చి రాజ్యానికి ఎంత భిన్నమో అంత భిన్నంగా ఉండేది. ఇక్కడ ఈ రెండింటికి వైరుధ్య మేమీలేదు: కేవలం ద్వైతభావం మాత్రమే. కాని, ఈ ఇరవయ్యో శతాబ్దంలో ఐహికమంతా ఆత్మతత్త్వంమీదికి దురాక్రమణ చేసి, యథార్థం గాను తత్త్వరూపంగాను ఆ రెండూ బొత్తిగా తికమకగా ఉన్నప్పుడు, దైహికమైన వ్యావృత్తులకు ఆత్మ విముక్తికీ మధ్య సామాన్యంగా కని పించే విభేదం ఉండేట్టు చూడడంకోసం వీరత్వం, తిరుగుబాటుచూపడం అవ సరమైంది. ఈ రెండూ భిన్నమైనవనే విశ్వాసం పునరుద్ధరించుకోడానికి బుద్ధిపూర్వకంగా మతాన్నే పరిశుద్ధం, చేయవలసివచ్చింది. అందువల్ల ప్రతిఘాతమైన ఈ విశ్వాసాలు ఆధునికమైన లేదా లౌకికంగా మారిన మతాన్ని ప్రధానశత్రువుగా భావించి పోరాడవలసి వచ్చింది. ప్రపం చంతో సమాధానపడిన క్రైస్తవులకు అసంబద్ధ మని కనిపించినదంతా సాధ్యమని నిరూపించవలసి వచ్చింది. అంటే, పురాతనమైన ద్వైతభావం ప్రాథమికమని సహేతుకమని సమర్థింప వీలున్నదని చూపించవలసి వచ్చింది. ఇట్లాటి తత్త్వం ఐహికమో లేక ఆధ్యాత్మికమో అయినకారణం చేత పరిస్థితుల పోకడలనుగూర్చి అసంతృప్తిపడిన వర్గాలకో, సంఘా లకో సహజంగానే నచ్చుతుంది. ప్రపంచ సంఘర్షణలు యుద్ధాలకాలానికి ముందు ఇలాటి తత్త్వాలు అంత జనరంజకంగా ఉండేవికావు. వాటిలో ప్రజలకునచ్చే గుణం ఏదైనా ఉంటే అది నానాటికీ పెరిగిపోతున్న "ధనపిశాచ" ప్రభావానికి విరుద్ధంగా మతావేశపరులు చేసే ఎత్తిపొడు పులవల్ల కలిగేది. కాని, పెట్టుబడిదారి వ్యవస్థతోపాటు ప్రపంచయుద్ధం కూడ ప్రబలమైన ఆధునికరూపంగా కనిపించినపుడు, ఆధునిక విజ్ఞానం అధికాధికంగా సాంకేతిక విద్యగా మారినప్పుడు, సనాతన చర్చులు ఉరు కులు పరుగులుగా పెరిగిపోయినవి. అధునిక ప్రపంచ వ్యవహారాలతో అణుమాత్రమైనా సంబంధంలేకుండా తమ ఆత్మవిమోచనానికి కృషి సల్పడం ఆచరణసాధ్యమైన కార్యక్రమమని విశ్వసించే ప్రాంతాలలోను,

వర్గాలలోను మాత్రమే ఈ చర్చులు పెరిగిపోయినవి. మతసంబంధమైన ఈ ఏకాంతత నిశ్చయంగా అభివృద్ధి నిరోధకమే. అయితే, ఇదికూడ ఒక విస్పష్ట నిరసనోద్యమమే. మతసాంఘికాల మధ్య ఉన్న ఇలాటి విడాకుల పద్ధతిని 11వ పోప్ పయస్ లౌకిక వ్యవహారాలు మతోద్యోగుల సహాయంలేకుండా వాటంతట అవే నడువగలవన్న భావం ఇందులో ఉండడంచేత, దీన్ని ఎత్తిపొడుపుగా సాంఘిక నవీనతా సిద్ధాంతమన్నారు. పందొమ్మిదవ శతాబ్దంలో ఇదే తత్త్వం ఒకవిధమయిన లిబరలిజం రూపంగా చెలామణి కావడంకూడ నిజమే. కాని, ఇరవయ్యో శతాబ్దంలో ఇది నరకప్రాయంగా పరిగణించిన ఒక సాంఘిక వ్యవస్థ. ఒక "సాంఘికతత్త్వం" నుంచి తప్పించుకోడానికి సాధనమైంది. అందుచేత వాటి తిరుగుబాటు స్వభావాన్ని, వాటి భవిష్యత్సూచ పరమార్థాన్ని అర్థం చేసుకొనడానికి సమకాలిక ఇవాంజలిస్టిక్, అపోకలిప్టిక్ వర్గాల వారి బైబిలు ముసుగును తొలగించి పరిశీలించవలసి ఉంది.

రోమన్, ఆంగ్లికన్, కాథలిక్ చర్చుల సంప్రదాయబద్ధమైన సనాతన సిద్ధాంతం స్వరూపమే చాలవేరు. ఈ చర్చులలో స్థిరమైన రూపానికి, స్థిరమైన నమ్మికకు, ఆధునిక కార్యాచరణకు మధ్య ఏర్పరచుకొన్న బూటకమైన ద్వైధభావం ఉంది. చర్చిపాలన నిర్వహించే ప్రామాణికమైన వర్గాలవారు ప్రజాస్వామిక సంబంధమైన రాజకీయాలలోను, ఆర్థిక భేదాలు తొలగించడంలోను ఆసక్తితో పాల్గొంటున్నారు. కనీసం అమెరికాలో అయినా వాళ్ళిప్పుడు వర్గవిభేదాలు పాటించడంలేదు. వారు ప్రజలకు చేసే ఉద్బోధనలు సనాతనులనుగాని, ప్రజలనుగాని ఆకర్షించడం లేదు. అమెరికా సమాజాన్ని అదుపులోపెట్టి, స్థిరత్వం చేకూర్చే మధ్యతరగతి ప్రజల లక్ష్యాలను ఆధునికమైన ప్రాటెస్టెంట్ వర్గాలవారివలెనే కాథలిక్కులుగూడ ప్రబలంగా వ్యక్తీకరిస్తున్నారు. లిబరల్ ప్రాటెస్టెంట్లవలె కాకుండా వాళ్ళు ఎప్పుడూ ఒకేవిధంగా ఉంటున్నారు. సమకాలిక సంఘవ్యవహారాలలో ఈ చర్చులు వాస్తవంగా ఏ విధంగా తమ పాత్రను నిర్వహిస్తున్నవో అర్థంచేసుకొనడానికి ఈ సందర్భంలో మనం పైపైన కనిపించే ఫార్మలిజం, అథారిటేరియనిజంల ఆంతర్యం పరిశీలించవలసిఉంది. ఉదాహరణకు: మెసాచ్యుసెట్స్ రాష్ట్రం లోని కేంబ్రిడ్జి నగరంలోఉండే సెయింట్ బెనెడిక్ట్ సెంటర్‌లోని ఫాదర్

విలోనార్డ్ ఫీనీ, కొందరు ఆయన అనుచరులూ సనాతన (ఫండమెంట లిస్ట్) సిద్ధాంత వాదయుద్ధానికి ప్రారంభించ ప్రయత్నించినప్పుడు చర్చి అధికారులు మూఢవిశ్వాసాలుగల భావాలు కలిగినందుకు వెంటనే క్రమ శిక్షణచర్య తీసుకున్నారు. ఈ సందర్భంలో అధారశేరియనిజం వర్గంవారు తాము చెప్పినదానిని సరిగా లౌక్యంగా అర్థంచేసుకోవాలని కోరుతున్నట్టు స్పష్టపరిచారు.

## బాహిరమైన మత సంపన్నత

ఈ శతాబ్దం ప్రారంభంలో మన ప్రముఖులైన చారిత్రకులు, సాంఘిక శాస్త్రజ్ఞులు వక్కాణించినదానికి భిన్నంగా 1900 నాటినుంచి అమెరి కాలో మతం క్షీణించలేదనడం స్పష్టం. 1800 లో వయోజనులలో నూటికి సుమారు పదిమంది మాత్రమే చర్చి సభ్యులు. బహుశ వారిలో నూటికి ముప్పైమందికి మించకుండా మాత్రమే క్రమంతప్పకుండా చర్చికి వెళ్లే వాళ్లు. పందొమ్మిదవ శతాబ్దకాలంలో 1900వ సంవత్సరంనాటికి మత సంస్థల సభ్యులసంఖ్య యాభైవంతులవరకు ఎక్కువయింది. ఇప్పుడు కనీసం యాభైఅయిదు వంతులమందయినా సభ్యులు. ఏదో ఒక మత సంప్రదాయానికి చెందినవాళ్ళమని భావించేవాళ్ళు ఇంకొక ఇరవయ్యా యిదు, ముప్పైవంతులదాక ఉంటున్నారు. వారు వైయక్తికంగా అస్పష్ట మైన మతవర్గాన్ని ఆశ్రయించుకొని ఉండవచ్చు. ప్రజలలో ఏ మతంతో సంబంధమూ అంగీకరించనివాళ్ళు పదివంతులకంటే ఆట్టే ఎక్కువఉండరు. ఈ అంకెలలో రవంత హెచ్చుతగ్గులు ఉండవచ్చు. అయినా గణాంకప్రవ రాలదృష్ట్యా సుపరిచితమైన ఒక యధార్థవిషయాన్ని సూచిస్తాయి. అంటే మతసంస్థలలో శ్రద్ధగా పాలొనడానికే మతం ఏనాడూ పరిమితం కాకపోయినా, 19వ శతాబ్దం ప్రారంభంలోకంటే, అమెరికాలో ఇప్పుడు ఎక్కువగా మతం వ్యవస్థాపన చెందినదని చెప్పడమే ఆ యధార్థవిషయం. సర్వసాధారణంగా అమెరికాలోని ప్రధానమైన అన్ని మతపద్ధతులు సామాన్యులు హేళనపూర్వకంగా అన్నట్టుగా మరల ప్రాముఖ్యానికి వచ్చాయి. మతనాయకులు ఒక తరము ముందు ఉన్నంతగా ఈనాడు తమ్ము తాము సమర్థించుకొనడం లేదు. కాని, ఈ పరిణామాన్ని ఊరికే "పునరుద్ధరణం" అనిగాని వెనక్కు మరలడ మనిగాని పరిగణిస్తే జరిగిన

సంఘటనలను బొత్తిగా అర్థంచేసుకొనకపోవడం అవుతుంది. మతం ముందంజ వేసింది. అథవా కనీసం బహిరంగంలోకి వచ్చింది. ఏళ్ళియేళ్ళక్రితం ప్రాణ పదంగా చూచుకొన్న ఎన్నిటినో వదలివేసింది. ఇప్పటికి ఆరాధించేవాటికి కొత్తఅర్థాలు కల్పించింది. విషాధకరానుభవంతో స్థితప్రజ్ఞతను సంపా దించుకొంది. పూర్వంకంటే ఆశాభావం లేదు; అయినా పూర్వంకన్నా ప్రాబల్యం సంతరించుకుంది. అమెరికన్ జీవితంలో సర్వత్రవచ్చిన పున ర్నిర్మాణం దృష్ట్యా తన్ను తాను పునర్నిర్మించుకోడానికి తగినంత బుద్ధి శక్తి ఉన్నందువల్లనే, అది, ఆ గండం గడిచి బయటపడింది.

సాధించబడిన పునర్నిర్మాణ పరిమాణవిషయంలో మతనాయకులకు సహజంగానే అసంతృప్తి కలిగింది. వారే నిశితంగా విమర్శించేవారిలో అగ్రగణ్యులుకూడా. ఉదాహరణకు: హోం మిషన్స రంగంలో పనిచేసే సుప్రసిద్ధుడైన డాక్టర్ హెర్మన్ నెల్సన్‌మార్స్ ఇలా వ్రాస్తున్నారు:

వ్యవస్థగా చర్చి పెరుగుతూనే ఉంది. అయితే ఆ పెరిగే రేటు తగ్గి పోయినది. సభ్యుల సంఖ్య పెరిగిపోతున్నా ప్రజానీకంలో చర్చితో సంబంధం లేనివారిని అధికంగా ఆకర్షించడం లేదు. వ్యవస్థగా ఇది అత్యంత బలహీనంగా ఉంది. మన జాతి జీవనానికి ఇరుకెలకులుగా ఉన్న గొప్ప నగరాలకు గ్రామాలకు ఏ మాత్రమూ అనుగుణంగా లేదు. బడుల్లో కంటె ఎక్కువగా ఇక్కడే వ్యవస్థాపద్ధతి అని, దృక్పథమని ఉన్నవి. ఇవి మన పందొమ్మిదో శతాబ్దపు వ్యావసాయిక నాగరకతకు చిహ్నాలు. బడులకంటే మరీ ఎక్కువగా ఇదే అసమగ్రమైన శిక్షణపొందినవారు, సహాయసహకారాలు లేనివారు అయిన నాయకులమీద ఆధారపడి ఉంది. ప్రధానంగా ఔత్సాహిక వ్యావృత్తిగా ఉంటున్నది. నూరేండ్లుగా వచ్చిన ప్రతి సాంఘికమైన మార్పూ దాని అగ్రగణ్యమైన స్థానానికి భంగం కలిగిస్తూ చర్చి పలుకుబడిని ఉపయోగించుకొనడం మరింత కష్టమయ్యే ట్లుగా చేసినది. విడివిడిగా సంఘాలు స్థాపించి, వాటిని నిర్వహించు కోవడంలో పాదుకొనిపోయిన సాంఘికమైన మార్పు ప్రభావాన్ని ఇది అడ్డుకొన్నది; అడ్డుకొంటున్నది.

ఈ విమర్శనే డాక్టర్ ఆర్. ఎ. షెర్మర్‌హారన్ మరింత విస్తరించి ఇలా అన్నారు:

తంతు నడపడం ముఖ్యంకావడం, వివిధ చర్చుల రాజకీయాలు, మతాధికారులు తమ చుట్టూ కట్టుబాట్ల కంచెలు సరిచేసుకోడం - వీటివల్ల ముందుకుపోతున్న సమకాలిక సంస్కృతి వ్యాపకాలకు దూరమై చర్చి వేరుగా ఉండడం జరిగింది. ఆధునిక కళ, సంగీతం, సాహిత్యం, ఇవేవో ఇంకొక గ్రహానికి సంబంధించిన వైనట్లుగా నిశ్చయంగా మామూలు మినిష్టర్ ఆస్వాదనపరిధికి దూరంగా ఉండిపోయినవి...సరికొత్త వాస్తు నిర్మాణపద్ధతిలో సాహసికరూపాల్లో తన ఆకృతిని మలచుకొనే చర్చిగాని. ఆధునిక కవితా విప్లవాన్ని స్వప్రయోజనానికి ఉపయోగించికొనే చర్చిగాని ఎక్కడున్నది? అందరికీ అగ్రగామిగా ఉంటేగాని నాయకుడుగా ఉండడం పాస్టరుకు కష్టం మతానికి సంబంధించి నంతవరకు అసంఖ్యాకమైన విలువలెన్నో మన సంస్కృతిలో అణగిఉన్నవి. అయినా లౌకికత్వంమీద శివమెక్కిన దండయాత్రలు సాగుతూనే ఉన్నది ఇది నమ్మశక్యం కానిది. అంతకంటె ఎక్కువగా విషాదకరమైంది.

“మధ్యకాలంనాటివారు, ప్యూరిటనులువలె మనకు కావలసిన ఉదాత్తమైన విలువలన్నీ చర్చివల్ల పొందలేకపోతున్నాం. ఇరవయ్యవ శతాబ్దపు లౌకికతత్త్వానికి కొంతమట్టుకు కారణమైన యథార్థవిషయం ఇదే. మధ్యకాలపువారు, ప్యూరిటనులు ఆ విలువకోసం చర్చిమీద ఆధారపడడం కన్నా గత్యంతరం లేదు. మనకు గత్యంతరం ఉన్నది. విజ్ఞానశాస్త్రం కళ సాహిత్యం నాటకం ఇవన్నీ జీవితంలోని విశేషమైన లోతుపాతుల జ్ఞానం మనకు కలుగజేస్తాయి. ఇది గతంలో మత మొక్కటే చేసేది.

లౌకికత్వ సహజత్వాలనే ఈ సమస్య అంతటినీ ఉపేక్షించడంవల్ల కాకుండా అవగాహనవల్లనే ఎదుర్కొనడం ఒక్కటే మార్గం అక్కరలేనట్టు మూల్గుతూనో, అక్కరగానో కాక ఉత్సాహోల్లసితమైన ఆశతో గనుక ఈ ప్రయాణం కొనసాగిస్తే చిరకాలంగా మనలను ఆవరించిన కాలజీమూతాలు మనలను భయపెట్టలేవు. ప్రొఫెసర్ హైమన్ మాటల్లో చెప్పాలంటే, “మనకు కావలసింది ఏ మాత్రం మార్చని పాతమతంకాదు. మరి, తల్లితండ్రి అన్వవాయుడు లేకుండా మెల్కిజెడెక్‌లాగ వచ్చే పూర్తిగా కొత్తమతమూ కాదు. మనకు కావలసింది ఏమంటే కొన్ని కొత్త సంబంధాలతో భగవంతునితోడి సాహచర్యం సంపాదించడానికి

గాను పవిత్రములు గావించదగ్గ కొన్ని విషయాలను కనుక్కోడం, భక్తి ప్రపత్తులు చూపదగిన కొన్ని కొత్తలక్ష్యాలు ఏర్పరచుకోడం."

ఇలాటి ఆత్మవిమర్శ బలహీనతా చిహ్నంకాదు. గాని అంధకార బంధురమైన మూడవ దశాబ్దంలో వచ్చిన ఆ విమర్శ, ఆ నాటినుంచి క్రమంగా ఎక్కువవుతూ వచ్చినదానికి నాంది అయింది.

ఇటీవల మతసంస్థల పెరుగుదలలో ఏర్పడిన వైఖరులను గురించి గణాంకవివరాలనుబట్టి ఒక స్వరూపం నిర్ణయించుకోడం కష్టమే. శాతా అనుబట్టి పెరుగుదలను కొలవడంవల్ల చిన్నచిన్న అధికంగా ఫండమెంట లిస్ట్ చర్చుల పెరుగుదలకు మితిమీరిన ప్రాముఖ్యం ఇచ్చినట్టవుతుంది. సభ్యత్వం వివరాలు పోల్చదగినవి కావు. ఏమంటే, కొన్నివర్గాలు (ఉదాహారణకు రోమన్ కాథలిక్కులు) పుట్టుకనుంచి (లేక బాప్టిజంనుంచి) సభ్యత్వం లెక్కపెడతాయి, ఇతరవర్గాలు కేవలం వయోజనులకు మాత్రమే సభ్యత్వ మిస్తాయి. యూదులలో సినెగాగ్ ప్రార్థనలో అధికంగా పాల్గొనే సభ్యులు ఎంతమందో కచ్చితంజా లెక్కించడంకూడా అసంభవం. ఒకటవ ఎగ్జిబిట్టులో స్థూలంగా తెలిపిన గ్రాఫ్ మతసంస్థల్లో ముఖ్యమైన రకాల పరస్పర బలాలు ఒకదానితో ఒకటి పోల్చి చూచినప్పుడు, వాటి పెరుగుదల, జనసంఖ్య పెరుగుదలతో పోల్చినప్పుడు వాటి పెరుగుదల నిష్పత్తి చూపుతుంది. ఈ గ్రాఫ సారాంశ మేమిటంటే చిన్నచిన్న సంస్థల్లో ఆశ్చర్యకరమైన మార్పులు కనిపించినా, సంఖ్యలో గాని మతసంస్థల పరస్పర బలాల్లోగాని ఆశ్చర్యకరమైన మార్పులేవీ లేవని సూచించడం. మొత్తంమీద మతసంస్థల బలం తరగడంలేదు. జన సంఖ్య పెరుగుదలనుబట్టి స్వల్పంగా పెరిగిందికూడ, లభ్యమవుతున్న అంకెలను మరింత వివరంగా పరిశీలిస్తే ఈ శతాబ్దం ద్వితీయపాదంలో అటు వాయువ్యంగాను ఇటు ఆగ్నేయంగాను అంటే శాలమైన మన పల్లెపట్టులలో గమనించదగినంతగా చర్చులు పెరిగాయని తెలియగలదు. మన మీ ప్రకరణంలో పరిశీలిస్తున్న విషయాలకు దీనికి కొంత సంబంధం ఉంది. ఈ ప్రాంతాల్లో ఇప్పుడు మతాసక్తి ప్రబలిందని కాదుగాని రహదారులు రవాణాలలో కొత్తగావచ్చిన అభివృద్ధులవల్ల సరిహద్దు ప్రాంతాలలోని వ్యవసాయదారులు మునుపు జనం చెదరుగా ఉండడంచేత చర్చి

వ్యవస్థీకరణ ఆచరణసాధ్యం కాని ప్రదేశాల్లో చర్చులకు హాజరై, వాటిని బలపరచడం జరిగిందని బహుశ యిది రుజువు చేస్తున్నది.

బాగా అభివృద్ధి పరచిన రహదార్లమీద నడిచే మోటారుకార్లు, ట్రక్కులు, బస్సులు గ్రామీణ జనసంఘాల పొలిమేరలను విస్తరింప జేసినవి. పల్లెపట్టునఉన్న గ్రామాన్ని గ్రామీణ అమెరికాకు ముఖ్యపట్టణం చేసినవి. బడులను స్థిరపరచినవి. వర్గసమావేశాల వ్యవస్థల సంఖ్యను పెంచినవి. రేడియోతోచేరి గ్రామీణ జీవితంలోని నిస్సంగత్వాన్ని చాలవరకు పోద్రోలినవి. ఈ అభివృద్ధికరమైన మార్పులతాకిడి చర్చికికూడ తగిలింది. బిడారాల గుంపులే సమాజంగా పరిగణింపబడుతున్న కాలానికి అనుగుణంగా ఉన్న ఆరుబయలు చర్చులు చాలమట్టుకు ఏభై మందికి తక్కువగా సభ్యులుండి ఒకదానికి సన్నిహితంగా ఉండేవి - వేలకొద్దీ నశించిపోయినవి. పల్లెచర్చుల సభ్యత్వంలో వ్యవసాయదారుల నిష్పత్తి 1940 నాటికి నూటికి సుమారు 40 వంతులు. ఇంత శాత మెప్పుడూ లేదు.

సుమారుగా ఒక తరహాకు నమూనా అయిన తూర్పునగరం దలువెర్ రాష్ట్రంలోని విల్మింగ్టన్ పరిశీలన ఇటీవల ల్మింగ్టన్ కౌన్సిల్ ఆఫ్ చర్చెస్ వారి యాజమాన్యాన జరిగింది. ఆ పరిశీలన ఫలితాలు ఏమంత దిగ్భ్రాంతి గొలిపేవిగా లేవు: జనసంఖ్యలో 37 శాతం రోమన్ కాథలిక్కులు. 27 శాతం ప్రొటెస్టెంట్లు. 3 శాతం యూదులు. మిగత 33 శాతం వాళ్లు ఏ మత సంఘంతోను చేరినవారు కారు. ప్రొటెస్టెంట్లలో (వీళ్ళలో నాలుగింట మూడుభాగాలు మెథడిసులు, ప్రిస్బిటీరియనులు, లేదా ఎపిస్కోపలియన్లు) ఎనిమిదింట్ల మూడువంతులు మాత్రమే. మామూలుగా ఆదివారంనాడు చర్చికి వెళ్లుతారు. చర్చి సభ్యులలో 55 శాతం ఆదివారపు బళ్లలో సభ్యులు. ఆదివారం బడులకు హాజరయ్యే వారిసంఖ్య చర్చికి హాజరయ్యేవారికన్నా కొంచెం మెరుగు. సభ్యులలో మూడింట ఒకభాగం నగరపు శివార్లకు చెందినవారు. ఇతర పరిశీలనవల్ల వికేంద్రీకరణపట్ల కొంతమొగ్గు ఉందని వెల్లడి అయింది. పట్టణాల శివార్లలోను, పరిసర గ్రామీణ ప్రాంతాలలోను ఉన్న చర్చులకన్నా పట్టణాలలోని చర్చులు నెమ్మదిగా బలపడుతున్నాయి.

ప్రజల సమస్యలలోను, స్థూలమైన సామాజిక దృక్పథంలోను మత వర్గాలకు ఉన్న అభిప్రాయాలను ప్రజాభిప్రాయ సేకరణ పద్ధతులు

వంచించి కొలవడానికి చాల ఇటీవల జరిగిన ప్రయత్నం ఎపెండిక్స్‌లో పొందుపరచబడింది. ఇదేవిధంగా 1940–1945 సంవత్సరాలలో సిద్ధించిన ఫలితాలకు పేర్కొనదగినంత భిన్నమైన ఫలితాలు ఈ ప్రయత్నంవల్ల లభించినవి. "మతం-వర్గనిర్మాణం" అతి జాగ్రత్తగా నిపుణంగా పరిశీలించే లిస్టన్ పోప్ అంతటివాడుగూడా చర్చుల (ముఖ్యంగా రోమన్ కాథలిక్ చర్చుల) సామాజిక ప్రతిపత్తిలో గడచిన దశాబ్దంలో అప్పట్లో అందరూ ఊహించిన వాటికన్నా గొప్ప మార్పులే రాగలవని నిర్ణయించడానికి ఆ ఫలితాలు కారణమైనవి.

కాని మతంలో వచ్చిన గమనింపదగ్గ మార్పులలో, ప్రధానమైనవాటిలో ఎక్కువభాగం మాత్రం కొలవడం జరుగలేదు. బహుశ వాటిని చాలభాగం కొలవడం సాధ్యంకూడ కాదు. ఏది ఎట్లున్నా, మతపునర్నిర్మాణ వివిధ దశలను అభివర్ణించిన ఈ తర్వాతి ప్రకరణాలు చాలవరకు శాస్త్రీయమైన నివేదిక లనడానికి ఏ మాత్రం వీలులేదు. : చాలీచాలని సాక్ష్యాలతో సాహసించి సామాన్య సూత్రాలు చేయడం, వ్యక్తిగతమైన భావముద్రననుసరించి విలువకట్టడం తప్పదు.

—

# సంస్థల పునర్నిర్మాణము

## మతసంస్థల బహువిధ విభాగము

మతాన్ని లోనుండి చూచేవాళ్లకు ఎవరికైనా మన సాంఘిక విప్లవం వల్ల మతానికి కల్గిన విప్లవాత్మక ఫలితాలు స్పష్టంగా కన్పిస్తవి కాని మత సంస్థల ముఖంవరణాన్ని మాత్రమే చూచేవాళ్ళకు కంటపడవు. ఆ ఫలితాలను అంకెలతో గణనపద్ధతిగా చూపడానికి వీలులేదు. కనీసం ఈ దొరుకుతున్న అంకెల రకాలతో సాధ్యంకాదు. సభ్యులసంఖ్య ఎక్కువగా వున్న చర్చిలే చాలవరకు స్థిరమైనవి. సభ్యత్వానికి సంబంధించినంతవరకు పుట్టుకరేటుకంటె అది కొంచెము ఎక్కువగానే వుంటుంది. మతసంస్థలకు చెందిన జనాభా శాతము 19వ శతాబ్దంలో మారినంతగా 20వ శతాబ్దంలో మారలేదు. మాటిమాటికి పత్రికల్లో కలవరపడటం, డంబాలు చెప్పటం ఎన్ని కన్పించినా ప్రాటస్టెంట్, కాథలిక్, యూదువర్గాల శాతాలు గమనించతగినంతగా ఏమీ మారలేదు. అంచుల్లో ఏవో కొన్ని పడిపోవడాలు, క్రొత్తలు వున్నవి. ఈ 50 ఏండ్లలో రెండు అమెరికన్ మతాలు లక్షలకొద్ది సభ్యుల్ని సాధించి అత్యంతం - కొంచె యించుమించు స్తంభించిపోయినంతగా - స్థిరపడిపోయినవి. "చర్చి ఆఫ్ జీసస్‌క్రైస్ట్ ఆఫ్ ది లాటర్ డే సెయింట్స్" (దిమార్మన్స్) ది చర్చ్ ఆఫ్ ది క్రైస్ట్, సైంటిస్ట్ (క్రిస్టియన్ సైన్స్) అన్నే ఈ రెండూను. మార్మనులు ఇస్రెల్ వాసులవలెనే తమకు యిష్టంలేకపోయినా యూదులమధ్య నివసించవలసి వచ్చిన జనులు. వాళ్ళ చర్చి ఆధ్యాత్మికజీవితాన్ని ఒకప్రత్యేకమైన తరతరాల సంస్కృతిని వ్యక్తం చేసే పరిపూర్ణమైన అర్థంలో చర్చి. క్రిస్టియన్ సైంటిస్టులుకంటె వీళ్ళు జర్మను సాంఘింక శాస్త్రజ్ఞులు ఒక తెగవారని పిలిచేవారు. వీళ్లకు వీళ్ల చర్చి ఒక ప్రత్యేకమైన ప్రయోజనాన్ని సాధిస్తుంది. ఒక ప్రత్యేక విధమైన భెషజ్యము, అనామయము ప్రసాదిస్తుంది. అథవా విలియం జేమ్స ఉత్సాహపూర్వకంగా అన్నట్లు కనీసం "ఆరోగ్య మనస్కత"ను ప్రసాదిస్తుంది. ఇంతకు తప్ప వీళ్ళలో ప్రత్యేకత ఏమీలేదు. వీళ్ళమతానికి వీళ్ళ పౌరసత్వానికి బొత్తిగా సంబంధంలేదు. ఈ రెండు మత సంస్థలకు 19వ శతా

బ్దంలో దర్శనసిద్ధి కల్గింది. 20వ శతాబ్దంలో తొలి సగమంతా తమను యింకేమీ క్రొత్తగా ఆవహించకుండా అడ్డుకోవడానికి ఉపయోగించు కున్నారు. కొన్ని చిన్నచిన్న భేదాలువున్నా ఈ చర్చీలకు యిప్పుడు చక్కగా అంచులుతీరిన ఆచారాదికాలు వున్నవి. అమెరికన్ మతసంస్థాధి కార్లలో యివే అత్యంత కఠినమైనవ్వి. ఇవి యిప్పుడు "ఉద్యమాలు"గా వుండడం మానివేశాయి.

జాతీయ చర్చిదృష్ట్యా మన చర్చీలన్నీ తెగలు కావడంచేతనూ, యూరో పియన్ జాతివర్గాల ఆధారంగా చేసుకొని వున్నవాటికి వాటి తొలుతటి ప్రాముఖ్యం పోతుండటంచేతనూ అమెరికన్ వాతావరణంలో "చర్చీలు" అని, "తెగలు" అని సాంఘికశాస్త్ర సంబంధంగా గిరిగీయడం అంతగా వుపయోగకారికాదు. మార్మనులు ఆచారపరాయణులైన యూదులు, మరికొన్ని చిన్నమత జనసంఘాలు మతమునకు సంబంధించి క్రమమైన కట్టు దిట్టాలు ఏర్పరచుకున్నవాళ్లు. అయితే రోమన్ కాథలిక్ చర్చితోకూడా కలుపుకొని యునైటెడ్‌స్టేట్స్‌లోని తక్కిన అన్ని మతసంస్థలు అటు జాతీయ చర్చీలుకావు, ఇటు తెగలూకావు. సాధారణంగా వీటిని "అంత రువులు" అని లేదా "కమ్యూనియన్"లని అంటారు. వీటిల్లో ప్రతిఒకటి భిన్నభిన్న వర్గాలకు చెందినపుడే సభ్యులను ఒక మతసంఘంగా కూర్చు కుంది. ఈ అంతర్వులన్నీ అమెరికన్ ప్రజల ఆధ్యాత్మిక జీవితాన్ని సామూ హికంగా అభివ్యక్తం చేస్తున్నవి. కాని వీటిలో ఏ ఒకటికూడా ఒక ప్రత్యేక సంస్కృతికిగాని, వర్గానికిగాని ప్రాతినిధ్యం వహించదు. అమెరికన్ సంస్కృతికి మతసంస్థలలోని అంతర్వులు, మతసంబంధమైన "ఉద్యమాలు" మరింత ముఖ్యము. ఒక మతసంఘమంటే తాను ఆరాధించే ఒకపురాసంపద తన విశ్వాసాన్ని సక్రమంగా వ్యక్తీకరించే పరిపాలన, సాధారణంగా అందరూ అవుననేట్లు ఏర్పడిన విధులు విలువలుగల సభ్యసంఘం వున్నటు వంటి స్థిరమైన సంస్థ. ఉద్యమాలన్ని సంస్థలుగా పరాకాష్ఠ పొందుతవి. విశ్వాసాలన్నీ తెగలైనట్లుగా, ఒకసంస్థను సృష్టించకపోతే ఉద్యమానికే ముప్పువస్తుంది. కదలిక లేకపోతే సంస్థకు ముప్పువస్తుంది.

ఈ భేధాన్ని ఉపయోగిస్తూ ఇప్పుడు చెప్పిన రెండు మతవర్గాలవలె ముందు శతాబ్దాల్లో తమ ముఖ్యమైన ప్రాబల్యాన్ని పొంది యిప్పుడు తగ్గి పోతున్న మతవర్గాలను మనం గమనించవచ్చు. ఉదాహరణకు 19వ శతా

బ్దంలో ఆధ్యాత్మికత శక్తివంతమైన ఉద్యమంగా వుండేది. ఈ శతాబ్దపు తొలి రెండుదశాబ్దాల్లోకూడా వాళ్ళ క్యాంపు సమావేశాలు, పితరులతో సంవదించడానికి కూర్చోవడాలు, "సమ్మర్ లాండ్"లోని దర్శనాలు - వీటిలో కొంత జీవముండేది. కాని ఈనాడు యీ ఆధ్యాత్మికమైన చర్చీలు చావసిద్ధంగా వున్నదికాకున్నా నిశ్చయంగా ఆధ్యాత్మికశక్తిలేని ఉద్యమానికి శేషచిహ్నాలు. న్యూ జెరూసలం చర్చి, (స్వీడెన్బర్గియన్) యూనివర్సలిస్టులు, లిబరల్ కాథలిక్ చర్చి, అమానాసొసైటి, క్రిస్టాడెల్ఫియా ఫ్రాటర్నిటి, ది షేకర్స్, బహాయ్, రాసిక్రూషియన్స్, థియాసఫి - వీటన్నిటిలోను సాధారణంగా ఒక పతనరేఖ కానవస్తుంది.

1906 నాటి జనాభా లెక్కలలో కెక్కినవాటిలో ఇరవైకి పైగా మతసంస్థలు పూర్తిగా అదృశ్యమైనవి. థియాసఫీ విషయంలో 1936 నాటి యునైటెడ్ స్టేట్సు సెన్సస్ అధికారు లిట్లా వివరించారు : "థియాసఫికల్ సొసైటి - ఈ సమాజాల స్వభావాన్నిబట్టి ఈ థియాసఫికల్ సొసైటీలను ఇకమీదట మతసంస్థలక్రిందగాని, మతసంబంధమైన సెన్సస్‌లోగాని లెక్కకు తీసుకోరాదని నిర్ణయానికి రావడమైనది." ఈ నిర్ణయం బహుశః థియసాఫికల్ సాహిత్యంలోని ఈ లాంటి ప్రకటన లాధారంగా పుట్టివుండవచ్చు; "థియాసఫీ...క్రొత్తమతంకాని, విజ్ఞానంకాని లేదా వేదాంతంకాని కానేకాదు. ప్రపంచంలోని ఏ మతంయొక్క ప్రాథమిక సత్యాలకూ ఇది విరుద్ధమైందీకాదు. ఇది విశ్వవసీజమైన సిద్ధాంతం" (కాలిఫోర్నియా రాష్ట్రంలోని కోలినానగరంలో ఉండే థియాసాఫికల్ యూనివర్సిటీ ప్రెస్సువారి ప్రచురణకర్తల ప్రకటన). అయితే ఇలాంటి ప్రకటనలు థియాసఫిస్టులు ఎప్పుడూ చేస్తునే ఉంటారు గనుక ఆ ఉద్యమం "ఇకమీదట" మతసంబంధంలేకుండా ఉండాలన్న మొగ్గు చూపుతున్నట్లు ఈ ప్రకటన ప్రతిఫలింపజెయ్యటంలేదు - థియాసఫిస్టులూ విద్యాసంబంధమైన థియాసఫికల్ యూనివర్సిటీ ముఖ్యమనేవారు, మతసంబంధమైన శ్రద్ధ కర్మకాండ కావలెననేవారు అని తమలో తాము రెండురకాలుగా అయినారు.

ఏమైన ఇరవైకిపైగా క్రొత్తసంస్థలు ఏర్పడినవి. ఇరువదవ శతాబ్దములో కూడ దానికి తగిన ఉద్యమాలు వచ్చినవి. వాటిలో అనేకం త్వరగా మాసిపోయేవి. అయితే చాల ఉద్యమాలు స్థిరమైన సంస్థలకు సృజించినవి. బాగా పరిచితమైనవాటిలో ఎక్యుమినికల్ మూమెంట్, ఫండమెంటలిజమ్,

జియానిజమ్, ఇంటర్ ఫెయిత్ ఫెలోషిప్పు, ఆక్స్‌ఫర్డు గ్రూప్ మూమెంటో, న్యూ థాట్, యూనైటెడ్ స్కూల్ ఆఫ్ క్రిస్టియానిటీ, యెహోవాస్ విట్నెసెస్ (19వ శతాబ్దపు ఉద్యమానికి తరువాతది), ది పీస్ మిషన్ ఆఫ్ ఫాదర్ డివైన్, ది ఇంటర్ నేషనల్ చర్చి ఆఫ్ ది ఫోర్ స్క్వేర్ గాస్పెల్, యూత్ ఫార్ క్రైస్ట్ మువ్ మెంటు, ది ఇంటర్ వర్సిటి ఫెలోషిప్స్ ఉన్నవి. ఇలాంటి ఉద్యమాలు కొన్ని తెగలకు సంబంధించినవి కావచ్చును కాకను పోవచ్చును. కాని సమకాలీన మతోద్యమాలుగా శాశ్వతసంస్థలు సృష్టించేవిగానో అథవా అటువచ్చి ఇటు పోయేవిగానో ఉన్న గుర్తింపదగినవే అవుతవి. మతసంబంధమైన కాగులోని రూపాలివి. అటువంటివిగా ఈ వచ్చే ప్రకరణాలలో వాటికి తగిన శ్రద్ధను మనము వాటికి చూపించాలి.

మతసంస్థల నిర్మాణములో ఒక విప్లవాన్నే సాధించబోతున్నట్లు కనిపించే మరొక విధమైన సంస్థావిభజనను ఇక్కడ మీ దృష్టికి తేవలసి ఉంది. యునైటెడ్ స్టేట్సు జనాభా లెక్కలలో ఎక్కించిన సంస్థలరకాలు చాలవరకు పూజ దేవతాసేవ ప్రధానోద్దేశ్యంగా ఉన్నదని (జనాభా లెక్కల అధికారులు ఆ సంస్థలు) నిర్వచించిన అంతరువు సంస్థంలు. ఇవన్నీ శతాబ్దాల తరబడిగా దేవాలయాలని, చర్చీలని, దేవతాగృహాలని మతాలని సినెగాగ్‌లని అందరికీ తెలిసిన భవనాలలో కేంద్రీకృతములై ఉన్నవి. కానీ మన ఈ శతాబ్దము సృష్టించిన అనేకములైన మతసంఘాల బాహిర సంభారాలు చర్చి భవనాలకంటె గొప్పవైన గొప్ప వ్యాపారసంస్థల భవనాలను బోలిఉంటవి. వీటిలో కొన్నింటిని "అంగడి ముందు చర్చీలు" అనికూడ సామాన్యంగా పిలుస్తారు. ఇవి పనికి, మతసంబంధమైన కృషికి, ఏర్పడిన సంఘాలు. క్రైస్తవ చర్చీల సాంప్రదాయికమైన కట్టుదిట్టాలలోకూడ "న్యూ ఇంగ్లండ్ సమావేశగృహాలు", "సొసైటీస్ ఆఫ్ ఫ్రండ్స్" అనే పదాలు, మతాధికార సంబంధములేని మతసంస్థలకు ఆపామాషి సభ్యత్వాలకు మిషన్‌బోర్డులకు సాంఘికంగా పనిచేసే కమిటీలకు యువక సమాజాలకు తొలిచాయగా వచ్చినవి. కడపటి దశాబ్దాలలో అమెరికన్ మతసంస్థల కృషి పూర్తిగా నిపుణమైనదిగా క్రమబద్ధంగా మారి క్రమబద్ధంగా ఆచరణదృష్టి కలదిగా మారింది. ఎంతగా మారిందంటే మతంయొక్క ప్రాణభూతమైన విషయం పూజనుండి సేవకూ దేవతాపీఠంనుండి ఆఫీసులోకి మారినట్లు కన్పిస్తుంది. ఈ శతాబ్దం తోట

తొలినాళ్ళలోకూడ ఒక దూరదృష్టిగల వేదాంతశాస్త్రజ్ఞునికి ఈ బహు విధ విభాగము మనస్సుకు తట్టి భవిష్యద్వాణిలాగ వ్రాసిన పేరాను ఇక్కడ రెండవ ఎగ్జిబిట్ లో చూపుతున్నాము.

ఈ కార్యకలాపాలన్నీ మతసంబంధము కలవి అవునా కావా అన్నది కేవలము శాస్త్రీయమైన చర్చే అవుతుంది. ఏమంటే, వ్యాపారము ఎక్కడ అంతమౌతుందో మత మెక్కడ మొదలవుతుందో అనికాని ఏ బిందువువద్ద రాజకీయాలు "స్వారాజ్యానికి ఎత్తుగడ"గా అవుతాయో ఎవరు ఇదమిత్థమని చెప్పలేరు. ఈమధ్య మన చర్చీలకు ఆలయాలకు దగ్గరగానో చుట్టుప్రక్కలనో లేచిన ముఖ్యమైన మతసంస్థలకు ఇక్కడ వింగడించితే చాలు.

1. సంపూర్ణమైన ఆధునిక నగరం సదస్సులతో పనిచేసే సంస్థల చర్చిలలో చదువుచెప్పే ఉద్యోగులు వినోదసౌకర్యాలు క్లబ్బుగదులు వంట ఇల్లు ఉంటాయి. తీర్పులు చెప్పడాలు వృత్తిగా సాంఘిక సేవ, మనస్తత్వశాస్త్రపు సలహాలు ఉద్యోగాలు చూచిపెట్టడంలాంటివి ఉంటాయి.

2. అంగడి ముందు చర్చీలు "సువార్తా ఉపకార్యాలు" అనేవి పైవానికి పూర్తిగా విరుద్ధమైనవి. ఇవన్నీ సువార్తను బోధించడం ఓదార్చడం తాత్కాలిక దానధర్మాలు చేయడం పనిగా పెట్టుకొన్న సంస్థలు. ఒక్కొక్కప్పుడు చర్చీలే వీటికి ధనమిస్తాయి. కానీ ఇప్పుడు పెద్దపెద్ద నగరాలలో ఒక షేఇదిగా సరైన నిర్మాణము పెట్టుబడి స్థిరతలేకుండా పుట్టగొడుగుల్లాగ పుట్టుతున్నవి.

3. జనసమాజ కేంద్రాలు సాధారణంగా క్రైస్తవ జనసమాజాలలో జనులుకాని లేదా చర్చీల సంఘంకాని పోషించేవి. ఈ చర్చి సమైక్య సంఘాలు మూడువేల స్వతంత్ర సంఘాలుగా పదిలక్షల సభ్యులతో ఉంటున్నవి. యూదు జనసమాజాలలో వివిధమైన యూదు మతశాఖలు సహాయపడుతవి.

4. ఉద్ధారణ, సంఘసేవ, విద్య, సువార్త బోధించటం ఎత్తివచ్చిన వాళ్ళకు పునరావాసము కల్పించటమువంటి సమైక్య కార్యక్రమాలకు చర్చిబోర్డులను పరిపాలనాశాఖలను కల్పి ఏకముచేశారు.

5. యువజనసంఘాలు : సాహచర్యానికి వినోదానికి మతవిద్యకు ఉద్ధరణ కార్యాకలాపాలకు ఏర్పడిన ఇవి చర్చి కార్యకలాపాలకంటె ఎక్కు

వగానే మతసంబంధమైన కృషిని విస్తరింప చేసినవి. వై. ఎమ్. సి. ఏ., వై. డబ్ల్యు. సి. ఏ., వై. ఎమ్. హెచ్. ఏ., వై. డబ్ల్యు. హెచ్. ఏ., బినాయ్‌బ్రత్, క్రిస్టియన్ ఎండెవర్ సొసైటీ, ది స్టూడెంట్ వాలంటీర్ మూవ్‌మెంట్ వంటి సంఘాలు అంతరువు సంస్థల ప్రాతిపదికలోనే ఏర్పాటు చేయబడినవి. ఇటువంటి ప్రయోజనాలే ఉండిన రోమన్ కాథలిక్ యువక సమాజాలలో నైట్స్ ఆఫ్ కొలంబస్ బాయ్స్ వర్క్, కాథలిక్ బాయ్ స్కౌట్సు, కాథలిక్ గర్ల్ స్కౌట్సు, కాథలిక్ యూత్ ఆర్గానిజేషన్, కాథలిక్ స్టూడెంట్సు మిషన్, క్రూసేడ్‌లు ఉన్నవి. ప్రొటెస్టెంటు అంతర్వు సంస్థలు, న్యూమన్ క్లబ్, హిల్లెల్ సమాజాలు ఈమధ్య కళా శాల ఆవరణలలో పలుకుబడి సంపాదించుకొన్నవి. పరస్పర మతవిశ్వా సాలకు సంబంధించిన ప్రయోగాలుకూడ జరిగినవి.

6. మతసంస్థల విద్యాసంబంధమైన కృషిలో విద్యకు సంబంధించిన అన్నిదశలు, అనగా ఎలిమెంటరీ స్కూళ్ళు (రిలీజ్‌టైమ్ తరగతులలో కూడ) ఆదివారపు బళ్ళు మొదలుకొని కళాశాలలు విశ్వవిద్యాలయాలు వేదాంత శాస్త్ర చర్చాసదస్సులు అనేకవిధములైన యాంత్రికోద్యోగాల శిక్షణ విద్యాలయాలు ఉన్నవి.

7, ప్రాథమిక మతవిద్యకు, ఉన్నత మతవిద్యకు బళ్లలో మతసంబంధ మైన కార్యక్రమాలనుగూర్చి చర్చించి పథకాలు వేసుకునే సమైక్య సమావేశాలను ఎన్నో సంఘాలు నిధులు ఉన్నవి.

8. మతసంబంధమైన వార్తాపత్రికలు, ప్రకటన, ఇప్పుడు వృత్తి ప్రాతి పదికమీద నడుస్తూ సాధారణమైన వార్తలు వినోద కాలక్షేపాలు మత బోధన అందిస్తు అన్నివిధాల లౌకికమైన వార్తాపత్రికలతో పోటీ చేస్తు న్నది. మతగ్రంథాలు ప్రచురించే ప్రచురణాలయాలు తమ ప్రచురణ కార్యక్రమ విస్తృతిని మరింతగా పెంచి సాంప్రదాయికమైన మత స్వాతంతో పాటు పరిశోధన కార్యక్రమాల ఫలితాలనుకూడ ప్రచురిస్తున్నాయి.

9. పెద్దపెద్ద చర్చీలు మతసంబంధమైన లాబీలను ఏర్పాటుచేసినవి. తమ పలుకుబడితో ఒత్తిడి తేగల లాబీవర్గాలకు పరస్పర మతవిశ్వాస సంఘాలు కొన్ని డబ్బుకూడ ఇచ్చినవి.

10. పరస్పర మతవిశ్వాస సంఘాలు అంతర్జాతీయ సంఘాలు లౌకికతా సిద్ధాంతమునుండి మతాలను పరిరక్షించటానికి తమ కందరికీ సామాన్య మైన ముఖ్యవిషయాలను అభివృద్ధిచేసుకోవటానికి ఏర్పరుపబడినవి.

ఇలాంటి సంస్థలను ఊరక పట్టీకట్టినా, ఈ మతసంస్థలు ఎంత క్లిష్టంగా "స్వార్థపరంగా" అయినవో, మతం అనేది ఏకాంతంగా సాధనచేసేది అనే భావం ఎంత ప్రాతపడిపోయిందో సూచనగా తెలుస్తుంది. ఏకాంతిక భక్తి సాగుతునే ఉందనుకోండి. అయినా ఎంత వైయక్తికమైనా, సాధుత్వమైనా నిపుణులు సక్రమ సంఘంగా ఏర్పడినవారు అయినా మత సేవకులు సమిష్టి ప్రయత్నాలకే ప్రేరేపిత మవుతున్నారు. 1920 నుండి 1950 దాకా ఉన్న మూడుదశాబ్దాలలో అంతకు మునుపటి మూడు దశాబ్దాలకంటె రెండింతలుగా పలువిధములైన కాథలిక్ సంఘాలు స్థాపింపబడినవి. ప్రాటెస్టెంట్ యూదు సంఘాల కథకూడ ఇలాగే ఉంటుంది. "కలియడ" మనేది ఇప్పుడే మొదలవుతున్నట్లుగా ఉన్నది.

## మతసంస్థల బహిరంగ ప్రతిపత్తి

ఆధునిక విజ్ఞానం పుట్టినకాలంలో, ప్రభుత్వానికి చర్చికి మధ్యవుండే సంబంధాలనుగూర్చిన అమెరికన్ సూత్రాలు నిర్మించబడినప్పుడు మత మనేది వ్యక్తి స్వంతవిషయమని మామూలుగా అనుకొనేవాళ్లు. 1776 నాటి వర్జీనియా హక్కుల ప్రకటన మతానికి, నీతికిమధ్య ఒక విలక్షణమైన భేధాన్ని చూపింది. దాని ప్రకారం "మతమంటే మన సృష్టికర్తకు మనము ఋణపడివున్న విధి రూపమైన బాధ్యత". "నీతి అంటె మన మందఱము పరస్పఱము క్రైస్తవ మతానుసారమైన క్షమను, ప్రేమను, ఔదార్యమును ఒకరియం దొకరు పాటించడము". ఇక్కడ "క్రైస్తవ" అన్న విశేషణ పదము ప్రమాదవశాత్తు పడివుండవచ్చు. లేదా మామూలు మాటలను అజాగ్రత్తగా వాడివుండడంవల్ల వచ్చివుండవచ్చు. ఏమైనా అప్పట్లో సిద్ధాంతంలో ప్రాథమికంగా వుండిన భేదము "తన అంతరాత్మ ఉద్బోధించినదానికి అనుగుణంగా" ప్రతివ్యక్తి స్వతంత్రంగా భగవంతునియెడ తాను నిర్వహించవలసిన విధులకు పౌరసంబంధమైనవో అథవా పరస్పరమైనవో (తప్పనిసరిగా క్రైస్తవ సంబంధులు కానక్కర లేదు) అయిన సహనము లేదా క్షమ అనే విధులకు మధ్యవుండేది. మొన్నమొన్న 1931 లో ప్రధానన్యాయమూర్తి హ్యూస్, అంతరాత్మ ఒప్పుకోదని ఆక్షేపించిన (యునైటెడ్ స్టేట్స్ వర్ సెస్ మాకింటోష్, 283 యు. యస్. 633) వారి వివాదంలో ఈ భేదాన్ని అంగీకరించి

చూపారు. ఆయన ఇట్లా వ్రాశారు; "మతంలోని సారభూతమైన విషయమేమంటే భగవంతునికి మనకు ఒక సంబంధము ఉన్నదన్న నమ్మిక - దానితోకూడ ఏ మనుష్య సంబంధంవలనకాని పుట్టిన విధులకంటే బలీయమైన విధులతో కూడివుండటము." ప్రకరణాన్నిబట్టి తేటబడుతూ ఆయన మనస్సులో వుండిన దేమంటే "రాజ్యంకంటే వున్నతమైన ఒకానొక నైతికశక్తియెడ బాధ్యత." కాని కాథలిక్ సిద్ధాంతులవలె ఆయనకూడ రాజకీయమైన విధికి పైనవున్న ఏ విధి అయినా మనుష్య సంబంధాల ప్రాతిపదికమీద లేదనే భావించారు. మతసంబంధమైన ఈ అంతరాత్మను లేదా అనుత్తమ విధినిగూర్చి చేసిన వైయక్తిక వ్యాఖ్యానం క్రమశః పడిపోయి ఈనాడు లౌకిక మతనాయకులలో మతానికున్న సాంఘిక బాధ్యతనుగూర్చిన ఎక్కువ తెలివిడి వుంది. సాంఘికమైన ఈ బాధ్యతే మతంయొక్క సారమని వాదించే అతివాదులతో ఏకీభవించినా, ఏకీభవించకపోయినా, అట్లే సంఘంలో నీతిని నిలపడంలో మతానికున్న శక్తిని పూరక గుర్తించినా గుర్తించకపోయినా మన సంస్కృతి నిర్మాణంలో మత మనేది మూలభూతాంశం కాకపోయినా ఒక ప్రధానాంశము మాత్ర మగుననే తెలివిడి సర్వత్ర వుంది. థామస్ జఫర్సన్ "పంపకాల గోడ"ను గురించి మాట్లాడిన ప్రసిద్ధ రచనాభాగం ఈ వాక్యాంశంతో ఆరంభిస్తున్నాడు; "మత మనేది కేవలము మనుష్యునికి భగవంతునికి మధ్యవుండే విషయమని, తన విశ్వాసాన్ని గురించిగాని, తన పూజనుగురించికాని, అత డింకెవరికిని సంజాయిషీ చెప్పుకోనక్కఱలేదని మీతోగూడా నేను విశ్వసిస్తూ..." ఆయన ఈ వాక్యాంశంతో ముగించినాడు; "మనిషికి తన సాంఘికవిధులకు వ్యతిరేకంగా సహజమైన హక్కు ఏమీలేదనడంలో నాకు సందేహంలేదు." ప్రకృతిసిద్ధమైన హక్కులను, ప్రకృతిసిద్ధమైన సూత్రాలనుగూర్చి ఈనాడు జరిగే సజమర్థన జఫర్సన్ లాగా సాంఘికమైన విధికి వ్యతిరేకంగా ఏ ప్రకృతిసిద్ధమైన హక్కువుండదని భావించినట్లయితే అది మరింత సమర్థనీయ మవుతుంది. ఒక చర్చి ప్రభుత్వనియామానికి లోబడక స్వేచ్ఛగా వుండవచ్చు. కాని సాంఘికమైన బాధ్యతలనుండి తప్పించుకోలేదు. అందుచేత చర్చికి ప్రభుత్వానికి మధ్యవున్న "పంపకాల గోడను" ఎంత దిట్టంగా కట్టినా బాధ్యతనెఱిగిన

పౌరులకు, ప్రజాప్రభుత్వాలకు మతమంటే మధ్యస్థంగా వుండకూడదని, ఒక మతమునెడ ఔదార్యం చూపరాని, సర్వమతాలయెడ వైముఖ్యం చూపకూడదని, అల్లే న్యాయసూత్రాల ప్రకారం "ప్రైవేటు" విషయాలైనా ప్రజాప్రయోజనాలు కల్గిన పలువిధములైన విశ్వాసాల్లోని సాధుత్వం, నెనరులను గురించి సవిమర్శంగా పట్టించుకోవలసిన స్పష్టమైన బాధ్యతవుంది. చార్లెస్ ఇ. విల్సన్ నాయకత్వంక్రింద జాతీయ సామాన్య జనులు సంఘం ఒకటి అమెరికన్ జీవితంలో మతమనే పేరుతోవున్నది. దాని ఉద్దిష్టప్రయోజనం ఇది: "అమెరికనుల జీవితంలో సర్వమతసంస్థల ప్రాముఖ్యము పునాదివంటిదని వక్కాణించడం అమెరికను లందరినీ తాము కోరెడు చర్చికివెళ్లి దాని నిర్వహణకు సహాయపడవలసిందిగా ప్రోత్సహించడము." ఇలాంటి సంస్థ వివిధములైన మతసంస్థలు యథార్థంగా యెట్లు "అమెరికన్ జీవితానికి పునాదిని" సమకూర్చుతున్నవో శ్రద్ధగా పరిశీలించే ఒక పనినికూడా కలుపుకుంటే బాగుంటుంది.

పన్నులువేసి పనికిగాను మతసంస్థలను లాభాలు సంపాదించనివిగా వర్గీకరించినారు. ఆ కారణంచేత అవి పన్నులనుండి మినహాయింపబడినవి. కాని తక్కిన పనులకు వాటిని సాధారణంగా "దానధర్మాల సంస్థల"లో చేరివున్నట్లుగా వ్యవహరిస్తారు. సాధారణంగా, మతసంస్థలను నిషేధించే "ఫెడరల్ అమెండ్‌మెంటు"ను చర్చి - ప్రభుత్వాల విభాగాన్ని వ్యంజింపచేదిగా స్థూలంగా వ్యాఖ్యానించడానికి లేకున్నా ఆ అమెండ్‌మెంట్ (రాజ్యాంగపు సవరణ)లో క్రమబద్ధంగా ఏర్పడిన మతంయొక్క కార్యకలాపాలను, విలువలను ప్రభుత్వం గుర్తించదన్న అభిప్రాయం లేదు. యునైటెడ్ స్టేట్స్‌కు చర్చీలకు మధ్య చారిత్రికంగా వుండిన సంబంధాలను నికరంగా నిర్వచించి చెప్పడంలోని కష్టాలను ఇ. బి. గ్రీన్ "మతము - అమెరికాలో ప్రభుత్వము" (1941) అనే తన పుస్తకంలో పరిశీలించినాడు. అప్పటినుండి ఈ సంబంధాలు యెట్లుండవలెను? అనేదాన్ని గూర్చిన చర్చ ఒక తీవ్రమైన బహిరంగ సమస్య అయింది. విడిపోవడం సంపూర్ణంగా యెప్పుడూ లేదని, యథార్థమైన సంబంధాలు నికరమైన న్యాయసిద్ధాంతాలమీదకంటె సానుభూతి యెటు మారుతుంది అనేదానిమీద ఆధారపడుతుందని ప్రొఫెసర్ గ్రీన్ స్పష్టంగా చూపించాడు. ఈ ప్రశ్నను ఒక మహాగ్రంథంలో పరీక్షించి డా. ఆన్సన్ ఫెల్ప్స్

స్టోక్స్ "యునైటెడ్ స్టేట్స్‌లో చర్చి - ప్రభుత్వము" అనే మూడు సంపుటాలు వ్రాసి సాధించారు. ఈ సంపుటాలు యెన్నో వివరాలతో గ్రీన్ చెప్పిన నిర్ణయాలలోని సత్యాన్ని ప్రదర్శిస్తవి.

1900 లలో ఈ ప్రశ్ననుగురించి, పోల్చిచూస్తే, యింత ఆసక్తిలేదు. 1928 లో ఆల్‌ఫ్రెడ్ ఇ. స్మిత్ అధ్యక్షపదవికి పోటీచేస్తూ ప్రచారంచేసే సమయంలో ఈ విషయం అందరూ పట్టించుకున్నారు. ఎంతో ప్రచారం పొందిన ఆయన వ్యక్తిగతమైన "మార్గాన్ని" "లిబరల్" కాథలిక్కుల అభిప్రాయాన్ని నిర్మించేదని అనుకున్నారు. (మూడవ ఎగ్జిబిట్ చూడుడు) "జోక్యం" చేసుకోరాదని ఆయన చేసిన ప్రకటనకు వేధింపబడుతున్న మెక్సికన్ చర్చిల తరఫున జోక్యం చేసుకోవాలని కాథలిక్కులు తెచ్చిన ఒత్తిడి పురికొల్పింది.

గడచిన రెండుదశాబ్దాల్లో ఈ "విభజన" అర్థాన్ని నిర్వచించడానికి ప్రయత్నించిన కోర్టునిర్ణయాలు అనేకమున్నవి. సంస్థలన్నిటికి, ముఖ్యంగా లాభాలులేని సంస్థలకు ఎక్కువో తక్కువో ప్రభుత్వం ఆదరణ కావలసి వుంటుండటంవల్ల తమ సంపూర్ణ స్వాతంత్ర్యం దెబ్బతినవచ్చునని చర్చిలకు అవగతమే. ప్రజల్డబ్బు తెచ్చుకోవడంలో తాము యింక ప్రభుత్వంతో పోటీ పడలేమని చాలా చర్చిలు భావిస్తున్నవి. ఇప్పట్లో చర్చికి "టైత్" (ఒక్క సభ్యుని ఆదాయంలో పదోవంతు శాతము) యిస్తే చాలు చర్చి యెంతో తృప్తిపడుతుంది. మరి ప్రభుత్వమేమో అంత కొంచెం డబ్బుతో నడవగలనని కలలోగూడా అనుకోదు. ఈ సన్నివేశమే చారిత్రికంగా, నైతికంగా యెంతో ఆసక్తిగొలిపే విషయం. ఏమంటే ఈ దేశంలోకూడా డబ్బు సమకూర్చడంలో చర్చిల సామర్థ్యానికి ప్రభుత్వం అసూయపడిన ఒక కాలం వుండేది. కొంతవరకు ఆర్థికమైన అవసరంగాను, కొంతవరకు నీతికి సంబంధించిన ఒక్క నియమంగాను చర్చి - ప్రభుత్వం విభజననుగురించి సాంప్రదాయికంగావున్న భావాన్ని మార్చాలని చర్చిలన్నీ (ముఖ్యంగా రోమన్‌కాథలిక్ చర్చి) కోరినవి.

అమెరికన్ రోమన్‌కాథలిక్ బిషప్‌ల 1948 నవంబర్ 20వ తేదీనాటి మానిఫెస్టో (ప్రణాళిక)లో మారుతున్న విధానం స్పష్టంగా పొందుపరచబడింది. అందులో వాళ్ళు "చర్చికి - రాష్ట్రానికి మధ్య సహకారం" అనే అనుసరణీయ సూత్రాన్ని ఈ క్రింది విధంగా సూచించారు:—

దేశచరిత్ర న్యాయశాస్త్రము ఏ కొంచెమైనా తెలిసినవానికి మొదటి (రాజ్యాంగ) "సవరణ" మాటలనుబట్టి దాని అర్థము స్పష్టము:— "మతాన్ని స్థాపించడం గురించికాని, దానికి సంబంధించి స్వతంత్రంగా వ్యవహరించడాన్ని నిషేధిస్తూ కాని కాంగ్రెసు చట్టాలు చేయరాదు..."

మొదటి రాజ్యాంగ సవరణ ప్రకారం ఈరక్షంగా ఒక మతంకంటే వేరొక మతాన్ని పాక్షికంగా చూడటం కుదరదు. ఏ రాష్ట్రాన్నికూడా అలాచేయమని బలవంతం చేయడంకాని నిషేధించడంకాని కుదరదు. ఆచరణయోగ్యమైన ఈ విధానాన్ని "చర్చికి - ప్రభుత్వానికి మధ్య అడ్డ గోడ" అనే ఉజ్జాయింపు రూపకంతో అభివర్ణిస్తే ఆ మాటల్ని కేవలం ఒక నిర్దిష్టమైన అమెరికన్ల అర్థంలోనే అర్థంచేసుకోవాలి. ఆచరణీయమైన ఆ విధానంలో మతానికి సంబంధించి ఉదాసీనభావం ఉందనికాని, మతానికి ప్రభుత్వానికి మధ్య సహకారాన్ని "చర్చి రాష్ట్రాల విభజన" అనే దాంట్లో తీసివేసినట్టు అనిపిస్తుందనికాని చెప్పినట్లయితే అమెరికన్ చరిత్రను, చట్టాన్ని పూర్తిగా రూపు చెదరగొట్టినట్లు అవుతుంది. చర్చి రాష్ట్రాల విభజన మనేమాట సిద్ధాంత లౌకికత్వంలో వినవచ్చే ఒకపార్టీ సంకేతపదం అయిపోయింది.

గడచిన రెండు సంవత్సరాల్లో లౌకికతా సిద్ధాంతం ప్రభుత్వం మత, నైతికశిక్షణను ప్రోత్సహించడం—ఒక మతంకంటే యింకొక మతాన్ని ఎక్కువగా చూడడం తటస్థించనిచోటకూడా—పనికిరాదని వ్యతిరేకించి అనిదంపూర్వమైన విజయాలను సాధించింది. మొన్నమొన్నటి రెండు కేసుల్లో యునైటెడ్ స్టేట్స్ సుప్రీంకోర్టు మొదటి అమెండ్‌మెంట్‌లోని "మతాన్ని స్థాపించడం" అనే అంశానికి ఒక పూర్తిగా క్రొత్తదైన, ఆగామి సూచకమైన విస్తృత వ్యాఖ్యానాన్ని ఆమోదించింది.

ఈ వ్యాఖ్యానం మతసంస్థలమధ్య యెలాంటి పక్షపాతం చూపినారు? అన్న ప్రశ్న లేనిచోట్లకూడా మతానికి సహాయపడే సహకారం ప్రభుత్వానికి క్రమబద్ధమైన మతానికి మధ్య ఉండరాదని చెబుతున్నది.

మంచి పౌరస్వత్వము, మతము అనే ఈ రెంటికోసం ప్రభుత్వానికి మతసంస్థలకు మధ్య మొదటినుంచి వుంటున్న నిరాటంకమైన సహకార సంప్రదాయాన్ని పునరుద్ఘాటించడం అవసరమని ప్రగాఢవిశ్వాసంతో మేము భావిస్తున్నాము. ఈ సహకారంలో ఏ వర్గానికైనా ప్రత్యేక

హక్కు సదుపాయాలుకాని, ఏ పౌరుని మతస్వాతంత్ర్యంపై పరిమితి విధించడంకాని యిమిడివుండరాదు. మన పౌరులు పలువిధములైన మతాలను పాటించడంలో పుట్టిన ఈ సున్నిత సమస్యలనుగూర్చి వ్యవహరించడంలో ఈ న్యాయబద్ధము, ఆలోచనాపూర్వకము అయిన అమెరికన్ ప్రభుత్వ విధానాన్ని మార్చాలన్న ఉద్దేశంకాని, కోరికకాని ఏ మాత్రం లేదని మేము పవిత్రహృదయంతో చెబుతున్నాము...

ప్రజల బహిరంగ జీవితంనుండి భగవంతుణ్ణి తొలగించే ఒక న్యాయస్థానాల "లౌకికత్వ సిద్ధాంత సంస్థాపనం" అనే రానున్న ఆపదను తప్పించడానికి భగవంతుని నమ్మి భగవంతుని పేరుమీదుగా స్వాతంత్ర్యానికి శ్రద్ధాభక్తులుచూపే సమస్తజనులతోను మేము న్యాయంగా, ఉదారంగా సహకరించడానికి సిద్ధంగా వున్నాము. ఏమంటే "లౌకి తా సిద్ధాంతము" మన జాతీయ జీవితంయొక్క మతసంబంధమైన పునాదులకే ఆపద కలిగించేదిగా వుంటూ సర్వశక్తులుగల ప్రభుత్వం అవతరించడానికి దారితీస్తున్నది. 3

ఈ "సహకార" సిద్ధాంతాన్ని ఉపయోగించడంపై చాలా విషయాలు ఆధారపడి ఉంటవి. అమెరికనుల "ద్వైత" నైతికనిర్మితిని, స్పెయిన్ దేశీయుల "కాథలిక్కుల ఐకమత్యం" అనే భావాన్ని విడివిడిగా చూచి కాథలిక్ సిద్ధాంతాన్ని ప్రజాస్వామిక ప్రభుత్వానికి అమరించడమే ఈ బిషప్‌ల ఉద్దేశంగా కన్పడుతుంది. ఏమైనా 1950 నవంబర్ 18వ తేదీన నేషనల్ కాథలిక్ సంక్షేమ మహాసభ పాలకసంఘం బయలుపరచిన పిల్లల చదువునుగూర్చిన తమ ప్రకటనలో బిషప్‌లు ఈ సహకార సిద్ధాంతాన్ని రెండర్థాలు వచ్చేట్లుగా ఉపయోగించుకున్నారు. "రెండు లోకాల్లో" ద్వివిధములైన పౌరసత్వం అనే సిద్ధాంతానికి గౌరవం చూపినారు. కాని మతం ఒక్కటే "సమీకరణ శక్తి" అనే సిద్ధాంతాన్ని వివరిస్తూ—బిడ్డకు (మతం) "సంపూర్ణమైన తర్కసమమైన అర్థాన్ని జీవితానికి కల్గిస్తుంది" అని, బిడ్డ "భగవంతునియందో స్వార్థమునందో గూడుకట్టుకొని వుండాలని," అందుచేత చదువు సంధ్యలన్నీ, అందులో మరీ ముఖ్యంగా లైంగిక విద్యను "జీవితాన్ని నియమించే ప్రయోజనం బిడ్డకు తెలిసేటట్లు" దాన్ని మత నైతిక ఆవరణంలోనే వుంచాలని, అది "భగవత్సేవ" అని విపులీకరించారు. ఈ విధంగా ఈ సహకార సిద్ధాంతం

యొక్క అభివృద్ధిలో మతసంబంధమైన నీతినియమాలకు లౌకికమైన నీతి నియమాలు లోబడివుండటం, ఆధ్యాత్మిక విషయాల్లో తల్లిదండ్రులకు చర్చివాళ్ళకు కలసికట్టుగావుండే "సహజమైన హక్కులకు" పబ్లిక్ స్కూళ్ళు లోబడి వుండాలనటం యిమిడివున్నట్లు స్పష్టంగా కనపడుతుంది.

ఫాదరు జాన్ కోర్ట్నె ముర్రే అనే ప్రసిద్ధ అగమవేత్త తన ఒకానొక గమనింపదగిన వ్యాసంలో అతి స్పష్టమైన, చాల ప్రజాస్వామికమైన కాథలిక్ వివరణచేసి ఈ క్రిందినిర్ణయాలకు వచ్చినాడు.

చరిత్ర, అనుభవం అనేవి ప్రభుత్వంయొక్క స్వాతంత్ర్యాన్ని మరింత నిర్దుష్టంగా చర్చి గౌరవించేట్లు చేసినవి. ("పూర్ణమానవుని"లో ఒక ప్రధానాంశమునకు చూపించే గౌరవరూపముగా) అందుకు ఫలితంగా లౌకిక విషయాల్లో చర్చి మరింతగా ఆధ్యాత్మికమైన శక్తియుక్తులను చూపించవలసి వచ్చింది. పైగా ఈ శక్తిని ఉపయోగించడంలో అది యెంతగా ఆధ్యాత్మికమైతే అంతగా విశ్వజనీనమై గవేషణా స్వరూప ములై మానవజీవితంలోని అన్ని సంస్థలకు వ్యాపిస్తూ తమ స్వరూపం లోను, ప్రక్రమంలోను క్రైస్తవుల ఆత్మావసరాలకు అనుగుణంగా యిముడ్చుకుంటూ వచ్చినవి. పైకి విరుద్ధంగా కన్పించినా మధ్యయుగం లోని రాజ్యంలో ప్రభుత్వంతో కలిసిపోయి వుండిన చర్చి వెను కకు రావటం, (మరొక విధంగా) కన్ఫెషనల్ స్టేట్‌నుండి వెనుకకు రావడం అనేవాటికి సంఘం నుండి వేరుపడిందని అర్థంకాదు. అంత కంటే ఎక్కువ గంభీరంగా సంఘంలో మనుష్యవ్యక్తికి ఐహికాముష్మిక లక్ష్యాలను నడిపించే ఆధ్యాత్మిక సూత్రంగా అంతర్భూతమై నిలిచిం దనవలెను......వేరే మాటల్లోచెబితే ప్రశ్నయేమంటే మతస్వాతంత్ర్యాన్ని "రాచరికపు మతము" అనే భావంతో రాజకీయంగా దాన్ని ప్రతిష్ఠించి, ఆ భావంనుండి చారిత్రకంగా వచ్చిన "తర్కసమమైన, న్యాయస్థాన సంబంధమైన ఫలితాలను" గ్రహింపవలసిన అంతరమైన ఆవశ్యకత ఏమైనా ఉన్నదా? అని. నిశ్చయంగా లేదన్నదే దీనికి సమాధానం. 4

ఈ ప్రకటనకు ప్రసిద్ధుడైన ఒక న్యాయశాస్త్రవేత్త గమనికగా అన్న పలుకులు కలిపితే బాగుంటుంది:—

చర్చి, ప్రభుత్వం అనేవాటి పరస్పరవిధులు యెప్పుడూ వున్నట్లుగానే ఉంటున్నవి—మానవ సంఘాన్ని అభివృద్ధి పరచడానికి సహకరించడం.

సంఘం విషయంలో చర్చికివున్న ఈ బాధ్యత సెయింట్ పాల్ మాటల లోని ఆశయదృష్టితో నడువవలసి వుంటుంది; —"నేనుగనుక మనుష్యుల జిహ్వాలతో దేవదూతల జిహ్వాలతో మాట్లాడినా ఔదార్యం గనుక లేకపోతే నేను చప్పుడుచేసే ఇత్తడినో నిక్వాణించే తాళాన్నో అవుతాను." భగవత్సంబంధమైన సంస్థగా తాను చేయవలసిన పనిమీద విశ్వాసంతో ఔదార్యమనే సువార్తను ఈ దేశప్రజలకు లోకప్రజలకు చాటి చెప్పుతూ చర్చి సంఘముయెడ తన బాధ్యతను నిర్వర్తింపవలసి వుంటుంది. దాని మూలంగానే ప్రభుత్వం యెడ తన బాధ్యతను నిర్వర్తిస్తుంది." 5

ప్రభుత్వానికి చర్చికి మధ్యఉన్న చట్టసంబంధమైన విభాగాన్ని మతానికి సంఘానికి మధ్య ఒక నైతిక సహకారంతో సమన్వయించడానికి చేసే ఇట్టి ప్రయత్నాలు ప్రాతసమస్యలను క్రొత్తకోణాల్లో లేవదీస్తవి - ఈ మధ్యవచ్చిన మార్పుల్లో విశేషమేమంటే అందులో ఇమిడిఉన్న విషయాలయొక్క వాస్తవికమైన అవసరపరిస్థితి - ఏమంటే ఈ సిద్ధాంత నిర్మాణాల వెనుక ఎన్నో ముఖ్యమైన న్యాయస్థానాల తీర్పులు, వర్గ వ్యతిరేకతలు ఉన్నవి - ఇవన్నీ ఉన్న కొద్దిపాటి వీరనిరీశ్వరవాదుల లేదా స్వచ్ఛంద భావుకుల పరిస్థితిని. అట్లే ఇలాంటి లక్షణాలు "స్వతంత్ర రాజ్యంలో స్వతంత్రమైన చర్చి" అనే సూత్రాన్ని ఉల్లంఘిస్తాయని విడువకుండా వ్యతిరేకించే అనేక మతాధికారి వ్యతిరేకుల పరిస్థితిని ఓటమి బారచేస్తున్నవి. మతాసక్తిగలవారని అభ్యూహింపబడే అమెరికనుల్లో అత్యధిక సంఖ్యాకులు సాపేక్షాదృష్టికి పట్టించుకోకుండాను లేదా నిష్ఫలమైన వ్యతిరేక విధానంతోను ప్రభుత్వంయొక్క కచ్చితమైన "తాటస్థ్యం" మీది ఈ దురాక్రమణలను పెరుకపోనిచ్చినారు. పబ్లిక్ స్కూళ్ళలో మత సంబంధమైన పాఠ్యవిషయాలు ప్రవేశపెట్టడంలో ఎప్పుడూ చిన్నచిన్న ఫిర్యాదులు ఉంటూనే ఉన్నవి: క్రిస్‌మస్ పాటలు నేర్పితే యూదులు నిరసించారు. కింగ్‌జేమ్సు వ్రాయించిన బైబుల్ వాడరాదని కాథలిక్కులు నిరసించారు - శాసనసభల్లోని ప్రార్థనలను వాడటంగురించి, రాష్ట్ర విశ్వవిద్యాలయావరణలలో కొన్ని తెగలకు చెందిన మతసేవకులు, అధ్యాపకులు ఉండటాన్నిగురించి నిరీశ్వరవాదులు నిరసనతెలిపారు- అయితే ఇలాంటి సమస్యలు చాలాకాలంగా ఉంటున్నవే - క్రొత్త సమస్యలు సూటిగానో డొంకతిరుగుడుగానో ప్రపంచయుద్ధాలవల్ల సృజింప

బడినవే. ప్రెసిడెంట్ విల్సన్, ప్రెసిడెంట్ రూజ్వెల్టు - ఇద్దరూకూడా యుద్ధసమయంలో తమ బహిరంగోపన్యాసాల్లోను, అధికారిక పత్రాల్లోను మతాన్ని స్పృశించే మాటలు, భావాలు కలపడానికి వెనుకాడలేదు - "భగవంతునిక్రింది ఈ జాతి" వంటి మాటలు పోరాటాలకు సార్వత్రికంగా ఒక మతసంబంధమైన చిత్తశుద్ధిని కలిగించడానికి, "మనము భగవంతుని నమ్ముకొని" ఉన్నామని అధికారికంగా సూచించడానికి ఉద్దేశింపబడినవి - పౌరుల్లో అనేకులు ఇలాంటి భావాలను హృదయపూర్వకంగా సరిగ్రహించినా మిలిటరీ సర్వీస్‌లో చాప్లిన్లుకూడా ఉండరాదని ఆక్షేపించే క్షీణించిపోతున్న అతివాద లౌకికులగుంపు కోపాన్ని రెచ్చగొట్టడానికి ఉపకరించినవి.

1939లో వాటికన్‌కు ప్రసిడెంట్ రూజ్వెల్ట్ స్వంత ప్రతినిధిగాను ఆ తరువాత ప్రసిడెంట్ ట్రూమన్‌కు ప్రతినిధిగాను మిరాన్ టేలర్ నియామకాన్ని సామాన్యజనులంతా సైనికసంబంధమైన అవసరానికి వచ్చిన చర్యగాను, సైనికసంబంధమైన వేగు జరుపడానికి వచ్చిన చర్యగాను అంగీకరించినారు. కాని ప్రముఖమైన ప్రొటెస్టంట్ సంస్థలు యీ పని సక్రమమైన రాయబార సంబంధాలు నెలకొల్పడానికి సందుచేసే తొలిమెట్టు కావచ్చుననే సందేహంమీద తీవ్రమైన నిరసనలు తెల్పడానికి ప్రారంభించారు. అధ్యక్షుడు ట్రూమన్ 1951లో జనరల్ మార్క్ క్లార్క్‌ను యిదేవిధంగా నియమించడానికి చేసిన ప్రయత్నం ఈ అనుమానాలను బలపఱచి ప్రొటెస్టంట్లు తదితరులు వెంటనే తీవ్రంగా క్రమబద్ధంగా వ్యతిరేకించడానికి దారితీసింది.

ఇదేవిధంగా జనరలిసిమో ఫ్రాంకో పాలించే స్పెయిన్ దేశముతో సాధారణమయిన రాయబార సంబంధాలు నెలకొల్పాలని కాథలిక్‌లు తెచ్చిన ఒత్తిడివల్ల ప్రొటెస్టంట్‌లలోను, లౌకికులైన ఉదారవాదులలోను విస్తృతమైన కోపతాపాలు కల్గినవి. అయితే అత్యంత తీవ్రమైన చర్చా విషయాలు క్రొత్తవిద్యా విధానాలవల్ల పుట్టివచ్చినవి. 1930 ప్రాంతంలోను 1940 ప్రాంతంలోను పిల్లల అపరాధాల వ్యాప్తినిగూర్చి హై స్కూళ్ళలోని పిల్లలు నేరాలు చేయడంగురించి రానురాను అలజడి ఎక్కువ అవుతూవచ్చింది. ప్రొటెస్టెంట్, కాథలిక్, యూదుల జాతీయ పరిషత్తు, తక్కిన అంతర్వర్గ సంస్థలు ఉదుటుగొల్పే ఈ అవినీతికి మతవిద్య

లేకపోవడం ఒక కారణమని సూచించాయి. ఈ ఊహ ఆధారంగా ప్రజల్లో నైతికశ్రేయస్సుకొఱకు మతవిద్యను ఆదుకోవాలని విస్తృతంగా విజ్ఞప్తిచేశారు. "మతసంబంధమైన నిరక్షరాస్యత" యొక్క వ్యాప్తిని సాధారణంగా ప్రజలు భయపడవలసిన విషయమని అనుకొనేవారు. తెగల వారీతనాన్ని పెంచకుండే ప్రజల్లో నీతినియమాలకు కావలసిన మత సంబంధమైన అధికారాన్ని యిచ్చే పలువిధములైన ప్రతిక్రియలనుగూర్చి చర్చించినారు. ఇట్లా ప్రజలందరికి సమిష్టిగా మతం అవసరమనే సార్వత్రికమైన్లు ఒక విశ్వాసం ఏర్పడింది. దీనిని ఆయా విశ్వాసవర్గాలు వెంటనే ఉపయోగించుకొన్నవి. ఈ పరిస్థితికి తోడుగా ఫెడరల్ ప్రభుత్వం చాలా కాలంగా పనిచేసేవారికి యిచ్చిన ఉపకారవేతనాల మూలంగా తంటాలు పడుతున్న యెన్నో చర్చి కళాశాలలు యుద్ధకాలంలో ఆర్థికమైన ఉపద్రవానికి డొంకతిరుగుడుగా సహాయాన్ని పొందిన ఒక యథార్థవిషయం వుంది. చాలా రాష్ట్రాలు ప్రజాసంబంధమైన నిధులను మతపాఠశాలల సహాయానికి వాడుకోవచ్చని అనుజ్ఞయిస్తూ శాసనాలుకూడా చేసినవి.

ఈ విషయాలమీద యీ నాటికి (1952) చర్చ రేగుతుండగా నమ్మికతో స్థూలనిర్ణయాలు చేయటం కష్టమే. కాని 1900 నాటినుండి మత స్వాతంత్ర్య సమస్య తన కేంద్రబిందువును మార్చుకొన్నదని ఈనాడు సాధారణంగా అందరికి గుర్తుకు వచ్చినట్టే కన్పడుతుంది. నిరీశ్వరవాదులు, స్వచ్ఛందభావుకులు, అతివాద లౌకికులు - వీరి విషయంలో మతంనుండి స్వాతంత్ర్యం కావాలనే సంచలనం మునుపటికంటే తగ్గినట్లు కనపడుతుంది. కనీసం క్రమబద్ధమైన మత మనేదానికి వ్యతిరేకమైన ఈ చిత్తవృత్తిని ఒక శతాబ్దం లేదా అర్థశతాబ్దం ముందుకూడా వినిపించుకొన్నంతగా ఈనాడు ఎవరూ వినిపించుకోరు. అయితే మతసంస్థలు "లౌకికత్వాన్ని" అవినీతికరమని మాత్రమే కాకుండా అనే ఒక "సుప్రతిష్ఠితమైన మతం" అనికూడా తప్పుగా చూపడం సాగించినట్లయితే వీళ్లు క్రమబద్ధమైన మతం క్రమములేని నాస్తికత్వాన్ని ఓర్చుకోగలిగేటంతగా వివేకవంతవుమతుందని ఊహించిన మతసంబంధంలేని పౌరుల క్రమనిర్మితమైన శత్రుత్వాన్ని తప్పకుండా మళ్లా రెచ్చగొడుతుంది. ఇది ఒక్కటి తప్పిస్తే మతంకొఱకు స్వాతంత్ర్యం అనే సూత్రానికి సర్వసాధారణ

మయిన అంగీకారం వున్నట్లే. దీనికి అపవాద అమెరికన్ కాథలిక్ సిద్ధాంతుల అల్పసంఖ్యాక వర్గంవారు యిప్పటికి తప్పుడు మతాలను పట్టి పాలార్చాలని సూత్రప్రాయంగా సమర్థించినా ఆచరణలో ఆ పని చేయడానికి మొగ్గుచూపరు. అయితే మతంలో స్వాతంత్ర్యాన్ని గురించి నిజమైన అలజడివుంది. అనగా సంప్రదాయాలనుబట్టి పరస్పర విరుద్ధంగా కాకపోయినా విడివిడిగావుంటున్న యునైటెడ్ స్టేట్స్ (సంయుక్త రాష్ట్రాలు) లోని స్వతంత్రమైన 200 మతసంస్థలమధ్య పరస్పర గౌరవ సహకార బుద్ధిని పెంపొందింప చేయవలెననే కోరిక వేరేవిధంగా చెప్పినట్లయితే "మతాన్ని స్పృశించకూడదు" అనే వ్యతిరేక ప్రభుత్వ విధానంవల్ల ఈ చర్చి - ప్రభుత్వ సమస్య తీరదు. నిరాటంకంగా మతాన్ని పాటించుకోవడం అనేది సమష్టిజీవితంలో నిర్మాణాత్మకంగా ఫలప్రదంగా వుండే మేధాసంబంధమైన నైతికమైన వాతావరణాన్ని నిర్మించడంవల్లనే ఈ సమస్య తీరుతుంది. స్వాతంత్ర్యభావాన్ని మతసంబంధమైన భక్తితో లేదా బాధ్యతతో సమన్వయించడం సమష్టిగా ప్రజల నీతినియమాల్లో ఒక తీవ్రమైన సమస్య అయింది. ప్రభుత్వంకాని చర్చికాని యిప్పుడు ఒకదాని నైతికనిర్మితి విషయంలో ఒకటి ఉదాసీనంగా వుండటానికి వీల్లేదు.

## మత విద్యా సంస్థలు

మత విద్యాభివృద్ధికొరకు అయిన వివిధ కార్యక్రమాలు విద్యావిషయిక సమస్యలకుతోడు నైతికంగాను, న్యాయశాస్త్ర రీత్యాను చర్చి - ప్రభుత్వ సంబంధాల ప్రాథమిక విషయాలను పైకితెచ్చినవి. ఫెడరల్ ధననిధులు పారిష్ స్కూళ్ళ స్కూలు బస్సు సర్వీసు, ఉపహారాలకు, తదితర అవసరాలకుకూడా రావాలని చేసిన ప్రయత్నం ఒకటి. ఫెడరల్ శాసనము యిలాంటి చర్యలు మతవిద్యా బోధకంటే ప్రజారోగ్యానికి, పిల్లల సంక్షేమానికి మరింత సన్నిహితంగా వున్నవన్న కారణాన్ని ఆధారంగా చూపి పబ్లిక్ స్కూళ్ళకు డబ్బుయిచ్చింది. సెనేట్‌లో టాఫ్ట్‌బిల్లు, ప్రజాప్రతినిధుల సభలో 80వ కాంగ్రెస్ సమతుంలో మాన్‌గవన్ బిల్లు నిశ్చయంగా రాజ్యాంగ సంబంధమైన ఈ ప్రశ్నను పైకి తెచ్చినవి; విద్యారంగంలోని నాయకు లనేకులు పబ్లిక్ ఎడ్యుకేషన్‌కుగాను ఫెడరల్ సంస్థ ఖర్చుచేయవలసిన అవసరంవుందని చెబుతూవచ్చారు. కాని పారిష్

పాఠశాలలకు ఈ సమష్టి ద్రవ్యమునుండి సయహాయము రానంతకాలము కాథలిక్ లాబీవర్గాలవారు ఈ మార్గంలో అన్ని ప్రయత్నాలనూ అడ్డగించారు. దీనివల్ల స్పష్టంగా ఒక ప్రతిష్టంభన ఏర్పడింది. ప్రొటెస్టెంట్లు యూదులు, లౌకికవాదులు—వీరిలో తీవ్రమైన అలజడి కల్గడానికి కాథలిక్ నాయకులు తామింకా ఎక్కువ అడిగినా న్యాయమేనని తాము భావిస్తున్నట్టుగా చేసిన అరలేని ప్రకటనలు కారణం;—"కాథలిక్ పాఠ పాఠశాలలను అమెరికన్ విద్యలో అంతర్భాగంగా చేయడానికి కావలసినంతమాత్రం పన్నుల డబ్బు" వారు అనుకొన్న ఎక్కువ మొత్తం.

ఈ శతాబ్దారంభ కాలంలో పారిష్ పాఠశాలల గురించి అమెరికన్ కాథలిక్ నాయకుల అభిప్రాయం భిన్నభిన్నంగా వుండేది. 1870 లో సెయింట్ స్టీఫెన్స్ చర్చి, న్యూయార్కుకు చెందిన ఫాదర్ మాక్గ్లన్ పారిష్ స్కూళ్ళ విధానాన్ని విమర్శించారు. ఫలితంగా బిషప్లమధ్య తీవ్రమైన చర్చ జరిగింది. ఈ విమర్శను పోప్ లియో XIII రోమన్ కాథలిక్ చర్చిలో పెరుగుతున్న "అమెరికనిజం"కు ఇది ఒక నిదర్శనమని వ్యాఖ్యానించారు. ఇందుకుగాను చివరకు ఆయన తన టెస్టెం బె నవ లెన్షె (1899) ఉత్తరంలో ఆర్చిబిషప్ జాన్ ఐర్లండ్ను, కార్డినల్ గిబ్బన్స్ను కొంచెము యించుమించుగా అభిశంసించారు. 1892 లో పోప్ ప్రతినిధి అయిన మన్సెన్యూర్ సటోలీకి అమెరికన్ బిషప్లకుమధ్య ఒక రాజీ ప్రణాళిక తయారుచేశారు. కాని ఆరునెలల తర్వాత పోప్ పబ్లిక్ స్కూల్ విధానానికి ఈ మినహాయింపులు (కన్సెషన్లు) యివ్వడాన్ని ఖండించారు. దీనికి ఫలితంగా 20వ శతాబ్దంలో పారిష్ బడులు త్వర త్వరగా పెరిగిపోయినవి, ఇప్పుడు సగంమందికిపైగా కాథలిక్ పిల్లలు పారిష్ బడులకు వెళ్ళుతున్నారు. అనగా 1892 నాటి "కాథలిక్ పిల్లలు ప్రాథమిక విద్యాంశాలు, కళలలో ఉన్నతశాఖలు ప్రకృతి విజ్ఞాన శాస్త్రాలను ప్రభుత్వాధీనంలోవుండే పబ్లిక్ స్కూళ్ళలో నేర్చుకోవడం విరుద్ధమేమి కాదు" అనే దానికి సామాన్యమైన తిరస్కారము అని అర్థమవుతుంది. అంతేకాక ఆ సూత్రమున్నచోట పారిష్ మత విద్యావిధానం వుండడమే కాకుండా వ్రాయటం చదవటం, లెక్కలు చేయటం అనేవి బోధించడం కూడా మత సంబంధమైన యాజమాన్యంక్రిందనే వుండవలెనన్న విధానం కూడానని అర్థమవుతుంది.

ఇంతలో హీబ్రూ బళ్ళు కావాలని యూదులలో ఒక అత్యవసరమైన వాంఛ బయలుదేరింది. ఈ శతాబ్దపు తొలి దశాబ్దాల్లో విద్యారంగలోని యూదునాయకులు యూదుమతంలోని విశ్వజనీనాంశాలమ నొక్కిచెప్పి తమ మతవిద్యను అమెరికన్ లౌకికవిద్యతో కూడగట్టి క్రైస్తవ ఉదార వాదులకంటే ముందుకు వెళ్లారు. దీనికి తప్పనిసరి ఫలితంగా హీబ్రూ భాష నేర్చుకోవడం, యూదీయ "సెక్రా"ను పాటించడం, "టోరా" చదవటం అనేవాటి మతప్రాచుర్యం నిష్ఠాపరులకు ఉన్నదానికంటే ఇతరులకు తగ్గి పోయి యూదు "నాగరికత"లోని చారిత్రిక అంశాలుమాత్రమే అయి నాయి. మతవిద్యనుగూర్చి అరుదైన అత్యంత సూక్ష్మదృష్టితో చర్చించి నారు. "పునర్నిర్మాణ" ఉద్యమనాయకులు స్పష్టంగా ఈ మాటలన్నారు : అయితే లౌకికమైన యూదుజాతీయత జియానిజంల పెరుగుదలతోను, అన్నీ కలిపివేయాలన్న సాధారణ కార్యక్రమం అడియాస కావడం వల్లనూ గడచిన రెండుశతాబ్దాలలో యూదుల్లో, లౌకికులైన యూదుల్లోకూడా హీబ్రూ, టోరాల పరిజ్ఞానము పునరుద్ధరింపబడాని, యూదుమతానికి సంబంధించిన ప్రత్యేక ఆచారవ్యవహారాలు తిరిగి రావా లని ఒక కాంక్ష పెరిగింది. ఈ ఆచారవ్యవహారాల సాధనచేయటం అవి మతవిషయకంగా ముఖ్యమైనా కాకపోయినా విద్యావిషయి కంగా యిప్పుడు ముఖ్యంగా కన్పిస్తున్నవి.

ఈ బళ్ళు 7 "అడ్డగోడ"ను అంగీకరించడానికి యిష్టపడుతున్న కార ణంగా చర్చి - ప్రభుత్వ సమస్యను పైకి తేలేదు. కాని అమెరికన్ సంస్కృతికి వాటికివున్న సంబంధాన్ని మాత్రం ఎత్తిబెట్టినవి. మామూలుగా యూదులు చెప్పే సమర్థనను జోసఫ్ హెచ్. లుక్‌స్టీన్ అన్ని మతసంస్థ లకు అక్కరకువచ్చే మాటల్లో చక్కగా కూర్చి చెప్పినాడు. (నాల్గవ ఎగ్జిబిట్ చూడుము.) హోరేస్ యం. క్యాలెన్ అనే తాత్వికుడు యూదు విద్యకు చెందిన అమెరికన్ అసోషియేషన్ తరపున మాట్లాడుతూ ఈ అభిప్రాయానికి తోడుగా సమయంచూచి ఒక హెచ్చరిక మాట కలిపాడు:- "అమెరికన్ యూదుపిల్లల తల్లిదండ్రులకు, పిల్లలకు తమ వారసత్వమైన యూదీయ విలువలు, ఉదారవిద్య అందించడానికి ప్రయత్నించే విలువ లన్నిటివలెనే తాము స్వాతంత్ర్యంలో పెరుగగల శక్తులను విడుదల

చేయడానికి కావలసిన ముఖ్యమైన చోదకశక్తులని ఎంతవరకు స్పష్టంగా తెలిస్తే అంతవరకు ఈ పనిని నిర్వహించవచ్చును." 8

మతసంస్థలు సమకూర్చే మత విద్యాబోధనకొరకు పబ్లిక్ స్కూళ్ళ బోధనాకాలంలో (సాధారణంగా వారానికి ఒకగంట) నుండి "విడిచి పెట్టిన కాలం" వ్యాప్తిపొందటంవల్ల ఆచరణలోను, న్యాయశాస్త్రరీత్యాను యివే విషయాలు మళ్లీ ఎత్తిబెట్టబడినవి. పబ్లిక్ స్కూళ్ల భవనాలను ఈ పనికి ఉపయోగించరాదని సుప్రీం కోర్టు (మాక్‌కొల్లం కేసు, 1948) ఆదేశించింది. కాని ఈ నిర్ణయంవల్ల ఈ కార్యకలాపాలు ఆగిపోలేదు. సుప్రీం కోర్టు 6-3 తేదిగల నిర్ణయంతో న్యూయార్క్ రాష్ట్ర విధానాన్ని సమర్థించింది. ఈ కార్యకలాపాలకున్న మతసంబంధమైన విలువనుగూర్చి తీవ్రమైన బేధాభిప్రాయాలు వుండటమే కాకుండా మతస్వాతంత్ర్య సూత్రాన్ని యివి ఉల్లంఘిస్తాయా? లేదా? అన్న ప్రశ్నపైకూడా తీవ్రమైన బేధాభిప్రాయా లున్నవి. మత సంబంధమైన సంసర్గంకాని, ఆసక్తికాని లేని తల్లిదండ్రులు తమ పిల్లలకు ఒక గంటసేపు చదువు పాడయిపోతున్నదని ఫిర్యాదు చేస్తున్నారు. తెగలవారీతనాన్ని తెచ్చిపెడుతుందనీ, మతసంబంధమైన విభేదాలు పబ్లిక్‌విద్యకు సంబంధించినవి కావనే రెండు కారణాల చేత యూదుల్లో అధికసంఖ్యాకులు బడిపిల్లలను మత ప్రాతిపదికమీద విభజించడాన్ని ఆక్షేపిస్తారు. కొందరు ప్రాటెస్టెంట్లు ఈ కొద్దిపాటి కాలంతో మతవిద్యకు ఏమీ ఒరిగి వచ్చుటలేదన్న కారణంచేత, ఈ కార్యకలాపాలను కాథలిక్‌లు చాలా చక్కగా వినియోగించుకుంటున్న కారణంచేత దీన్ని ఆక్షేపిస్తున్నారు. ఈ ప్రణాళిక యిప్పటికి ఒక జనసమాజంలో వున్నట్లు వేరొక సమాజంలో లేకుండా చాలావరకు ప్రయోగదశలో వుంది. అయితే ఒక ప్రాథమికమైన ప్రశ్నను యిది ఆచరణమార్గంలో ఎత్తి చూపుతున్నది. అది ఏమంటే మతసంబంధమైన బేధాలను వ్యతిరేకతను ఎక్కువ చెయ్యకుండా అందరిని నాగరికులుగాచేసే సాధనంగా మతంమీద ప్రజలందరి ఆసక్తిని అభివృద్ధిపరచటం సాధ్యమా? కాదా? అనేది. ఈ సమస్య రెండు చెడుగులు పెరగడంవల్ల మరింత సంకీర్ణమైపోయింది. మతసంబంధమైన నిరక్షరాస్యత ఒక చెడుగు. నిరక్షరాస్యుల మతం యింకొక చెడుగు.

ఉన్నతవిద్య విషయంలో అమెరికన్ ప్రొటెస్టెంట్లు చర్చిలే నేతృత్వం వహించాలన్న భావంతో పందొమ్మిదో శతాబ్దకాలమంతా పనిచేసినారు. అందుచేతనే ఇరవయ్యో శతాబ్దంలో మునిసిపల్ కాలేజీలు, రాష్ట్ర ప్రభుత్వ విశ్వవిద్యాలయాల పెరుగుదలకు అనిష్టంగానే అంగీకరిస్తూ వచ్చినారు. మత సంబంధమైన పరిసరాల్లో సమపాళమైన విద్యావకాశం కల్పించాలని, సామాన్య విద్యతోపాటు మతవిద్యను బోధించాలని అనుకొన్న మొదటిలక్ష్యం రాను రాను ఫలవంతంకావడంకష్టంగా అవుతున్నది. నిశ్చయంగా మతసంస్థల యాజమాన్యంక్రింద స్థాపింపబడిన చాలా కళాశాలలు ఇప్పుడు అరలేకుండా లౌకిక లేదా "ఉదార కళల" కళాశాలలుగా ఉంటూ, ఆర్థికంగా మొదటి చర్చి స్థాపకుల సాహాయ్యం అక్కరలేకుండా ఉంటున్నవి. కాని చర్చి కళాశాల లనిపించుకున్న కళాశాలల్లో కూడా తమ "వాతావరణము" పాఠ్యవిషయాలు బొత్తిగా పతనమైనవి. విధిగా గుడికి రావాలనేదాన్ని ఇది బలవంతమని విధిగా ఆక్రోశిస్తున్నారు. బైబిల్ పాఠాలు, మరిన్ని సూటిగా మతసంబంధమైన పాఠాలు ఇప్పుడు విధిగా ఐచ్ఛికవిషయాలుగా ఉంటున్నవి. తరుచుగా వీటినెవరూ పరిగ్రహించడమూలేదు. చర్చివాళ్లు ప్రారంభించిన స్కూళ్ళలో సాధారణంగా నైతిక మత వైఖరి తత్సదృశమైన ఇతర లౌకికసంస్థల్లోకంటే తరుచు భిన్నంగా కనబడటంలేదనేది చెప్పడంవల్లకంటే మనసుకు దానంతకదే తెలుస్తున్నది.

ఈ యథార్థ విషయంవల్ల సకృత్తుగా దైవచింతనగల తలిదండ్రులు తీవ్రంగా విమర్శించడంగాని చర్చివర్గాలమధ్య ఆడిపోసుకోవడంగాని ఏర్పడుతుంది. ఈ విధంగా చర్చీలకు ఈ మొదటి లక్ష్యాలను నిలుపడానికి ప్రయత్నించడంవల్ల లాభముంటుందా అనే వ్యతిరేకవైఖరితో గూడిన సమస్య, ఇంతకంటే ఫలవంతంగా ఉండే క్రొత్త మతవిద్యాపద్ధతి నొకదాన్ని వెదుకవలసిన నేరైన సమస్య అడ్డువస్తవి.

ఉన్నతవిద్య పరిస్థితి నిస్పృహగా నున్నదని తలచి చివరకు పలుకుబడిగల ప్రొటెస్టెంటు విద్యావేత్త లనేకులు కాథలిక్కులను యూదులను ఉదాహరణంగా తీసుకుంటూ ప్రొటెస్టెంట్ ప్రాథమిక పాఠశాలలు నిర్మించాలని బహిరంగంగా చెప్పుతూ వచ్చినారు. 193 నుండి రోమన్ కాథలిక్ చర్చీల్లోకంటె లూథరన్, రిఫార్మ్డ్, సెవెంత్ డే అడ్వెంటిస్ట్,

మెన్నొనైట్ చర్చిల్లోనే మరింత ఎక్కువభాగం మత పాఠశాలలు పెరిగి నాయని 1949 లో మతవిద్యకు సంబంధించిన అంతర్జాతీయ పరిషత్తు తెలిపింది. కాని అంతర్జాతీయ పరిషత్తు పబ్లిక్కు స్కూళ్ళు "అందటి స్కూళ్ళు" అని తమ విశ్వాసాన్ని పునరుద్ఘాటించి. "మత మతరహిత ములనే రెండు జీవనమార్గాలలో ఏదో ఒకదాన్ని ఎంచుకోవచ్చునన్నట్లుగా ఈ రెంటియందు ఉదాత్తమైన తాటస్థ్యా"న్ని తప్పించడం కోసం పబ్లిక్ స్కూలు సంఘాలతో సహకారానికి ఒక ప్రణాళికను సిఫారసు చేసింది. ఆదివారపు బళ్లకు, చర్చి కార్యకలాపాలకు పిన్నవాళ్లను తెచ్చుకోలేక చర్చీలు పబ్లిక్ స్కూళ్ళ కాలాన్ని అడుగుతున్నారని, సమకాలపు అమెరికన్ జీవితంలోకి మతసంస్థలను అంతర్భవింప చెయ్యలేకపోయినారని ఆరోపిస్తూ మరొకవైపు లౌకిక విద్యావేత్తలు చర్చీలను నిందించినారు.

విద్యావిషయక నాయకులు విడిసమయానికి సంబంధించిన ప్రయోగాన్ని తీవ్రంగా బలపరచడానికి ఒక కారణమేమంటే ఎంతపూర్తిగా మారి ఆధునికమైన ఆదివారపు బళ్లు ప్రజలకు కావలసిన మతవిద్యను సమర్థంగా అందివ్వలేకపోతున్నవని వీళ్ళకు తెలిసిరావటం. ఈ శతాబ్దపు తొలిరోజుల్లో ఈ సంస్థలు కేవలం "బైబిల్ బళ్లు" మాత్రమే. నిజానికి తరచుగా వాటిని ఆ పేరుతోనే పిలిచేవారు. బైబిల్‌లోని కథలు, వ్యాఖ్యానాలు మాత్రమే పాఠ్యవిషయాలుగా వుంటూవచ్చినవి.

ఆదివారపు బళ్ల "కీర్తనలు" మతవిషయంలోను, సంగీతవిషయంలోను ఎంత "తగ్గురకంగా" వుండవలెనో అంత తగ్గుగా వుండేవి. ఈ శతాబ్దపు ప్రథమపాదంలో 1903 లో మతవిద్యా సమాజంగా ప్రారంభమై మత విద్యకు సంబంధించిన అంతర్జాతీయ పరిషత్తుగా ఏర్పడి (1922) పరాకాష్ఠనొందుతూ శ్రద్ధాశక్తులుగల నిజమైన అంతర్వర్గీయ విద్యావేత్తల సమష్టి ప్రయత్నాలద్వారా ఆదివారపు బడి (సిద్ధాంతరూపకంగా, మరి మేలుతరమైన చర్చీలలో ఆచరణలోగూడా) మతవిద్యకు సంబంధించిన "తరగతివారీ" స్వయంసంపూర్ణమైన అంగంగా మారిపోయింది. సువ్యవస్థితమైన పాఠ్యగ్రంథాలు, పాఠాలు సమకూర్చబడినవి. పాఠ్యవిషయాలలో పలువిధములైన పెరుగుదల స్థాయిలో, పసితనమునుండి కౌమార అవస్థదాక, సామాన్యమైన మత నైతిక విషయాలను చర్చించడానికి చర్చి చరిత్రాంశాలు, చర్చి శిక్షావిధానం, సాంఘికసమస్యలు అనేవాటిని

గూడా చర్చించడానికి వీలుగా విస్తరిల్ల జేయబడింది. సంగీతం కొంత వరకు మెరుగుపడింది. మొత్తంమీద ఆదివారపు బళ్లో సౌందర్య దృష్టికి అంత పాటింపురాలేదనే చెప్పాలి. క్రొత్తవిగా మారిన ఈ "చర్చీ బళ్లు" లౌకికమైన వృత్తివిద్యలో పాటించే పద్ధతుల్ని, స్థాయిని మత సంబంధమైన పాఠ్యవిషయాలకు మతం పెరుగుదలలోని చిత్తవృత్తికి అమలుచేయ ప్రయత్నించారు. ఉపాధ్యాయులకు కొంతవరకు ఈ వృత్తి శిక్షణనుయివ్వడానికి అత్యంత క్రమబద్ధంగా చక్కని ప్రణాళికతో కూడిన ఒక విధానంకూడా వుండింది. కొన్ని చర్చీలలో, ముఖ్యంగా ఎపిస్కోపల్ చర్చీలలో చర్చి సభ్యత్వానికి శిక్షణ యివ్వడమే ప్రధాన మయింది. (విద్యాప్రణాళికలోని కేంద్రబిందువుగా బైబిల్ స్థానంలో చర్చిని బదిలీచేసి పెట్టారు.) కాని అధికసంఖ్యాకమైన చర్చీల్లో మత దృష్టితో "పెంచడం" లేదా పిల్లలు సహజంగా బాల్యావస్థగుండా పెరు గుతూ రావడం అనేదాన్ని అభివృద్ధి చేయడమే లక్ష్యంగా వుండేది. ఈ విధంగా 19వ శతాబ్దంలో ప్రజల భావోద్రేకాన్ని ఆకట్టి మతానికి మార్చుకోవడం ప్రధానంగావుంటే దానికి తెలివైన ఫలకరమైన బదులు విధానాన్ని సమకూర్చజూచారు. ఈ మతవిద్యా ప్రణాళిక యిప్పటికి పనిచేస్తూనే వుంది. కాని ఈ శతాబ్దం ద్వితీయపాదంలో కొంత పడుబా టైంది. ఎంతవరకు పడుబాటు అయిందన్నది తేల్చడానికి సాధ్యంకాని ప్రశ్న. దాని కారణాలను నిర్ణయించడం కష్టమే. 1947 నుండి పైకి పోతున్నజాడ, ముఖ్యంగా ప్రొటెస్టెంటేతర పాఠశాలల్లో కనబడుతుంది. ఈ మతవిద్యా ప్రణాళికకు "అతిగా అంటగట్టడం" జరిగివుండటం, మొదటి దశలోని దాన్నిగూర్చిన గాఢమైన ఉత్సాహం క్రమశః ప్రతిక్రియను కాకపోయినా కొంత తాదాతనాన్ని సహజంగా తెచ్చిపెట్టడం అన్నవి సాధ్యమైన విషయాలే. ఫలితాలనుబట్టి ఈ విస్తృతమైన సంస్థలను అరగొర అయిన ఈ వృత్తివిద్యా మార్గ ప్రయత్నాన్ని సమర్థించడం వీలుకాదు. 1930 నాటి ఆర్థికమాంద్యంవల్ల తప్పనిసరిగా ఉద్యోగులను తగ్గించవలసి వచ్చింది. తరువాతవచ్చిన ద్రవ్యోల్బణంతో వీటి ధర్మాదాయాలు బీదపడి పోయినాయి. ఈ రకమైన విద్యతో పెరుగుతారని ఊహించిన "సామాన్య నాయకులు" యింతవరకు పైకి కనుపించడంలేదు. ఆ తర్వాత చర్చికి క్రమంగా రావటం సామాన్యంగా మొన్న మొన్న పడుబాటు కావడంతో

ఆదివారం బడికి రావడంకూడా దెబ్బతిన్నది. దీన్ని గురించి మొదటి ప్రకరణంలో నేను చెప్పాను. కాని ఈ బహిరంగ విషయాలకు అడుగున యీ వుద్యమంలో కొన్ని మతసంబంధమైన లక్షణాలున్నవి. పాఠ్యవిషయాల్లో మార్పులు తేవడానికి కారణమైన మతానుభవాన్ని గూర్చిన వుదార భావాలు చిన్నతరం వాళ్లలో బైబిలు తెలిసిన పెద్దలు తప్పులుపడ్తూ వచ్చిన "బైబిలును గూర్చిన అజ్ఞానాన్ని" బాగుచేయడానికి మారుగా బైబులు అంటే ఒక అతినాగరికమైన దృష్టిని వ్యాపింపజేసి, అందులోని "జ్ఞానాన్ని" మునుపటికంటే అముఖ్యంగా చేసివేసినవి. బైబులునుగూర్చిన అరగొర విమర్శలు, బైబిల్ ప్రామాణికత్వాన్ని గూర్చిన మరింత హేతుబద్ధమైన సిద్ధాంత మొకటి—ఈ రెండు మతంవిద్యను మామూలు విద్యతో కలపబోవడంవల్ల క్రొత్తవైన యీ ఆదివారపు బళ్ళలో పెరిగే ఈతరం వాళ్ళకు ఆదివారం బడి అంటే అంత ముఖ్యమైంది కాకుండాపోయింది. మతాన్ని "జీవితానికి" ఎంతగా సంబంధపరిచితే అంతగా మతసంబంధమైన ప్రత్యేక సంస్థల్లో ప్రాణశక్తి తగ్గుతూ వస్తున్నది. మతవిద్యా సమస్య ఆదివారపు బళ్ళనుండి మామూలు బళ్ళకు మారివచ్చింది, మతం అనేదాన్ని మామూలు చదువులో ఒక విషయాంశంగా "చదువ" వలసి వచ్చేది. ఈ విధంగా మతశిక్షణను మతాన్ని గురించిన పరిజ్ఞానము తొలగించే పరిస్థితి ఏర్పడింది. ఆదివారపు బళ్ళ వుద్యమానికి ఆధారంగా వుండిన వుదార మతవిద్యా బోధనకు చర్చివారు చూపిన ప్రేరేపకాలు మతసంబంధమైన ఉదారదృష్టిలో వచ్చిన ముందడుగువల్లనే లౌకికములై పోయినవి.

వృత్తివిద్యా మార్గంలో మతవిద్య వుండవలసిన అగత్యం పెరుగుతూ రాగా ఆదివారపు బళ్ళు దాన్ని నిగ్రహించుకోడానికి చాలకపోయినవి అన్న ఈ రోగనిదానాన్ని ఒప్పుకున్నా యీ సమస్యకు పరిష్కారంమాత్రం ఇప్పటికీ స్పష్టపడలేదు. మూడు సార్వత్రిక సంస్కరణ మార్గాలు సూచింపబడినవి

(1) పౌరోహిత్యంమీద శ్రద్ధాసక్తులున్న చర్చీలు బరువునంతటినీ కుటుంబంమీద పెడుతున్నవి. సహజంగా ఇంటికి సంబంధించినదాన్ని బళ్లు ఎలా సమకూర్చగలవు? ఆదివారం బడి కేవలం "వారంపొడుగునా ఇంట్లో

చెప్పిన మతబోధనను పట్టిచూపి ఉత్కృష్టంగా చేసే సాధనం"గా మాత్రమే పనిచేయగలదు. "ఆదివారపు బడి ఆధునిక కుటుంబం స్పష్టంగా నేర్పని దాన్ని పట్టిచూపలేదు." 9

ఇంకా కాథలిక్ బిషప్‌నుండి ఈ క్రింది యిదమిత్థమైన సలహాలు వచ్చాయి :—

తమ బిడ్డ భగవద్భావనలో పెరగటానికి తల్లిదండ్రులు ముందుగానే తగిన సదుపాయం చేయవలెను. బడివాళ్ళు పెంచుతారని వాయిదా వేయవలసిన విషయంకాదు యిది. ఇంట్లో నిరాడంబరమైన, ప్రార్థనా పూర్వకమైన ఆచారాలతో మొదలుకావాలి. ఉదయ సాయం ప్రార్థనలు, భోజనానికి ముందు తరువాత "గ్రేస్" చెప్పడం, కుటుంబం అంతా కలసిచెప్పే "రోసరీ" ప్రార్థన, గంటకొట్టే గడియారం, అనంతకాలానికి ఒకగంట దగ్గర పడుతున్నామని చూపిన ప్రతిసారి (గంటకొకమారు) ఒక చిన్న ప్రార్థన చెప్పడం, భక్తిగా సిలువగుర్తును చేతితో గుర్తించుకోవడం, సిలువమీది క్రీస్తును గురించిన భక్తిభావాన్ని కల్గించడం, యింకా యితర మత విషయాలు—ఇవన్నీగూడా బిడ్డ మతభావన నిర్మాణంలో ప్రోత్సహింపవలసిన విషయాలు...క్రైస్తు జీవితంనుండి తెచ్చుకోదగిన బలవత్తరమైన అతిమానుష శక్తిని తల్లిదండ్రులు వాడుకోవచ్చు. ఆయనను అనుకరించడం ముఖ్యంగా ఆయన విధేయత, సహనము, పరచింతన అనే వాటిని ప్రోత్సహించవచ్చు. క్రీస్తులోని విశేషగుణమైన నిస్స్వార్థంగా యివ్వడమనే గుణాన్ని అతిశయబుద్ధితో నేర్చుకొనేటట్లు తల్లిదండ్రులు ప్రోదిచేయవచ్చును. ఆచరణలో ఇది ఎన్నో రకాలుగా చేయవచ్చు. ముఖ్యంగా యింట్లో బిడ్డ స్వార్థత్యాగం చెయ్యడానికి తరచు అవకాశాలు కల్పించడం ద్వారా ఈ పని చేయవచ్చు..."నీకు నా యందు ప్రేమ వుంటేనా ఆజ్ఞలను నిర్వహించు." ఇది క్రీస్తు పెట్టిన పరీక్ష. దీన్ని బిడ్డకుకూడా అమలు చేయవచ్చు. భగవదాజ్ఞలను నీతులను తనకు మార్గదర్శకంగా వుండే చిహ్నాలుగా బిడ్డకు తెలిసివచ్చేటట్లు చెయ్యాలి. 10

ఇలాంటి సలహాలు ఈనాటి తల్లిదండ్రులకు నవ్వుతెప్పించడం, ఆధునిక విద్యావేత్తలను గింజుకొనేటట్లు చేయడమే కాకుండా చర్చి అధికారులు తాదాగా పనిలేనిపనిగా నీతినియమాలను గురించి మతవిద్యను గురించి సలహా చెప్పడానికి తాము "సహజ ధర్మంగా" నియమించబడినట్లు అను

కొంటారన్న యిప్పుడున్న అభిప్రాయాన్ని బలపరుస్తుంది. గృహజీవితాన్ని చర్చి అధికారుల ఆదేశాలకు తలవొగ్గేటట్లు చేయాలన్న ప్రయత్నం తల్లిదండ్రులు మతవిద్యనుగూర్చిన బాధ్యతను విద్యావిషయాన్ని వృత్తిగా స్వీకరించిన వారి భుజస్కంధాలమీద వుంచడానికి ఒక కారణమయింది. ఏది యేమైన ఈ నాటి పరిస్థితుల్లో క్రిందటి తరాలవారి ఇళ్లలోని ఆచార వ్యవహారాలను చర్చివాళ్ళ ఒత్తిడిచేత పునరుద్ధరించడం జరుగబోని కార్యమని చూడగానే తెలుస్తుంది. బిషప్పులు చెప్పే దైవీయ సంల్పాలు పని చేయడానికి ముందు యింట్లో పూజకు మరింత సహజమైన వాతావరణాన్ని సంస్కృతిరూపంగా సృష్టించవలసి వుంటుంది. ఇంట్లో పూజను పునరుద్ధరించే ప్రయత్నం ఆచరణీయమైనా కాకపోయినా కుటుంబజీవితం లౌకికంగా మారిపోవడంవల్ల మతవిద్య విప్లవాత్మకంగా మారిపోయిన దన్న నిజంమాత్రం నిలుస్తున్నది. ఒక మత సంప్రదాయానికి, జనసమాజకు, ఎల్లలకు లోబడివున్న విద్యకు కొందరు రచయితలు "సహజ అన్యమతారాధకులు" అని పిలిచేవారి మతవిద్యకు గొప్ప తేడావుంది. ఈ రెంటిలో ఎందులోనైనా అధిగమించవలసిన పురస్సిద్ధాంతాలు వున్నవి. అయితే అవి పరస్పరం వ్యతిరేకములు. మొదటిదానిలోని పురస్సిద్ధాంతం చదువు సంధ్యలులేని లేదా బాలుర మతం. రెండవదానిలో మతసంబంధమైన నిరక్షరాస్యత. ఎందులో చూచినా ఒక నిజమైన ఉపద్రవమే ఏర్పడు తున్నది. లేదా విద్యలేదు.

(2) రెండవ సంస్కరణమాత్రం యేమంటే చర్చిల విద్యాసౌకర్యాలను, ప్రణాళికలను విస్తరిల్లజేయటం. ఇవ్వటి ఆదివారపు బడి క్రమంలో విద్యాసంబంధమైన కృషికి ఎక్కువకాలాన్ని సమకూర్చడానికి చేసిన ప్రయత్నాలు ప్రోత్సాహకరంగా లేవు. ఆదివారంనాడు పిల్లల్ని ఒక గంట సేపటికంటే ఎక్కువగా సమకూర్చుకోవడం కష్టం. ఆదివారపు బడి పనిని వారం దినాలకు పొడిగించడం మరింతకష్టం. డెయిలీ వెకేషన్ బైబిల్ స్కూళ్లు ఆచరణలో చాల విజయాలను సాధించినట్లు కనపడు తుంది. ఈపాఠశాలలు చిత్రంగా తల్లిదండ్రులను పిల్లలను రంజింపజేసినవి. సాధనాంతరంగా విడిసమయపు ప్రణాళికవైపు తిరిగిన మతవిద్యా బోధకులకు యిప్పుడు వారానికి ఒక గంటగావుంటున్న పంపిణి వారానికి ఒక మధ్యాహ్నం కావచ్చునని, ఈ విధంగా స్థానికమైన పరిస్థితులకు అను

గుణంగా వర్గీయమైన లేదా అంతర్వర్గీయ మతవిద్యా బోధనా కేంద్రాలు చాలినన్ని నిర్మించవచ్చునని ఆశపడుతున్నారు.

(8) మూడవ సంస్కరణ మార్గంప్రకారం ప్రాథమిక పాఠశాలల నుండి లేదా ఆదివారపు బడులనుండి లేదా స్వగృహాలనుండి ఫలితాలు కలుగుతాయని ఎదురుచూడటంవల్ల ప్రయోజనం లేదు; ఈ సమస్యను ముఖ్యంగా కళాశాలల్లోనే యెదుర్కోవాలి. ఈ స్థాయిలో, కొంతవరకు యీ సన్నివేశ స్వభావాన్నిబట్టి, కొంతవరకు అధికారానికి రెండు వృత్తుల వారు పోటీపడుతుండటంవల్లను యీ సమస్య పరిష్కారసాధ్యం కాదు. మతవిద్య బోధించేపని పెట్టుకోరాదని శాసనమూలకంగా నిషేధింపబడిన పబ్లిక్ కాలేజిలు, విశ్వవిద్యాలయాలు మాత్రమేకాకుండా ప్రముఖమైన ప్రవేటు "లిబరల్ ఆర్ట్సు కళాశాలలు" విశ్వవిద్యాలయాలు మతాన్ని గురించిన బోధన వేరని తలుస్తాయి. ఇది తప్పనిసరిగా చాలాశాఖల్లో చాలా కోర్సుల్లో వుంటుంది. పట్టం పుచ్చుకునేదానికి వీలుగా దీనిని గుర్తించారు. మతంలో విద్యాబోధ వేరు. (చాలా పరిమిత పరిమాణాల్లో తప్ప) దీన్ని పైదానిలాగా గుర్తించలేదు. అందుచేత యిది ఆ ఆవరణాలకు అంచుల్లోవుంటూ దాని పాఠ్యవిషయాలు "చర్చి పౌండేషన్లు", "బైబుల్ పీఠాలు", మతసంస్థలు మొదలైనవాని రూపంగా వుంటవి. హోవర్డ్ మంఫర్డ్ జోన్స్ యీ పరిస్థితిని అనితరసాధ్యంగా అభివర్ణించారు :

మతమనే మాటయొక్క అనువైన ద్వ్యర్థికతక్రింద తరచుగా ఆచరణకు సంబంధించిన రాజీమార్గాలు తయారవుతున్నాయి. ఏమంటే రాష్ట్ర విశ్వవిద్యాలయం థియాలజీ విద్యాశాఖను నిర్వహించరాదని నిషేధించినట్లయితే "తులనాత్మక మత" పాఠ్యాలు ఎవరితోనూ, రాజీపడకుండా ఎవరినీ ఏడిపించకుండ బహుశః అందరి సౌముఖ్యానికి కారణమౌతాయి. "తులనాత్మక మతం" అక్కడక్కడ అది పరిహరించవలసిన ఇబ్బందినే తెచ్చిపెట్టినప్పటికికూడా పైమాట యథార్థమే. యుక్తాయుక్త విచక్షణగల నీతిశాస్త్రోపాధ్యాయుడుగాని లేక తాత్వికుడుగాని ఈ పాఠాలు చెప్పవచ్చు. చరిత్ర అథవా మానవజాతి శాస్త్ర శాఖలక్రింద ఇవి రావచ్చు. ఒక్కొకప్పుడు ఆంగ్లభాషా శాఖలో "సాహిత్యంగా బైబిల్", "మానవజాతియొక్క మహా మతగ్రంథాలు", లేదా ఇలాంటి మరి యింకొక

పేరుమీదుగా మారువేషంతో ఇవి రావచ్చు. అల్లే నీతిశాస్త్రంలోనూ, సాంఘిక శాస్త్రం, సాంఘిక సమస్యలు లేదా సాహిత్యం అనేవాటిలో పై పేర్లు పెట్టకపోయినా మతసమస్యను చర్చిస్తాయని నడిచప్పుడు లేకుండా అర్థమౌతుంది. ఈ పాఠ్యాలు తమ జోక్యం కనిపించనీయకుండానే రెండు విధాలుగా ఎంతో మేలుచేస్తున్నాయి. దిక్కుతెలియని పట్టభద్రులు కాబోయే విద్యార్థులకు సహాయపడుతున్నవి. విశ్వవిద్యాలయం అనేది నాస్తికత్వం పెరిగే చోటుకాదని చర్చిలకు తాదా చెబుతున్నది. అయితే తులనాత్మకంగా బోధింపబడే "మతం" విషయదృష్టితో లేదా వ్యక్తులకు సంబంధము లేని ప్రాతిపదికమీద చెప్పబడే మతం, ఎన్నో తెగలవారీ చర్చిలు కోరేవిధంగా ఇది నడవడిక ఆలోచనలమీద సూటియైన ప్రభావానికి విధిగా దారితీయక పోవచ్చును.

రెండవ ఉపాయ మేమంటే పూర్తిగానో లేదా కొంతవరకో ప్రభుత్వం ఖర్చుక్రింద "మతసంబంధమైన సలహాదారును" ఉంచటం. దయాళువు, పక్షపాతం లేనివాడు అయిన ఇలాంటి ఉద్యోగి విశ్వవిద్యాలయానికి తెగలవారి చర్చిలకు మధ్య పొందునడిపే ఉద్యోగిగా పనిచేస్తాడు...

ఏమైనా మొత్తంమీద పట్టభద్రులు కాబోయే విద్యార్థుల్లో తమ ఇబ్బందులను ఈ మతసంబంధమైన సలహాదారు దగ్గరికి తీసుకుపోయే గుణం ఉందని చెప్పలేము. మొట్టమొదట ఈ సలహాదారు తాను అందరికి అన్నీ కావాలి—మరొక కారణంగా చెప్పితే కాథలిక్కులు, ప్రొటెస్టెంట్లు, యూదులు, దేవుడున్నాడని నమ్మజాలనివారు, ఇంకా తదితరులు వీళ్లందరిమధ్య చాల నిష్పక్షపాతంగా ఉండాలి. దీనంతట ఇదే ఒక అసాధ్యమైన కార్యభారం. తర్వాత అతడు నిష్పక్షపాతంగా ఉన్నా అతడు చేయగలిగిందంతా విద్యార్థియొక్క సమస్యను సమస్తమైన భావచ్ఛాయలతోకూడా అతడు నమ్మిన చర్చివైపుకు ప్రసరింప చేయటమే. అయినప్పటికి ఒక్కొక్కసారి విద్యార్థి ఈ ఉద్యోగినే తప్పుకొని పోవాలని చూస్తాడు. ఇంక నిష్ణాతులుండే విద్యాశాఖలో తాత్వికంగాను శాస్త్రీయంగాను పోటీపడటం చాల ఎక్కువ గనుక ఈ సలహాదారు నెగ్గుకురావడం కష్టమని మృదువుగా చెప్పవలసి ఉంటుంది. ఇంతవరకు ఈ ఉద్యోగం గొప్ప ప్రతిభావంతుల్ని ఎవరినీ ఆకర్షించలేదు. పట్టభద్రుడు కాబోయే దిక్కుతెలియని విద్యార్థి తానొక పెద్దవానిదగ్గరకంటూ పోతే

ఆచార్య స్థానీయులలోని సానుభూతిగల ఒకరి దగ్గరకుపోయి వెళ్ళబోసుకోవడమే సహజంగా జరుగుతుంది.

ఈ సమస్యను పరిష్కరించటానికి విశ్వవిద్యాలయం ప్రయత్నించిన రెండు ముఖ్యమార్గాలు ఇవి. ఆయా చర్చీలుకూడ స్నేహపూర్వకంగా ఈ సమస్యను సమీపించినాయి. దగ్గరిలోనున్న స్థానికమైన చర్చికి లేదా సినెగాగ్‌కు ఒక "స్టూడెంట్ పాస్టర్"ను నియమించడం ప్రత్యేకంగా గమనించదగింది. అనేక రాష్ట్ర విశ్వవిద్యాలయాల, ముఖ్యంగా దక్షిణాదిన, ఆవరణలకు ఆనుకొని బైబుల్ పీఠమో, లేదా పీఠాలో అనేవి ఉన్న ఒకటో అంతకంటే ఎక్కువో భవనాలు ఉండడం కనబడుతుంది. దీని అర్థమేమంటే ఒకతెగకు చెందిన చర్చి తనప్రస్థానాన్ని బోదించే ఒక ఉపాధ్యాయుణ్ని పోషిస్తుంది. ఆచర్చి అద్దెకో, స్వంతంగానో తీసుకున్న భవనంలో ఆఉపాధ్యాయుడు బైబుల్‌ను గురించి ఆగమ శాస్త్రాన్ని గురించి లేదా "మతా"న్ని గురించి బోధిస్తాడు. పట్టభద్రులు విద్యార్థుల ఆసక్తిని పిలిచిమళ్ళించి విశ్వవిద్యాలయంలో బోధించే పాఠ్యాల ధిషణా స్థాయిలో పోటీపడగల పరిపక్వత ఏర్పడిన వాడుగా ఉంటాడు. ఈ పాఠ్యాలు చాలావరకు విద్యాప్రణాళికకు సంబంధించక బయట ఉండే రకంగా ఉంటాయి. వీటికి కళాశాలలో ఏరకమైన గుర్తింపు లేకపోయినా ఇవి ఇంకా బ్రతికి ఉన్నవంటే చెప్పడంలోని శ్రద్ధాసక్తులకు విద్యార్థుల ఆత్మగవేషణ గుణానికి పొగడికోలు అన్నమాట.

మరొకవైపు సాధారణమైన చర్చి మామూలు మినిష్టరు చేయగలదానికంటే ఎక్కువగా విశ్వవిద్యాలయం తన విద్యార్థుల్ని ఉన్నతమైన మేధా సంపత్తిని ఆశించేటట్లుగా తర్ఫీదు చేస్తుంది. నిష్ణాతులైనవారు వీళ్ళ కుపన్యసించిన తర్వాత వీరు ఎంత మందమతులైన కాథలిక్, ప్రొటెస్టెంట్ లేక యూదు సంబంధమైన ఏ ధర్మోపన్యాసంగానీ, విద్యార్థికి ప్రత్యేకం చాల అసంతృప్తికరంగా ఉంటుంది. వృత్తిగా స్వీకరించిన ఆలోచనాపరులు తర్ఫీదుచేసిన తర్వాత ఆదివారపు బడిలోని ఆజమాయిషీ మనిషి యొక్క అస్పష్టమైన సాముఖ్యం దుమ్ముధూళికంటే చౌక అయిపోతుంది. యునైటెడ్ స్టేట్సులోని రాష్ట్రాలు నిర్వహించే ఉన్నత విద్యాసంస్థలలోని పట్టభద్రుల పొందు నిలుపుకోవాలంటే మేధా విషయకంగా జాగృతం కావలసింది చర్చీలేకాని విశ్వవిద్యాలయం కాదు. ఒంటరి మినిష్టరు ఒంటరి

చర్చిలు ఇది గమనిస్తారు. చర్చిల్లో అనేకం ఇది గమనించడంలేదని ఒప్పుకో వలసివుంది. 12

చర్చిలు రాజకీయవాదులు ఈ సమస్యను సమగ్రంగా చూచినా చూడక పోయినా వృత్తిచేత విద్యగరపేవారై ఉంటూ మతాన్ని గురించిన జ్ఞానం, మతజ్ఞానం అనే వాటిమధ్య సాంప్రదాయికంగా వస్తూన్న ఈ వైరుధ్యాన్ని తొలగించాలని యాథార్థాన్ని ఎరిగిన ఆగమవేత్త లనేకు లున్నారు. ఆగమశాస్త్రంలోని ఇప్పటి పద్ధతులు, దానివైపుకున్న మొగ్గులు ఈ సమస్యా పరిష్కారం ముందుకు సాగడానికి అనుకూలంగా ఉన్నవి. ఉదాహరణకు ఒక ప్రొఫెసర్ ఇలా వ్రాస్తున్నాడు, అనేకు లిది ఒప్పు కుంటారుకూడా :

కళాశాలల్లోని మతవిద్యా బోధకులలో చాలమంది ఆగమశాస్త్రం ఒక సిద్ధాంతానికి మరలక మునుపు సెమినరీలలోను పట్టములిచ్చే బళ్ళలోనూ తర్ఫీదైనవాళ్లు. వీళ్ళ బోధనకు క్రైస్తవభావ ప్రభావాన్ని ముందుకు తీసుకపోతున్న ఇప్పటివాళ్లకు మధ్య ఒక "సాంస్కృతికమైన అంతరము" ఉంటున్నది...అంతేగాక ఇతర పరిషచ్ఛాఖల ఇప్పటి అభిప్రాయం ప్రకారం మతబోధ ఎప్పుడూకూడ విజ్ఞానశాస్త్రపు లక్ష్యం ప్రకారం కావలసిన నిష్పాక్షిక విషయదృష్టిలోని వైయక్తికమైన జోక్యానికి తావీయని దూరపుతనాన్ని చూపించాలి. ఇట్లు మతవిద్యాశాఖకు సంబంధించిన ఉద్యోగులు తామే మరొక విధంగా చెయ్యబూనిన తమ సహోద్యోగుల అభిప్రాయాలతో సర్దుకొని రావడమనేది ముఖ్యంగా చారిత్రక దృష్టినో లేదా తులనాత్మక దృష్టినో గ్రహించేటట్లు బలవంతపెట్టుతున్నది. ఇది కూడ తులనాత్మకమైన మతవిద్యమీది ఆసక్తితో సమర్థంగా మతవిద్యా బోధ చెయ్యగల క్రొత్త అధ్యాపకుల సరఫరా కొంచెం మించుమించుగా దుర్లభమైన ఈనాడు జరుగుతున్నది.

మతవిద్యను శాస్త్రీయమైన మతవిద్యాభ్యాసంతో సమన్వయపరచే సమస్య మేధా విషయిక పునర్నిర్మాణమునకు సంబంధించినంతగా సంస్థల పునర్నిర్మాణానికి సంబంధించినది కాదనడం స్పష్టం. మతాన్ని తెలివి తేటలతో శ్రద్ధాసక్తులతో విమర్శదృష్టితో విద్యాసంస్థల్లోను అట్లే పూజ సేవలకు సంబంధించిన సంస్థల్లోనూ నేర్వరాదు అనుటకు కారణం లేదు. మతమనేది ప్రాథమికమైన "మానవ విషయంగా" గుర్తించబడినంత

వరకూ విద్యావిషయకంగాకూడా ప్రముఖమైనదే అవుతుంది. మానవ నాగరికతలో అది తన ప్రధానపాత్రను పోగొట్టుకుంటే ఎంతచదువైనా దాన్ని రక్షించలేదు, మతసంబంధమైన నిరక్షరాస్యత మతమనేది సర్వ జనోపయోగియైన ఒక సేవాశాఖగా ఉన్నంతవరకే సను ష్టి చెడుగుగా ఉంటుంది. మతానికున్న ఈ దయాళుత్వాస్థాయి తెలివి కలిగించేపని అనే నాటికి మతోద్యోగ వ్యతిరేకులు తెచ్చిపెట్టిన అజ్ఞానంవల్లనూ, తమ విశ్వాసాన్ని నాగరికతకు సమన్వయంచేసి వ్యాఖ్యానించటం చేతకాని వుద్రేకపరులైనవాళ్ళ మొండితనంవల్లను ఆపద వాటిల్లగలదు. చర్చివాళ్లు లోకాన్ని విమర్శించటంలో ఎంతవరకు వుద్ధరణశక్తి చూపగలరో అంత వరకే వాళ్ళ పారలౌకికతను గౌరవించటం జరుగుతుంది. ఇంకొక రకంగా చెప్పితే పాఠశాల, చర్చి, ప్రభుత్వం నిజంగా పరస్పరం సహకరించాలి. రాజకీయమైన అధికారాన్నిగానీ నైతికాధికారాన్నిగానీ కేవలం తమ అదుపులో పెట్టుకొనడానికి ప్రయత్నింపరాదు.

## ఉద్ధరణ సంఘాలు

దేశాంతరోద్ధరణ రంగాలలోని సంస్థలలోవచ్చిన మార్పులనుగురించి ఇక్కడ చర్చించడం అసాధ్యము, అప్రసక్తము ఔతుంది. మాకిక్కడ కావలపింది దేశంలోని ఉద్ధారణ సంఘాలలో వచ్చిన మార్పులేకాక యునైటెడ్ స్టేట్సులో ఉద్ధరణ సంఘాల అంతశ్శక్తి, క్రమనిర్మితి అనే వాటిలో వచ్చిన మార్పులు. తొట్టతొలుత అమెరికన్ వలసరాష్ట్రాలన్నీ ఉద్ధరణ సంఘాలకు రంగాలుగా ఉండేవి. రోమన్ కాథలిక్ చర్చికి యునైటెడ్ స్టేట్సు 1908 దాక అధికారికంగా "ఉద్ధార్య ప్రదేశం"గా ఉండేది.

మిషనరీ ఎజుకేషన్ మూవ్‌మెంట్ 1921 నుండి సమన్వయం చెయ్యడానికి ప్రయత్నించినా దేశంలోని ఉద్ధరణ సంఘాలకు దేశాంతరోద్ధరణ సంఘాలకు మధ్య పోటీ ఏర్పడడం తప్పనిసరి. ప్రొటెస్టెంట్లలో ఒక శతాబ్దానికిపైగా విదేశరంగాల విషయంలో ఎక్కువ జనప్రియత విస్తరణము సహాయము లభించినవి. ఈ రంగాలలో ముఖ్యంగా ఇండియా చైనా, జపాన్‌లలో, ఈ కృషికి సంబంధించిన ఉత్సాహము, పెట్టుబడి అమెరికన్ ఆర్థిక రాజకీయ ప్రముఖ విషయాల పెరుగుదలను ఎంతగానో

అధిగమించి ప్రాతపడజేసినవి. అమెరికన్ ఉద్ధరణ సంఘాలకు లౌకిక సిద్ధాంత శ్రద్ధాళువులు సామ్రాజ్యవాదపు విధానాలు క్రొత్తరంగాలను "తెరచి" నప్పుడు తమకు దొరికిన అవకాశాలను చర్చీలు వెంటనే వినియోగించుకొన్నవనుకొంది. 19వ శతాబ్దములోలాగానే 20వ శతాబ్దములో కూడా "హీదలిజం" కొట్టవచ్చినట్లు కనిపించే ఇండియా, చైనా, "చీకటి ఆఫ్రికా"లలోని జనరంజకమైన ఉద్ధరణ రంగాలే కావటం ఈ ఉద్ధరణ సంఘాల సాధారణ హృదయగత భావానికి సూచకం. ఏమైనా హీదలిజం భయానక దృశ్యాలను నాటకీయంగా చేసి సామాన్యుల మనస్సును ఆకట్టుకోడమనేది ఉద్ధరణ సంఘాల ప్రచార ప్రయోజనానికి ఇప్పటికి ఉపయోగిస్తానే ఉన్నా ఉద్ధరణ సంఘాలు మరింత తెలివితేటలతో ప్రణాళిక వేసిన పని క్రమంగా ప్రముఖమై ఇది తగ్గునపడుతూ వచ్చిందని చెప్పడం క్షేమం. ఫారిన్ మిషన్ కాన్ఫరెన్సు ఆఫ్ నార్త్ అమెరికా (1893), ఎడింబర్గ్ కాన్ఫరెన్సు (1910), ది ఇంటర్నేషనల్ మిషనరీ కౌన్సిల్ (1921) గా పరాకాష్ఠ పొందిన ప్రాటెస్టెంట్ ఉద్ధరణ సంఘాల క్రమాధికమైన కేంద్రీకరణం అమెరికన్ కాథలిక్కులు ప్రపంచమంతటా ఉన్న కేథలిక్ ఉద్ధరణ సంఘాలకు క్రమంగా ఎక్కువచేస్తూ వచ్చిన సహాయంతో కలిసి ఉద్ధరణ సంఘాల కార్యకలాపాలను మరింత నియమబద్ధంగా, నిర్మాణాత్మకంగా, తెలివిగా చెయ్యడంలో గెలుపు సాధించినవి. ఈ విదేశీరంగాలకు అట్టడుగున సహాయపడుతున్న సామాన్యజనుల భావంలో సంప్రదాయికంగా ఉంటూ వచ్చిన ఆసక్తిని తగ్గించకుండా ఈ పని చేశాయి. గడచిన రెండు దశాబ్దాలలో ఉద్ధరణ సంఘాల సంస్థారూపమైన కృషి ఉద్ధరణ సంఘాలకొరకు ఏర్పడే భావంలోని మత సంబంధమైన ఉత్సాహం ఎన్నో ప్రమాదాలకు లోనైనవి. మొదటి ప్రమాదం 1920 లో వచ్చింది. ఉద్ధరణ సంఘాల ఉత్సాహం అది ఆధారంగా కేంద్రీకరించి ఒకచోట పథకాలు వెయ్యడం అనేవి ఇంటర్ చర్చ్, ప్రపంచోద్యమా (1919-20) లలో నాటకీయంగా పతాకాసన్ని వేశాన్ని అందుకుంది. మొదటి ప్రపంచ సంగ్రామానికి తోడ్పడిన అమెరికన్ మతాధినేతలు యుద్ధసమయంలో ఋణాలు సేకరించే పద్ధతులతో పరిచయ మేర్పడిన వీరు దేశంలోని నైతిక, ఆర్థిక సంపదలను మరింత నిర్మాణాత్మక లక్ష్యాలకు వినియోగింపజేసేందుకు 1918 ఆఖరున

సమావేశమైనారు. మెథడిస్టు నాయకత్వంక్రింద ఎన్నో తెగలవారి ప్రపం చోద్యమాలు ఒకటైనవి. 1919 లో "యునైటెడ్ స్టేట్సు, కెనడాలలోని ఎవాంజికల్ చర్చీల ఉద్ధరణ, విద్య, తదితర ఉదారమార్గాల సహకారంతోకూడిన ప్రయత్నంతో కలిసికట్టుగా తామందరు ఇప్పుడు చేయవలసిన పనులనుగురించి విచారించేందుకు, అల్లే కలిసికట్టుగాను, విడివిడిగాను ఆ పనులకు కావలసిన మనుష్య, ఆర్థిక, అధికారిక శక్తులను సంపాదించేందుకు 1118 ఇంటర్ చర్చి ప్రపంచోద్యమం తరపున ఒక ఆశాపూరితమైన ఉద్యమాన్ని ఆరంభించారు.

ఇంటర్ చర్చి ప్రపంచోద్యమం ఉద్దేశించిన ప్రయోజనాలను ఒక ఆశాపూరితమైన ఖరీదైన పథకంలో ప్రకటించారు. 14 (ఎగ్జిబిట్ V చూడు.) విస్తారమైన కార్యాలయాలు వెలసినవి. ప్రొటెస్టెంట్ చర్చీల కార్యకలాపాలు ఒక బృహద్వ్యాపారమువలె కట్టుదిట్టమైనవి. ఈ ఉద్యమం ఆరంభించినారో లేదో యుద్ధకాలంలో వచ్చిన ప్రచారాలకు కలిగిన ప్రతిక్రియ దానిమీద దెబ్బతీసి దివాలా తీయించింది. అది ఉన్నట్లుండి పడిపోవడానికి మరొక కారణం ఏమంటే దాని కమిటీలలో ఒకానొక కమిటి బిషప్ ఫ్రాన్సిస్ జె. మాక్‌కన్నెల్ అధ్యక్షతక్రింద 1919 నాటి ఉక్కుపనివారి సమ్మెను గురించి ఒక నివేదికను ప్రకటించింది. దీనికి చాలా ప్రచారం వచ్చింది. ఇది నిశ్చయంగా పనివాళ్ళకు అనుకూలంగా ఉంటున్నటువంటి నివేదిక. ఈ ఉద్యమానికి అత్యధికంగా సహాయంచేసిన కొందరు ఇటువంటి "ప్రపంచ" కృషి జరుగుతుందని అభ్యూహించలేదు.

ఏమైనా ఉద్ధరణ సంఘాల మామూలు కార్యక్రమాలు ఔదార్య సంసేవా సిద్ధాంతాల సంయుక్త ప్రేరణలో విస్తరిల్లుతూనే వచ్చినవి. ఆర్థికమాంద్యము ఏర్పడకముందే తీవ్రమైన డబ్బుచిక్కులు ఏర్పడినవి. ఉద్ధరణ సంఘాలవారి ఉత్సాహంతోపాటు ఆర్థికసహాయం అందిరాలేదు. 1928 లో జరూసలేం కాంగ్రెసులో ప్రాతిపదికలైన సమస్యలను చర్చించారు. ఎన్నో ముఖ్యమైన విధాన నిర్ణయాలు చేసినారు. అందరికి శత్రువైన "లౌకికతా సిద్ధాంతాన్ని" దృష్టిలో పెట్టుకొని క్రైస్తవులు ఇతర మతాలవాళ్లనుగూడా అందరికి సంబంధించిన ఒక పనిలో మిత్రవర్గాలకు చెప్పినట్లుగా, క్రైస్తవమతంలోని "విశిష్టత" సత్యము చెడకుండా, చెప్పవలసిందని కోరినారు. స్నేహపూర్వక సంబంధాల అభివృద్ధి చేయ

జూస్తుండిన అంతర్విశ్వాస సంస్థలకు మేలుగా యూథులను ఉద్ధరించే కార్యక్రమాలు ఆపివేయదలిచారు. సర్వసాధారణంగా "భగవద్వాక్యాలు వినిపించే" ఈ ఉద్ధరణ సంఘాల స్థానాన్ని "నాగరికత నేర్పే" ఉద్ధరణ సంఘాలు తీసుకోవాలని అన్నారు. ఉద్ధరణరంగ విషయంలో వచ్చిన ఈ నికరమైన ఉదారమైన చిత్తవృత్తివల్ల ప్రాచ్యఖండంలో విద్యా, వైద్య, గ్రామీణ, పారిశ్రామిక సేవలు విస్తరిల్లినవి. అయితే కన్సర్వేటివ్‌లు ఈ భగవద్వాక్యాలను వినిపించే క్రైస్తవమతం పూర్తిగా వదలి వేయబడుతుందని భయపడి తీవ్రంగా నిరసించారు. 1930 లో జాన్ డి. రాక్‌ఫెల్లర్ ప్రేరణ సహాయముల క్రింద కొందరు సామాన్యులు లేమెన్సు ఫారిన్ మిషనరీ ఇంక్వైరీని ఏర్పరచినారు. అది ప్రధానమైన ఉద్ధరణ రంగాలలో దేశాంతరోద్ధరణ సంఘాల విషయంలో సహాయపడదగిన అంశాలను తెలుసుకొనడానికి అనేక నిపుణుల సంఘాలను పంపించింది. యథార్థము కనుక్కోడానికి వెళ్ళిన వీళ్ళ నివేదికలను హార్వర్డులోని ప్రొఫెసర్ విలియం అర్నెస్ట్ హాకింగ్ అధ్యక్షతక్రింద ఉన్న జేరీజు సంఘానికి సమర్పించారు. ఈ సంఘ నివేదిక రీ థింకింగ్ మిషన్సు అనే పేరుతో 1932 లో ప్రకటింపబడింది. ఇది ఉదారవాదుల దృక్పథాన్ని సమగ్రంగా సమర్థించింది. (ఎగ్జిబిట్ VI చూడు.)

ఈ విధానాన్ని గురించి బలమైన చర్చ జరిగింది. ముఖ్యంగా అమెరికా బొత్తిగా "క్రియా చణత్వం"లో పడిందని పూర్తిగా నమ్మిన యూరోపియన్ శాల్త్రియనులు ఈ క్రొత్త భగవద్వాక్య ప్రచారాన్ని వెనుకవేసుకు రావడంవల్ల ; ఉద్ధరణ సంఘాల పద్ధతులను పునర్నిర్మించడంలో ఆచరణలో ఫలకారులైనవి క్రైస్తవ భగవద్వాక్య ప్రచారానికి (సాధారణంగా హైందవుల ఆశ్రమము, ధ్యానములవంటి) ప్రాచ్యదేశాల మతాచారాలను రంగంలోని అమెరికన్ నాయకులు స్వీకరించడానికి చేసిన ప్రయత్నాలు. జాన్ సి బెనెట్ ఒక మధ్యేమార్గాన్ని సూచించాడు :

సాంఘికమైన బోధనలు మాత్రమే సాధారణంగా జనులను క్రైస్తవ శ్రుతులవైపుకు మార్చవు అయితే క్రైస్తవమతం సాఘికంగా అందని పొందనిది అన్నభావం వాళ్ళను దూరంగా ఉంచగలదు. తర్వాతి దశలో క్రైస్తవమతం ఎందరి హృదయులనో జయించవచ్చు. ఎందుచేతనంటే ఇది ఐహికాముష్మికములు రెండూకలది, ప్రగాఢమైన ఆంతర

అశవ్యకతలను ఎదుర్కొంటూనే జనులు సాంఘిక పరిస్థితులను మార్చే టట్లు చేస్తుంది; ఆర్థికమైన వైయక్తికత కమ్యూనిజం అనే రెండు మిథ్య లలో పడిపోతున్న జీవితాన్ని తుణ్ణంగా రోగనిదానం చేసి చూపగలదు. భగవద్వాక్య ప్రచారాన్ని ఒత్తి చెప్పడానికి నా ముఖ్యకారణ మేమంటే గడచిన 20 సంవత్సరాలలో ఆగమశాస్త్ర విషయంలో ఉదారదృష్టిగల నేపథ్యమున్న చర్చిలలో క్రైస్తవ శ్రుతియొక్క విశిష్టతనుగూర్చిన నిశ్చిత మైన బోధ కలిగిందన్న నా విశ్వాసం. సమకాలీన ఉద్ధరణ సంఘాల కృషిలో చాలాభాగం క్రైస్తవమతం వినా మరేది ఆస్థానానికి చాల దని అనిపించే ఒక లక్షణాన్ని దాని విశిష్టతను కూర్చిన భావం కొంత వరకు పోగొట్టుకొన్న ఆగమవిద్య తొట్టతొలుతగా ప్రేరేపించినది. 15

ఇక్కడ "ఆర్థిక వైయక్తికత", కమ్యూనిజం "అనేవాటి" సమగ్ర మైన రోగనిదానం "అందియ్యడంలో మునుపటికంటే క్రైస్తవమతం మరింత విశిష్టంగా" ఔతుందని ప్రొఫెసర్ బెనెట్ ఆశిస్తున్నట్లు కన బడుతారు.

రెండవ ప్రపంచయుద్ధం ఉద్ధరణ కార్యకలాపాల సంస్థలకు చాలా తీవ్రమైన ప్రమాదాన్ని తెచ్చిపెట్టింది. ఈ పైనచెప్పిన మార్పులు ప్రాచ్య ఖండంలోని మతాల, సంస్కృతుల బిషయంలో ఒక క్రొత్త చిత్తవృత్తికి భూమిక ఏర్పరచకుండా ఉండివుంటే అది మరింత వినాశకరంగా అయ్యేది. యుద్ధం సామాన్య ప్రజానీకానికి ప్రాచ్యఖండాన్ని గురించిన కొన్ని ప్రాథమిక వివరాలను తెలియజేసింది. దీనితో సాధారణంగా "హీదన్" అంటే ఉండే లేనిపోని దయాభావాన్ని ఛిన్నాభిన్నంచేసింది. ఉద్ధరణ సంఘాల కృషిని ప్రాథమికంగా పురికొల్పే కారణాలను పూర్తిగా మార్చగలిగే టట్లు అయింది. చేతికి చెయ్యిగా అనుకోకుండా విరోధంతో ప్రాక్పశ్చి మాలు మొరటుగా "కలుసుకోవడం" లేదా ఇతరమైన పాశవికప్రవృత్తి అనేవి ఉద్ధరణ సంఘాల వ్యావృత్తికి సంబంధించిన మతాంశాలను వెనుకకు నెట్టివేసి యుద్ధానికి ముందు కన్పించిన లక్షణాలను లౌకికమైన సహా యాన్ని, భూమిసంస్కరణను, ఆరోగ్యవిద్యలను ఇచ్చేటందులకై పెదింత చేసినవి. ఇదంతా మరిన్ని ఉద్ధరణ సంఘాలకు లేదా సంఘాలు లేక పోవడానికి—దేనికి దారితీస్తుందో కొంచెం ఊహ చెయ్యడానికికూడా సాధ్యంకాదు. ప్రస్తుతపు యథార్థంగా గమనింపవలసిన ఒక ముఖ్యవిషయ

మేమంటే అవిచ్ఛిన్నంగా, కలిసికట్టుగా, ఉద్ధరణ సంస్థలు ఉంటున్నా ఉద్ధరణ సంఘాల భావస్వరూపమే పూర్తిగా మార్పులకు లోనైనది.

దీనికి సంబంధించి కొట్టవచ్చినట్లు కనబడె విషయమేమంటే ఇప్పుడు కేథలిక్ ఉద్ధరణ సంఘాలలో వస్తున్న పునర్వ్యవస్థీకరణ. ఇందులో అమెరికన్ కాథలిక్కులకు తప్పకుండా ప్రముఖమైన పాత్ర ఉంటుంది. మొన్నమొన్నటి దాక అమెరికన్ కేథలిక్కులు స్వదేశంలోని ఉద్ధరణ కార్యకలాపాలలో వ్యగ్రులై ఉండేవారు. దేశాంతరోద్ధరణ కార్యకలాపాలకు చురుకుగా సహాయం చేసే సాధన సంపత్తిగానీ, శ్రద్ధగానీ ఉండేది కాదు. కాని మేరినాల్ ఫాద్సర్ స్థాపింపబడిన 1911నుండి కేథలిక్కు ఉద్ధరణ సంఘాల కార్యకలాపాలు దడబడకుండా పెరిగినవి. ఆ పెరగటం ప్రాటెస్టెంట్ ఉద్ధరణసంఘాల మార్గంలో పెరిగినవి. 1921లో సైంట్ కొలంబస్సు ఫారిన్ మిషన్ సొసైటి తన విద్యాకేంద్రాన్ని ఆరంభించింది. 1943లో దిఅకాడిమియా ఫార్ మిషన్ స్టడీ అన్ని కేథలికు విద్యాకేంద్రాల్లోనూ ఉద్ధరణ కృషిని భోధించే ఒక ప్రణాళికను ఏర్పాటు చేసింది. అమెరికన్లు శ్రద్ధచూపే ముఖ్యమైన కాథలిక్కుల ఉద్ధరణ రంగాలు జపాన్, చైనా, ఫిలిప్పైన్ దీవులు, దక్షిణ అమెరికా. కేథలిక్కు, ప్రాటెస్టెంట్ ఉద్ధరణ సంఘాల, అందలి ఉద్ధారకుల మధ్యఉన్న సంబంధాలు స్నేహపూర్వకాలని సర్వజనవిదితం. మొత్తంమీద కాథలిక్కులు క్రైస్తవ మతంలోకి పరివర్తన చెయ్యడంమీద ఎక్కువ ప్రాధాన్యం నిలుపుతూ వచ్చినారు. ప్రాటెస్టెంట్లు ఉదార సిద్ధాంతం రాకముందు ఉన్నట్లుగా కేథలిక్కుల పద్ధతులు కొంత భిన్నంగా ఉన్నవి. చదువు, మతబోధల మీద అంతగా ఆధారపడకుండా కరువుకాటకాలలో సహాయం చెయ్యటం అనాథశరణాలయాలు ఏర్పరచటంవంటి దానకార్యాలమీద ఆధారపడుతున్నారు. కాని యుద్ధం తెచ్చిపెట్టిన పరిస్థితులు కాథలిక్కులను తమ ప్రయత్నాలను ఇతర మతాలమీద కేంద్రీకరించకుండా "అనాచారము", నాస్తికత అనగా కమ్యూనిజం అనే శక్తులమీద దైవదృష్టిలేని లోకాన్ని పరిరక్షించడమే ఇప్పటి తమ ప్రధానకర్తవ్యంగా భావిస్తూ కేంద్రీకరింపచేసినవి. ప్రాటెస్టెంట్లు మనస్ఫూర్తిగా ఈ మార్గాన్ని అవలంబింపకపోవచ్చు. అయినా వాళ్ళుకూడా తమ ఉద్ధరణ కృషి కార్యక్రమాలను క్రొత్తరాజకీయ సన్నివేశానికి అనువుగా మార్చుకోడానికి

ప్రాచ్యఖండంలోని "లౌకికుల" తత్వవ్యాప్తికి అనువుగా మార్చుకోడానికి పూర్తిగా పునరాలోచించుకొనక తప్పదు.

పునరాలోచించే ఉద్ధరణ సంఘాల ఆవశ్యకతకు సద్యఃఫలము ఏమంటే స్వదేశంలోని ఉద్ధరణ కార్యకలాపాలవైపు దృష్టిరావడమే. అయితే ఈ రంగంలోకూడా, అంత నాటకీయంగా కాకపోయినా, ఈ అర్థశతాబ్దిలో ఒక సమగ్రమైన పునర్నిర్మాణం జరిగింది. "స్వదేశంలోని విదేశీయు"ల (ఇండియన్లు, వలసవచ్చినవారు, మారుమూల పర్వతప్రాంతాలు, చర్చిలేని జనసమాజాలు అనేవారి మధ్య కృషి) మధ్య ఉద్ధరణ సంఘాలు ప్రాథమికములని భావింపబడుతూ ఉండగా అటువంటి కార్యకలాపాలన్నీ ఇప్పుడు "సంఘ శ్రేయస్సు" లేదా వృత్తిరూపకంగా "సాంఘిక కృషి" అని అనబడే ఒక విస్తృత కార్యక్రమానికి లోబడకపోయినా సమన్వయపరచబడుతూ ఉన్నవి. సాంఘిక కృషి అనేదాని భావస్వరూపమే ప్రాథమికమైన దానధర్మాలను, ఆరోగ్య సంబంధమైన సేవలను కలుపుకొనేటంతగా విస్తరిల్లింది. దీనికొక ఫలమేమంటే సమగ్రమైన నగర పారిష్ అనేది (శిక్షితులై జీతాలు పుచ్చుకొనే సంఘసేవకులు ఉండే) ఒక "వ్యవస్థ అయిన చర్చి" మాత్రమేకాదు. అది స్థానికమైన లౌకికుల శ్రేయఃకృషితో భారీఎత్తున ఉండే జాతీయ కార్యసంఘాలతో సహకరిస్తుంది ఈఏజెన్సీలు పరిస్థితులప్రాబల్యంవల్ల సాంప్రదాయికమైన పరోపకారపారీణతను లోకువజేసి కార్మికుల సమస్యలు పరిశీలించి పరిష్కరించటం. శాసన నిర్మాణం, అంతర్జాతీయ సంబంధ బాంధవ్యాలు, ఇతర విషయాలకు పోవలసి వచ్చింది. ఇవన్నీ కూడా అర్థశతాబ్దం ముందు కాలంలో మతసంస్థలకు ఏదో మహాఅయితే యథాలాపమైన పనులుగా భావింపబడేవి,

వ్యవస్థీకృతమయిన ఉద్ధరణ సంఘాలతోపాటు ఉద్ధరణ కలాప స్వభావమే మారిపోయినట్లు ఈమార్పులన్నీ రుజువు చెయ్యకపోయినా సూచనగా తెల్పుచున్నవి. క్రైస్తవ ఉద్ధారకులు లోకాన్ని క్రీస్తు దగ్గరకు తేలేదుకాని లోకానికి క్రైస్తవ మతాన్ని తెచ్చారు. మానవజాతికి ఎన్నో విధాలుగా సేవచేశారు. లోకంలో చేయవలసిన పనిలో తమ భాగానికి కంటే ఎక్కువే చేశారు. ఈ నాటి ఒక ఉద్ధారక సభ్యునికి ఎప్పుడూ ఉన్నట్లుగానే మానవజాతి విముక్తి ఎడల మతసంబంధమైన భక్తిశ్రద్ధలలోని అంతరదృష్టి ఉన్నది. అయితే ఈ భక్తిని అతడు తానొక కృషి

కుడుగా ఉంటూ యథార్థమైన సేవ చెయ్యడంలో చూపిస్తాడు. అతడు ఉపాధ్యాయుడో, వైద్యుడో, నర్సో, వ్యావసాయిక నిపుణుడో లేక కూలీల నాయకుడో కావచ్చు. క్లెర్జిమన్‌గాకూడా (ఉద్ధారక సభ్యుల్లో ఈ క్లెర్జీలు ఇప్పుడు అల్పసంఖ్యాకులుగా ఉంటున్నారు.) అతడు మతబోధ చెయ్యడంలోకంటే "సహాయపడటం"లోనే ఎక్కువగా పనిచేస్తున్నాడు: అంటే క్రైస్తవేతరులుకూడా ఇది ఉపయోగకరమైనపని అని ఒప్పుకొనే మార్గాలలో అతడు జనులకు సేవ చేస్తున్నాడన్నమాట. ఈ విధంగా సంస్థారూపమైన మతం సిద్ధాంతంలోని తన ప్రచారానికి ఆవల ఆచరణలోకూడా ఈ సరిపోని లోకానికి తన ఉనికిని తాను సమర్థించుకొన్నది. ఏమంటే ఈనాడు మనుష్యజాతి కంతటికి ఆచరణలో విశ్వాసము కలిగి ఉండటాన్ని సాధనచేసే సంస్థలు లేవనే చెప్పాలి. అమెరికన్ జుడాయిజం మీదికి ఒక విపరీతమైన గొప్ప మార్పు వచ్చిపడింది. ఏమంటే ఉద్ధరణ సంఘాలలో నమ్మికలేకుండా స్థానికంగా లౌకికమార్గంలో సంఘసేవ చేస్తూ ఉండే జుడాయిజానికి ఇప్పుడు స్వదేశమైన ఇశ్రేల్ గప్పున కనిపించే ఉద్ధరణ రంగాలలో ఎదురైంది. యూధు జాతివారి అతిప్రాథమికమైన సర్వసాధారణమైన ఒక అవసరంగా దానికి ఒక లక్షణాన్నికల్పించే బలవత్తరమైన చిత్తవృత్తి ఏర్పడింది. అతివాదులైన జియానిష్టులలో "జుడాయిజం అంతటిని ఇశ్రేలుగా మార్చాలని" చేసే ప్రయత్నం ఎంత మృదువుగా చెప్పినా కలగనటమే అనాలి. ఏమంటే అమెరికన్ యూదులలోని అధికసంఖ్యాకులు నిశ్చయంగా తాము రెండు దేశాలఎడ విశ్వాసమే చూపుతారు. పారిభాషికంగా ఆగమార్థ విషయాలకు తప్ప తక్కిన విషయాల్లో వాళ్లు తాము నిష్కాసితులై వచ్చిన వాళ్ళమని అనుకోరు. అయితే వచ్చే మరి కొంతకాలంవరకు అమెరికన్, ఇశ్రేల్ నాయకులు పరస్పరము ఒకదేశానికి మరొకదేశం ఉద్ధరణ కార్యరంగంగా పరిగణింపవచ్చు.

## క్రైస్తవ ప్రపంచపు తీరుతెన్నులు

"విశ్వాసంలోను, క్రమంలోను" కంటే కృషిలోను సేవలోను సమైక్యాన్ని అభివృద్ధి చెయ్యడానికే అమెరికనులు ఎక్కువ ఆతురతపడుతున్నారన్నది యూరోపియన్ మతనాయకులలో అందరికి తెలిసిన సంగతి.

20వ శతాబ్దంలో ప్రొటెస్టెంట్ నాయకుల ఊహలకువచ్చి వాళ్ళ ప్రయత్నాలకు ఉత్తేజం కల్పించిన సాధారణ ప్రణాళిక ఏమంటే విశ్వాసం లోను, పూజావిధానంలోనూ ఉండే వైవిధ్యాన్ని స్వాతంత్ర్యాన్ని నిలుపుతూ అన్ని చర్చీల కృషిని సమన్వయపరచి సమైక్యం చెయ్యాలనేది. ఈ శతాబ్దపు తొలి సంవత్సరాలలో చర్చీల సమైక్యం కొరకు "తెగల వారీతనం" మీద ప్రయత్నపూర్వకమైన అభిశంసనం వచ్చింది. నిజానికి ముఖ్యమైన చాలా తెగలవారీ చర్చీలు ఏకమైనవి. అయితే అవి బల వత్తరమైన తెగలవారీ చర్చీలుగా ఏకమైనవి. విడివిడిగా ఉన్న చర్చీలు అక్కడక్కడ ఏకమౌతూవచ్చిన, సాంప్రదాయికంగా వస్తూ ఉండిన తమ వైలక్ష్యము చెడినప్పటికికూడ చారిత్రకంగా తమ ప్రత్యేక వ్యక్తిత్వాలను నిలుపుకొన్నవి. యునైటెడ్ స్టేట్సులో స్వతంత్రమైన మతసంస్థలు 250 కి పైగా మిగిలి ఉన్నవి. అయితే 54 చర్చీలుమాత్రమే తమకు 50,000 లకు పైబడిన సభ్యుల సంఖ్య ఉన్నట్లు తెల్పుతున్నవి. 14 చర్చీలకు మాత్రమే 1,000,000 కు పైబడిన సభ్యత్వమున్నది. ఈ సంస్థలు క్రమంగా ఇవి: రోమన్ కేథలిక్; మెథడిస్ట్; సదరన్ బాప్టిస్ట్; నేషనల్ బాప్టిస్ట్ కన్వెన్షన్; యు. ఎస్. ఎ.; నేషనల్ బాప్టిస్ట్ కన్ వెన్షన్ ఆఫ్ అమెరికా; ప్రిసిబిటీరియన్ చర్చ్ ఇన్ ది యు. ఎస్, ఎ.; ప్రొటెస్టెంట్ ఎపిస్కోపల్; యునైటెడ్ లూథరన్ చర్చి ఇన్ అమెరికా; ది సైపుల్స్ ఆఫ్ క్రైస్టు; నార్తరన్ బాప్టిస్టు కన్వెన్షన్; ఎవాంజిలికల్ లూథరన్ సినాడ్ అఫ్ ఒహియో అండ్ అదర్ స్టేట్సు; కాంగ్రెగేషనల్ క్రిస్టియన్; ఆఫ్రికన్ మెథడిస్టు ఎపిస్కోపల్; చర్చీ ఆఫ్ జీసస్ క్రైస్ట్ ఆఫ్ లాటర్ డే సైంట్స్. యునైటెడ్ స్టేట్సులోని యూధీయ ప్రార్థన సదస్సులలో 45 లక్షలమంది ఉన్నారు. ఈసంఖ్యలో బహుశః జుడాయిస్టులుకాని యూధులుకూడా ఉన్నారు.

క్రైస్తవవర్గాల నన్నిటిని ఒక్కటిగా సమైక్యపరచాలన్న ప్రయత్నం ఆచరణలో పరిత్యక్తమైనట్లే ముఖ్యంగా కెథాలిసిజం, ప్రొటెస్టాంటి సిజం, జుడాయిజంల మార్గాలు కొంచెమించుమించు చక్కగా పాదు కొన్నట్లే. ఈ మూడువర్గాలవారు మతం మార్చడానికి ప్రయత్నించ కుండా సహకార ప్రణాళికలమీది వ్యగ్రులై ఉన్నారు. ఇప్పుడు వీళ్లు ముఖ్యంగా సహకరించే ప్రధానవిషయ మేమంటే సరిపోని తనాలను

నిర్మూలించే ప్రయత్నం. అయితే "లౌకికతా సిద్ధాంత మార్గం" పెరుగుతుండగా దానితో పోరాడే వీళ్ళకు తమకందరికి ఆసక్తికరమై మరింత గుణమైన ప్రదేశాలు ఏర్పడుతున్నాయి.

ఈ మూడు పెద్ద మత వర్గాలలో ఒక్కొక్క దానిలోనూ సంస్థలను గట్టిచేసుకొనడంలో గమనింపదగిన ఫలాలు సాధించినట్లు కనబడుతుంది. యూధుల్లో ఆర్తోడాక్సు. కన్సర్వేటివ్, రిఫామ్ వర్గాలమధ్య అనూచానంగా ఉంటూ ఉన్న రేఖలు, ముఖ్యంగా నాజీలు పట్టి పాలార్చుచు యూధుల కందరికి సాధారణ మైన సమస్యలు కల్పించటం వల్లను. ఇస్రేల్ స్వదేశం సృజింప బడడం వల్లను, బలహీనం కావడానికి ఆరంభించినది. ఈ పరిస్థితులు అమెరికన్ జుడాయిజంలో రెండు రకాల జాతీయత త్వరితంగా పెరగటానికి దారితీసినవి: జాతికి సంబంధించిన చరిత్రాత్మకమైన మత విశ్వాసంగా ఇస్రేల్‌లోని మతానికి ప్రాధాన్యం; అమెరికాలో పుట్టిన అమెరికన్ యూధుల నాయకత్వానికి ప్రాధాన్యం; దీని వల్ల వీళ్ళు కన్సర్వేటివ్ వర్గం వాళ్ళ చేతుల్లో పడినప్పటికి ఇది అదే సమయంలో అమెరికాలోని దైవచింత గల యూధు జన సమాజానికంతటికి ఆచరణలో ఏకీకరణా ప్రాతిపదికగా ఉపకరించే ఒక రాజీమార్గాన్ని వెదకేటట్లు ఒత్తిడి తెచ్చింది. ఏమైనా ఈమధ్య అన్నివర్గాల రాజీలను సినెకాన్ కౌన్సిల్ ఆఫ్ అమెరికా అనే సంఘంగా ఏకం చెయ్యటానికి చేసిన ప్రయత్నం సఫలం కాలేదు. ఈ రాజీలు వీళ్ళ మూడు జాతీయ సంస్థలు దేశమంతట అలుముకొన్న సామాన్య యూధుల పలువిధములైన సంస్థలతో (అమెరికన్ జూయిష్ కాంగ్రెస్, ది అమెరికన్ జూయిష్ కమిటీ వంటివి) సంప్రదాయికమైన అవధులను దాటి తమకు అందరికి సామాన్యమైన అక్కఱలను తీర్చుకోవడానికి పరస్పరం సహకరించటం బహుశః మరింత గమనింపదగిన సంగతి.

రోమన్ కేథలిక్ చర్చి దిట్టమైన ఐక్యం కలదే ననుకోండి. అయినప్పుటికి అమెరికన్ కేథలిక్కులు మునుపు స్థానికంగాను లేక అంతర్జాతీయంగానూ నడుప బడుతున్న చర్చి కృషిని జాతీయ దృష్టితో ఎంతగానో కలిపివేశారు. ఈలాంటి సదుపాయ కారుల్లో చురుకుగా చాలా శక్తిమంతంగా పనిచేసేవాటిలో చాలా శాఖలున్న నేషనల్ కేథలిక్ వెల్‌ఫేర్

కాన్ఫరెన్సు. (1919లో సృజింపబడినది) ఒకటి. కానీ సాధారణంగా కొన్ని నిర్దిష్ట ప్రయోజనాలకుగాను ఏర్పడిన ఇలాంటి ఇతరములు, కేథలిక్ ఇంటర్ రేషియల్ కౌన్సిల్, ది కేథలిక్ అసోషియేషన్ ఫార్ ఇంటర్ నేషనల్ పీస్, దిఫెడరేషన్ ఆఫ్ కేథలిక్ కాలేజి స్టూడెంట్సు; దికేథలిక్ రూరల్ లైఫ్ కాన్ఫరెన్ సెస్, ది అసోషియేషన్ ఆఫ్ కేథలిక్ ట్రేడ్ యూనియనిస్ట్స్ వంటివి చాలా ఉన్నవి. ఇలాంటి సంస్థలు కేథలిక్కులు చేయవలసినపని విస్తరించిం దనడానికి అందులో పనిచేసేవాళ్ళు మరింతగా వృత్తిమార్గంలోకి వచ్చినా రనడానికి రుజువు చూపిస్తున్నవి.

కేథలిక్కు ఐకమత్యపు సరిహద్దులకు ఆవల చర్చి సంబంధం లేని మామూలు సాహచర్యాన్ని అభివృద్ధి చేసేందుకు రోమన్ కేథలిక్కులుచేసిన ప్రయత్నాలు అరగొరగానోలేదా నిరాశాజనకంగానో ఉన్నవని చెప్పాలి. థామిస్టుల లౌకికసిద్ధాంత తాత్వికుల మధ్య మేథా విషయకమైన సంబంధాలు (యూరప్‌లోకంటే తక్కువైనా) గమనింప తగినంతగా ఎక్కువైనవి. మొత్తంమీద లౌకిక వర్గాలతోగానీ జుడాయిజంతోగానీ స్నేహపూర్వకంగా వాద ప్రతివాదాలు జరుపుకోవడం కేదలిక్కులకు ప్రొటెస్ టెంట్లతోనో ఈస్టర్న ఆర్తడాక్స వర్గాలతోనో జరుపుకోవడం కంటె మరింత సులువు అయింది. ఏమంటే క్రైస్తుయోగ తనువులో సభ్యత్వమో దాని తోడి సంవాదమో ఇమిడి ఉండేటటువంటి ఒక రకమైన సాహచర్యాన్ని తోడిక్రైస్తవులలో వెదకాలన్న ఆకర్షణ ఒకటి ఎప్పుడూ ఉంటుంది. మరి చర్చీలలో వివిధమైన ఆచార సంప్రదాయాలు ఉంటున్నా ఇటువంటి సంవాదంలో ప్రవేశించడానికి కేథలిక్కు సిద్ధాంతంలో అడ్డు లేదు. కానీ చర్చిల్లోని ఆవైవిధ్యం "క్రీస్తు ఏర్పాటు చేసిన పూజావిధానం లోని సారభూత విషయం"లో మార్పు కల్గించకుండా ఉండాలి. మతంలోని "సార" మన్న ప్రశ్న వెంటనే సంస్కార యోగ్యత, దేవదూత అధికారము అనే సమస్య నంతటిని ఎత్తిపెడుతుంది. ఈసమస్య "ఐకమత్యము" అనదగిన దాన్ని అంతటిని అడ్డగిస్తుంది.

ప్రొటెస్ టెంట్ చర్చీలు ఈ మహాసమస్యనుచూసి పట్టుదలతో కృషినంతటిని ఏకం చెయ్యటానికి ప్రయత్నం చేసినవి. తెగలవారీ చర్చీల రకాలకు చెందని ప్రొటెస్ టెంట్ సంస్థలు చాలా ఉన్నవి. ది వై. యం. సి. ఎ, ది వై. డబ్ల్యు. సి. ఎ., విద్యార్థి వలంటీర్ ఉద్యమము, సన్ డే

స్కూల్ యూనియన్, క్రిష్టియన్ ఎండివర్ మూవ్‌మేంట్, డబ్ల్యు. సి. టి. యు. వంటి సంస్థలు ఇవి. ఇవి ఈ శతాబ్దానికి ముందునుంచి ఉంటున్నవి. తెగలవారీ చర్చిలు పరస్పరము ఆధికారికంగా సమాఖ్యలు కావడానికి ఎంతగానో దారి ఏర్పరచినవి. ఉద్ధరణసంఘాలు మతవిద్యా పరిషత్తులు అయిన పైచెప్పబడిన సంస్థలు సమాఖ్యారూపకమైన కృషిని అభివృద్ధి చెయ్యడంలో నాయకత్వం వహించినవి. రెండురకాలైన స్థానిక ఏకీకరణము కూడ చాల పలుకుబడిని సంపాధించినవి: (1) నగర సంబధమైన అథవా రాష్ట్రవ్యాపకమైనచర్చి సమాఖ్యలు: (2) తెగలవారీ చర్చిలు కానివో లేదా పరస్పర సంబధంగల తెగలవారీ చర్చిలో అయిన కమ్యూనిటీ చర్చిలు.

సహకారానికి దేశవ్యాప్తమైన ఉద్యమం 1908లో ది ఫెడరల్ కౌన్సిల్ ఆఫ్ ది చర్చెస్ ఆఫ్ క్రైస్ట్ ఇన్ అమెరికా అనేదాని నిర్మాణంతో రూపు దాల్చింది. ఈ పరిషత్తు క్రమంగా పరిమాణంలోనూ, చేసే పనియొక్క విస్తృతిలోనూ, అధికారంలోనూ పెరిగింది. ప్రాటెస్‌టెంట్ చర్చిల్లోని సభ్యత్వంలో 75%(శాతానికి)కు ఇది ప్రాతినిధ్యం వహించింది. 1950లో నేషనల్ కౌన్సిల్ ఆఫ్ చర్చెస్‌గా విస్తరిల్లిన తర్వాత ఇప్పుడు కొంచె మించుమించు ప్రాటెస్‌టాంటిజంను పూర్తిగా తనలో కలుపుకొన్నది.

మొదటి ప్రపంచ యుద్ధకాలము పారిశ్రామిక సంబంధాలను దిద్దడానికి చేసిన ప్రయత్నాలు కల్లోలంగానూ ఎంతో ప్రయోగాత్మకంగానూ ఉండేవి కానీ 1913లో తన మొదటి 2దశాబ్దాల అనుభవ ప్రాతిపదికనను సరించి ఫెడరల్ కౌన్సిల్ తన కార్యకలాపాలను మరింతచక్కగా ఏకం చెయ్యడానికి తన బాధ్యతలను స్పష్టంగా ఏర్పరచు కోవడానికిగాను తన నియమావళిని చక్కదిద్ది పునరాలోచించుకొన్నది. స్థానికమైన సమాఖ్యల నుండి విడిపోయి అది తెగలవారీచర్చిల అభిప్రాయాలకు, విధానాలకు తాను అధికారికంగా "ప్రాతినిధ్యం వహిస్తానని" చెప్పడం మానుకొని సభ్యత్వంగల తెగలవారీ చర్చీల స్వతంత్రమైన నడవడికను కాపాడింది. అదే సమయంలో తన కమీషన్‌లకు మరింత స్థిరత, నిర్దిష్టత కల్పించింది. నిపుణులైన ఉద్యోగుల సంఖ్యను పెంచుకొన్నది. సాంఘికమైన కృషి ఉద్ధరణసంఘాలు మొదలైన వాటికి చెందిన ఎన్నోరకాల విచారణలు

జరపడమేగాక ఈ సహకార అంగాలు సాధించిన ఒక గొప్ప విషయమే మంటే చర్చిల్లో కలిసి కట్టుతనానికి కావలసిన సూత్రాలను వివరంగా తయారు చెయ్యటం.

1938 నాటికి ఏటా ఫెడరల్ కౌన్సిల్‌కు 2, 50, 000 డాలర్ల ఆయ వ్యయాలు ఉండేవి, ఇందులో నాల్గింట ఒకపాలు సభ్యులనుండి సూటిగా వచ్చేవి. మిగిలింది నిర్దిష్టకార్యాలకు పలుచోట్లనుండిసంపాదింప బడేది. దానికి సంబంధించిన చురుకైన కమిటీలు లేదా వాళ్ళు అన్నట్లుగా కమీషన్‌లు ఇవి: చర్చిల పరిషత్తులకు సంబంధించినది, ఎవాంజిలిజం లైఫ్‌సర్వీసులకు సంబంధించినది, సంఘ సేవకు సంబంధించినది, అంతర్జాతీయ న్యాయ సుహృద్భావాలకు సంబంధించినది, జాతి సంబంధాలకు సంబంధించినది. సెలవ రెన్సుకు సంబంధించినది, క్రైస్తవవిద్యకు సంబధించినది. ముఖ్యంగా ఎఫ్. అర్నెష్ట్ జాన్‌సన్ నాయకత్వం క్రింద విద్యా. పరిశోధనశాఖ చురుగ్గా పనిచేసేది. 1941లో ఫెడరల్ కౌన్సిల్ కొంత మినహాయింపులతో, హోం మిషన్సు, కౌన్సిల్ ఫారిన్ మిషన్సు కాన్ఫరెన్సు, మిషనరీ ఎజుకేషన్ మూవ్‌మెంట్, నేషనల్ కౌన్సిల్ ఆఫ్ చర్చ్‌ఉమెన్, యునైటెడ్ స్టువర్డ్ షిప్ కౌన్సిల్, ఇంటర్ నేషనల్ కౌన్సిల్ ఆఫ్ రెలిజియస్ ఎజుకేషన్ అనే సంస్థలతో చేరిపోవడంవల్ల దీనిపని విపరీతంగా పెరిగిపోయింది. పది సంత్సరాలు తీవ్రంగా ఈ ఎనిమిది పరస్పరము తెగలవారీ చర్చిల ఏజె న్సీలతో గాఢంగా సహకరించిన తర్వాత ఈ కలయిక క్లీవ్‌లాండ్‌లో 1950 వ సంవత్సరం నవంబర్ 28 న నేషనల్ కౌన్సిల్ ఆఫ్ చర్చెస్ ఆఫ్ క్రైస్ట్. స్థాపనకు దారి తీసింది. (ఎగ్జిబిట్ ఎ. చూడు). ఈ పరిషత్తు కృషి అంతా నాలుగు విభాగాలుగ ఏర్పరుపబడింది. జీవితము—కృషి (మునుపటి ఫెడరల్ కౌన్సిల్), దేశాంతరోద్ధరణ సంఘాలు, దేశంలోని ఉద్ధరణ సంఘాలు, క్రైస్తవ విద్య.

ప్రాటెస్‌టెంట్లలో క్రైస్తవ ప్రపంచోద్యమ పెరుగుదల, "క్రీజండం పునస్సమాగమం."ను తెచ్చేందుకు ఉద్దేశించ బడిన అంతర్జాతీయ సభల పరంపర, అమెరికాలోని.బహువిధములైన మతసంస్థలను అడుగునుండి చెడ గొట్టినవని వ్యాఖ్యానించరాదు. కొన్నిచోట్ల కలయికలు జగిరినాసాధారణ మైన తెగలవారీ చర్చిల నిర్మాణం మునుపటికంటె బలంగానే ఉంది. వర్గతత్వాన్ని దుయ్యబట్టడంవల్ల స్నేహ సంబంధాలు ఎక్కువై ఉండ

వచ్చును కాని అమెరికన్ మతసంస్థల్లో తెగలవారీ చర్చిలే మూలభూత ములుగా నిలిచి ఉన్నవి. అందుచేత ఐకమత్యావశ్యకతను గురించి పట్టు పట్టినట్లు మాట్లాడే చర్చీలుకూడా మన మత సంబంధమైన బహుధాత్వంలో నిజంగా మరొక చిక్కును మాత్రమే తెచ్చి పెడుతున్నాయి. ఈ సన్ని వేశాన్ని డన్‌స్ప్రెరీ చక్కగా చెప్పాడు: మన అమెరికన్ తెగలవారీ చర్చ్‌లకు అధికారంతో తాదాగా చెప్పేనోరుగానీ గట్టిగా అభిప్రాయ భేదం చెప్పేనోరుగానీ లేకుండా పోయింది. తన స్వకీయమైన సూక్ష్మ దృష్టిలోని సత్యాన్ని పోగొట్టుకోకుండా ప్రతి చర్చివాడు అవతలి భాగం లోని అవతలివాళ్ళ అభిప్రాయాన్ని ఎంతవరకు ఒప్పుకోవలెనో అంతవరకు ఒప్పుకొనేందుకు ఇష్టపడాలి. ఆచరణలో వచ్చేచిక్కు ఏమంటే ప్రభుత్వ సాహ్యాన్ని తమ విశ్వాసాలకు విరుద్ధంగా మార్చినా అనుకోకుండా ఈ పని చెయ్యగలవాళ్ళు లేరు......హుషారుగా ఏమీ పట్టించుకోకుండా ఉంటే వచ్చే లాభమేమీలేదు. మన ఈ తెగలవారీ చర్చ్‌లు, మన సమగ్ర మైన మత జీవనానికి కావలసిన చర్చి తెగపద్ధతికి విరుద్ధంగా ఏర్పడి వుండడం వల్ల అమెరికా ఈ సమస్యను చెప్పడానికి సంపూర్ణమైన సర్వ స్వతంత్రమైన అవకాశాన్నిచ్చింది.16".

ఐనా డన్‌స్ప్రెరీ చెప్పే "అమెరికన్ తెగలవారీ చర్చ్‌విధానం" ప్రాతి పదికగా పెద్దపెద్ద మతసంస్థలు తాముజీవిస్తూ వేరేవాటిని బ్రతుకనిస్తావా అనేది ఇంకా వేచి చూడవలసిన విషయం. ప్రొటెస్టెంట్ల క్రైస్తవప్రపంచ సిద్ధాంతం కేథలిక్ సిద్ధాంతానికి సవాలన్న సంగతి రహస్యమేమీ కాదు క్రైస్తవ మతంలోని ఈ రెండు రెక్కమధ్యల ఉద్రిక్తత తమతమ ఐకమత్యం లోని బలం తెలసినకొద్దీ పెరుగుతున్నది. మతసంస్థలన్నీ కమ్యూనిస్టుల నాస్తికత్వాన్ని ఉదార లౌకిక సిద్ధాంతాన్ని ఎదుర్కోడంలో కలిసినంత కాలం తమతమ మత సంబంధమైన భేదాలను లోకువచేసి ధార్మికత్వ శక్తులకు ప్రాతినిధ్యం వహిస్తున్నట్లు కనబడవచ్చు. అయితే యునైటెడ్ స్టేట్సులో మరల మతసంబంధమైనపోరాటాలు రావటం ఫౌండింగ్‌ఫాదర్స్ దినాల్లో వచ్చినట్లుగానే స్వాతంత్ర్యం, సమానత్వం, సౌభ్రాత్రం, లౌకిక రూపంగా కావాలనే ఒకవిజ్ఞప్తి మళ్ళారావటం అనేవి సాధ్యమే. (సంభావ్యంకాదు)

ఇది ఇట్లుండగా క్రైస్తవ ప్రపంచ భావుకులకు ప్రొటెస్టెంట్లు, రోమన్ కేథలిక్కులు వర్గ తత్వాన్నిగాని లేదా పొల్లుపోకుండా అనుసరించే మార్గాన్నిగానీ అలవాటు చేసుకోకుండా మత సంబంధమైన విభేదాలను అంగీకరించే టట్లుగా ఉన్నారు. ప్రొటెస్టాంటిజం ఇప్పుడు భావంలోనూ సిద్ధాంతంలోనూ ప్రొటెస్టెంటు తత్వానికంటెను కేథలిక్కు సిద్ధాంతానికి విరుద్ధంగా ఉండటం కంటెను ఉన్నంతగా ఉంది. అందరికి సంబంధించిన బహిరంగ సమస్యల విషయంలో కలిసికట్టుగా పనిచేయవలసిన అవసరం ఉందని తెలుసుకొన్నవి. ఈ విషయంలో ఇది రోమన్ కేథలిక్ చర్చిల అధికార పద్ధతినే అనుసరిస్తూ పోరాడుతున్నది. ప్రొటెస్టెంట్ చర్చిలకు కలసిపోవడానికి రెండు ప్రోత్సాహ కారణాలున్నవి. అమెరికన్ జీవితంలో ఒకమత సంప్రదాయంగా తమకున్న అధికసంఖ్యాకుల హోదాను కాపాడుకొవాలన్న పట్టుదల ఉంది. అందుచేత చక్కగా కలిసిపోయిన ఒక అల్ప సంఖ్యాకవర్గం "పబ్లిక్ మర్యాద," లైంగికమైననీతి, అంతర్జాతీయ సంబంధాలు, కార్మికోద్యమాలు, సాధారణమైన రాజకీయాలు మొదలైన విషయాలకు సంబంధించి అధికారికమైన పాత్రను నిర్వహించ నీయడం తనకు కష్టం. తాము సురక్షితంగా ఉంటే అందరూ కలసి కట్టుగా కనిపించాలని కోరకపోవచ్చును. కానీ లౌకికంగానో చర్చి సంబంధంగానో పెరుగుతున్న వ్యతిరేకతతో అంతాకలిసి ఒకరికొకరు ఆసరా కావలసిన అగత్యాన్ని గమనిస్తున్నారు ఈ విధంగా తక్కినఅన్ని సంస్థల్లాగానే ఈ చర్చిల సమాఖ్య కూడ బెదరు, ధైర్యము, కృషి కలిసిపోయిన సంస్థ. కృషికి సంబంధించిన కార్యక్రమమే దీని తొలినాళ్ళ జీవితంలో ప్రధానంగా ఉండేది. అయితే వ్యతిరేకతకు సంబంధించిన కార్యక్రమం తప్పని సరియై ఎక్కువౌతున్నట్లు కనబడుతుంది.

క్రైస్తవ ప్రపంచ భావసిద్ధాంత సభ్యత్వానికి ఒప్పుకో నటువంటి కొన్ని వర్గీయ సనాతన చర్చిలకు కూడా ఒకవిధమైన కలిసికట్టుగుణం కమ్ముకొని వచ్చిందని మనం గమనించాలి. ఇటువంటి అంతర్వర్గీయ చర్చిల సాధన సంస్థలలో అమెరికన్ కౌన్సిల్ ఆఫ్ క్రిష్టియన్ చర్చెస్ అనేది ప్రముఖమైనది. దీనిని ఫెడరల్ కౌన్సిల్ ఆఫ్ చర్చెస్ వారియొక్కయు కాలేజి విధార్థులమధ్య సనాతన సిద్ధాంత సంస్థగ ఏర్పరచిన ఇంటర్ -

వర్సిటి - ఫెలోషిప్ అనే సారి యొక్కయు "ఆధునికమైన సామ్యవాద సంబంధమైన ప్రభావాన్ని అరికట్టడానికి" 1941లో స్థాపించారు.

## మత వార్తా పత్రికలు

1900 నాడు ఉండిన "మత వాఙ్మయా" నికి (ముఖ్యంగా నవ్యవధికంగా వచ్చే పత్రికా వాఙ్మయము) ఈనాడు ఉన్నవానికి మధ్యనున్న తేడా కంటే మతంలో వచ్చిన మార్పును కొట్టవచ్చినట్లుగా చూపించేది మరొకటి లేదు. క్రమంగా మత సంబంధమైనమాగజీనులవ్యాప్తి ఎక్కువౌతూ వచ్చినా, లౌకికమైన మేగజీనుల పెరుగ దలతో పోల్చి చూస్తే ఆ విధగా వీని వ్యాప్తి తగ్గిందని చెప్పాలి 17. ప్రొఫెసర్ ఏ. మాక్ క్లంగ్ లీ అనే ఒక పరిశోధకుడు "మత వార్తా పత్రికల ప్రభావము నూరేండ్ల నాడు ఉన్నట్లుగా అమెరికాలోని పాఠక వర్గంలో మూడింట నాల్గువంతు లకు అందుబాటుగా ఉండటం పోయి—అచ్చువేసే కాపీల సంఖ్యను బట్టి—ఇప్పుడు లౌకికమైన దిన పత్రికల ప్రభావములో ఏ పదింట ఒక భాగము గానో ఉండవచ్చు 18." నని అంచనా వేశాడు. సాపేక్ష దృష్టికి పరిమాణంలో తగ్గిపోయిన మత వాఙ్మయము కంటె మరింత గమనింప దగింది మత సంబంధమైన ప్రచురణలు ఎంత మాత్రము విప్లావితంగా మారిపోయినవి అనేది. మెథడిస్టుల క్రిస్టియన్ అడ్వకేట్ (340,000 కాపీలు ప్రచారముగల విస్తృతమైన ప్రాటెస్టెంటు వార పత్రిక), క్రిస్టియన్ హెరాల్డ్ (కొంచెం ఇంచు మించుగా అదేసైజు) అనే పత్రికలో 1900 నాడు వాటిలో ఉండిన దానికంటె కనీసం మూడు రెట్లు లౌకికవార్తలు ఉంటున్నది. ఎక్స్టెనన్షన్ అనే ప్రముఖమైన కాథలిక్ మాసపత్రిక (434,000 నెలకు) ప్రొఫెసర్ లీ మాటలలో "తయారీలోనూ లోపలి విషయములోను సాటర్ డే ఈవినింగ్ పోస్ట్ అనే లౌకిక వార్తాపత్రికను పోలి ఉంటుంది. 19" కామన్ వీల్, అమెరికా, ది క్రిస్టియన్ సెంచరీ, క్రిస్టియానిటి యండ్ సొసైటి అనే ప్రచురణలుమరింత గప్పున కనబడుతాయి. వీటిని మత సంబంధమైన వర్గాల వాళ్ళు రాజకీయ సాంఘిక వార్తల కొరకు, వ్యాఖ్యానాలకొరకు విశేషంగా చదువుతారు. పత్రికారచనలో

గొప్ప స్థాయి తెచ్చిపెట్టిన క్రిస్టియన్ సైన్సు మానిటర్ పత్రిక అన్నిటికంటె ముందు కనబడుతుంది క్లుప్తంగా చెప్పుతే లోక విషయాలను చర్చిస్తూ--మతదృష్టితోనే కావచ్చు---లౌకికమైని సవ్యావధిక వార్తా పత్రికలతో చురుకుగా పోటీచేస్తున్న పత్రికలు పత్రికా రచయితలు చర్చిలకు ఉన్నారు. కానీ 50 ఏండ్ల నాటి మత వార్తా పత్రికలలో ముఃఖ్యంగా ఉంటూ ఉండిన "ఉదాత్తము, భక్తిపూరితము, బోధకళాత్మకము, మత గ్రంధ వివరణాత్మకము అయిన వాఙ్మయము మీది ఆసక్తి వారికంటె భిన్నులయిన వాళ్ళకె ఇవి ఇప్పుడు బాగుంటాయి. ఆసక్తిలోని ఈమార్పు మతోద్యోగుల నుండి మామూలు మనుష్యుల మీదికి దృష్టిమారటం కాదు. ఎందుకంటే ఈ మార్పు జరగడంలో మతోద్యోగులు తామే ముందుకు వచ్చి నడిపించారు.

## మత సంబంధమైన లాబీలు

రాజకీయమైన పలుకుబడికి ఒత్తిడి గుంపుగా ఏర్పాటు చేసుకోకపోతే ప్రజాస్వామ్య రాజకియాలలో అమెరికన్ ప్రజల మతంలోని స్వార్థ పూరితమైన శ్రద్ధ నిరుపయోగం అవుతుందని వేరే చెప్పనక్కరలేదు. బహిరంగ విచారణలో బహిరంగంగ వెలిబుచ్చి చెప్పడం ఇమిడిఉంది దీనిలో మళ్ళా మిగిలిన హక్కుదారులలో పోటీ పడటానికి శక్తిగల వాళ్ళందరు పోటీచెయ్యడం కూడా ఇమిడి ఉంది. గడచిన 30 సంవత్సరాలలో మత సంస్థలు జాతీయమైన ఒత్తిడి గుంపులుగా ముందడుగు వెయ్యడం బాగా జరిగింది. నిర్దిష్ట ప్రయోజనాలకు ఏర్పడిన మత సంబంధమైన సమాజాలు 100 ఏండ్లకు పైబడి ఉంటూఉన్నవి. చర్చి సంబంధికులు శాసన నిర్మాణం ప్రవేశ పెట్టడానికి చేసిన తొలి ప్రయత్నాలలో బానిసత్వానికి విరుద్ధంగా జరిపిన పోరాటాలు, టెంపరెన్సు లీగులు, శాంతి సంఘాలు ఉన్నవి. అయితే ఈ మధ్య రెండు ముఖ్యమైన పనులు పెట్టుకొని నిలుకడైన లాబీవర్గాలు అభివృద్ధి అయినాయి: మతసంస్థల చట్టబద్ధమైన హక్కులను కాపాడి వాటిని అభివృద్ధి చెయ్యడం. చర్చి సభ్యుల లక్ష్యాలను అంతరాత్మకులను స్పృశించే శాసన సంబంధమైన ప్రయత్నాలకు మతసంబంధికుల ఆమోదాన్ని అందివ్వడం, అంతరాత్మ ఒప్పుకోదని ఆక్షేపించే

వారికి సహాయపడే సంఘాలు, ప్రచురణకు సంబంధించిన క్రిష్టియన్ సైన్సు కమిటీ, అనేకమైన యూదు పరిషత్తులు, దేశాంతరోద్ధరణ సంఘాలలోని కమిటీలు, చర్చిప్రభుత్వం విభక్తంగా ఉండాలని కోరే ప్రాటెస్ టెంట్లు, మిగిలిన అమెరికన్లు కలిసిన సంఘం మొదలైన ప్రత్యేకవర్గాల హక్కులను పరిరక్షించడం మాత్రమే తమ పనిగా పెట్టుకొని ఉన్న కార్యాలయాలు మొదటి రకానికి చెందినవి. అనేక విధాలయిన సాంఘిక సమస్యలమీద జరిగే శాసన నిర్మాణంమీద పలుకుబడి చూపించడానికి ఏర్పడిన సాధారణమైన సాధన సంఘాలు రెండో రకానికి చెందినవి, 20 వ; శతాబ్దంలో పుట్టినవిగా వీనినిక్కడ ప్రత్యేక శ్రద్ధతో చూడాలి.

నేషనల్ కేథలిక్ వెల్ ఫేర్ కాన్ఫరెన్సు మొట్ట మొదటి పెద్దలాబీని ఏర్పరచింది. ఇది 1920 తొలినాళ్ళలో నేషనల్ కేథలిక్ వార్ కౌన్సిల్ (1917—1919) యొక్క కృషిని అనుసరిస్తూ పనిచెయ్య నారంభించింది. మొదటి ప్రపంచ యుద్ధానికి సంబంధించిన కార్య కలాపాలు. ప్రాతదైన నేషనల్ కాన్ఫరెన్సు ఆఫ్ కేథలిక్ చారిటీస్‌తో సహకరించటం మాత్రమే ఈ రెండవ సంఘం యొక్క పరిమిత ప్రయోజనాలుగా ఉండినది. నేషనల్ కేథలిక్ వెల్ ఫేర్ కాన్ఫరెన్సులోని న్యాయశాఖ మాత్రమే కాకుండా తక్కిన శాఖలన్నీ కూడ రాజకీయమైన పనులు చెయ్యడానికి ఏర్పాటు చెయ్య బడినవే. వాషింగ్ టన్ లోని తమ 250 మంది ఉద్యోగులతో ఈ కాన్ఫరెన్సును అధికారంతో నడిపించే బిషప్పులు కావలసిన చోట అంతా వెంటనే సక్రమంగా శాసన సంబంధమైన ఒత్తిడి తెచ్చేందుకు సాధ్యంగా చేస్తున్నది.

కేథలిక్కులు సాంఘికంగా పనిచెయ్యటానికి ఏర్పాట్లు చేస్తున్న సమయంలో మెథడిష్టులు వాషింగ్ టన్ లోని తమ బోర్డు ఆఫ్ టెంపరెన్సు కార్యాలయ కార్యకలాపాలను విస్తృతం చేస్తున్నారు. ఈ బోర్డు పదునెనిమిదవ సవరణ కొరకైన ప్రచారాన్ని "నైతిక సూత్రాలను బహిరంగంగా ఉల్లంఘించటాన్ని వ్యతిరేకించే అభిప్రాయాన్ని గట్టి పడజేసే" ఒక సామాన్యమైన ప్రయత్నంగా త్రిప్పింది. ఇప్పుడు దీనికి 25 మందికి పైగా ఉద్యోగులు ఉన్నారు. వాషింగ్ టన్‌లోని మెథడిష్ట్ ఫారిన్

మిషన్సు బోర్డు కార్యాలయం ఉద్యోగులతో వీరు సహకరిస్తారు: వీరంతా కలిసి "కాముకము, చెడిపేది అయిన సాహిత్యాన్ని అధమమైన వినోదాలను, లాటరీలను ఇతర రకాలైన జూదాలను" అణచడానికీ, అంతర్జాతీయ సంబంధాలలో క్రైస్తవగుణ స్పర్శను ఎక్కువ చెయ్యటానికి, సాధారణంగా సమష్టిగా నీతి నియమాలను అభివృద్ధి చెయ్యడానికి, చురుకుగా పనిచెయ్య చూస్తారు.

ముఖ్యమైన అంతర్వర్గీయ ప్రొటెస్టెంట్ ఏజన్సీ 1945లో ఫెడరల్ కౌన్సిల్ ఆఫ్ చర్చెస్‌వారు వాషింగ్‌టన్‌లో స్థాపించిన కార్యాలయం. ఇది ఇప్పుడు అనామతులో ఉన్న శాసనాలను గురించీ, "వాషింగ్‌టన్‌లో ఎవరిని ఏలాగా కలుసుకోవా లనేదాన్ని గురించి" నేషనల్ కౌన్సిల్‌కు నివేదిస్తుంది. ప్రొఫెసర్ ఈబర్‌సోల్ సంగ్రహంగా చెప్పిన దాని ప్రకారం,

కౌన్సిలో అథవా దాని నిర్వాహక సంఘమో 1944 మార్చి నుండి 1948 మార్చిలోగా 80 కిపైగా తీర్మానాలు ప్రకటనలు ఆమోదించాయి. ఈ ప్రకటనలు పలువిధములైన విషయాలకు సంబంధించినవి. ఇందులో వ్యాపారపు ఒప్పందాలు, చర్చి ప్రభుత్వాల విభజన, ఆత్యంతిక దేశాంతర సహాయం యుద్ధఖైదీలు జపాన్‌లోని అమెరికన్లకు రావలసిన డబ్బు చెల్లించటం ఆదాయపు పన్ను నిర్వాసితులైన వక్తులు, గ్రీస్ టర్కీ దేశాలకు సహాయం, అందరికి పనులు, విద్యకు, పౌర హక్కులకు, మత సంస్థల గణనకు, బ్రెట్టన్ వనాలకు, ఆహారానికి, వ్యవసాయానికి, యునైటెడ్ నేషన్సు మొదలైన వాటికి ఫెడరల్ ప్రభుత్వ సహాయం వంటివి అన్నీ ఇందులో ఉంటాయి. 20

ప్రొటెస్టెంట్లలో స్పర్ధవహించి మాట్లాడేవి నేషనల్ చర్చి లీగ్ ఆఫ్ అమెరికా, ది నేషనల్ అసోషియేషన్ ఆఫ్ ఎవాంజిలికల్స్, అమెరికన్ కౌన్సిల్ ఆఫ్ క్రిష్టియన్ చర్చెస్ అనే సనాతన సిద్ధాంత సంస్థ.

మత సంబంధమైన లాబీలు తరచు లౌకికమైన లాబీలతో సహకరించి కలిసి అందరికి సంబంధించిన విషయాలను సాధిస్తారు. శాసన నిర్మాణం మీద పలుకుబడి చూపడానికి సాధారణంగా లాబీవర్గాలు వాడే అన్ని పదతులను వీళ్ళుకూడా వాడుతారు,

## సారాంశము

మన శతాబ్దపు తొలి సగంలో మత జీవనము మత సంబంధమైన కృషి ఎంతవరకు క్రమ నిర్మితమైనదో లేదా సంస్థారూపంగా వెలసిందో సూచించ డానికి కావలసిన దానికంటే బహుశః ఎక్కువే చెప్పబడింది. ఈపరిశీలన సూచించే ముఖ్యమైన సార్వత్రిక వ్యాప్తిగల అంశాలను మనమిప్పుడు సారాంశ రూపంగా చెప్పుకోవచ్చు.

(1) మతం, దానిలో ఏ యితర గుణాలు ఉన్నాసరే, అమెరికాలోని గొప్ప వ్యాపారాల్లో ఒకటి. శాస్త్రీయంగా అది లాభాల ఆశ లేని వ్యాపారం—లోకోపకారకం. అయితే ఇందులో ఎంతో మూలధనం పెట్టు బడిగా ఉంది. ఉద్యోగ నిర్వహణకు ఎందరో కృషిచేస్తున్నారు. వీరు ఉపయోగకరంగా ఉన్నారని సాధారణంగా అందరు గుర్తిస్తారు. ఎన్నో లౌకిక సంస్థలకు సమాంతరంగా పనిచేస్తారు. శాస్త్రీయంగా శిక్షణపొంది వృత్తిగా స్వీకరించినవారే ఈ ఉద్యోగాలు నిర్వహిస్తారు. వీరిలో అధిక సంఖ్యాకులు మామూలు మనుష్యులే. మతానికి విస్తృతమైన సొంత ఆస్తులు ఉన్నాయి. వ్యవహార దృష్టితో వీటిని పాలించు కోవటానికి క్రమ ప్రయత్నం జరుగుతున్నది:

(౨) మత సంస్థలమధ్య పోటీ అనేది మునుపెప్పుడో ఉండినది కాక పోయినా ఈ మత సంబంధమైన కార్య కలాపాల మొదటి లక్ష్యాలు మతాల మీదికి మళ్ళింప బడలేదు. లౌకికమైన చెడుగులను సాంఘిక సమస్యలను పోగొట్టేందుకు మళ్ళింప బడినవి. అంటే చర్చీల సమష్టి పూజా విధానానికి సాధన సంస్థలు మాత్రమే, కాదన్నమాట. అవి పని చేస్తున్నవి. లౌకికమైన అర్థంలోనే పనిచేస్తున్నవి. ఇటువంటి పనిని చర్చీలు ముఖ్యంగా మతానికి సంబంధించిన కృషిగా భావిస్తాయి. ఇంకొక రకంగా చెప్పితే సంస్థ రూపంగా ఉన్న ఈ రకమైన మతం మతాల మతానికి వ్యతిరేకమైనది. ఎవరైతే దైవ చింతనతో ప్రత్యేకమైన పవిత్ర జీవి తాన్ని గడపదలచుకుంటారో వాళ్ళకు దట్టమైన ఈ లౌకికవ్యా వృత్తుల మధ్యనే ఆ జీవితం గడపమని వాళ్ళను ఇది ఒత్తిడి చేస్తున్నది: ఇటువంటి మతాన్ని లోకంనుండి వెనక్కి మళ్ళే మతమని తప్పించు కోవటానికి వేసే ఎత్తుగడఅనీ, పసితనపు ప్రవర్తనఅనీ, లేదా ఏదో మత్తు పదార్థం

వంటిదని గానీ వ్యాఖ్యానించటానికి అవకాశమే లేదు. ఇది ఎన్నో కోట్ల మందికి పని పెట్టుతున్నది. ఇటువంటి వ్యావృత్తిలో ఎప్పుడూ కొంతవరకు అనవసర ప్రమేయం నిష్ఫలమైన నడక ఊహాగానం వంటివి ఉన్నా తక్కిన రకాలైన వ్యాపారంలో కంటే మతంలో ఏమీ అంత కంటే ఎక్కువ వ్యర్థమైన కార్య కలాపాలు ఉన్నట్లు కనబడదు.

(3) మతం వ్యాపన శీలమైన సంస్థ. విద్య, వైద్యం, రాజకీయాలు, వ్యాపారం, కళ, అనేవాటితో ఇది కలసి పోతుంది. దీనికి అందనిది తెలియనిది ఏదీలేదు. చర్చీలు "దూరంగా ఉండాలని" చెప్పుతూ కొన్ని జీవన రంగాలకు కంచె వెయ్యడానికి చేసిన ప్రయత్నాలు ప్రభుత్వాన్ని, విజ్ఞాన శాస్త్రాన్ని తగ్గించడానికి చేసిన ప్రయత్నాలవలె విఫలమై పోయినవి. మత సంబంధంగా ఏదైనా చెయ్యవచ్చు. చర్చి సంబంధికుల స్పర్శ తప్పించు కోవడం దేనికీ సాధ్యంకాదు. ఆత్మ విమోచనం ఒక నిర్దిష్ట మైన, ప్రత్యేకమైన వ్యాసృత్తిగా ఉన్నరోజులు పోయినవి. చర్చి, ప్రభుత్వాల విభజన మత రాజకీయాలను వేరు చెయ్యలేదు. పాఠశాల, నాటకశాల వేరైనంత మాత్రాన విద్య, కళ ఎంతమాత్రం వేరుపడినవో అంతే ఇవికూడా వేరుపడినవి. ఊహించిన ఒక చర్యనుగాని ఒక భావాన్ని గాని ఒకప్రత్యేక సన్నివేశంలో శిక్షణలో పెట్టిచూచే కొన్ని సంస్థలు న్నవి. అందులో మతము, ప్రభుత్వము, విద్య, కళ, అనేవి కొన్ని. ఇటువంటి వ్యాపన శీలమైన సంస్థలు ఒక సంస్థకు పునాదుల పద్ధతులై జీవితానికి "నాగరిక" మని చెప్పబడే స్వరూపాన్ని ఇస్తున్నవి. ఇతర సంస్థలు జీవితాన్ని "పాక్షికంగా" గ్రహిస్తే మతం తాను జీవితాన్ని "సమగ్రంగా" గ్రహిస్తానని తరచు చెప్పుతుంది దీన్ని సందేహించవచ్చు. అయితే మతం ప్రభుత్వం లాగా మొన్నమొన్న గడచిన దినాలకంటే ఎక్కువగానే ఇప్పుడు జీవితా న్నంతటిని ప్రభావితం చెయ్యడమో చెయ్య డానికి ప్రయత్నించడమో చేస్తున్నవి. భక్తులైనవాళ్ళు కోరేటంత మతం మన నాగరికతలో కేంద్రంగా లేదనేది వాస్తవమేకానీ అది అన్ని తరగతులవారినీ చేరిమనకు ఆసక్తిగల అన్ని విషయాలను, కళలను ప్రభావితం చేస్తూ వ్యాపనశీలంగా ఉంటున్నది.

# నైతిక పునర్నిర్మాణము

## మతసంబంధమైన అంతరాత్మ పనిచేయుట

మత సంబధముగా అమెరికా అంతస్సులో వచ్చిన మూలభూతమైన మార్పులను పరిశీలించుటకు ముందు మతసంస్థలు తమ నైతికాధికారము నెఱపు పద్ధతులలో వచ్చిన మార్పులను ఆలోచింతము. 1900 లో కూడ నిలచి ఉండిన సాంప్రదాయికమైన పద్ధతులు గృహ, మతాధికారుల సన్నిహిత సహకారముపై ఆధారపడి యుండి శిశువునకు, "మంచి చెడ్డలను గూర్చిన తెలివి" ని స్పష్టముగ గలిగించుట మత సంబంధమైన ఆదేశాలను భావమునకు పట్టజేయుట, భగవంతునిమీద ప్రేమ కలుగునట్లు ఆయన అనుగ్రహము స్వభావ దుష్టమైన సంకల్పమును తీర్చువరకు దైవభీతిని కలిగించుట అను ప్రాథమిక విద్యా సమస్యపై కేంద్రీకృతములై ఉండెను. అమాయకమైన విశ్వాసము భగవత్ప్రేమ, దైవనిర్ణయముమీది ప్రేమ ఒకని ఆత్మలో కలిగించు పద్ధతి అనగానే ఇంటిలో అలవాటుగా కొన్ని మతాచారములను పాటించు క్రమము, ఒక ఆచార్యుడో, మినిష్టరో, రాబీదో ప్రశ్నోత్తర రూపముగా విషయములు తెలియజెప్పుట, ఆధ్యాత్మిక సంవాదములోని ప్రవేశమునిచ్చు ఒక ఉపదేశము, ఒప్పుకోలు. మార్పు, పశ్చాత్తాపము భగవదనుగ్రహము కలుగునను నిశ్చయముతో పింప జేయుట మొదలగు వానిద్వారా అప్పుడప్పుడు శ్రుతిశ్రావణ కార్యము చేయుట అనునవి ఇమిడి ఉన్నవి. అన్ని కాలములందును స్థలములను మత సంబంధమైన అంతరాత్మను తీర్చు ఈసామాన్య పద్ధతినే జనులనుసరించినారు.

ఈ శతాబ్దములోని అమెరికన్ పద్ధతిలో ఏమైన విశేష మున్నదంటే అది మతవిద్యా బోధకుడు కౌమార దశమీద కేంద్రీకృతుడు అగుటయే. ఇండ్లలో ఆచారాలను అప్పటికే విరివిగా విడచిపెట్టినారు. మతోద్యోగులుపిల్లలకు బోధించడము రానురను ఎక్కువగా యథాలాపముగా మారి క్లుప్తమైనది. అయితే ప్రథమ సంవాదము, నిశ్చయము, లేదా బార్ మిజ్వాత్ నుండి పెద్దవాడయిదాక దేశంలోని యువకులను తీవ్రమయిన భావచోదనకు గురిచేసేవారు. కౌమార అవస్థలో నువ్నవారు ఏదైనా

ఉన్నా ఏదీ లేకపోయినా గుంపుచేరుతారు. కనుక యువక సంస్థలను అభివృద్ధి చేయటం సులువే. ఒకసారి గుంపు చేసిన తరువాత ఎందుకైనా వారిని వెంటనే ఒప్పించవచ్చు...భక్తి, ఆత్మత్యాగము, విశ్వాసము, ప్రేమ మొదలైన ఉద్దేశ్యాలను సోకేటట్లుగా మాట్లాడినప్పుడు ముఖ్యంగా ఇది సులువు. క్రమ బద్ధమైన మతశక్తులు బాలుర మీద తమపట్టు కొంతవరకు జారి పోవడము గమనించి యువకుల మీద పట్టుతెచ్చుకొనే అవకాశాలను పూర్తిగా వినియోగించు కొన్నారు. ఎన్నో రకాలలైన యువక మత సంఘాలు (వీనిలో కొన్నింటిని వెనుకటి ప్రకరణములో పేర్కొన్నాను) వృద్ధి అయినవి. సాధారణమైన సంఘాలకు తోడుగా మతాభినివేశము తీవ్రంగా నున్న దేశాంతర ఉద్ధరణ సంఘాలకుగా ఏర్పడిన విద్యార్థి వాలంటీర్ దళములు మొదలైన ప్రత్యేక వర్గాలు ఉండేవి.

సాంప్రదాయిక మైన ఆచార పరతగల ఈ శిక్ష ఉదార దృష్టిగల అధవా ఆధునికమైన మత సంస్థలలో "మత విద్య" గా మారిపోయి సహజంగా పెరుగుట అనే ఒక వ్యవస్థను స్వీకరించింది. మత సంబంధమైన నీతి క్రమంగా మతంలోకి మార్చడం నుండి మార్చిన తరువాత పెద్దవాళ్ళ మతజీవితం మీదికి వచ్చింది. ఈ విధంగా ఇరవయ్యో-శతాబ్దములో మత సంస్థలలో ప్రత్యేకమైన నైతిక సాంఘిక సంస్థలను ఎదుర్కోడానికి పెద్దవాళ్ళకు సంఘాలు ఏర్పడినవి. ఈ సంఘాలు మత సంబంధమైన అంతస్సుతోనే సమస్యలను చూచిన పద్ధతులలోను, విషయాలలోను లౌకికమైన లోకోపకార సంస్థలతో రానురాను ఎక్కువగా సహకరించుతూ వచ్చినవి. ఇందువల్ల మంచి చెడు అనే భావాన్ని పెంపొందించుకొనే మతసమస్య నుండి ప్రాధాన్యము అభిప్రాయములోనే కాక నమ్మికలో కూడ తీవ్ర విభేదాలు ఉన్న ప్రత్యేకమైన నైతిక విషయాలను ఆచరణ దృష్టితో చర్చించడము మీదికి వచ్చింది. విషయములో వచ్చిన ఈ మార్పు ప్రశ్నోత్తర పద్ధతినుండి చర్చాపద్ధతి లోనికి మార్పు తెచ్చింది. దళవిధ ఆదేశాలనుండి విమర్శా పూర్వకమైన చర్చకు మతోద్బోధనుండి సాంఘికమైన ప్రచారానికి పునరుద్ధారణలనుండి, లాబీలకు మార్పుతెచ్చింది. సిద్ధాంత రీత్యా చర్చిలు సాంప్రదాయికంగాను ఆధునికంగాను ఉండవచ్చు ననుకోండి. ఆచరణలో కూడా సాంప్రదాయికంగా మత సంబంధమైన శిక్షణ పిల్లలకు, యువకులకు ఇవ్వడం జరుగు

తునే ఉంది. విశ్వాసము మార్పిడి చేయడం వినపడక పోలేదు. అయితే, క్రమ బద్ధమైన మతము యొక్క విలక్షణమైన ప్రయత్నాలు ప్రస్తుతపు లక్ష్యాలు ఇప్పుడు .లౌకిక విద్యకు అహిక విషయలకు సన్నిహితంగా ఉంటున్నవి. స్పష్టమైన నైతిక విషయాలమీద వివేచించి "భగవ దిచ్ఛ" ఇది అని భోధించడం యాభై ఏండ్లనాడు ఉన్నంత సులభం కాదీనాడు. నేడు నీతి అన్నదే సమస్యవలె తయార యింది. సులభంగా దశవిధ ఆదేశాలమీద, సువర్ణ సూత్రంమీద ఆధార పడటం మతానికి. నీతికి పోయింది. తర్కనహం అయినా మత సంబంధమైన నీతి ఇప్పుడు ఎక్కువగా తర్కించడంగా నున్నది. ఇట్లా పద్ధతిలోనూ, విషయంలోనూ మత సంబంధమైన అంతస్సునకు పూర్తిగా ఒక పునర్నిర్మితి ఏర్పడింది. ఇది ఆ అంతస్సును సాంఘిక నీతికి సంబంధించిన విషయాలకు సన్నిహితంగా తెచ్చి ఆత్మ విమోచనానికి లౌకిక విషయాలతో ముడిపెట్టింది. ఈ పునిర్నిర్మాములోని ముఖ్య దశలను వ్యక్తి గతమైన దానధర్మాలకు, ఉపకారానికి గడచిన శతాబ్దాలతో సంబంధించియున్న వాటితో మొదలుపెట్టి పరిశీలిద్దాము.

## మతసంబంధమైన సంఘ కార్యకలాపాల ఏజెన్సీలు

సాల్వేషన్ ఆర్మీ పేరుతోనూ, రూపముతోనూ, మనకు పందొమ్మిదవ శతాబ్దము నుండి వచ్చినది. ఇరవైయ్యో శతాబ్దానికి రెండు దశాబ్దులు ముందుగా అది ఇంగ్లండునుండి యునైటెడ్ స్టేట్సు చేరింది. మొదట ఇది పరిత్యక్తుల ఆత్మలను వశపరచు కోడానికి మొదటి మెట్టుగా వాళ్ళకు అన్నావాసములుకల్పిస్తూ "బవర్ మిషన్సు"తో సంబంధం కలదని అందరు అనుకొనేవారు. వీధి మలువుల్లో జరిపే దీని సమావేశాలు పునరుద్ధారణ పద్ధతుల వింత చిహ్నాలుగా ఉండేవి ఈ సంస తాను ఒక "ఎవాంజలికల్ సంస్థ" నని చెప్పుకొంటుంది.

దీని ఆధ్యాత్మిక ఉద్దేశ్యము చాలా ముఖ్యమైనది. మొదట ఇది ప్రజానీకము యొక్క మత విజ్ఞానము కోసం స్థాపింప బడింది. ఇప్పటికి పాటతో, మాటతో, క్రియతో మత గ్రంథాలలోని శక్తిదమైన సందేశాన్ని ప్రకటించి వివరించి చూపడమే దీని ఎడతెగని ప్రధానమైన లక్ష్యము సంఘ సేవాకృషి ఆ కృషికి అనుబంధము మాత్రమే. 1 కాని ఇది అనేక విధాలుగా ఉపయోగ పడుతూ గౌరవింప బడుతూ జనసంఘాల నిధితో ఒకప్పుడు అవసరం లేకుండా ఒకప్పుడు ప్రజలసహా

కారాన్ని ఎంతగానో పొందుతూ ఒక పెద్ద లోకోపకార సంస్థగా అయింది. యుద్ధాల కాలంలో ఇది సైనికులకు పౌర జనులకు కూడ ఒక ప్రధానమైన సేవా సంస్థగా ఉండినది. ఇప్పుడు వాడిన వస్తువులు అమ్మే అంగళ్ళు హోటళ్ళు పనులు చూపించే బ్యూరోలు వ్యవసాయ సంబంధమైన వలస గ్రామాలు పనివాళ్ళకు పిల్లలకు ఉపకరించే గృహాలు పగటి పూట నర్సరీలు బాలుర క్లబ్బులు స్త్రీల "హోమ్ లీగులు" ఖైదీలను పౌర జీవితానికి అనుసరించే కార్య కలాపాలు శిశువుల పురావాసాలు మొదలైన వాటిని నడుపు తున్నది. ఈవిధంగా సహాయ భూతమైన నిర్మాణాత్మక మార్గంలో అధికారులు ప్రైవేటు సాంఘిక సంస్థలు చేసే కృషికి తోడ్పడుతున్నది, అందుచేత దీని మత ప్రచారోద్దేశ్యము కంటె గమనింప దగింది దీని ఆచరణీయ సూత్రం. అదేమనగా:

క్రైస్తవ మతము సేవకు పర్యాయముగా భావింప బడుతున్నది: ఒక వ్యక్తి ఆదివారాలు సమావేశాలకు హాజరు కావచ్చును. కానీ తన విశ్వాసాన్ని కనిపించే టట్లుగా ఇతరులకో, సమష్టిగా సంస్థకో సహాయ రూపంగా ప్రదర్శించడానికి ఇష్ట పడకపోతే అతడు సరియైన యోధుడు అనిపించుకోడు: అందుచేత ఇది (సాల్వేషన్ ఆర్మీ) తన శ్రేయః కృషిని కేవలం ఒక తాత్కాలిక చిత్తవృత్తి భావమును అనుసరించి దాన ధర్మాలు ఇవ్వడం అనికాకుండా కదలివచ్చే ప్రేమగా, క్రియా రూపమైన క్రైస్తవత్వముగా గుర్తించాలని కోరుతుంది. మనుష్యుని "పూర్తిగా శాశ్వంతగా పునరుద్ధరించటమే శాల్వేషన్ ఆర్మీ లక్ష్యం 2

సిద్ధాంతమును బట్టి మోక్ష మనగా దీనిభావము క్రైస్తవ శ్రుతుల మీది విశ్వాసమునకు సంబంధించినది. ఆచరణలో ఇది పూర్తిగా సాంఘిక భావముగా నుండి "సౌమనస్య పరిశ్రమ" అనే సామాన్య సూత్రం మీద పనిచేస్తూ ఉంది. చాలా అమెరికన్ నగరాలలో సాల్వేషన్ ఆర్మీ వారి ఆచరణదృష్టిని అనుసరించి చర్చిలు కూడ ప్రాత సామానుల అమ్మకము వాడిన వస్తువుల అంగళ్ళు అనేవాటితో గృహోద్ధరణ కార్య క్రమాలను జతపరిచే సౌమనస్య పరిశ్రమల శాఖలను ఏర్పాటు చేసినవి.

వై. ఎమ్. సి. ఏ. ,వై. డబ్ల్యు. సి. ఏ, సంస్థలు యువకుల మత సంఘాలుగా ఉండటం నుండి అందరికి సంబంధించిన సామాజిక సంస్థలుగా ఈ ఇరవైయో శతాబ్దములో వృద్ధి పొందినవి. అన్ని వయస్సుల తెగల

అవసరాలకు ఉపకరిస్తున్నవి. హోటళ్ళు, గరిడీలు, పలువిషయాల మీద పాఠాల ఏర్పాట్లు, ఉపన్యాసాలు, సంగీత కచేరీలు, చర్చావేదికలు, ఎండాకాలపు క్యాంపులు, ఎన్నో సమకూరుస్తున్నవి. దేశాంతరోద్ధరణ రంగాలలో, కళాశాలల ఆవరణలలో, సైనిక స్థావరాలలో వీటికి దిట్ట మైన సంఘాలు ఉన్నవి. ఇవిఎక్కడ పనిచేసినా ప్రత్యేకంగా మతసంబంధ మైన సేవలు చేస్తూనే ఉంటాయి. కాని కొంచెమించుమించు ప్రతిచోట వీటి లౌకికమైన సేవలు కనిపించినంతగా అవి కనిపించవు. మరి బహుళః ఇంత కంటె మరింత గమనింపదగిన విషయమేమంటే ఈ రెండురకాల సేనల్లో గిరిగీచినట్టు భేదము ఏర్పరచటము అంటే వాళ్ళకు సరిపోదు. యూదు సమాజకేంద్రాలుగా వై. ఎమ్. హెచ్. ఏ., వై. డబ్ల్యు. హెచ్. ఏ. సంస్థల పెరుగుదలను గూర్చి ఇటువంటి కథే చెప్పవచ్చు. కాథలిక్ యువక సంస్థలు ఎన్నో విధాలైన కార్యకలాపాలు సేవలు చేస్తూనే ఉన్నాయి. ఇవన్నీ చర్చి కృషికి, దానిమీది ఇష్టాన్ని ఎక్కువ చేసినంత వరకు ఏదో ఒంక తిరుగుడుగా మాత్రమే మత సంబంధములు అవుతవి.

## ధర్మయుద్ధశ్రేణి

మన మతసంస్థలు త్రాగుడు కూడదని చేసిన సంయమ "ప్రచారాల మొన్నమొన్నటి నాటకీయ చరిత్ర ప్రతివారికి తెలుసు. మతవర్గాలు మొదలుపెట్టి నడిపించిన నేషనల్ టెంపరెన్స్ సొసైటి, డబ్లు. సి. టి. యు. ఆంటీ-సెలూన్ లీగ్, ప్రొహిబిషన్ పార్టీ—ఇవన్నీ దాదాపు అర్ధశతాబ్దం కాలం ఈ సెలూన్లను తుడిచివెయ్యడానికి విడువకుండా ప్రచారం సాగించారు. ఈ ప్రచారం సాధించిన ముఖ్య విజయాలకు స్థానికమైన మద్యనిషేధమో లేక పీటల అథవా కౌంటీల ఎన్నికల్లో స్థానికులు దీనిని "ఎన్నుకోవటమో" కారణాలు. ఎన్నికల్లో సాధించిన ఈ విజయాలు ఎడతెగకుండా చర్చీల్లో సంయమప్రచారం చేయడంవల్లను, సెలూన్లుండరాదని అప్పుడప్పుడు బహిరంగంగా ప్రదర్శనలు చేయడం వల్లను సాధ్యపడినవి. చాల రోజులుగా ఉంటున్న త్రాగుబోతుతనం మీది ధర్మయుద్ధం ఆచరణలో ఇరవైయో శతాబ్దంలో వచ్చిన మద్య

పాననిషేధ శాసనంతోను మత్తు పానీయాలను తుడిచివెయ్యడానికి చేసిన ప్రయత్నంలోను కలిసి పోయింది. 1907. 1917 మధ్య మద్యనిషేధం మీద పెరిగినభావం, ఓటింగు హక్కు యునైటెడ్ స్టేట్సు మద్యనిషేధం చెయ్యడానికి అవకాశం కల్పించినవి. ఈ దశాబ్దంలో నాల్గింట మూడు వంతుల రాష్ట్రాలు "ఎండి" పోయినవి. పశ్చిమ దక్షిణ ప్రాంతాల్లో ఈ ఉద్యమం చాలా బలంగా ఉండింది. ఈ విషయాన్ని యుద్ధసమయంలోని అత్యంతిక పరిస్థితిని ఆసరా చేసుకొని మద్యనిషేధం కోరే వారంతా లాబీవర్గాలుగా పనిచేసి 1917 ఫెడరల్ కాన్స్టిట్యూషన్కూ పదునెనిమిదవ సవరణను గెలిపించారు. ఇది 1933 దాకా ఉపసంహరింపబడ లేదు. 1917లో మద్యనిషేధ విజయము సాధించి నప్పటినుండి ముఖ్యంగా 1933లో అది చెడిపోయినప్పటినుండి తర్వాతికాలంలో త్రాగుడు కూడ దనే విషయము మొదలుకొని అన్నినైతిక సమస్యల గురించి గొప్ప మార్పులు వచ్చినవి. హృదయ పూర్వకంగా మద్యనిషేధాన్ని సమర్థించిని మతసంస్థలు, జనసమాజాలు ఆ విషయముమీద భిన్నాభిప్రాయులు కావడం మొట్టమొదటిది. నైతిక శాసనాలు ఫలవంతంగా పనిచేయడం, తప్పనిసరి నిషేధాల నైతికవిలువ అనేవాటిని గూర్చి అనుభవ పూర్వకంగా ఒకనైరాశ్యం అంతటా ఎర్పడింది, ఇది రెండవది. విడిగానున్న సంయమ సమస్యను తక్కిన నైతిక లక్ష్యాలతో ముఖ్యంగా స్వాతంత్ర్యం; విద్య, బాధ్యత, చిత్తశుద్ధి, శాసనగౌరవము మొదలైన వాటికి ముడి పెట్టడం మూడవది దీనికి ఫలితంగా త్రాగుడుకు సంబంధించిన సంయమమే కాక సాధారణమైన సద్గుణాలను గూర్చి మునుపటి మతసంబంధమైన నిశ్చిత దృష్టి నీతులలో ఒప్పుకొన్న దానికంటె మరింత యథార్థంగా సాపేక్షాదృష్టితో ఆలోచించడం జరిగింది. ఇప్పుడు "ఆదర్శవాదం" గా పేరుపెట్టబడిన మునుపటి నిరంకుశ చిత్తవృత్తి, మంచిచెడుగులమధ్య జరిగే పోరాటమే. నీతులనే నమ్మికలోని ఆంతర్యం క్రమంగా విచ్చిపోతూ నిర్దిష్టమైన నైతికసమస్యలను శాస్త్రంగా కాక ఆచరణదృష్టిలో చూడడానికి సౌముఖ్యాన్ని కలిగిస్తున్నది. ఇంత మాత్రంచేత చాలామంది మతవ్యక్తులు నీతులు "పోరాట" మనే నమ్మికను సిద్ధాంతంగా విడిచిపెట్టడానికిష్టపడతారని కాదు; రాజీమార్గంలోని నీతిని అంగీకరిస్తారనీ కాదు. ఆచరణలో వాళ్లకు ఖండన దృష్టికంటె "పన్నుగడ" ను గూర్చిన

సమస్యలు ముఖ్యమైనవి. సెలూన్లను, పానీయశాలలుగా లేదా టావెర్న్లుగా మార్చడంవల్లను, నిషేధశాసనానికి లొంగనివారిని పన్నులువేసినట్లయితే త్రాగుడును నిరుత్సాహపరచ వచ్చునని మద్యం కావాలనే వాళ్లుచెప్పే వాదాలకు తక్కిన లౌకికులైన నీతివాదులవలెనే మతవ్యస్తులు కూడా లోబడిపోవడం ఈ విధంగా ఏర్పడింది. ఈ విధంగా వీరు ఈ "ఉపసంహారణ" తాత్కాలికమైన ఓటమికాదని, పూర్తిగా క్రొత్తరకమైన సంయమోద్యమానికి ఆరంభమని సమాధానపడి అంగీకరించినారు. మత సంబంధీకులైన-- సామాన్యులలోను, అల్పసంఖ్యాకులలో అనేకులు సంయమమంటే బాగా తిని త్రాగి ఉండడమనే ఆరిష్టాటిలియన్ పద్ధతిగా, అనగా మన అలవాట్లను నాగరికంగా మార్చుకొనుటగా తలంచడానికి ఇష్టపడుతున్నారు కాని అధికసంఖ్యాకులు త్రాగుడునేగాక మత్తుపదార్థములను నాశనము చేయుటయే సరియైన నైతికలక్ష్యంగా ఇప్పటికి భావిస్తున్నారు. ఇదే సమయంలో మతనాయకులు అనేకులు "ఆల్కహాలిక్సు అనానిమస్" మొదలైన వర్గాలవారిమతంతో అర్చకుని సంబంధము గల పద్ధతులను, మత సంబంధమైన సభ్యత్వాన్ని తదితర మిశ్రమ సభ్యత్వము కంటె ఆకర్షణీయంగా చేయుటకు ఉన్న అవకాశాలను పరిశీలిస్తున్నారు. ఏదిఏమైనను జాతీయ మద్యనిషేధం విఫలంకావడంవల్ల మతనాయకులలో ఏర్పడిన నిరుత్సాహం. ధార్మికకోపం పోయి వివేకాన్ని అభివృద్ధిపరచుట ఎట్లా అని మరింత వివేకంగా పరిశీలించడం వచ్చింది. ప్రపంచ శాంతిని ఏర్పరుచుటకు చేయబడిన ప్రయత్నముల చరిత్రకూడా ఇటువంటి నీతినే సూచిస్తున్నది. అయితే ఆనీతి మరింత క్లిష్టంగా ఉండవచ్చు. మత సంబంధికులు జరుపుతున్న రెండు యుద్ధ వ్యతిరేక ప్రయత్నాలు చాలాకాలంగా నడుస్తున్నవి; ఈ శతాబ్దములో కూడాఅవి రెండు గమనింపదగిన పాత్రలనే నిర్వహిస్తున్నవి: హింసాచర్యలకు అంతరాత్మ ఒప్పుకోదని ఆక్షేపించుట ఒకటి. శాంతియుత అంతర్జాతీయ సంబంధాలను అభివృద్ధిపరచడానికి ఏర్పడిన అంతరచర్చి సంఘాలు మరొకటి. ఈ మనస్సాక్షి ఆక్షేపకులు గడచిన రెండు దశాబ్దిములవరకు ఆయుధ విసర్జనము మత సంబంధమైన ఏకదేశవిధిగా చేసుకొన్న మతసస్థలలో ఎక్కువగా ఉండేవారు. యునైటెడ్ స్టేట్సులోని ఈ సంస్థలలో ముఖ్యమైనవి ది సొసైటి ఆఫ్ ఫ్రండ్స్ (క్వాకర్స్) ది

మొరెవియన్సు, ది మెన్నానైట్సు, ది డంకర్స్ యండ్ ష్వెంక్ ఫెల్డర్స్, జెహోవాస్ విట్నెసెస్ (రస్యల్ యుగసభ్యులు). బహుశః ది ఫెలోషిప్ ఆఫ్ రికాన్సిలియేషన్‌ను కూడా ఇందులో చేర్చవలసి ఉంటుంది. ఏమనగా అది అంతర్ వర్గీయసంస్థ అయినా ప్రత్యేకంగా అహింసా మార్గాన్ని ("అహింసామార్గంలో శత్రువుతో సహకరింపకుండుట") భక్తి భావంతో చూస్తున్నది. మహాత్మాగాంధి వ్యక్తిత్వ ప్రభావంతో కూడి వేదాంత మిషన్లు కూడా హింసకు ప్రతిక్రియలుగా "అహింసా" "ఆత్మ శక్తి" అనే వానిలో విశ్వాసాన్ని బలపరచినవి. దివ్యజ్ఞాన సమాజము వారిలో మాత్రము (చిత్రముగా) ఇది జరగలేదు.

మొదటి ప్రపంచ సంగ్రామ కాలంలో ఈ మనస్సాక్షి ఆక్షేపకులకు చట్టం కొంతవరకు ఒక విధంగా చూచుట, రక్షణ కల్గించుట చేసేది. కాని ఈ సంస్థలలో అనేకం జర్మను సంస్థలు కావటం అనే పరిస్థితి వీనికి అడ్డు వచ్చింది. ఇటువంటి సంస్థలలో సభ్యులు కాకుండా విడివిడి వ్యక్తులుగా ఆయుధ ధారణను గూర్చిన మతసంబంధమైన నియమాలు కల వారికి ఏవిధమైన ఆదరణ ఉండేదికాదు. పైగా వారు దూషింప బడే వారుకారు. యుద్ధం ముగిసి దానిసద్దు మణిగిన తరువాత, ముఖ్యంగా అంతర్జాతీయ ఆయుధ వలయం చేసేపనులకు బలమైన ప్రచారం వచ్చిన తరువాత మతసంబంధమైన శాంతి ఉద్యమం బాగా వ్యాపించిపోయింది. ఫలితంగా అన్ని చర్చిలలోను మనస్సాక్షి ఆక్షేపకులు అసంఖ్యాకులైనారు. నాయకత్వం వహిస్తున్న అనేకచర్చి సంస్థలు యుద్ధమనేది పాపమని అధి కారరీత్యా ఖండించి ఇతరములైన శాంతి సంబంధమైన, "మనస్సాక్షి సంసర్గ రాహిత్య" విధానాలను అనుసరించినవి. యునైటెడ్ స్టేట్సు రెండవ ప్రపంచ యుద్ధంలో ప్రవేశించినప్పుడు ప్రభుత్వం, మనస్సాక్షి ఆక్షేపకు లను మరింత ఉదారంగా చూచి వారిని విస్మృతి నిర్వచనంలో చెప్ప వలసి వచ్చింది. 1940 నాటి, సెలెక్టివ్ సర్వీస్ ఆక్ట్, లోనుండి చర్చి సభ్యత్వం ఉండవలెననే నియమాన్ని తీసివేవారు. "ఏరూపంగానైనా యుద్ధంలో పాల్గొనుట" ను వ్యతిరేకించినట్లైతే అవ్యతిరేకించుట "మత సంబంధమైన శిక్షణ విశ్వాసము" ప్రాతిపదికగా వచ్చినట్లైతే వారిని మనస్సాక్షి ఆక్షేపకులుగా మన్నించేవారు. సివిలియన్ పబ్లిక్ సర్వీస్ కాంపులు యూనిట్లలోని ఏడువేలమంది శాంతి వాదులలో మూడింట

రెండు భాగాలు మాత్రం చరిత్రాత్మకమైన "శాంతి చర్చీల" నుండి వచ్చినవారు. నిజానికి మిడిల్ వెస్ట్‌లో క్వాకరులు పడిపోవుటకు ఒక కారణం సమగ్ర శాంతియుత విధానాన్ని స్వీకరింప కుండిన మెథడిస్టులలో తక్కిన ప్రాటెస్టెంటు చర్చీలలో శాంతిమార్గం వ్యాపించుటయో, సివిలిన్ కాంపులలో నూటికి ఎనిమిది మంది మెథడిస్టులు, మూడు శాతము; యెహోవాస్ విట్నెసెస్, నూటి కారుమంది ఏ చర్చికి చెందిన వారు కారు. ఫ్రండ్స్ యుద్ధ ప్రయత్నముతో సహకరించటానికి, ముఖ్యంగా, సివిలియన్ సర్వీసులలో, సహకరించటానికి కొంతవరకు సిద్ధంగా ఉండటం గమనింపదగిన విషయం. అయితే కొందరు ఆయుధ ధారణకు కూడా అంగీకారం చూపినారు. ఇంకిప్పుడు యుద్ధమంటె "ఆశీర్వదించి" ఆమోదము చూపమని కట్టుబాటు చేసుకొని ఈ తగవులో తమపద్ధతిని మార్చుకోక నిలచిన పలుకుబడిగల మినిష్టర్ల వర్గం ఒకటి చాలా ముఖ్యమైనది.

కాగా యుద్ధం "పాపకర" మైనదన్న ప్రశ్న సామాన్యంగా ఒకప్రధానమైన వ్యక్తిగత నైతిక సమస్యగా ఒక తరం అమెరికన్ ప్రాటెస్టెంట్లు అందరికి తయారైంది. కాథలిక్‌లలోను యూదులలోను లెక్కకురాని ఏ కొద్దిమందో శాంతివాదులుగా ఉండటంవల్ల వాళ్ళకు ఇది ఏ విధమైన నైతిక పోరాటం కాని తెచ్చిపెట్టలేదు. అమెరికన్ కాథలిక్ నాయకులు స్పానిష్ అమెరికన్ యుద్ధకాలంలో కూడా ఆతురతగా దేశభక్తి ప్రకటించి ("దేవునికి దేశానికి") తను రాజకీయ విశ్వాసాలు అసంసర్గ మార్గంలో ఉండిన మనస్సాక్షిగా యుద్ధప్రయత్నానికి సహాయ పడినారు. ప్రథమయుద్ధకాలంలో అమెరికన్ యూదులు ప్రజాస్వామ్యం ఒక మత సంప్రదాయంగా ఏర్పడిన అమెరికన్ పౌరులుగా పోరాడినారు. రెండవ యుద్ధకాలంలో హిట్లరు భయానకత్వాన్ని అంతమొందించుటకు సహాయ పడవలసిన విధి, ప్రత్యేకశ్రద్ధ కల్గిన అమెరికనులుగా, యూదులుగా రెండు రకాలా పోరాడినారు. ఈ ప్రాటెస్టెంటుల అంతరాత్మల్లో ఒక తీవ్రమైన నైతిక పోరాటం క్రమాభివృద్ధిగా కనబడుతూ వచ్చింది. వీళ్ళు క్రైస్తవ ఖండిత శాంతివాదాన్ని ప్రజాస్వామ్య పౌర సంబంధమైన నీతితో సమాధాన పరచడానికి చాలా కృతనిశ్చయమైన ప్రయత్నమే చేసినారు. మొదటి యుద్ధకాలంలో ఆ పోరాటాన్ని

"లోకంలో ప్రజాస్వామ్యానికి భద్రత కల్గించేటందుకు" ఒక పవిత్ర కారణంగా, ఒక నైతిక యుద్ధంగా భావించడంలో అనేక క్రైస్తవ మినిష్టర్లు తమ ప్రిజ్బిటిరియన్ ప్రసిడెంటు, ఉడ్రోవిల్సన్ ను అనుసరించిన తరువాత, ఆ పోరాటం విఫలం కాగా నైరాశ్య నిరుత్సాహాల తరువాత ప్రాటెస్టెంటులు అందరిలోను అవమానం, పశ్చాత్తాపం, ఆత్మార్పణ చేయడం అలవలె ముంచుకొని వచ్చినవి. ఈ "యుద్ధ యంత్రం" మీది కోపం 1930 తరువాత అంతర్జాతీయ ఆయుధ వలయం బయట పడగానే అది అమెరికన్ తటస్థ విధానానికి చెందిన చట్టానికి దారితీసినప్పుడు పరాకాష్ట పొందింది, ఇంకెప్పుడు యుద్ధాన్ని పవిత్రంగా భావించమన్నారు. అయినప్పటికి (కొంత పోరాడుకొన్నాక) ప్రాటెస్టెంటులలో అధిక సంఖ్యాకులు రెండో ప్రపంచ యుద్ధాన్ని పవిత్ర విధిగా భావించినారు. 1941 వేసవిలో న్యూయార్కులోని యాంగ్లో కాథలిక్ బిషప్ మానింగ్ గంభీరంగా చెప్పిన ఈ మాటలతో ఎవ్వరూ ఏకీభవించలేక పోయినారు: "తరువాత అమెరికా దేశస్థుడుగా క్రైస్తవుడుగా క్రైస్తవ చర్చికి బిషప్‌గా మాట్లాడుతూ ఈ పోరాటంలో మనం ఒక జాతిగా సమగ్రమైన పాత్ర నిర్వహించుట మనవిధి అనినేను చెప్పుతున్నాను". 3 యపిస్కోపలియన్లలో కూడ ఇటువంటి ప్రకటన అసహ్యాకరంగా అయింది. చాలామంది ప్రాటెస్టెంటులు దీనిని దైవ దూషకంగా భావించినారు. అయినా ఒకటి రెండు సంవత్సరాల తరువాత అధిక సంఖ్యాకులు అతడు చెప్పినదానితో చాలావరకు ఏకీభవించినారు. క్రిష్టియన్ సెంచరీ సంపాదకుడైన, శాంతివాది క్లేటన్ డబ్ల్యు మారిసన్ వంటి ఏ కొందరో ఈ ఆంతర సంఘర్షణను కొనసాగించుచూ వచ్చినారు. ఆయన పెర్ల్‌హార్బరు తరువాత ఇలా వ్రాశాడు: "మనదేశం యుద్ధంలో ఉంది. దాని ప్రాణానికే ముప్పు వాటిల్లవచ్చు: ... ఇది మనఅక్కర, అక్కర లేని అక్కర కనుక తప్పుచేసిన అక్కర ... మన పోరాటం అవసరమే అయినా న్యాయమైనది కాదు. భగవంతుడు మనలను పోరాడ మని నిర్దేశించలేదు. మనచేతులార మనము వ్రాసిన ఆయన ఖండన వాక్యము ఏమంటె మన సోదరమానవులను మనమే చంపి వారి చేతులలో చావాలని, ఈ ఖండింపే నరకమని మేము ఇప్పుడు తీర్మానిస్తున్నాము" 4 అధికసంఖ్యాకులు లివింగ్ చర్చి సంపాదకునితో కలిసి అధిక సంఖ్యా

కులు మరింత తాదాగ ఇలా ప్రార్థించారు: " భగవంతుడు మావైపు ఉండాలని కాక మేము ఆయన పక్షంలో ఉండునట్లుగా ఎప్పుడూ కోరుదుముగాక. చివరకు విజయ మాయనదే యగుగాక. " 5 ఈ ప్రార్థన క్రైస్తవులలో సాంప్రదాయికంగా వచ్చేదే. లౌకిక నీతివాదులు దీన్ని ఒక చిరునవ్వునవ్వి ఒక నిట్టూర్పు విడిచి పరిగ్రహించవలసిఉంటుంది.

ఇంక శాంతి నిర్మాణ విషయంలో క్రమబద్ధమైన ప్రణాళిక వేయుటకు ఆ విధమైన ప్రయత్నములకు 19 వ శతాబ్దములో క్రమ వ్యవస్థితములైన మతసంస్థలు అంతగా చొరవ చేసుకొనలేవు. వ్యక్తిగతంగా ప్రాటెస్టెంటులు అందులోనూ ఎక్కువగా వామపక్షీయులు సహకరించిన లౌకిక మానవతావాదులు ఇంతకంటె ఎక్కువే చేసినారు. కానీ 20 వ శతాబ్దములో చర్చీలు "న్యాయమైన మన్నికయైన" అంతర్జాతీయమైన ఒప్పందాలను తయారు చేయుటకు కావలసిన ప్రణాళికలలోనూ శాంతి సంఘాలలోనూ క్రమాధికమైన శ్రద్ధ తీసుకొన్నవి. ఈ శతాబ్దపు తొలి సంవత్సరాలలో శాంతికి మధ్యవర్తిత్వానికి దోహదంచేసే లక్ష్యంగల లేక్ మొహాంక్ కాన్ఫరెన్సులు, ది కాన్ఫరెన్స్ ఆఫ్ ఫ్రండ్సు. ది అమెరికన్ అసోసియేషన్ ఆఫ్ మినిష్టర్సు. తదితర సంఘాలను నిర్మించారు. ఉత్సాహపూరితంగా లీగ్ ఆఫ్ నేషన్సును బలపరిచారు. 1942 లో ఓహియో రాష్ట్రంలోని డిలావేర్ లో వీళ్ళు "న్యాయమైన మన్నికయైన శాంతికి ప్రాతిపదిక" అను ఒక ప్రకటనను తయారు చేసినారు. దీనికి పలుకుబడిగలవారి మద్దతు ఉండేది. ఇది యునైటెడ్ నేషన్సును స్థాపించడానికి దారితీసిన చర్యలలో ఒకటి. మానవుని హక్కుల ప్రకటనను కూర్చుటలోనూ దానికి దోహదము చేయుటలోనూ కాథలిక్కుల, ప్రాటెస్టెంటులు, యూదునాయకులతో చేరినారు. దేశంలోని మత శక్తులు క్రమ క్రమంగా యుద్ధం శాంతి అనే సమస్యలలో ఆచరణీయమైన, రాజకీయమైన శ్రద్ధ తీసుకొన్నాయి. యదార్థ దృష్టితో, శాంతికి ప్రణాళిక తయారుచేసే దృష్టితో లౌకికమైన ఏజెన్సీలతో సహకరించారు. ఈ సహకరించడం అనుభవంలో వేసే ఎత్తుగడలను ఆగమశాస్త్ర దృష్ట్యా తాము సమాధాన పడినా, పడలేకపోయినా లేదా యుదంద్వారా శాంతి సాధించవలసి వచ్చినా సరే నన్న దృష్టితో జరిగింది.

ప్రొటెస్టెంట్లు త్రాగుడు, సంయమము, శాంతి అనే నైతిక సమస్య లలో వ్యగ్రులై ఉంగా కాథలిక్కులు తమదృష్టిని లైంగికనీతి, "పబ్లిక్ డీసెన్సీ", "కుటుంబ పరిరక్షణ" అనే సమస్యలమీద కేంద్రీకరించినారు. 1934 లో నేషనల్ లీజెన్ ఆఫ్ డీసెన్సీని సృష్టించిన పబ్లిక్ డీసెన్సీ ఉద్యమం నాటకరంగాలమీద చలనచిత్రాలమీద కేంద్రీకృత మైంది. స్థానిక మైన రాజకీయపు ఒత్తిడివల్లను, హాలీఉడ్ లోని సెన్సార్ షిప్ ద్వారాను కాథలిక్ చర్చి (సాధారణంగా ఇతర మతసంస్థలు ఉదార తాటస్థ్యం పూనుటతో) రంగస్థలంమీద, తెరమీద మొరటైన అసభ్య తను నివారించటమే కాక తనకు చేతనయినంతవరకు మతసంస్థలకు విరుద్ధమైన రూపకాలను, మతసంబంధమైన భావాలను బాధించే మరేదాని నైనను నివారిస్తుంది. ఉదాహరణకు దైవనింద రంగస్థలం తెర మీదనే కాక సాహిత్యంలోనూ జర్నలిజంలోనూ అవినీతిగా భావింపబడుతున్నది. తత్వసంబంధమైన నాస్తికత రాజకీయమైన నాస్తికతకూడా మతం ప్రజా నీకం పరిరక్షించ వలసినదను ఆధారం చూపి పట్టుదలగా ఖండిస్తారు. కనుకనే అతివాద మార్గమునకు చెందిన "లౌకికతా సిద్ధాంతం మత విరుద్ధమేకాక అవినీతికర మని కూడా భావింప బడుతున్నది. ఇతర మత వర్గాలు ముఖ్యంగా కొందరు యూదులు మరి మానవతా వాదు లందరు ఆస్తికతా విరుద్ధమైన భావాలమీద చర్యలమీద వచ్చిన ఖండ నలను బహిరంగంగా తిరస్కరించినను క్రైస్తవులలోను యూదులలోనూ అత్యధిక సంఖ్యాకులు నీతికి మతం యొక్క సహాయసంపద అవసరమనే సాధారణ దృష్టితో తమముఖ్య శత్రువును ఎదుర్కొటానికి చేతులు కలిపినారు. ఇటువంటి కారణాలతోనే కాథలిక్ అధికారులు పబ్లిక్ లైబ్రరీలలోనూ స్కూళ్ళలోనూ కొన్ని కొన్ని కాథలిక్ విరుద్ధమైన గ్రంథాలు ఉండరాదని చేసిన ప్రయత్నాలను సమర్థించుకొంటారు. కనీసం సిద్ధాంతంలోనైన "మిథ్యా" మతాన్ని సెన్సార్ చేయడం ఒక ప్రజాసేవగా భావిస్తారు. కొందరు ప్రొటెస్టెంటులు కాథలిక్ చర్చి ప్రజానీకానికి "అపాయకరము" అని భావించినట్లుగానే ఇదికూడా. ఇంక యూదులు లౌకికమైన అథవా బహిరంగమైన యాంటీసెమిటిజమ్ నుకూడ సెన్సారు చేస్తారు. ఇది మతసంబంధమైన హింస అని కారణం చూపుతారు. అయితే మొత్తంమీద ఈచిన్న చిన్న విశ్వాసాలు

పరస్పర ఖండనం చేసుకున్నప్పుడు మతసంబంధమైన కారణాలు చూపుకొని చేసుకొంటున్నవి కాని పబ్లిక్ డిసెన్సీ కారణాల మీదకాదు. ఉదాహరణకు నిరంతరం, జాగ్రత్తగాచూస్తూ తరుచుగా ప్రైవేటుగా సెన్సారు చేయడానికి ప్రయత్నించే క్రిస్టియన్ సైన్సు చెర్చివారి పబ్లికేషన్ కమిటీలు క్రిస్టియన్ సైన్సును తప్పుడు రూపంలో చూపించడాన్ని అడ్డగించడానికే సెన్సారు చేస్తున్నామని స్పష్టంగా చెప్పిచేస్తారు. కానీ ఒక విశ్వాసం ఎంత బలవత్తరమైతే అంతగా అది తాను ప్రజాశ్రేయస్సుకే పాటుపడు తున్నామని తడుముకోకుండా చెప్పడం జరుగుతుంది. కనుకనే గొప్ప క్రైస్తవ చర్చీలు అన్నీచాలా తీవ్రమైన కష్టమైన నైతిక పరిస్థితులలో పడినవి. అవన్నీ ఎన్నో విధములైన ప్రజాసేవలు చేయడం సామాన్యమైన అందరి సహకారాన్ని పొందడం స్పష్టం. అందుచేతనే సహజంగా తాను లేకపోతే పనిజరగడదనే విశ్వాసానికి వస్తవి. మరి ఇవన్నీ కేవలం ప్రైవేటు హక్కులవారి సంస్థలనీ ఎవ్వరూ రుజువు చెయ్యలేరుకనుక అవి తమబాగు పబ్లిక్ డిసెన్సీఅని, వ్యవస్థఅని, చెప్పుకోడానికి ఒక ఆకర్షణ ఏర్పడుతున్నది. మనుష్య సహజమైన ఈలోపం, భగవదనుగ్రహం అధిగమింప వీలైన ఈలోపం మత విశ్వాసాలకు పబ్లిక్ డిసెన్సీకి మధ్యఉన్న సంబంధాన్ని పరిశీలించి స్పష్టంగా అర్థం చేసుకోగల ఒక సమకాలీన నైతిక దృష్టి అవసరమగు నట్లుగా చేస్తున్నవి. మొండిగారెండూ ఒకటే ననడంగానీ మొండిగా విభజించడంగానీ మునుపటివలె ఇప్పుడు మనస్సుకు నచ్చుటలేదు.

ఇదే విధంగా లైంగిక నీతి, సంతాన నిరోధం, విడాకులు అనే సమస్యలను గూర్చిన వ్యతిరేకాభిప్రాయాలవల్ల శారీరక మానసి కారోగ్యాలకు సంబంధించిన వైద్యశాస్త్ర సమస్యల మధ్యను మతమునకు సంబంధించివినగా సాంప్రదాయికముగా భావింపబడు తున్న నైతిక సమస్యలకు మధ్యఉన్న సంబంధాల సామాన్యమైన ప్రశ్నను తీవ్రంగానే రేపినవి. కాథలిక్కుల సిద్ధాంతం మొండిగా స్పష్టంగా ఉంది: ఏనైతిక విషయానికైన మతసంబంధమైన అధికారమే మార్గదర్శకంగా ఉండవలసిన అవసరం ఉన్నది. చర్చి ఉద్రేకానికి (ముఖ్యంగా "కామోద్రేకానికి"), వివాహానికి, వంశాభివృద్ధికి సంబంధించిన సర్వ సమస్యలను నైతిక సమస్యలని అధికారికంగా

గుర్తించింది వీటిని కన్ఫెషన్సు. తపస్సుద్వారా సరిదిద్దడానికి ప్రయత్ని స్తుంది. కనుకనే అప్పుడప్పుడూ "అంతరాత్మ కేసుల" కు మార్గ దర్శకంగా ఉండడానికి అధికారికమైన ప్రకటనలు చేస్తుంది. కనుకనే చర్చివీటిని గుర్తిం చిందని చెప్పవలసి యున్నది. కొన్నివైద్య నిర్ణయాలకు సంబంధించిన నీతు లను గురించి, ముఖ్యంగా కష్టప్రసవాల విషయంలో, 1951లో పోప్‌చేసిన ప్రకటనవల్ల యునైటెడ్ స్టేట్సులో విస్తృతమైన చర్చ విమర్శ వచ్చినవి.

1943లో కాథలిక్‌లు ఫ్రాన్సునుండి ది కెనా కాన్ఫరెన్సు మూమెంటును ప్రవేశ పెట్టినారు. ఈ ఉద్యమం క్రొత్తగాపెండ్లి చేసుకొన్న దంపతుల కొరకు వివాహం మాతృత్వ పితృత్వములు అనువానికి సంబంధించిన సమ స్యలను గూర్చి చర్చించే సమావేశాలు ఏర్పాటు చేస్తుంది. దంపతులకు తానిచ్చే సలహాను ఈ ఉద్యమం సగ్రహంగా అధికారికంగా ఇలాచెప్పింది: "కెనా పెండ్లి సందర్భంలో బ్లెసెడ్ మేరీ చెప్పిన 'అతడు ఏమిచెప్పిన చేయుము, అనే మాటలు స్మరిస్తు ఈ ఉద్యమం సృష్టికర్త పురుషుని స్త్రీని సృజియించి వర్ధిల్లుడనిఆదేశించి నపుడు అతని హృదయ మెట్టిదో దానిని వివాహితు లైన జనులకు అందిస్తున్నది " నైష్ఠికమైన జుడాయిజంలోనూ సనాతన సిద్ధాంతాన్ని అనుసరించే క్రైస్తవ మతంలోనూ నైతికమైన "అధికారా" న్నిగూర్చిన భారం అంత నికరంగా లేదు. ఉదారులైన ప్రాటెస్టెంట్లకు యూదులకు వశ్యత (ఫ్లెక్సిబిలిటి) వల్ల కొన్ని సదుపాయాలు కొన్ని ఇబ్బం దులు కూడా ఉండినవి. వివేకంగా ఉండాలని తలచి వాళ్ళు సంప్రదాయ ఘాతకులుగా ఉండరు. మామూలు మనుష్యులను వివేకంగా నడిపించాలని తలచి మతోద్యోగులు ఇతర శిక్షణగల సలహాదార్లను జాగ్రత్తగా అనుస రించారు, దానినిబట్టి బిషప్పులు దేనిని వివేకవంత మని సిద్ధంగా అంగీకరి స్తారో దానిని "నైతికమని" "సరైనదని" ఆశీర్వదించినారు. పోల్చిచూచి నప్పుడు వైద్యుల నైతికమైన సలహాకు మతనైతిక విధులకు ఈ ప్రాటె స్టెంట్లుతోనూ, ఉదార మత వర్గాలతోనూ ఎక్కువ వైరుధ్యం ఉన్నట్లు కాన్పించదు. యథికల్ కల్చర్ సంఘాలలోను మానవతావాద సిద్ధాంత సభ్యులలోనూ సంస్కరణకోరే యూదులలోనూ వైద్య వృత్తిలో వచ్చిన మార్పులతో సరిసమానంగా తామూ నడవాలన్న ప్రయత్నం స్పష్టంగా ఉండినది.

ఈ పరిస్థితుల మార్పుల వల్ల కల్గిన సకరమైన ఫలిత మేమంటే వైద్య వృత్తి, ముఖ్యంగా మానసిక రోగ వైద్యులు, పాస్టర్ ప్రీస్ట్ వృత్తులు తమ ఇరుతెగలకు సమానంగా ఉన్న ఈ సమస్యలను స్పష్టముగా గుర్తించుట వల్లనో లేదా అక్కడ ఇక్కడ ఒకరితో నొకరు చర్చించుకొనుట వల్లను ఒకటిగా వచ్చినారు. వైద్యులు నీతులను గురించి చర్చించ డానికి ఎంత ఔత్సాహికంగా లేదా కట్టు కథలుగా సాంప్రదాయిక మైన రోగ నిదానాలు కన్పించినప్పటికి కొన్ని మతసంబంధమైన ఆచారాలకు ఉన్న చికిత్సా గుణాన్ని గుర్తించేందుకు ఎక్కువ ఇష్టమే చూపుతున్నారు. మతోద్యోగులు కూడా లౌకికమైన మానసిక రోగ చికిత్సను గూర్చిన ప్రాథమికాంశాలను నేర్చు కొనడానికి అజ్ఞానాన్ని తమ పారిషనర్లకో, కన్వెన్షన్‌కు వచ్చినవారికో సలహా చెప్పేటప్పుడు బహిరంగంగానో నిగూఢంగానో ఉపయోగింప డానికి మరింత ఆతురత పడుతున్నారు- నైతిక సమస్యల నెదుర్కొనడం లోని ఈ రెండు మార్గాలకు అనిష్టంగా ఉంటున్నా క్రమంగా ఒకపొత్తు ఏర్పడుతున్నది; అన్నీ కాకపోయినా పాపమునకు మోక్షమునకు సంబంధించిన సమస్యలు ఆరోగ్యానికి సంబంధించిన సమస్యలని అస్పష్టంగానైనా క్రమంగా గుర్తిస్తున్నారు. "ముక్తి" అనేది "మానసికారోగ్యం" , సాంఘికారోగ్యం, అనే వానిలాగానే ఒక అస్పష్టమైన భావమైంది; ఈ భావాలన్నీ గతకాలంలో మతోద్యోగులు, మానసికరోగ చికిత్సకులు ఒప్పుకున్న దాని కంటె ఎక్కువగానే నీతి నియమాలకు చాలా సన్నిహితంగా ఉంటున్నవి. మత సంబంధమైన తర్కము, శాస్త్రీయమైన మానసిక రోగ చికిత్స, లౌకిక మైన నీతినియమాలు పరస్పరము ఒకదానితో ఒకటి క్రమంగా కలిసిపోవడం, సిద్ధాంత రూపంగా పొందిక లేకపోయినా మనుష్యుల ప్రాణాలు రక్షించడంలో, ఉత్సాహాన్ని నిలబెట్టడంలో పరస్పరం ఒకదాని నొకటి కలియుటకు వీటి అంగీకారము ఇరవైయవ శతాబ్దములోని సృష్టింప బడిన గొప్ప నైతిక సృష్టులలో ఒకటి. 7

మతవర్గాలు తీవ్రంగా గ్రహింపవలసిన గొప్ప నైతిక సమస్యలలో మరి మొన్న మొన్నటిది జాతి సంబంధాల సమస్య. మరింత ముఖ్యంగా నీగ్రో చర్చీల, చర్చీలలోని నీగ్రోల సమస్య 1920లో నీగ్రోలను గూర్చి "చట్ట రీత్యా న్యాయం", సోదరభావ "అధ్యాసం" కార్యక్రమాన్ని ఫెడరల్ కౌన్సిల్ ఉద్దేశించింది. జాతి సంబంధమైన ఆభిజాత్య భావాలను ఖండిం

చింది. క్రమంగా తన ప్రణాళికలో లించింక్ (చిత్రవధ)కు జాతి విచక్షణకు విరుద్ధంగా శాసన నిర్మాణాన్నికూడా చేర్చుకొన్నది, ఉత్తర దక్షిణ శాఖల మధ్య (ముఖ్యంగా మెథడిస్టులు బాప్టిస్టుల మధ్య) మరింత సన్నిహిత సమైక్యము కోరుతున్న విస్తృమైన ప్రాటెస్టెంటు వర్గాలలో జాతిసమస్య ఇబ్బంది పెట్టుతూ ఉండేది. రోమన్ కాథలిక్‌లు కూడా నిదానంగా ఈ సమస్యను చేబట్టినారు. అన్ని మతసంస్థలు త్వరితంగానో, ఆలస్యంగానో దీనిని ఎదుర్కోవలసి వచ్చింది. 1934లో న్యూయార్కు నగరంలోని ఈపరిస్థితిని సరిదిద్దడానికి కాథలిక్ ఇంటర్ రేషియల్ కౌన్సిల్ యండ్ సెంటర్ ఆఫ్ న్యూయార్కు స్థాపింపబడింది. ది ఇంటర్ రేషియల్ రెవ్యూ అనే తన ప్రచురణద్వారా అది విస్తారమైన పలుకుబడి సంపాదించింది. వర్ణ భేధాన్ని పడగొట్టడానికి ప్రయోగ మాత్రములుగా ప్రాటెస్టెంటులు అనేకంగా "వివిధ జాతిమత సభ్యత్వాలు" ఏర్పాటు చేసినారు. నీగ్రోల విషయంలో ఈ మతసమస్య జాతికి సంబంధించిన అడ్డంకుల పురస్సిద్ధాంతాల సాధారణ సమస్యలకంటె వేరుగా మరింత సంకీర్ణంగా ఉన్నది. ఏమంటే, ఒక శతాబ్దకాలంలో ఈనీగ్రో చర్చీలు తమకొక విధమైన పూజావిధానాన్ని ఆధ్యాత్మికతను వృద్ధిచేసు కొన్నవి. ఆ చేసుకొనుట కూడా అందుకు తాము తమ మతసంబంధ మైన ప్రార్ధనలలో గర్వపడి తృప్తిపడే టంతగానూ ఉండడమేగాక ప్రపంచములోని ఆధ్యాత్మిక జీవితానికి, ముఖ్యంగా అమెరికన్ సంస్కృతికి వారుచేసిన దోహదం సామాన్యంగా గుర్తింప బడుతున్నది. అందుచేత వర్ణభేధాన్ని పడగొట్టుటలో త్వరిత పద్ధతులను ఉపయోగించి ఈ మంచి నిర్మాణాన్ని అడుగునుండి బలహీనపరచ కుండడం ముఖ్యమైన విషయం. కృత్రిమమైన పృధక్ విభాగం, కృత్రిమమైన కలయికలు కూడా తప్పించాలి. ఏమైనా మొన్న మొన్నటి ప్రయోగాలు, పద్ధతులు చూపుతున్నట్లుగా నీగ్రో చెర్చీలలోని మతపు విలువలను కదలించకుండ జాతులమధ్య సాంఘికమైన అడ్డకులను పోగొట్టుట సాధ్యమే, అటు ఉత్తర ప్రాంతములోను, ఇటు దక్షిణ ప్రాంతములోనూ ఈ పక్షపాతాన్ని అధిక మించడంలో ఈతరం యువకులు ఇచ్చిన నేతృత్వం గమనింపదగిన యదార్థ విషయం. అభిప్రాయాలలో వచ్చిన మార్పు దాదాపు విప్లావకమైనదే. అయితే, అందులో, ఎంత మాత్రం మతసంబంధమైన భావంతో కల్గిందో చెప్పడం కష్టం. ఏమైన, మతసంబంధమైన యువక

సమస్యలు తీవ్రమైన కృషిచేసినా యనడం నిశ్చయం. ప్రాచ్య దేశాలలోని జాతులలో మతవిషయకమైన సంబంధాలు వేరు. వివిధమత సఖ్యత్వ విషయంలో ప్రాచ్యఖండంతో మనము అంతగా ముందుకు పోలేదు. ఏమైనా రెండవ ప్రపంచ సంగ్రామ కాలంలోనూ అటు తర్వాతను నిర్వాసితులైన జపానువారిని ఆదుకొన్నందుకు చర్చీల "సోషల్ ఇంజనీరింగ్ హోమ్ మిషన్సు" వారు సాధించినదాన్ని మెచ్చుకోక తప్పదు.

## సాంఘిక సువార్తలు

అమెరికన్ మతంలో చాలా దూరం పోగల శాశ్వతమైన నైతిక పునర్నిర్మాణం "సాంఘిక సువార్త" అనబడుదాని వ్యాప్తికి కెథాలిసిజమ్‌మీద, జూడాఇజంమీద ప్రాటెస్టాంటిజమ్‌కు చెందిన బలీయమైన వర్గాలమీద, చర్చీలమీద, మంచి పట్టుఉంది: రూపురేఖలు దిద్దుకొంటున్న సాంఘిక నీతి ప్రాతిపదికగా మతాన్ని పునర్నిర్మించే పద్ధతి యొక్క పరాకాష్టకు ఇది ఒక చిహ్నము. దీనిని "ఈ నాటి మతవిప్లవం" అని సముచితంగా పిలవవచ్చు. సామూహికంగా మనుష్య జాతికి మోక్షము సంప్రక్రమాన్ని పునర్జీవింప చేయుట మతానికి చరమ లక్ష్యము అనేదే ఇందలి ప్రధాన భావము. యుటోపియన్ సోషలిజమ్ ఎంతప్రాతదో కనీసం అంత ప్రాతదైన ఈ సువార్తను 19వ శతాబ్దములో వేరువేరు రూపాలుగా ప్రచారముచేసినారు. ఆగమశాస్త్ర దృష్టికి బహుశః అతివాదంగా కనిపించేది హెన్రీ జేమ్సు ది ఎల్డర్ చెప్పిన ఆగమ పద్ధతి. ఇతడు తన సిద్ధాంతాన్ని కాల్వినిజమ్, ఫోరియరిజమ్, స్వీడన్ బర్గోరియా నిజమ్‌ల నుండి గ్రహించి ఆడం విషయంలో ఎట్లో అట్లే మనుష్యులందరు భగవంతుని నుండి వ్యక్తిగతంగా పతితులైనారని కనుక దివ్యమానవ జాతిలో మానవులందరు సామూహికంగా ఉద్ధరింప బడతారని బోధించినాడు. అమెరికన్ క్రిష్టియన్సులో మరింత పల్కుబడి సంపాదించినవి ఎలిషామల్ ఫర్డు వ్రాతలు, వాషింగ్‌టన్ గ్లాడన్ ధర్మోపన్యాసాలు. హెన్రీజార్జి ఎడ్‌వర్డు బెలమీల తరువాత, పాప్యులిస్టు ఉద్యమం "సాంఘిక జాతీయత" లో యదార్థమైన అస్తి కలిగించిన తరువాత సామాన్యులు మతోద్యోగులు చేరిన క్రిష్టియన్ సోషలిస్టులు (సామాన్యుల్లో మంచి ఆర్థికశాస్త్ర వేత్తలుకూడా ఉన్నారు). ఈ ఉద్య

మానికి ఒక శాస్త్రీయమైన ఆధారం అమెరికన్ ప్రొటెస్టెంట్లలో 1900 కు ముందు ఒక యదార్థమైన ప్రోత్సాహం కల్పించినారు. మత సంబంధమైన సోషలిస్టులలోని చాల అతివాదులలో హెన్రీషరానీ ఒకడు. ఇతడు 1880 లో "శ్రామికజాతీయ పరిషత్తు" (నేషనల్ కౌన్సిల్ ఆఫ్ టాయి లర్సు) ను నిర్మించడానికి ప్రయత్నించినాడు 9.

ఈ శతాబ్దపు తొలిపాదంలో కొందరు మాత్రమే చర్చీలలోనూ గోష్ఠుల లోనూ ఈ సాంఘిక సువార్తను బోధించి ప్రచారము చేసినారు. మతో ద్యోగులే లౌకికులకంటె ఎక్కువగా ఈ విషయంలో ఉత్సాహం చూపి నారు. ఈ శతాబ్దపు తొలిదశకంలో సంఘసేవకు కేంద్రసంఘాలు స్థాపిం చడంలో చర్చీలు ఒకదానితో ఒకటి పోటీపడినా, ఈ సంఘాల కార్యశాలా పాలకు ప్రకటనలకు స్థానిక చర్చీలలోనూ మతోద్యోగులలోనూ అధిక సంఖ్యాకులలోనూ తగినంత సమాధానం రాలేదు. యూరోపియన్ కాథ లిక్కులలో సాంఘికమైన చర్యకు పోప్ లియో వారి శ్రీముఖంలో ఇము డ్చబడిన సువార్తయే ప్రాతిపదికగా చాలాకాలము నుండి ఉంటున్నను, అమెరికన్ మతోద్యోగులు 1919లో బిషప్పులూ దానిని బలవంతగా చూపిం చినంత వరకూ దానిని పట్టించు కొననేలేదు. అప్పటికి అటుతరువాత పదేండ్లదాకా సార్వత్రికమైక ఉన్ముఖత రాలేదు.

వ్యక్తిగతమైన ఔదార్యమును స్పృశించుట వల్లను ప్రత్యేకముగా స్వంత మోక్షమునకు పాటు పడుట ఆధ్యాత్మికమైన స్వార్థ పరత్వముగా చూపిం చుట వల్లను మోక్షమును గురించిన వైయక్తిక పారమార్థిక భావములలో నికి తొలి రహదారులు వేయబడినవి. తన్ను గురించికంటె ఎక్కువగా ఇత రులను గురించి చింతించుట ఈ 20వ శతాబ్దపు తొలినాళ్ళ విశిష్ట మనో లక్షణము. దానినిబట్టి "మంచి చేయుట" అనేదే "దేవుని ప్రేమించుట" గా సామాన్యంగా అనుకొనే పద్ధతిగా మారింది. వై. ఎమ్. సి. ఏ. వై డబ్ల్యు. సి. ఏ. ఇతర యువజన సంస్థలు ఈ సిద్ధాంతమునే ప్రధానంగా ప్రచారము చేసిన వనుట అందరికి తెలిసిన సంగతి. వైయక్తిక సిద్ధాంతానికి పట్టుగొమ్మ అయిన ప్రిన్స్‌టన్ ప్రిజ్బిటీరియన్‌లలో కూడా నైతిక వాతావరణము లలోని ఈ మార్పు కనబడసాగింది. ఉదాహరణకు 1909లో ఉడ్రోవిల్సన్ ఆగమశాస్త్ర విద్యార్థులను పలుకుబడిగల సామాన్యుడిగా ఉద్బోధిస్తూ ఇలా అన్నాడు:

"నిజమైన వైజ్ఞానిక సిద్ధాంతయ ప్రాతిపదిక మీదతప్ప చర్చిలోకాని సంఘ లోకాని శక్తిఏర్పడే సూచన మున్నట్లు నామట్టుకు నాకు కనిపించటము లేదు.... మినిష్టరు క్రైస్తవ మతాన్ని మనుష్యులకు బోధించ వలెనుకాని సంఘానికి కాదు. మోక్షాన్ని గురించి వ్యష్టికి చెప్పవలసి ఉంది. ఎందు కంటే ఒకరితరువాత ఒకరిని ప్రేమించటమే మనకు సాధ్యంని మరిప్రేమ ప్రాణధర్మం 10.

కాని 1914 లో ఆయన తన రాజకీయమైన "నవ స్వాతంత్ర్యం" తో బాటు సాంఘిక సువార్త కూడ రావాలని జాగ్రత్తగా ప్రయత్నించినాడు. "శాస్త్ర క్రైస్తవమతాన్ని" గురించి వై. లిమ్. సి. ఏ. వారికి ఉపన్యసిస్తూ ఆయన ఇలా అన్నాడు:

క్రైస్తవమతం వ్యష్టి ఆత్మలను రక్షించే సాధనమని ప్రియంగా భావించే వాడను కాను నేను....... క్రీస్తు ఇతరులను రక్షించడానికే ప్రపంచములో నికి వచ్చినాడు, తన్ను రక్షించుకొనుటకు కాదు. నాసోదర మానవుని ఉద్ధ రించుట ఎట్లాఅని నిరంతరం ఆలోచించనివాడు మానవ జాతికి జ్ఞానోదయం కల్గించుట ఎట్లాఅని ఆలోచించనివాడు తాను జీవిస్తున్న పరిధిలో సచ్చరి త్రమే ధర్మంగా చేయుట ఎట్లా అని ఆలోచించనివాడు నిజమైన క్రైస్త వుడు కాడు."

అయితే ఈ క్రైస్తవ సాంఘిక సువార్త విల్సన్ కలలుగన్న దానికంటె మరింత ముందుకు శీఘ్రకాలంలో జరిగింది. 1907 లో న్యూయార్కులోని బాప్టిస్టు సెమినరీ ఆఫ్ రాచష్టర్ లో ఉండిన ప్రొఫెసర్ వాల్టర్ రౌషన్ బుష్ తన "క్రిష్టియానిటి అండ్ ది సోషల్ క్రైసిస్" అనే గ్రంథాన్ని ప్రచురించినాడు. ఈయన న్యూయార్కు నగరంలో సాంఘిక కృషిలో పాల్గొన్నవాడు. పై పుస్తకం ప్రొటెస్టాంటిజంకు చెందిన వారం దిరిలోనూ ఈ సువార్త సాంఘిక రూపాన్ని గురించి ఊహాపోహలను భావా లను ఉద్దీప్తంచేసింది. సాంఘిక సంస్కరణ ప్రణాళికను సంకట స్వరూపం లోనికి అనువదించుట వల్లను, "దైవసామ్రాజ్యాన్ని భూమి మీదికి అవత రింపచేయుటగా" చెప్పుటవల్లను, సంప్రదాయికంగా వస్తున్న క్రైస్తవమత ప్రచారం క్రీస్తు రాజ్య పరిపాలనము అనే విషయాలలోని అర్థాలకు ఒక క్రొత్త ఆచరణ సాధ్యమైన రూపాన్ని కల్పించుటలో కృతకృత్యుడై నాడు. ఈ సువార్తవల్ల అనతి కాలంలోనే సంస్కరణ కావాలనే ఒకక్రొత్త

తెలివి అప్పుడే అవతరించినట్లుగా చేసింది. చర్చీలలోని సంఘసేవా కార్య కలాపాలను మామూలు లోకోపకార కార్యముల కంటె మరింత తీవ్రంగా తయారుచేసిన ప్రాటెస్టెంటుకృషికులలోని 20వ శతాబ్దపు తలతంతు నాయకులను పేర్కొనక తీరదు: (1) చార్లెస్ స్టెల్ జల్. ఇతడు 1903 లోనే డిపార్టుమెంటు ఆఫ్ చర్చ్ అండ్ లేబర్ ఆఫ్ ది ప్రిస్బిటీరియన్ బోర్డు ఆఫ్ మిషన్సు స్థాపించినాడు. తనతెగలో ఉండిన అధిక సంఖ్యాకులైన కన్సర్వేటివులతో కష్టపడి పోరాడి ప్రచారముచేసి నాడు (2) హారీఎఫ్. వార్డు. మెథడిస్టులలో ఇతడు ఇట్లాంటిసేవే చేసినాడు. చర్చీలను సోషలిస్టుపార్టి, సివిల్ లిబర్టీస్ యూనియన్ వారి ఎత్తుగడలు రాజకీయములవైపు మళ్ళించ ప్రయత్నించినాడు. (3) షైలర్ మాత్యూస్, గ్రాహమ్ టైలర్. వీరు చికాగోలో శాస్త్రజ్ఞుల మధ్యను, సాంఘిక కృషి ఆచరణలోనూ ఈఉద్యమాన్ని నడిపినవారు. (4) ఎఫ్. ఎర్నెస్ట్ జాన్‌సన్. ఇతడు ఫెడరల్ కౌన్సిల్ ఆఫ్ చెర్చెస్ చేస్తుండిన చాలాకృషిని నడిపించినవాడు. ఈశతాబ్దపు మూడవ దశకంలో ఫెడరల్ కౌన్సిల్‌వారు 1908లో ప్రచురించిన "సోషల్ క్రీడ్" అనే గ్రంథాన్ని క్రొత్తగా కనుపింప చేసినాడు. (5) రీన్ హోల్డునీబూర్, అతని సోదరుడు హెచ్. రిచర్డ్‌నీబూర్. వీరు సాంఘిక సువార్తకు మరింత యదార్థము తీవ్రము అయిన సాంఘిక లక్షణాన్ని పరీక్షించి దానికిఉన్న బూర్జువా లిబరిజమ్ అనే మచ్చను పోగొట్ట ప్రయత్నించినవారు. వీరందరి కృషివల్లను మరి ఇంకొక 20మంది నాయకుల కృషివల్లను పెద్ద చర్చీలకు సంబంధించిన కేంద్రపరిపాలన సంఘాలు, ఏజెన్సీలు మాత్రమే కాకుండా మతోద్యోగు లందరు "సాంఘిక వ్యవస్థను క్రైస్తవ మొనర్చు" కార్యమునకు ఉపకరించినారు.

సంస్కరణ వాదులైన లాబీలు 1985నాటి తమ పిట్సుబర్గు వేదిక నుండి "అధునిక కాలంలోని ఈమహా కార్యంలో తాము పాల్గొనుట, ఇప్పటి సంఘ వ్యవస్థలో కనబడుతున్న అంతరాలు చెడుగులు కల్పించిన సమస్యలను న్యాయధర్మాల ప్రాతిపదికమీద తీర్చుట, తమవిధి" 12 అని కొంచెం ఎదురుగానే స్పష్టపరచినారు అయితేఅటు తరువాత అమెరికన్ జుడాయిజం లోని మూడుశాఖలు కూడా సాంఘిక న్యాయాన్ని గురించి గట్టి అభిప్రాయాలనే వెలిబుచ్చినవి.

ఒక సాంఘిక పునర్నిర్మాణ ప్రణాళికను తయారుచేసిన అమెరికన్ మత పాలకుల పాస్టర్ లేఖ 1909లో వచ్చిన తరువాత కాథెలిక్కులు "సాంఘిక చర్య" లో చొరబడినారు. కాథెలిక్కులలో సాంఘిక సువార్తను బలపరిచినవారు సాంఘిక చర్యాశాఖకు నేషనల్ కాథెలిక్ వెల్ ఫేర్ కాన్ఫరేన్సుకు చెందిన జాన్ ఎ. ర్యాన్ ఒకడు, అనేక హోదాలలో పనిచేసిన ఆర్ ఏ. మాన్‌గొవన్ ఒకడు. శ్రామికుల కందుబాటు పొందుటలో చాలా కృతకృత్యములైన మతసంబంధమైన ఏజెన్సీలలో అసోసియేషన్ అఫ్ కాథెలిక్ ట్రేడ్ యూనియన్స్ (1937) ఉన్నది. నేషనల్ కాథెలిక్ వెల్ ఫేర్ కాన్ఫరెన్సు 1920 తొలినాళ్లలో నిర్మింపబడింది. ఇప్పుడిది దేశంలోకెల్లా మతసంబంధమైన సాంఘికచర్యను పూనుకొన్న శక్తివంతమై. కేంద్రంగా నిర్మితమైన ఏజెనిన్సీలలో ఒకటి. ఇది ఎనిమిది శాఖలద్వారా పనిచేస్తుంది: కార్యాచరణ (ఇందులో ఎత్తివచ్చిన వారికి సేవ, సిద్ధాంత, వివరాల సేకరణ, ప్రచురణలు కూడా చేరుతవి.) విద్య, వార్తాపత్రికలు, సాంఘికచర్య (ఇందులో పారిశ్రామిక సంబధాలు, కుటుంబ జీవితం, గ్రామీణ జీవితం, శాంతి, యుద్ధానంతర సమస్యలు, అప్పులు, ఆరోగ్యం, వస్త్రవి.), చట్ట సంబంధశాఖ (ఇది శాసన సభలలోని లాబీలలో పనిచేస్తుంది), కాథలిక్ చర్యా పరిశీలనము, యువజనశాఖ (ఇందులో నేషనల్ కాథలిక్ యూథ్ కౌన్సిల్, ఫెడరేషన్ అఫ్ న్యూ మన్ క్లబ్బు వగైరాలు), లౌకిక సంఘాలు. స్థిరమైన ఈశాఖలకు తోడుగా అవసరమైన పుడల్లా ప్రతేక సేవా కార్యాలు ఏర్పాటు చేస్తుంది. యుద్ధ బాధితులకు సహాయం, కాందిశీకులకు సహాయం (1936, నేషనల్ లీజియన్ అఫ్ డీసెన్సీ (1934), న్యూయార్కు నగరంలోనికాథలిక్ ఇంటర్ రేషియల్ కౌన్సిల్ (1934)కాథెలిక్ ట్రేడ్ యూనియనిస్టులసంఘం (1937),అమెరికన్ పౌర స్వతాన్ని కిసంబందించినకమిషన్ (1939), నేషనల్ కాథలిక్ కమ్యూనిటీ సర్వీస్ (1940), పారిశ్రామిక సంఘాల రంగంలో కాథెలిక్కులు చాలా బలంగా ఉండి 1933 నుండి కాథెలిక్కు కార్మిక ఉద్యమము నడుస్తున్నది: ది కాథెలిక్ వర్కర్ అనే 65,000 ప్రచారంగల మాసపత్రికను ప్రచరిస్తున్నది.

1946నాటికి ప్రొటెస్టెంటులు, యూదులు, కాథలిక్కులు "ఆర్థికన్యాయ ప్రకటన"లో ఒకటి కాకల్గినారు. ఈ ప్రకటన 19వ శతాబ్దములో ఈ వర్గా

లలో ఏఒకరు చేసిన దానికంటె కూడా మరింత ముందుకు పోయింది. ఇంతలో న్యూయార్కులో (డాక్టర్ ఫెలిక్సు అడ్లర్ ప్రోత్సాహం క్రింద) తదితర నగరాలలో నైతిక సంస్కృతి సంఘాలు వెలసినవి. ఇవి వివిధ మత స్థులను మతంలేని వారికి ఒకచోటికి తెచ్చి మతవిషయకంగాను, ఆచరణ లోనూ ఒక సాంఘిక నీతిని కలిపి అభివృద్ధి చేసేటట్లు చేసింది. ఈ సంఘాలు సాధారణంగా కొంత ఉదారమైన అమెరికన్ మత విశ్వాసాలతో క్రమాధి కంగా కనబడుతున్న పద్ధతిని తీవ్రంగా ప్రకటించేవి. సాంఘిక పునర్నిర్మా ణానికి ఆచరణ ప్రణాళికకు ఆగమ సంబంధమైన విభేదాలను లోబడచేసి పనిచేయాలనేదే ఈ పద్ధతి. క్రైస్తవ సామ్యవాదుల వలెనే వీరుకూడా ఒక సంఘ వ్యవస్థను మనుష్య సంబంధంలేని అతీత లక్షణాలతో కాక ఆ సంఘం లోని మనుష్యులు ఏరకంగా తయారవు తున్నారనే దానిని బట్టి నిర్ణ యించవలె ననే సిద్ధాంతాన్ని నొక్కిచెప్పినారు.

ఆర్థిక సమస్యలమీద మతసంబంధమైన భావాలు, చర్యలు సామాన్యంగా ఏవిధంగా నడచినవో వర్ణించుట అంత సులభంకాదు. ఏమనగా లౌకికమైన ఆలోచనలు చర్యలు ఎంతభిన్నంగా ఉంటవో ఇదికూడ అంతే. మొత్తం మీద చర్చీలు లౌకిక హృదయాన్ని ప్రతిబంచించినవని తాము విధిగా నాయకత్వము వహించడంగాని, విధిగా అనుగమించడంగాని చేయ లేదని చెప్పడం క్షేమం. సాంఘిక న్యాయ విషయాలలో మనుష్యులకు చర్చీలు తామే నైతిక నాయకులమని భావింప బోతాయి. మతోద్యోగ విరోధులు చర్చీలు బొత్తిగా సంప్రదాయ పాఠకములని అనుకో బోతారు. ఈ రెండు విపరీత భావాలలో ఏదీ నిజంకాదు. సాంఘిక సంస్కరణను నడి పించిన నాయకులలో మతోద్యోగులు, మతదృష్టితో పనిచేసే లౌకి కులు ఎప్పుడూ ఉంటూనే ఉన్న చర్చీలయొక్క ప్రధాన కార్యం అసంస్కృ తులకు ప్రాతినిధ్యం వహించడం మాత్రమే. లౌకికమైన పత్రికా రచన నాటక రంగాల కంటెను, సాంఘిక విజ్ఞానాచార్యుల కంటెను, రాజకీయ పక్షాల ప్రచారోద్యమాల కంటెను, ఎక్కువగా మతసంస్థలకు చెందిన ఉప న్యాస వేదికలు, పత్రికలు మామూలు అమెరికనులకు ఇది తప్పు ఇది ఒప్పు అనే భావాన్ని గురించి సులభమైన స్వరూపాన్న భావికమైన శక్తిని ఇచ్చి నవి. పోల్చి చూచినప్పుడు సంస్కరణలను కలుగచేయుటలో అవి అంతగా పనిచేసి ఉండక పోవచ్చు. (ఒకటవ ప్రకరణము చూడుడు) కాని

సంస్కరణావశ్యకతను ఎంతో నిపుణంగా "అచ్చు కొట్టినట్లు" చూపుత వనుట నిశ్చయము.

సాంఘిక సువార్త తొలినాళ్ళలో పోప్ ఉద్యమాన్ని "పెట్టుబడిదారీ విధానాన్ని" నిందించుట (అనగా ఫాక్టరీల పద్ధతినికాక బ్యాంకుల పద్ధతిని ముఖ్యంగా నిందించుట— మత పరిభాషలో "ధన పిశాచం"), లాభో ద్దేశ్యాన్ని నిందించుట— ప్రతిబింబించుటయే ప్రధానంగా ఉండేది. అంతర్ వ్యక్తి సహకారాన్ని గురించి చెప్పియు, మనుష్య గౌరవం సౌభ్రాత్ర గౌరవం కల్గినదనియు, చివరస్వ "సేవా" భావాన్ని కల్గించియు, ఆర్థిక వ్యవస్థను మా న వ ల క్ష ణ స ము పే త మొ న ర్చు ట ల క్ష్యం గా ఉండేది. దురాశ జయింపవలసిన ఒక మహా పాతకం, ఆ దురాశ రెండు రకాలు— ఒకసంస్థ ఒక ఉదేశ్యం మానవ సౌభ్రాత్ర సంసిద్ధియో (సంస్థ గానూ ఉద్ధేశ్యంగానూ) ఈ సువార్తయొక్క ప్రధాన సందేశం. వర్గచైత న్యాన్ని ఇది స్పృశించలేదు. తద్భిన్నంగా తెగలన్నభావమే మతసిద్ధాంతా లకు సరిపోనివి. లౌకికమైన అమెరికన్ సామ్యవాద శక్తులుకూడ వర్గా లను ప్రబోధించడం జనులకు రుచికరం కాదనే విషయాన్ని, మార్క్సు చెప్పిన వింగడింపు వైదేశికమనే విషయాన్ని గణనలోకి తీసుకో వలసి వచ్చింది. సాంఘిక న్యాయమనే లక్ష్యం క్రైస్తవులలోనూ యూదులలో మంరిత బలవత్తరంగానూ, న్యాయ శాస్త్రానికి సంబంధించిన వ్యక్తిసంబంధం లేని అతీత రూపంకాక వ్యక్తియొక్క హక్కులు అవసరా లనుబట్టి ఉత్సా హపూరిత రూపంగా భావింప బడింది.అందుచేతనే చార్యా కార్యక్రమాన్ని ప్రభుత్వం మీదికి (యాంటీమొనా పలీ యాంటీ ట్రస్టు శాసన నిర్మాణ విషయాలలో తప్ప) మళ్ళించిన దానికంటె ఎక్కువగా ఉద్యోగులలోనూ, యజమానులలోనూ శ్రామికుల శ్రేయస్సును గురించిన భావం పెంపొదిం చడం వైపే మళ్ళింప బడింది. ఇట్లే వ్యాపార సంఘాలను శ్రామిక సంఘా లను అవి సామూహికంగా బేరమాడే ఏజెన్సీలు వర్గ వ్యతిరేకమైన ఏజె న్సీలు అనికాక "ఉదార రక్షణ" సంస్థలుగా బలపరప బడినవి. రిష్లిల్ ట్జొల్ చెప్పిన జర్మన్ సాంఘిక శాస్త్ర సంస్కారంతో, 19వ శతాబ్దపు యుటోపియన్ సంస్కర్తలకంటె కొంచెం తక్కువ అశాశ్వత భావంగల రూషెన్ భూష్‌కూడ తన "భగవత్సామ్రాజ్యాన్ని" మానవుల వుద్దేశ్యాల లోని విప్లవ రూపంగా భావించినాడు. 1907లో అతడు ఇట్లు వ్రాసినాడు:

మనుష్య ప్రకృతిలో లోభాన్ని అదే పనిగా పెంపొందించి మేదురం చేసే ఒకానొక సాంఘిక వ్యవస్థను కనిపెట్ట నుద్దేశించి నట్లైతే ఈ ప్రయోజనానికి మనదాన్ని మించిన మరిదేనిని తయారు చేయడం వీలవుతుంది ? పోటీవ్యాపారం స్వార్థపరతను ఒకనైతిక సూత్రస్థాయికితెచ్చి హోదా కల్పిస్తుంది ... ఎంతో సాధువులు దయాపరులైన స్నేహితులు ఇరుగు పొరుగువారుగా ఉండే మనుష్యులను అది తమతమ కొట్టులలో అంగళ్ళలో విడవకుండా పీకిపాకంపెట్టి పనిచేయించే వానిరిగా చేస్తుంది.13

పోటీ సూత్రం కమ్యూనిజం సూత్రం అనేవానిని నైతిక గుణాలమధ్య ఉన్న బేధం ప్రజాబాహుళ్యానికి అర్థమయ్యేటట్లుగా చర్చివారు సహాయపడి తత్వత: క్రైస్తవమైన దాని తరఫున మతసంబంధమైన ఉత్సాహాన్ని తమకు సహాయంగా రప్పించుకోవాలి. 14

తరువాత 1942లో రూమెన్ భూష్ ఇలా వ్రాశారు: "పదార్థాలను మనుష్యుల కంటె గొప్పగా చూడడం నిజానికి అపాయకరమైన ఆచరణ లోకాయతన పద్ధతి. భగవంతునికంటె ముందుగా ధన పిశాచాన్ని కొలచడం జీసస్ మనను జాగ్రత్తగా వారించిన నిగ్రహారాధన." 15

మరి 1933 నాటికి "ఫెడరల్ కౌన్సిల్ ఆఫ్ చర్చస్" వారు ఇలా చెప్పుతూ ఒక ప్రకటన చేసినారు: "వ్యక్తిగత లాభోద్దేశ్య స్థానంలో పరస్పర సహాయోద్దేశ్యాలు పూర్తిగా వస్తేనే గాని క్రైస్తవుల అంతరాత్మ తృప్తి పడదు" 16

అమెరికన్ కాథలిక్కులు లియో XIII వారి రే ర మ్ నొ వ ర రం (1891) అనే శ్రీముఖంలోని అంశాలను అందుకొని సాంఘిక వ్యవస్థను మానవతా గుణోపేతం చేయవలెననే అతేప్రాతిపదిక భావాన్ని చెప్పినారు. కాని ఉద్దేశ్యాలమీద ప్రాధాన్యం నిలపకుండ దిద్దడానికే ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చినారు: ఉదారము, న్యాయశీలము అయిన సాంఘిక వ్యవస్థకు బ్రతుకు తెరువునిచ్చే కూలి న్యాయమైన వెల పునాదులవంటివి. వీటిని సంపాదించడానికి "ఆర్థిక ప్రబలత్వా" న్ని, పోటీని "న్యాయమైన పరిమితావధులలో ఉంచడం" అవసరం. కాథెలిక్కులు కూడ ప్రాటెస్టెంటుల కంటె ఎక్కువగానే సమానత్వాన్ని ఒత్తిచెప్పినారు: అనగా సహకార సహస్వామిత్వ పద్ధతుల ద్వార స్వామ్యమును ప్రజాస్వామికంగా పంచి పెట్టడం.

కాని సర్వసాధారణంగా "ఆర్థిక ప్రజా స్వామ్యం" కావలె ననుటలో అన్నిమత వర్గాలు ఏకీభవించినవి. ఆర్థిక ప్రజాస్వామ్య మనగా వారి అభిప్రాయము ప్రకారం సాక్కుల సమన్వయం చేతనో లేదా ప్రజాస్వామ్య విధానానికి లోబడిన ఐచ్ఛిక సహకారం చేతనో పరస్పర వ్యతిరేకత (లేదా విపరీతమైన పోటీ) తొలగింప బడిన సహకార ఆర్థిక వ్యవస్థ. ఇందులో జాతీయం చేయుట కానీ లేదా "ప్రభుత్వమువారి పెట్టుబడిదారీ విధానం" అంతర్భ వించవు: ఈరెండవది 19వ శతాబ్దపు స్వామ్య వాదులలో ముఖ్యమైన ఉత్సాహ విషయంగా ఉండినది. నిజానికి ఈ ఊహించిన ఆర్థిక వ్యవస్థకు అంత ప్రత్యేకమైన ప్రణాళిక అంటూ ఏమీలేదు. దానిది రాజకీయమైన లక్ష్యమూకాదు. దాని ఉద్దేశ్యం చర్చీలను సంస్కరణలకు సంబంధిచిన ఒక పాక్షికమైన ప్రణాళికలో ఇరికించేటంత స్పష్టంగా ఉండక శ్రామికులను చర్చీలలోనికి తెచ్చేటంత విస్తృతంగా ఉండటం మాత్రమే. చర్చీలు, ముఖ్యంగా ప్రాటెస్టెంట్ చర్చీలు బూర్జువాగా ఉంటున్నవని, శ్రామికుల విషయంలో ఉదాసీనంగా ఉండటమేగాక ప్రబలంగా ఉన్న తెగకు సూటిగా సాధనాలుగా ఉంటున్నవని ఒకనింద ఏర్పడింది: ఈ నిందను విస్తారంగా విశ్వసించి నారుకూడ. వ్యవస్థితమైన మతం తమ శ్రేయస్సుకు పాటుపడుతున్నదని శ్రామిక వర్గాలకు రుజువు చెయ్యటం, వారిని తమతోపాటు మత సంబంధమైన ఏజెన్సీల ద్వారా పనిచెయ్య డానికి ఆహ్వానించటం ఈ సాంఘిక సువార్త యొక్క కార్యం. ఈ విధంగా 1934లో కాంగ్రిగేషన లిష్టు నాయకులు తమ పరిషత్తును నిర్మించి నప్పుడు వారు లోకంకొరకు చర్చినే త్యాగము చెయ్యటాన్ని గురించి మాట్లాడినారు: "యుద్ధ రహితము, న్యాయ సమ్మతము, సౌభ్రాత్ర సమ్మత ముఅయిన ప్రపంచాన్ని సాధించటానికి జరిపే పోరాటంలో చర్చి తన్ను తాను త్యాగం చేసినా తన్ను తాను దర్శింప చేసుకో గలదనే విశ్వాసంతో, సర్వ జనులు శాంతి, రక్షణ, సమృద్ధమైన జీవితము పొందగలిగే దినానికై చేసే ఎడతెగని కృషికి ఆత్మాంకితం చేస్తూ మేము ఈ సాహస కార్యాన్ని ప్రారంభిస్తున్నాము."

కాంగ్రిగేషనలిష్టులతో పాటు ఇతర ప్రాటెస్టెంట్ చర్చీలుకూడ ఆర్థిక మాంద్య కాలంలో ఫెడరల్ కౌన్సిల్ తో చేరి "జాతీయ పశ్చాత్తాప" మనే అలను కల్పించినారు. ఈ ప్రాటెస్టెంట్ చర్చీలకు సంబంధించిన లౌకికులు రాజకీయంగా కొంతవరకు సంప్రదాయ పాక్షికులై ఉండి ప్రిస్బిటేరి

యను, ఎపిస్కోపలియనులు) ఇందులో చేరినారు. ఈ జాతీయ పశ్చాత్తాపము వాళ్ళని "న్యూడీల్"లో ఇరికించక పోయినా వారి అంతరాత్మలు ఈ విషయంలో సుఖంగా లేవని వారు సాంఘిక రక్షణ ప్రణాళికలను, పథకాలను ఒకవిధంగా పరిగ్రహించడానికి సుముఖంగా సూచింది అయితే విస్తృతమై సంధిగ్ధగా ఉన్న ఈ శ్రామిక వర్గంలో ప్రచారం తనశక్తిని చాలావరకు పోగొట్టుకొన నారంభించది. మరి ఈ విషయానికి దోహదం చేసేందుకు చర్చీలు రాజకీయ రంగంలోకి దిగి రావలసిన ఒత్తిడి ఏర్పడింది. అవికూడ ఆపనిచేసి ఫలితాలను అనుభవించినవి: ఉద్యమానికి ఉండిన నైతికమైన ఐక్యం పోయింది. అయితే ఆర్థిక వ్యాపారానికి తీవ్రంగా పూనుకొన్నది. ప్రతిఒక ప్రార్థన సదస్సులోనూ ఆర్థిక పథకాలకు శ్రామిక సంస్థలకు సంబంధించిన ఆచరణలోని యదార్థ విషయాలను గూర్చి చర్చించి ఏర్పరచుకొన్న లక్ష్యాల దృష్టిలో వాటి విలువలు నిర్ణయించేవారు. విశ్వాసానికి, ఆసక్తికి సంబంధించిన తీవ్రమైన విభేదాలు ఏర్పడి స్థానికకంగాను జాతీయంగానూ చర్చీలను కలచ నారంభించినవి.

ఫెడరల్ చర్చి సంఘాలు, జాతీయ లాబీలు, మతోద్యోగులు కూడ సాధారణంగా పలుకుబడి గల లౌకికుల కంటె మరింతగా "సామ్యవాదానికి సన్నిహితంగా వచ్చినప్పుడు 1937లో చర్చి లీగ్ ఆఫ్ అమెరికా ఏర్పరుపబడింది. ఇది "మత రంగంలో ఈక్రొత్త సువార్త" వ్యాపించ కూడదని కృషి చేసి" జాతిలోని మతోద్యోగుల కందరికి చర్చీలకు సహాయ పడుతు ఈ దేశపు స్వంతవ్యాపార పద్ధతిలో తమ సర్వస్వము పెట్టుకొన్న సామాన్యుల అభిప్రాయాన్ని తెలియ చెప్పుటకు" ప్రయత్నించింది. దానిప్రకారం వారు ఈ "లాభమనే భావంలోనూ, లాభం చేసుకొనే ఉద్దేశ్యంలోనూ, ఏదో కోరిక చెడుపు ఉన్నది.... అనే అభిప్రాయన్ని చాలావరకు అంగీకరిస్తున్న మతోద్యోగులకు, అధ్యాపకులకు, తదితర సంఘ నాయకులకు"17 విరుద్ధంగా కృషి చేసినారు. మరి మతోద్యోగులు తమకు "అనుభవం" లేని విషయాలలోకి సాహసించి వస్తున్నారని తలచిన దైవభీతిగల వ్యాపారుల్లో ఎన్నో చీకాకు లక్షణాలు అంతటా కనిపించినవి. వారు సాధారణంగా మతోద్యోగులు కానీ, ఫెడరల్ కౌన్సిల్‌గాని ఆయా చర్చీల అధికారిక చర్చా వేదికలుగా తమ అభిప్రాయాలను చూపించడం మానుకోవాలని ఒత్తిడి చేసినారు. చర్చీలు వాణిజ్య రాజకీయ అంశాలను విడమరచి చెప్ప

కుండా పశ్చాత్తాపాన్ని దిద్దుబాటును ప్రచారం చేస్తూ "చర్చిగా ఉండడం" లోనే తృప్తిపడాలి అనే భావాన్ని ఆమోదం తెలపినారు.

అయినప్పటికి సాంఘిక చర్యకుగా నేర్పడిన కమిషన్లు, సంఘాలు తాము మంచివని చెప్పిన ఆయా విధానాలను సార్వత్రికంగా బలపరచేటట్లు చెయ్యటం అసాధ్యమని పించినను, లౌకిక జీవితానికి సంబంధించిన బహు విధ విషయాలను మత సమాజాలలోకి తీసుకొనిపోయి స్పష్టమైన నైతిక అంశాలను బలవంతగా ఎత్తబెడుతు ముందుకు సాగినారు. ఈ విధంగా ధర్మోపన్యాస వేదికలు, ఆదివారపు బడులు, వై. సి. ఏ. లు అమెరిక అంత రాత్మలను స్పష్ట పరచడానికి ముఖ్యమైన చర్చావేదికలు అయినవి. ఇంతలో సాంఘుక సువార్త నాయకులు వ్యక్తి సమావేశానికి గుమికూడి రాజకీయా లలో వారివలె ఎవరికీ భాధలేని ఉపన్యాసాలు జరిపించడానికి బదులుగా నిజమైన నీతివాదులు వలె తాము అంగీకరించటానికి తగిన విధానాలను తేల్చుకోడానికి ప్రయత్నించినారు. ఒక ఫలితమేమంటే ఫెడరల్ కౌన్సిన్ 1932లో "చర్చీల సాంఘిక లక్ష్యాలు" అనేదానిని మార్చి వ్రాసిన. (చూడు ఎగ్జిబిట్ VII)

సూత్రాలను మరింత స్పష్టంగా పునర్నిర్మించ టానికి తోడుగా నేషనల్ కౌన్సిల్ అసంఖ్యాకములైన పరిశోధన కార్య క్రమాలను విచారణలను ఆరంభిస్తున్నది. వాటిలో "క్రైస్తవ మత సూత్రలను ఆర్థిక జీవితానికి అన్వ యించుట" అనేది (రాక్ ఫెల్లరు సంస్థవారు కూడా ఆరంభించిన) ఒక పరి శోధన. దాని నిర్వాహకులు శ్రీచార్లెస్ పి. టాఫ్ట్ గారి అభిప్రాయం ప్రకారం పరిశీలింప వలసిన ముఖ్య విధమైన సమస్య ఏదనగా సమగ్రమైన ఆర్థిక నిర్మితి, శక్తి పెరుగుటవల్ల నైతిక భాధ్యత, నిర్ణయాలు ఏవిధంగా మారుతవి అన్నది.

అధికారిక మైన ఆమోద ముద్ర లేకపోయినా నేషనల్ కాథలిక్ వెల్ ఫేర్ కౌన్సిల్, ఫెడరల్ కౌన్సిల్ ఆఫ్ ది చెర్చస్ ఆఫ్ క్రైస్తు, నవెకాన్ కౌన్సిల్ ఆఫ్ అమెరికా 1946లో సంయుక్త, ప్రకటనలుచేసినవి. అమె రికా దేశము మత అంతరాత్మ స్పష్టమగుట 1932 తర్వాత సాంఘిక సంస్క రణకు సంబంధించిన సామాన్య సూత్రాలను వ్యక్తపరిచే విధంగా పురోగ మించిందని ఇది సూచిస్తున్నది. మరి కేంద్ర అధికారిక మతసంస్థలు అవ

లంబించిన వైఖరి సామాన్యుల, శాసన సభ్యుల అంతరాత్మలను తగినంతగా
ప్రభావితం చేసిందని అనడానికి గట్టి సాక్ష్యమే ఉంది.

సామాన్యమైన ఈ నైతిక భూమితో పాటు వివిధములైన మత పత్రి
కలు, లాబీలు నిర్దిష్టమైన ఆర్థిక రాజకీయ సంస్కరణలు కావాలన్నవి. ఈ
విధంగా కాథలిక్కులు అనేక విధాలైన సహకార సంఘాలు ప్రారంభించి
నారు. మొన్న మొన్న పోప్ గారి సంఘ సిద్ధాంతం (కార్పొరేటిజమ్) చేతను,
ఇటలీ పోర్చుగల్ దేశాలలోని సిండికలిస్ట్ ప్రయోగాల చేత ప్రభావితులై
"ఆర్థిక పరిషత్తులు" స్థాపించాలని కోరినారు. ఇవి ప్రతి ఒక్కరికి సాధ్య
మైనంత ప్రజాస్వామ్య లక్షణాన్ని స్వతంత్ర ప్రతిపత్తిని ఇస్తూ అందరికి
ఒక కేంద్ర ప్రణాళిక ఏజెన్సీనిస్తూ జాతి యొక్క ప్రధానమైన హక్కులను
కార్యాలను సామూహికంగా సమన్వయ పరచేవి. ఈ విధంగా అమెరికన్
బిషప్పులు 1948 నవంబరు 20 నాటి తమ మానిఫెస్టోలో (చూడు ఎగ్జి
బిట్ VIII లో "అందరి శ్రేయస్సునకై పెట్టుబడి, శ్రామికులు శాశ్వ
తమైన ఏజెన్సీలుగా సహకరించే స్వతంత్రమైన నిర్మాణాన్ని" మరియు
ప్రతి పరిశ్రమలోనూ, మొత్తం ఆర్థిక వ్యవస్థలోనూ ప్రభుత్వము యొక్క
అధికారంలో కాక అజమాయిషీ క్రింద పెట్టుబడిదార్లకూ, శ్రామికులకు,
సంబంధించిన అధికారికి ప్రతి నిధులకు మధ్య నిరాటంకంగా ఏర్పరుపబడిన
సహకారం కాంక్షించినారు. ఈ నిరాటంకంగా ఏర్పరుపబడిన సహకారం
యొక్క ఏజెన్సీలను పలువిధిములైన పేర్లతో పిలచినారు: ఉద్యోగవర్గాలు,
వృత్తివర్గాలు లేదా మొన్న మొన్నటి పరిశ్రమ పరిషత్తులు." ఈ "వింగ
డింపు సిద్ధాంతం" లేదా సిండికలిస్టు బహుత్వ సిద్ధాంతం (బ్రిటిషువారి గిల్డు
సోషలిజమ్ వంటిది) ప్రభుత్వంవారీ విధానములోని అధికార్ల పరిపాలనను,
మరియు పార్టీనియంతృత్వాన్ని తప్పించుటకు ఉద్దేశింప బడింది. రాబీల
సంఘాలు సమమైన ఆర్థిక వ్యవస్థకు, ఆర్థిక సమానత్వానికి సర్వుల రక్షణకు
ప్రైవేటుగా గుత్తగొనడాన్ని నిర్మూలించడాన్ని, బాంకులను ప్రజల యజ
మాన్యములోనికి తెచ్చుటకు, వాహక సంవాద పద్ధతులకు, విద్యుచ్ఛక్తి
మూలములకు, ఆర్థికమైన పథకాలు వేయడం అవసరమని నొక్కిచెప్పినవి.
ప్రొటెస్టెంటులు "సాంఘిక శ్రేయో రాజ్యాన్ని" సూత్రప్రాయంగా అంగీ
కరించినారు కాని ఒకస్పష్టమైన కార్యక్రమానికి తాము కట్టుబడి మాట్లాడ
లేదు. ఏమైన వాళ్ళు పరిశ్రమలోని స్త్రీలకొరకు, పిల్లల కొరకు రక్షకమైన

శాసన నిర్మాణాన్ని ఆరంభింప చేసినారు. కాథలిక్కులు ఈ పనిచేయడానికి సుముఖంగా ఉంటుండడంలేదు.

## సాంఘిక సువార్తను గూర్చిన పునరాలోచన

మతసంస్థలు రాజకీయ రంగంలోకి దిగడంఎంత విజయవంతంగా కొనసాగిందంటే, అది ఇరుకునపడ్డట్టుగా అయింది. కొంత ఎక్కువ ఆలోచన, బాధ్యత, కలఉద్యమ నాయకులు వ్యవస్థారూపంగా ఏర్పడిన మతానికి విప్లావక పరిణామాలు రావచ్చునవి భయపడ సాగినారు. కొందరు నాయకులు విప్లవాత్మకమైన మార్పులను అహ్వానిస్తున్నారని బయటికి పొక్కగానే ఈ భయాలు మరింత నిజమైనవి. క్రైస్తవ చర్చిల స్థానంలో క్రైస్తవితమైన సాంఘిక వ్యవస్థ సరిపోలునా? కానిచో చర్చిలు అటువంటి "రాజ్యంలో" విప్రత్యేకమైన పాత్రను నిర్వహింపగలవు? మతసంబంధమైన సామ్యవాదం లౌకిక సామ్యవాదం కంటె భిన్నంగా ఉంటుందా? కొంచెం ఇంచుమించు జిజ్ఞాసా రూపమైన ఈ ప్రశ్నలకు మొన్న మొన్న జరిగినసంఘటనలు ఊహాకు రాని సమాధానాలను సూచించినవి, ఆర్థిక మాంద్యము, నియంతృత్వాలు, ప్రపంచ యుద్ధం రాజకీయ సంస్కరణను ఎంతక్లిష్టంగా చేసినవంటే అమెరికాలోకూడ సంస్కర్తలే దిక్కుతెలియని స్థితిలో పడినారు. ముఖ్యంగా ఉదారవాదులు పెరుగుతున్న అధికార దాహాన్ని చూచి చకితులైనారు. లౌకికులు మతోద్యోగులతో "రాజకీయంగా విషయాలను క్లిష్టం చేయవద్దు, కానీ నైతికాధిరాన్ని సులభం చెయ్యండి" అని అనసాగినారు. ఉపాధ్యాయులు తమకు "ఏది ఏదో" తెలియ చెప్పాలని యువకులు అనుకోసాగినారు. జనసామాన్యం లోని ఈదిక్కు తెలియనితనం అధికారవాదుల చేతుల్లోకి ఎంతగా పడిపోయిందంటే, సాంఘిక కంగా మార్చివేసిన మతానికి చెందిన అమెరికన్ నాయకులకు ఒత్తిడి కలిగించే తరుణ సమస ఇట్లా ఏర్పడింది. అధికారదర్పం లేకుండా అధికారాన్ని మనం ఎట్లా తెచ్చిపెట్టగలము?

క్రమక్రమంగా భూలోకంలోని భగవత్ సామ్రాజ్యంలో ప్రచారం చేస్తున్నవారికి ఆసామ్రాజ్యంలో చిత్రంగా దివ్యమైన లేదా పవిత్రమైన ఒక

సంఘానికి— దివ్య దర్శన లౌక్యాలకు రక్షకులుగా దాని తరఫున మాట్లా డేవారిగా ఉండటమే ప్రధాన కార్యముగా ఉన్న సంఘాల విస్తృత సమాజంలో ఒక సమాజానికి— అవకాశం ఉండాలనే స్పష్టంగా తెలిసివచ్చింది. మహా సముద్రానికి ఆవలి గట్టునుండి అటు ఇటు బడివచ్చిన రాగాన్ని వాళ్ళు ఇప్పుడు సుముఖంగా విన్నారు: "చర్చి చర్చిగానె ఉండనియ్యండి."

కాథలిక్కులకు ఈ సన్నివేశంవల్ల ఏసమస్యా కలుగలేదు. కారణమేమంటే వారు ఏనైతిక విషయం మీదనైన అధికారంతో మాట్లాడడానికి సిద్ధాంత రూపంగాను ఆచరణ రూపంగాను అయత్తపడి ఉన్నారు కాని సాంఘిక సువార్తను అభివృద్ధి చేయదలచిన ప్రాటెస్టెంటులకు మాత్రం ఈ పరిస్థితి బెరుకు కలిగించింది. అనేకములైన అమెరికన్ చర్చిలు పవిత్ర చర్చిగా ఎలా కాగలవు? వాళ్ళకు ఇప్పుడు చర్చి సిద్ధాంతం సాంఘిక సువార్తలోని ఒక ప్రధాన విషయంగా తయారయింది. ఈ సిద్ధాంత రూపమైన సమస్య ప్రజా స్వామ్యాన్ని మతాధికారంతో సమన్వయ పరచవలసిన ఆచరణ సమస్యగా పరిణమించింది. దర్శకాన్ని గురించే ఒక "తీవ్రమైన గవేషణ దృష్టి" కావలసి వచ్చింది. ఈ అవసరాన్ని ఒక ఆగమ శాస్త్రజ్ఞవర్గం తీర్చినారు. వాళ్ళు హెచ్. రిచెర్డె. నీబూర్ మాటల్లో చెప్పినట్లైతే "దర్శనము మన మతభావముల అభివృద్ధికాక వాని నిరంతరమైన మార్పు" అని వివరించినారు. అఖండమైన దర్శనము ద్వారమున ఎడతెగని పరిణామము అనెడి ఈప్రాటెస్టెంటుల అభిప్రాయము ఒప్పుకొన్నను, లేదా కార్డినల్ న్యూమన్ చెప్పినట్లుగా దర్శనంలో అభివృద్ధి ఉన్నదనే ఉదార కాథలిక్కుల దృష్టిని ఒప్పుకొన్నను, ఎందులోనైనా మారుట కనువైన పూర్ణాధికారమును గురించిన భావం చూపబడినది· దీనివల్ల చర్చిలు తమ దివ్యకార్యాన్ని అంటి పెట్టుకొని అదే సమయంలో ప్రజాస్వామిక సంఘంలోని నైతిక ప్రయోగాలలో పాలుపంచుకో గలిగినవి. ఈ విధంగా అధికార విరోధ భావంగల చర్చిలలో భగవద్వాక్కు వినబడ వచ్చును. చాల అమెరికన్ చర్చిలు తమకు క్రైస్తవ ప్రపంచోద్యమం మీద కేంద్రీకృతమైన మతాధికారం మీద ఎంత ఉత్సాహమున్నా చర్చి అంటే ప్రార్థన సదస్సు అనేభావాన్ని నిలబెట్టు కొన్నారు. నిశ్చయంగా అమెరికన్ చర్చి ఒక స్థానిక సమాజం. ఇందులోని సభ్యులు ఇతర సంఘాలలో ఐచ్ఛికంగా చేరినట్లే ఇందులోనూ చేరుతారు. ఈ విధంగా అమెరికన్ చర్చి లౌకిక

సంస్థల మధ్య ఒక విధమైన కలుపుగోలు తనంగా తనస్థానాన్ని ఆక్రమించు కొనుచున్నది. పారిభాషికంగా చెప్పే "పవిత్రత" తప్ప మరి ఇంకేదీ ఉన్న ట్లుగా అభినయించదు. ముఖ్యంగా సాంఘిక సువార్త నాయకులు క్రైస్త చర్చి అంటే ప్రపంచ మహారణ్య మధ్యంలో రోందిచే అతిమానుష కంఠ ధ్వని అని కాకుండా క్రైస్తవ సంఘంలో అథవా సంస్కృతిలో ఒక అంతర్ భాగమైన అంశగా భావించడానికి ఉబలాట పడినారు కానీ యూరప్‌లోని మరింత చర్చి పాక్షికులైన ఆగమజ్ఞులు వీరు కేవలం ప్రాస్థానికులని విమ ర్శించినారు. ఈవిమర్శ తాకిడి చాలావరకు అనుభవించిన యఫ్. యర్నెస్ట్ జాన్ చక్కగా వివరించినాడు.

మీరు క్లబ్బులో చేరినట్లుగా చర్చిలో చేరుతారు. చర్చిని ఈ విధంగా చూడరాదు. ఇందులో సభ్యత్వం ఒక కుటుంబంలోని సభ్యత్వం వంటిది. నిశ్చయంగా మీరు మాకుటుంబాన్ని వదలిపెట్టి పోవచ్చునుకాని కోరినప్పుడు ఆ సభ్యత్వానికి రాజీనామ ఇవ్వలేరు.... ఇక్కడ సమాజ చర్చ "గుంపు కూడిన" చర్చిని — విశ్వాసము గలవారు ఐచ్ఛికంగా ఏర్పడిన సంఘం— ఎదుర్కుంటున్నది. అమెరికాలో ఈ రెండవ రకమైన భావమే బలవత్త రంగా ఉంటున్నది. 18

డాక్టరు జాన్‌సన్ ఈ సమస్యను సూటిగా ఎదుర్కొన్నాడు. సాంఘిక సువార్తకు సంబంధించిన పునః పరిశీలనలో మతాధికార్ల సమస్యకు ఈచెప్ప బోవు ఒక అమెరికన్ సమాధానాన్ని తయారు చేసినాడు:

చర్చి విషయంలో విశిష్ట లక్షణమేమంటే అది ఒక సమాజము. ఈసమా జములో జనులు జీవితంలోని ప్రతి విషయాన్ని గురించిన సంపూర్ణమైన వెల కట్టే పద్ధతిలో పాలు పంచు కొంటారు; ఖండితమైన విధి విధానాన్ని దృష్టిలో పెట్టుకొని తమతమ జీవితాలమీద తమకు తోచిన ఆధ్యాత్మిక నిర్ణయాలు చేసుకొంటారు; తమ పరిపాలనకు కావలసిన సమగ్రమైన నైతిక స్థాయిని ఏర్పచు కొంటారు; సమస్తమైన అనుభవాన్ని సమగ్ర పూజా విధానంలో సమైక్య పరుస్తారు; ఈసమాజా లన్నిటిలోను ప్రమాణమనే సూత్రాన్ని గుర్తిస్తారు. ఎందుకంటే ఆ సూత్రము సరిగా సామూహికమైన ఆలోచన, సామూహికమైన చికీర్ష, సామూహికంగా విలువలనుప రీక్షిం చుట అనే వాటిలోను సారవంతమైన సంప్రదాయ నేపథ్య భూమిక ముందు అనుభవాన్ని పంచుకొంటూ చేసే వ్యక్తిగత శిష్యరికములోను ఉన్నటు

ఆధ్యికము— వ్యక్తి తాను ఏకాంతంగా ఉండి సాధించిన దానికంటె సాముహిక జీవితంలో సాదించ గల్గిన మిన్నతనము: మత సమాజము యొక్క ప్రామాణికత్వాన్ని బలపరిచే యధార్థ విషయ మేంటే కలిసికట్టుగా వివేచించుట వల్లను సాధనకు పూనుకొనుట వల్లను తన్నుతాను అధిగమించే పద్ధతి అని నేను దేనిని అన్నానో ఆదానికి— ఉత్తమోత్తమమైన మతానుభవానికి— ఇది దోహదము చేయుట. "నా పేరు మీదుగా ఇద్దరో ముగ్గురో చేరిన చోట నేనున్నాను" అని చెప్పిన ఈ క్రైస్తవ సమాజ మహాగుణంలోని విశిష్ట లక్షణము మరేమి కాగలదు? సమాజమనేది సంకలన భావము కాదు. మొత్తమూకాదు. మానవ సాహచర్యము వంటి విశిష్టమైన ఒకానొకటి. 19

"నిజమైన భవిషద్వాణి ప్రాతినిధికము" అంటాడు ఆయన. ఇంకొక రకంగా చెప్పితే ప్రజాస్వామిక సంఘులో ఇతర సంస్థలలో సమాజంగా కలిసి బ్రతికే లక్షణం ఉన్నదాని కంటే ఎంత సమగ్రంగా చర్చిలో ఉంటుదో అంత వరకే అది ప్రామాణిక మౌతున్నది. పవిత్ర సంవాద సంకేతాలను చెప్పడం కంటే ఎక్కువగా చర్చి కృషి చెయ్యాలి. సంపూర్ణమైన సమాజానుభవంలో ఎట్లు దివ్యదర్శనం కలుగుతుందో దానికి చర్చి సమగ్ర ఉదాహరణం చూపించాలి.

చర్చి యొక్క భవిషద్వాణి చేసే పుఃనర్వ్యాఖ్యానించటానికి సమాంతరంగా ప్రీష్టుల కార్యాన్ని గురించిన పునర్వాఖ్యానము గూడా వచ్చింది ప్రీష్టుల స్థానాన్ని ప్రజాస్వామికం చెయ్యడం లూథ ప్రకటించినాడు. దాని వల్ల ప్రాట్ స్టెంట్లలో—దిసైపుల్స్, మార్ మన్స్, క్రిష్టియన్ సైంటిస్ట్‌వంటి చాల తీవ్రమైనకొన్ని "లౌకిక" చర్చిలలో తప్ప— ప్రీష్టుల అవసరం చాలా తగ్గించటానికి ఉపకరించింది. కాని మొన్న మొన్నటి ప్రపంచ సంఘటన పరిస్థితివల్ల ఇతర సంస్థలు శ్రద్ధాళువుల సమాజము లైనట్లే తమసంస్థ అంటే బాధపడేవారి సమాజం అన్నభావం ఏర్పడింది. చర్చి సాంఘిక రూపంగాఉన్న నిష్కృతి. రెండవ ప్రపంచ సంగ్రామ మధ్యములో ఇంగ్లీషు వారికి ఉపన్యసిస్తూ దీన్ స్పెర్రీ. మనసువిచ్చి ఇట్లా అన్నారు.

రాబోయే అర్ధ శతాబ్దపు చరిత్రలో బహుశః మనకు నైతిక సామాన్యత్వ మనే దురదృష్టము పట్టవచ్చు. ఎందుకనగా మనకాలంలోని "బాధా సహిష్ణుత అనే ఆభిజాత్యంలో" మనము మనకొక స్థానం సంపాదించుకో

లేము. మన చర్చీల విషయంలో ఇది ప్రత్యేకంగా యథార్థమైన సంగతి అనే అనిపిస్తుంది: బాధాన్ని పరీక్షలకు నిలిచినవాళ్ళకు వీరి నిజానిజాలు పరీక్షించని మాటలు కొరగానివి బూతవి. ౬౦

యూదు సమాజాలు ఈ సామూహిక నిష్కృతి, సముద్ధారక బాధా సహిష్ణుత అను భావాల సిద్ధాంతం పొందిక అయినదేనని భావించినారనుట స్పష్టము. ఇంక కేథలిక్కుల సంస్కారాలు, సంకేతాలు చర్చి జీవితంలో సిలువను కేంద్ర స్థానలో నిలిపినవి. ఇప్పుడు ప్రొటెస్టెంట్ ఉదారులు వాళ్ళతో కలిసి మత సంబంధమైన నీతికి త్యాగమనే లక్ష్యం ప్రధానమైన దని పునర్ఘాటింప గోరుతున్నారు. మరి ఈ మధ్య అమెరికాలో చరిత్ర అవిచ్ఛిన్నమనే భావాన్ని— ఋషుల సంవాదము, మృతులైన వారితో జీవాతువుల సంసర్గము, ముఖ్యంగా మృత వీరులతో— పెంపొందింపచేసే చిత్రమైన. అవకాశము ఒకటి చర్చికి ఏర్పడిందని గమనించే లక్షణం పెరిగింది. ఈ విధంగా చర్చిలు టిల్లిక్ "ఆగమశాస్త్ర లక్షణ" మని పిలిచిన లక్షణాన్ని సంఘంలోకి సంఘంలోకి ఎక్కించుతూ భగవంతుని గూర్చిన అస్థిత్వ, సారభౌమత్వ, పావిత్ర్య భావాలను గురించిన సామాజికమైన యోగానుభవ భావాన్ని కల్గిస్తున్నాయి.

ఇట్టి పలువిధాలుగా సాంఘిక సువార్త మొన్నమొన్నట సంఘటనలకు అనువుగా పునర్నిర్మించ బడింది. దీని తొలినాళ్ళ ఇటోపియన్ సామ్యవాదము పోయి సాంఘిక పునర్నిర్మాణము అను సాధారణ కృషిలో మతం చేయగల్గినదాన్ని గురించి యథార్థ దృష్టితో అర్థం చేసుకోవడం వచ్చింది. ౬౦

లౌకికమైన సాంఘిక సంస్కరణను వదలి సంఘంలో చర్చి ఎడతెగకుండా ఉద్ధరణ కార్యాన్ని సాధిస్తుంది— అని ప్రధానంగా చెప్పడంలో వచ్చిన మార్పును" ప్రొటెస్టెంట్లు "సాంఘిక సువార్త" ఈ శతాబ్దపు మూడవ దశకంలోనే ముగిసిందన్నట్లుగాను, నవీనాచార పరతగల ఆగమ శాస్త్రం పెరగడం ఒకక్రొత్త విధమైన సాంఘిక సువార్తగా చూపించు తున్నట్లుగాను అభినయించడం ద్వారా గమనించడం పరిపాటి అయిపోయింది. అందుచేతనే "సాంఘిక సువార్త అనంతరము" మరియు "సాంఘిక సువార్త అంతం" అనే మాటలు మనం చదువుతాము. ఇట్లాంటి పద

బంధాలు తప్పుదారి త్రొక్కిస్తాయి. ఎందుకంటే అగమ శాస్త్రాన్ని అను సరించియు, సిద్ధాంతాన్ని అనుసరించియు క్రైస్తవ సంఘ నీతులలో మిక్కుటమైన మార్పు వచ్చుట నిజమైనను చర్చీలు చేస్తుండిన క్రియారూప మైన సాంఘిక కృషిలో సాధారణంగా పోగు తెగకుండానే వస్తున్నది. "సాంక సువార్తను పునరాలోచించుట" అనేది నిర్దుష్టమైన పదబంధము. ఎందుకంటే మునుపటి కంటే ఇప్పుడు సంఘాన్ని క్రైస్త వితముగా చేసే ప్రయత్నాలు వేరూనినవి. క్రైస్తవ రాజకీయాలు మునుపటికంటే మరింత యథార్థ దృష్టికి వచ్చినవి. అందుచేత ఉదారవాద విషయంలో అగమ శాస్త్ర ప్రవర్తన క్రియా రూపమైన రాజకీయాలలో ఏమో తెచ్చివెదుతా యని ఊహించుకోకుండా సామాన్య పాఠకులు జాగ్రత్త పడాలి. నిజానికి ఈనాటి చర్చీల కార్యక్రమాలు వాళ్ళ "బూర్జువా సామ్యవాదం" కంటే మరింత తీవ్రంగా సంకీర్ణంగా ఉంటున్నది.

అమెరికాలోని మతంలో ఈ శతాబ్దంలో ఏర్పడిన నైతిక పునర్నిర్మాణ స్వభావాన్ని గురించి ఈ ప్రకరణ ప్రారంభములో చెప్పిన సామాన్య మైన భావాన్ని రుజువు చెయ్యడానికి కావలసినన్ని చారిత్రక వివరాలు ఇచ్చినామను కుంటాము. వ్యగ్రతయొక్క కేంద్ర బిందువు ఆత్మలను ఉద్ధ రించడం నుండి సంఘాన్ని ఉద్ధరించడాన్ని, భగవంతుని దయాదాక్షిణ్యాల మీద ఆధార పడడంనుండి ఆర్థిక రాజకీయ చర్యలద్వారా సంఘాన్ని "పునరుద్ధరించడా" నికి, మత విషయాలను పునరుద్ధరించడం నుండి సాంఘిక పునర్నిర్మాణానికి నీతి వాక్యాలు చెప్పడం నుండి నైతిక విమ ర్శకు మారింది.

## అతిమానుష, అతిసాంఘిక సువార్తలు

మత విషయకమైన ఉదార విధానాన్ని లౌకికీ కరించి సాంఘికీ కరిం చటం వల్ల రెండు రకాలైన మనస్సాక్షి వాదులు వ్యతిరేకించడం తప్పని సరిగా ఏర్పడింది: "ప్రపంచాన్ని పునస్సృష్టి చేయుట" లో విశ్వాసము లేనివారు. ఈ సాంఘిక సువార్త నంతటిని బూర్జువా మమకారంగానో ఆశా భావంగానో భావించినవారు ఈ రెండు రకాల వ్యతిరేక వర్గాలు,

తరచుగా జరుగునట్లే, ఏకీభ వించినప్పుడు సాంఘికంగా ప్రగతి విరుద్ధములు మత విషయకంగా "దర్శన మార్గగాములు" లేదా అతిమానుష సిద్ధాంతానుగాములు అయిన నిరసన మతోద్యమాలను ఏర్పాటు చేయడం ఫలింత మైంది. సాంఘిక సువార్తకు విరుద్ధంగా "పూర్ణ సువార్త" చర్చిలు, క్రీస్తు పరిపాలనా యుగం వస్తుందని ఆశించే చర్చిలు ఏర్పడినవి. ఈ చర్చిలు "పలుకుబడి లేనివారి చర్చి" అని సాంఘిక శాస్త్రజ్ఞులు వానికి సాధారణంగా ప్రాతినిధ్యం వహిస్తారు కానీ మనం వానిని తప్పుడు మార్గంలో చూడకుండా జాగ్రత్త పడాలి. సాంఘిక శాస్త్ర రాజనీతి శాస్త్రముల దృష్ట్యా ఈ క్రొత్తవైన సువార్తా ప్రచారక చర్చిల సభ్యులు ఒక విధంగా నిరక్షరాస్యులు, విద్యా విషయకంగా "తక్కువ" వారు. కాని వీరిలో ఉన్నవారు లేనివారు కూడా సమానంగానే ఉన్నారు: అనేకులు "మధ్య తరగతికి క్రింది" వర్గాలనుండి వస్తారు. అమెరికనులలో ఎలాగూ చాలా మంది ఈ వర్గంవారే. ఈ ఉద్యమాలకూ, వాని పత్రికలకూ. స్కూళ్ళకు, ప్రచారాలకూ. ధనవంతులైన వ్యాపారులు నిధులు ఏర్పరచినారు, మార్క్సిస్టు సిద్ధాంత వాదులు తాము ఆర్థికమైన ఎత్తుగడగా కాక మత విశ్వాసంతో ప్రవర్తిస్తూ తాముకూడ ఆ "మత్తు మందు" తోనే వృద్ధి పొందుతూ ఉండటం యదార్థం కాకపోతే వీళ్ళను ప్రజలకు "మత్తు" గొలుపుతున్నారని న్యాయంగానే నిందించవచ్చు. ఈ వ్యాపారులు సామాన్యంగా "గట్టి పడిన" వారు. అమెరికన్ శ్రామిక వర్గాలతోపాటు లోకం ప్రధానంగా క్రూర మైనదని పాప భూయిష్ట మైనదని, భగవంతుడే స్వయంగా దీనిని నాశనం చేసేవరకు ఇది ఇట్లాగే ఉంటుందని, విశ్వసించేవారు, ప్రపంచం శిక్షించ వలసిందికాదు. లోకానికి దాని నైచ్యాలకూ దూరంగా పారి పోవడమే మానవుని మత వ్యాపారం. నిరసనతో కూడి తప్పించుకో చూచే ఈ చిత్తవృత్తి విధిలేదని ఒప్పుకొని ఊరకుండే చిత్త వృత్తి కాదు, దైచేన, యదార్థమైనా, అనుభవంతో వృద్ధి పొందినది ఇది. లోకజ్ఞానం ఉండే మనస్సుకు పట్టుతుంది. అమెరికనులలో చాలామంది బీదవారు మతాభి ముఖులేవారు. కానీ ఆ అయినప్పుడు విప్లవంలోని విశ్వాసానికి అభిముఖలుగా కోరుకొని తమతోడి మానవుని మీది విశ్వాసానికి విరుద్ధ మైన మరింత తీవ్రప్రతి ఘటనకు అభిముఖు లౌతారు. "మేము భగవంతుని విశ్వసిస్తాము" అనేదానిలో చూపరాని అంశం కొంత ఉంది. మోక్షం

"పైనుండి" వస్తుంది కాని పైవారు నుండి కాదు. సాంఘిక సువార్త సుఖ జీవితం గడిపేవారి అంతరాత్మలను పట్టుకొన్నప్పటికిని, శ్రామిక వర్గాలలో పోల్చిచూడగా ముందుకు పోలేదు. ఈ శ్రామిక వర్గాలు, కనీసపు అమెరికాలో ఆర్థిక విషయాలను గూర్చి నైరాశ్యంతోనూ, రాజకీయాలను అసహ్యంతోనూ, ఉంటున్నవి.

ఈ నాడు నైతిక సనాతనత్యం మునుపటి కంటే ఎక్కువగా ఒక ఖండనోద్యమంగా ఉంటున్నది: దాని దృష్టిలో మానవుడు, సంఘము రెండు కూడ అవినీతిగానే ఉన్నవి; మత మనేది లౌకిక ఆనందము. మనుష్యుల సంపత్ సమృద్ధి అనేవాని కంటె దొడ్డదైన విశ్వాసము, చదువుకొన్న క్రైస్తవ సనాతన సిద్ధాంత వాదులలో— వీరు మనదేశంలో కంటే ఇతర దేశాలలో ఎక్కువగా నున్నారు— జనరంజకులైన ప్రవక్తలు తాము విఫల మనోరథులైత "క్రైస్తవ రాజ్యం" అనే భావాన్ని, సాంఘిక వ్యవస్తను క్రైస్తవీ కరించుట అనే భావాన్ని హేళనచేసే కీర్కగార్డు, ఉనామునో వంటి వ్యక్తులు. క్రైస్తవుడు ప్రపంచంతో సుఖ ప్రవిష్టుడుగా ఉండరాదట 1 ఇంక యూదు సనాతన సిద్ధాంత వాదులలో— ఈ పేరు నేను వాళ్ళకు ఉపయోగించే అవకాశం ఉంటే— సంఘాన్ని క్రైస్తవీ కరించడం అనేదాన్ని వాళ్ళు పండ్లు ఇకిలించి నవ్వుతూ స్వీకరించినారు, వినుగుపుట్టి "ఓ మీ ఘెట్టొలకు తిరిగి పోవటమే" ఈ జియానిస్టుల మాటలు వినడం కంటె మంచిదని చెప్పేవారి మాటలను వాళ్ళు ఇప్పుడు ఆలసిస్తున్నారు. కాని సాధారణంగా ఈ "తక్కువ రకపువారి చర్చిలు" నైరాశ్యం మీద కాక భగవంతుడు ఈ భూమిని చివరకు నాశనం చేయడానికి ముందు తన త్రోవను తాను "సంకటన" పరిస్థితిని కల్పించి దానివల్ల ఈలోకం క్రొత్తగా మరింత మేలుగా బాగుపడాలి ఆరంభంగా శాంత పాలన తెచ్చి పెట్టేటట్లు చేస్తాడన్న ఆశమీద నిర్మింప బడినది, దీనిని అతిమానుష సిద్ధాంత వాదులు అమెరికన్ నీతిలో స్థిరాంశముగా నున్న "న్యూడీల్" మీది విశ్వాసానికి ఇచ్చిన మారు రూపం అనవచ్చును,

"న్యూడీల్" దశాబ్ద కాలంలో ప్రాటెస్టాంటి జంకు చెందిన సువార్తా ప్రచారక చర్చిలు తెగలు విపరీతంగా పెరిగిపోయినవి. ప్రాటెస్టాంటిజం ప్రథమ, ప్రపంచ సంగ్రామ కాలంలో క్రొత్త ప్రాణశక్తిని సంపాదించుకొన సాగింది. ఉదాహరణకు ఇలాంటి ఒక డజను మత సంఘాలకు మచ్చు

తునకగా కనిపించే నాజరీన్ చర్చి వారికి 1906 లో నూరుచర్చీలు 19 రాష్ట్రాలలో 6, 600 సభ్యులలో ఉండేవి. 1923లో 1400 చర్చీలు 47లో రాష్ట్రాలలో 63,000 సభ్యులతో నుండేవి. మరి 1949లో దీనికి 3, 000 చర్చీలు 48 రాష్ట్రాలలో 2, 20, 000 సభ్యులతో నుండేవి.

19 వ శతాబ్దములో క్రీస్తు ద్వితీయ ఆగమనం తప్పక జరుగుతుందని (1914) జోస్యం చెప్పిన చార్లెస్ టీ. రస్సెల్ అనే క్రీస్తు పరిపాలనాయుగ సిద్ధాంత ప్రచారకుని అనుయాయులైన జియాన్ వాచ్‌టవర్ ట్రాక్టు సొసైటి వారు "రస్సెల్ సిద్ధాంత" పుస్తకాలను, తమ వాచ్ టవర్ (1879 లో ప్రారంభిప బడింది) అనే మాగజీన్ కొన్నివేల ప్రతులను పంచి పెట్టిన శ్రద్ధా భక్తులుగల ఒకచిన్న ఏకాంత సంఘం కాని 1900 — 1910 మధ్య కాలంలో ఈ సంఘం తాము ప్రచురించిన స్టడీస్ ఇన్ ది స్క్రిప్చర్స్ (మత గ్రంథాల పరిశీలనలు) అనేదాని కాపీలను లక్షల కొలది పంచిపెట్టింది, ఇప్పుడు పక్ష పత్రికగా నున్న తమ వాచ్ టవర్ 6, 00, 000 ప్రతులను పంచి పెట్టుతున్నది.

1914 లో ఎనిమిది గంటల కాలం నడిచే చలన చిత్రాన్ని లేదా "సృష్టి ఛాయా నాటకము" ను చూపించినారు. 1919లో ఎనిమిది వేలమంది "మినిష్టర్లు" లేదా "సాక్షులు" సమావేశమై "సార్వభౌముని, అతని సామ్రాజ్యాన్ని చాటించి, చాటించి, చాటించి" వేయడానికి ఒప్పందం చేసుకున్నారు. 1931లో వాళ్ళు జహోవా యొక్క సాక్షులు అని పేరు పెట్టుకొన్నారు. 1946లో క్లీవ్ లాండ్‌లో సమావేశమైన 80, 000 మంది సాక్షులు ఉత్తిష్ఠ! (అవేక్) అనే మరొక మాగజీనును ప్రారంభించినారు. ఇంతలో ఎక్కువవుతూ వచ్చిన రేడియో ప్రసారముల వల్ల బ్రూక్‌లిన్ లోని డబ్ల్యు. బి. బి. అర్. రేడియో స్టేషన్ స్థాపింప బడింది. పూర్తిగా ఆధునికమైన ఈ పద్ధతుల వల్ల జహోవా సాక్షులు భగవంతుడు తన పరిపాలనను ఏవిధంగా తెచ్చి పెట్టనున్నాడన్న దానిని గురించి, తమ పాఠాన్ని ప్రకటించినారు. (చూడు ఎగ్జిబిట్ IX) ఈ సువార్త యొక్క సంగ్రహ పాఠం, ఆసంఘా అధ్యక్షుని మాటలలో చెపితె, ఒకవైపు ఈ సువార్తకు, లౌకిక సంఘటనలకు వ్యగ్రతలకు మరొకవైపు "భగవ

్రాజ్యా" న్ని గురించి ఉదార వాదులు చెప్పేదానికి మధ్య ఉన్న సంబంధ బాంధవ్యాలు తెల్లం చేస్తుంది.

1880 నుండి జహోవా సాక్షులు బైబులు జోస్యం చెప్పిన ప్రకార ముగా 1914లో "యూదు మతేతరులకాలం" అంత మవుతుందని ప్రచారం చేస్తూ వచ్చినారు. ఆ సంవత్సరం "ఒక జాతి మరొక జాతి మీదికి దండె త్తింది." ...ఈ ద్వితీయ అగమనము, అంతము అనేవి భూమి దగ్ధమై పోతుందని కాక అవిచ్ఛిన్నంగా "ఈ ఇప్పటి పాప భూయిష్ట ప్రపంచం మీద" కొనసాగిన సైతాను పరిపాలన అంతమౌతుందని క్రీస్తు స్వర్గంలో రాజుగా సింహాసనాధిష్ఠితుడు అయ్యే సమయమని ఈ సాక్షు లందరికి మొత్తంగా అర్థమైన విషయము... ఈరాజ్యం భూలోకానికి సంబంధించింది కాదు. అటు కాకూడదు. భూమిమీది ప్రభుత్వాల కలయికలో కాని ఏరాజకీయమైన పరిపాలనలో కాని కనుపింప బోదు. "నా రాజ్యం ఈ లోకానికి సంబంధించినది కాదు" అన్నాడు జీసస్ (జాన్ 18:36). ఏమైన స్వర్గ రాజ్యంలోని అన్యాయ పరిపాలన భూలోకానికి దిగివచ్చి "స్వర్గంలో లాగానే భూమిమీద కూడ నీఆజ్ఞ నిర్వర్తింప బడును కాక" అని చేసిన ప్రభువు ప్రార్థనకు సమాధానాన్ని కల్పిస్తుంది.

జహోవా సాక్షులు భగవద్రాజ్యం స్థాపింప బడిందని, అందుబాటులో నున్నదని, ఇప్పుడు నడుస్తుందని, విశ్వసించడమే కొట్టవచ్చినట్లుగా కని పించే విషయం. ఎడతెగగానున్న దుఃఖాల, విపత్తుల మధ్య చాలా మందికి ఇది వింతగా వినబడు తుంది. ఏమైనా మత గ్రంధాలుకూడ ప్రాత ప్రపంచ పాలన భగవద్రాజ్య పాలనగా మారేటప్పుడు ఒక మార్పుడి కాలం ఉంటుం దని ఆ సమయంలో క్రీస్తు "తనశత్రు మధ్యంలో పరిపాలిస్తాడని" సైతాను భూమండలంలో దుఃఖాలను ఎక్కువగా చేస్తాడని (21) జోస్యం చెప్తున్నవి.

"భగవంతుని దృష్టిలో మనుష్యుని వివేకం తెలివి లేనితనం" మాత్రమే కాక మానవుని సంస్థలు నిదానంగా, "విస్తారమైన అధో మార్గంలో" పోవడం వాటి తలవ్రాత కూడ, "ఈ యుగానికి చెందిన ఈ అధఃపతనాన్ని ఏది ఆపలేదు. ఈ శతాబ్దపు నాజూకుతనం సాక్షుల దృష్టికి" ఒక పలుచని సులభంగా వలచి వేయదగిన మునుగుగా కనబడుతుంది.... చరిత్రలో ఎంతోగొప్ప నీతిపరులైన వ్యక్తులచేత అనేకోద్యమాలు ఆరంభింప బడిప్పటి కిని తప్పకుండ సైతాను ఆ ఉద్యమాలను "అంటు వేసుకొని" అవి తమ

ప్రధానోద్దేశ్యానికి విరుద్ధమైన అభిప్రాయాలు చెప్పేటట్లుగా చేసివేసినా డని వాదిస్తారు. మతాల విషయంలో ఇదిముఖ్యంగా నిజం." (22) సాధులు పెద్దవాళ్ళ బాప్టిజం పాటిస్తారు. "స్మృతి భోజనము" (మెమోరియల్ సప్పర్) పాటిస్తారు. ఇది, బైబులులోని సంస్థలని వాళ్ళు పాటిచడం. తక్కిన ఆచార కర్మ కాండలన్ని "మూఢ నమ్మకము". విధి మీది అమా యక విశ్వాసమునకు సంబంధించిన "ఆధునిక" పునరుద్ధరణ ల్లో చాల వీపరీత మైనదియు, గుణపాఠం నేర్పునదియు అయిన ఫాదర్ డివైన్ పీస్ మిషను ఒకటి. ఇది ముప్పై ఏళ్ళనాటిదే అయినా వేలకొలది నీగ్రోలను చాలా మంది తెల్లవారిని విశ్వాస శాంతి సభ్యులుగా చేసింది. ఎంత సంప్రదాయ భిన్నమో అంత దైవచింతన గలది. సభ్యులు, క్రొత్తజీవితాలు జీవిస్తారు. క్రొత్త రక్షణ, శాంతి, కొత్త పేర్లు— వాళ్ళంతా "స్వర్గం" లో నివసిస్తున్న "దేవతలు". వాళ్ళ కమ్యూనిలున్ భోజనాలు నిజమైన విందులు. దివ్యులైన మాత్రపితల తోడివారి జీవితం నిజమైన విధి విధా నాన్ని పంచుకొనుట (చూడు ఎగ్జిబిట్ X). ది న్యూ డే అనే పేరుతో ప్రచురింపబడిన ఈ ఉద్యమ సారస్వతము నుండి ఈ క్రింది భాగాన్ని ఉదా హరిస్తున్నాము. దీనివల్ల ఇటువంటి విప్లవాత్మక మతసంఘం సాంప్రదా యికమైన చర్చిల సాంఘిక కార్య కాలాపాలకు తెలిసి తెలిసి విరుద్ధంగా ఉంటుందని తెల్లమవుతుంది.

దివ్యపిత యందు విశ్వాసం కలవారు ప్రతిఫలం ఆశించకుండ స్వచ్ఛం దంగా ఉద్యమానికి తమ సేవలు అర్పిస్తారని తెలుసు కోవాలి.

మరిన్ని శాంతి సంఘాల ప్రతినిధులు సహ కృషికులు మనం తెలిసి చేను కొన్న నమ్మిక ప్రకారం మనస్ఫూర్తిగా భగవంతుని విశ్వసించ డానికి అంగీక రిస్తున్నారు అనేదికూడ గతార్ధమే.

అందుచేత— సంగ్రహంగా మనము, ప్రజా శ్రేయస్సును గూర్చి ప్రాకు లాడుతూనే ఉండము, మరింత సహాయం కావాలని కోరం. భీమాచేయము. ఇప్పుడు మనకు ఉన్నదానిని మన హృదయాలను ఆత్మలను, బుద్ధిని మనము మారినా దానికి ఇచ్చుటకుగా విడచి పెడ్తున్నాము— ప్రతిఫలంగాని బాధ్య తగాని ఏ ఇతర విధమైన రక్షణగాని తీసుకోము. ముసలి తనపు ఉపకార వేతనాలు భీమాలు ప్రాతవారి ఉపకార వేతనాలు మరి ఇతర ప్రతిఫలాలు స్వీకరించడానికి కూడ నిరాకరిస్తాము. ఇటువంటి పని తమ మత విశ్వా

సానికి ఉల్లంఘన మౌతుంది.1 అన్నీ తెలిసి ఏర్పడిన నమ్మికతో ఇదంతాచేస్తు న్నామేకాని మత విషయకమైన క్రమ శిక్షణను అను సరించరాదు(23)

ఉదార వాదపు సాంఘిక సువార్తకు తీవ్రంగా భేధిస్తూ ఈనాటి సాంఘిక పరిస్థితులకు సమాధానంగా వచ్చినవని స్పష్ట పడుతూ ఉన్న నిన్న మొన్నటి సువార్తల పెరుగుదలకు ఇంకా అనేకమైన ఉదాహరణలు ఈయవచ్చు. ఇవన్నీ ప్రగతి విరుద్ధములని గాని ప్రాతవాని హతశేషములని గాని లేదా ఏవో తప్పించుకొనే పద్ధతులనిగాని త్రోసి పారవేయుట కూడదు, ఇవికూడ పాండిత్యంగల తమ ఇరుగు పొరుగు వాటివలెనె క్రొత్త ఆధునిక విశ్వా సాలు, వీటిని ఆగమాలుగా తత్వాలుగా చూచినప్పుడు హేళన పరచడా నికి వీటిలో ఎన్ని లక్షణాలు ఉన్నా ఇవి సమకాలీన నైతిక సమస్యలను సూక్ష్మజ్ఞతతో ప్రతిబింబిస్తున్నవి.

# ఎగ్జిబిట్ 1

## జనసంఖ్యా పెరుగుదలతో పోల్చిచూచినప్పుడు యునైటెడ్‌స్టేట్సులో 1900-1949 మధ్యమతసంస్థల పెరుగుదల

ఈ అంచనాలు కొంచెమించుమించుగా మాత్రమే ఆధారపడతగినవి. ప్రధానమతవర్గాలలోని ప్రయోజన సభ్యుల (13 సంవత్సరాల పైబడినవారు) సంఖ్యను సూచిస్తవి. అంకెలు మిలియన్లలో ఉన్నవి. అధికారికమైన సెన్సస్ లెక్కలను, వివిధమత సంస్థలు తయారు చేసిన అంచనాలను ఉజ్జాయింపుగా పోల్చి చెప్పడానికి అనువుగా సరిచేయబడినవి, 'కీ' గా ఇచ్చిన స్థలాలు సగటున సాపేక్షాబలాన్ని సూచిస్తవి.



## ఎగ్జిబిట్ II

# 1904లో తెలియవచ్చిన నవప్రాణచిహ్నాలు

థియోడార్ టి. మాంగర్ వ్రాసిన ఎ స్పేస్ ఫార్ ది డే (1904)
పుట 30. నుండి

మత ప్రచారకునిని చర్చిని జనులు దాటవేసి పోయినారు. వ్యవస్థితమైన సిద్ధాంతాల మధ్య జీవిస్తూ ఆలోచనలు సలిపేవారి మీదకంటే, ప్రజా సమూహం మీదనే బలీయమైనఆధ్యాత్మి కోద్యమాలు త్వరగా పట్టు సంపాదించు కొంటాయి. తత్త్వం వాయువు వంటిది. వెల్లడిగా ఉన్న చోట నిరాటంకంగా వీచుతుంది. దాని ఫలితంగా ఈనాడు సగం తెలిసిన లేదా తెలియని తనంగా చూపబడే ఉద్యమాలు చర్చీలలో నడుస్తున్నాయి. యంగ్ మెన్స్ క్రిస్టియన్ అసోసియేషన్, దిక్రిస్టియన్ యూనియన్, దిక్రిస్టియన్ ఎండవర్ సొసైటీ, దిబ్రదర్ హుడ్ ఆఫ్ సెయింట్ ఆండ్రూ, దిఎప్ వర్త్ లోగ్, దిబాప్టిస్ట్ యూనియన్, దిస్టూడెంట్ వలంటీర్ మూవ్ మెంట్, దిబ్రదర్ హుడ్ ఆఫ్ ఆండ్రు యండ్ ఫిలిప్. దిగర్ల్స్ ఫ్రెండ్లీ సొసైటీ, దికింగ్స్ డాటర్స్ మొదలయిన, తత్స జాతీయాలయిన లౌకిక సంస్థలను గురించి తేలికగా మాట్లాడ డానికి ముందు, ఒకసారి పట్టు రెండుసార్లుగా ఆలోచించాలి. ఈ సంఘాలు ఒక భావానికి, ఒక ఉద్యమానికి నడుంకట్టి నిలిచాయి. అవిఎంత సంస్కారం లేనివిగా అల్పాలుగా కనిపించి నప్పటికీ, వారు ఏతప్పులు చేసినప్పటికీ వారు వదలకుండా అంటి పెట్టుకొని ఉన్న తమ చర్చీలు చేస్తున్న వానికంటే ఎక్కువ తప్పులుగాని, అధ్వాన్నపు పనులుగాని చేయలేదు. వారిలో ఉత్సాహపుపాలు ఎక్కువయినా, గుమిగూడే లక్షణం ఎక్కువగాఉన్నా, చర్చీలలో ఉండే అనాకర్షణీయతకు, తరచుగా కనిపించే చాలని తనానికి, తమకే తెలియకుండా చూపుతున్న నిరసనలని చెప్పవలసి ఉంటుంది. యౌవన ప్రాణికి సహజమైన గుణంతో వారుజీవితంలో కార్యరంగానికి వెదుకుతున్నారు.

## ఎగ్జిబిగ్జి III

కాథలిక్ అమెరికన్ పౌరుడుగా (1927) ఆల్ఫ్రెడ్ ఇ. స్మిత్ "పంథా" 1927, 1928లలో విస్తారంగా ప్రకటించ బడింది. ఉదాహరణకు అట్లాటింక్ మంత్లీ CXXXIX (మే 1927) పు. 728లో ప్రచురించ బడింది.

అమెరికన్ కాథలిక్కుగా నాపంథాను సంగ్రహంగా చెబుతాను. రోమన్ కాథలిక్కుచర్చి మతపద్ధతిని, ఆచారాన్ని అనుసరించి భగవంతుని పూజించడలోం నాకు విశ్వాసం యునైటెడ్ రాజ్యాంగం ప్రవర్తించడంలో గాని లేదా ఈదేశపు న్యాయ చట్టాలను అమలు పరచడంలోకాని జోక్యం చేసుకోడానికి మాచెర్చికి సంబంబంధించిన సంస్థలకు అధికారము ఉందని నేను ఒప్పుకోను. సర్వమానవులకు అంతరాత్మకు సంబంధించిన పరమస్వాతంత్ర్యం ఉందని నేను విశ్వసిస్తాను. న్యాయచట్టాల ముందు అన్ని చర్చిలు, అన్ని తెగలు, అన్ని విశ్వాసాలు, సమానమేఅని, అసమానత అన్నిటికి హక్కేగాని దాక్షిణ్యం కాదని నేను విశ్వసిస్తాను, చర్చి, ప్రభుత్వము పూర్తిగా వేరు వేరని, రాజ్యాంగంలో చెప్పబడిన అంశాలను కఠినంగా అమలు జరుపుటకు వీలుగా కాంగ్రెస్ ఒక మత స్థాపనకు సంబంధించిగాని లేదా దానిని నిరాటంకంగా ఆచరించడానికి సంబంధించికాని ఎటువంటి చట్టము చేయరాదని నేను విశ్వసిస్తాను. తన చర్చిలోని సంవాదకుల హోదాను స్థాపించుట కంటె భిన్నమైన పనికిగా దేశంలోని న్యాయ చట్టాలకు సంబంధించ ఎంతమాత్రము ఆమోద ముద్రవేసే అధికారం ఏచెర్చి సంఘానికి లేదని నా విశ్వాసం. అమెరికా స్వాతంత్ర్యానికి మూాల స్తంభాలలో ఒకటిగానున్న పబ్లిక్ స్కూలును బలపరచడంలో నాకు విశ్వాసం ముంది. తన శిశువును పబ్లిక్ స్కూలులో చదువ వలెనా లేక తాను పాటించే మత విశ్వాసానికి చెందినవారు నడుపుతున్న మతవిద్యా పాఠశాలకు పంప వలెనా అనే వాటిలో తనఇష్టం వచ్చినట్లుగా ఎన్నుకొనే హక్కు ప్రతి తండ్రికి ఉందని నావిశ్వాసం. ఈదేశం ఇతర జాతుల ఆంతరంగిక వ్యవహారాలలో జోక్యం చేసుకో రాదనే సూత్రంమీదను, ఎవరైన అటువంటి జోక్యం కావాలన్నప్పుడు దానికి పోటువడ్డి నిలబడ వలెననె సూత్రం మీదను నాకు విశ్వాసం ఉంది. మరి భగవంతుడు సామాన్యంగా అందరికి

తండ్రిఅని అతని క్రింద మానవులంతా సామాన్యంగా సోదరులని నేను విశ్వసిస్తాను.

## ఎగ్జిబిట్ IV

మతమునకు సంబంధించిన పాఠశాలలు సాంస్కృతిక బహుళత్వము కావాలని చేసిన ఒక రాజీవాదన.

జోసఫ్ హెచ్ లుక్ స్టీన్ వ్రాసిన "మతము — పబ్లిక్ స్కూళ్ళు" అనే దానినుండి, జ్యూయిష్ ఎడ్యుకేషన్, XXI (1949), పుటలు 40—43

మత సంబంధీకులైన అత్యుత్సాహిని, మతానికి పబ్లిక్ స్కూళ్ళకు సంబంధించిన అతని చిత్తవృత్తిని తొలగ గొట్టిన తర్వాతగూడ మన సమస్య పూర్తిగా తెగలేదు. మరొక రకమైన అత్యుత్సాహి ఉన్నాడు. ఇతనివాదం కూడ మునుపటివాని వాదం వలెనే చెల్లబోదు. మొదటివాడు పబ్లిక్ విద్యా సంస్థలలోకి మతాన్ని బలవంతంగా ప్రవేశ పెట్టాలని చూస్తాడు. ఈ రెండవాడు ప్రతి అమెరికన్ శిశువు మీద ఒకే విధమైన లౌకిక విద్యను ప్రత్యేకంగా రుద్దచూస్తాడు...

ఈ దృక్పథాన్ని చూచినప్పుడు ఒకేఒక అభిప్రాయం కలుగుతుంది. ఉద్దేశ్యంలో ప్రజాస్వామిక లక్షణము ఉన్నదికాని ఫలితాలలో టోట లిటేరియన్ లక్షణ మున్నది. "ప్రతిశిశువు పబ్లిక్ స్కూలుకు పోవాలి" అని నినాదం. దీనిని సమాంతరంగా ఉన్న "ప్రతి కాథలిక్ శిశువు కాథలిక్ బడికే వెళ్ళాలి" అనే నినాదం ఎంత దోష భూయిష్టమో ఇదికూడ అంతే. అమెరికన్ ప్రజాస్వామ్యంలో సాంస్కృతిక బహుధాత్వము ఒక విచిత్ర భాగము. మనము సంస్కృతి ఒకేరకమన్న భావము ఏనాడో వదలివేసినాము. దానితో కూడ "శపెళ ఉడుకుతున్న కుండ" అనే పాత భావం కూడ పోయింది. అమెరికాలోని మిలియన్ల కొలదిగా ఉన్న జనసందోహం ఒకే మూసలో పోత పోసినట్లుగా కాకుండా భగవంతుడు రక్షించుగాక. యూదు, కాథలిక్, ప్రొటెస్టెంటు, తెల్ల, పసుపు, నల్లవారిని, వలసవచ్చిన వారిని, స్వదేశస్థులను అందరిని ఒక పెద్దగంగాళములోకి త్రోసి ఒకతరమో, రెండు తరాలో కాగబెట్టినట్లైతే ఆతరువాత నూటికి నూరు పాళ్ళు అమెరికన్ అనే ఒక రుచికరమైన పదార్థం తయారవుతుందని ఊహించడం

విపరీత బుద్ధి. ఈ పద్ధతి టోటలిటేరియన్ల తయారీ పద్ధతి. ఇది అన్నింటిని ఇముడ్చుకొనే అమెరికన్ ప్రజా స్వామ్యంలోని సాంస్కృతిక బహుత్వమునకు పనికివచ్చే పద్ధతికాదు.... క్రైస్తవుల, యూదుల, పారిష్ బడిమాట అంటారా దానిని అమెరికన్ ప్రజా స్వామ్యంలో ఒక అంశగా అమెరికన్ సంస్కృతిలోని స్వాతంత్ర్యానికి ఒక అభివ్యక్తిగా, కొలమానంగా భావించుదాము. మనదేశంలో ఉన్న సంస్కృతుల వైవిధ్యాన్ని పరిరక్షించుకోడానికి ఇదిఒక మార్గం. అమెరికన్‌సంస్కృతి యొక్క పూర్ణత్వానికి సారాన్ని, సౌందర్యాన్ని ఇటువంటి వైవిధ్యం అందివ్వ గలదనే ఒక ఆశకు రూపం.

## ఎగ్జిబిట్ V

ఆర్థిక మాంద్యమునకు ముందటి మిషన్ ప్రణాళిక మేలిగుణము (1919) అంతర చర్చి ప్రపంచోద్యమము ఇట్లు చేయదలచు చున్నది:

1. ఉపేక్షిత రంగాలను కనుగొనుటకు వీలుగా చోటుచోటున, అంశాశమును పరిశీలించి చర్చిచేయవలసిన మొత్తం ప్రపంచ కృషినిగూర్చి విస్పష్టమైన వింగడింపును తయారు చేయుట; ఇప్పుడున్న ముఖ్యకృషిని బలవత్తరంచేయుట; సమర్థింప వీలులేని కృషిని తొలగించుట; అన్ని ఏజెన్సీలమధ్య, కృషికుల మధ్య ఉపకారకమైన సంబంధాలను నెలకొల్పుట.

2. నిశ్చితమైన యదార్థ విషయాలను విస్తారమైన వివిధ మార్గాలలో ప్రసరింపచేసి దేశమందలి దృష్టిని ఆకర్షించుటకు తగినంత గొప్పగానూ, సాధ్యమయితే లోకసేవకు క్రీస్తు పిలుపు ఇప్పటికి పొత్తిగా వినబడని లక్షకొలది జనుల ఆసక్తిని తట్టి లేపి నిర్ణయమును ఒప్పించు నట్లుగాను చేయుటకు ఎడతెగని విద్యా ప్రచారమును సాగించుట.

3. చర్చివారు మరింత వివేకంగా, సమగ్రంగా ఆయా రంగాలలో తమ బాధ్యతలు నిర్వర్తింపగల యట్లుగా పారిశ్రామిక సంబంధాలు, లోకోపకారము, సువార్తా ప్రచారము, విద్య, మొదలగు లంగాలలో చర్చికి సహకార నేతృత్వమును ఇచ్చుట.

4. మినిష్టరు ఉద్యోగాలకు మిషన్ సేవకు క్రొత్తగా చేరేవారికై ఒకప్రచామును నడుపుట.

5. సమయమునకు అవసరమైన విధముగా మాత్ర్య దేశమందునందును. విదేశముల యందును చేయవలసిన ప్రయత్నానికి చాలినంత మొత్తాన్ని సమకూర్చుటకు నిధులకై సంయుక్తముగా ఒకేసారి ప్రకటన చేయుట.

## ఎగ్జిబిట్ VI

# క్రైస్తవ లౌకికుల పునరాలోచన మిషనులు (1932)

విలియమ్ ఎర్నెస్ట్ హాకింగ్ అధ్యక్షులుగా ఏర్పడిన లౌకికుల వైదేశిక మిషనరీ విచారణను గూర్చి పరిస్థితిని తెలిపెడు కమిన్‌వారి వేదిక నుండి 1932 లో పునరాలోచించుచున్న మిషనులు. అను శీర్షికతో ప్రచురించిన నానినుండి.

ఉద్ధరణ సంఘాల కృషికి సంబంధించిన విద్యతదితర లోకోపకార కార్యాలను క్రమవ్యవస్థిత సంఘాల జవాబుదారీనుండి తొలగించి తెలసి సూటిగా సువార్తా ప్రచారముచేసే పనికి మార్పించడానికి తగిన సమయం వచ్చిందని మన నమ్మకం. ప్రచారం లేకుండ మనము దండిగా ఇవ్వడానికి ఇష్టపడాలి. సాంఘికమైన అభివృద్ధికి క్రైస్తవేతర ఏజెన్సీతో సహకరించటానికి ఇష్టపడాలి. ఏమార్గాలలో సహాయం చెయ్యడానికి మనలను పిలువవలెనో స్పష్టపరుచు కొనుటకు ప్రాచ్యఖండమువారి—ప్రారంభాన్ని బాగా పెంపు చెయ్యడానికి మనము ఇష్టపడాలి. దీనికి అర్థమేమంటే మనము కనపడని విజయాలలో అధికతరమైన విశ్వాసము ఉంచి కృషిచెయ్యాలి. మన సంస్థల సంఖ్యా బలానికి చేరికలు లేకుండ ప్రాచ్యఖండంలోని సంఘాలలో క్రైస్తవ సేవా తత్వము మెల్లగా ప్రచురించిన దానినికూడ ఒక లాభంగా మనము పరిగణించాలి....

క్రైస్తవమత సందేశాన్ని తెలియచెప్పే మనసొంత ప్రయత్నంలో సాధ్యమైనంత వరకు వివరింపబడని సంకేతాల బాషను తప్పించుకొని సామాన్యులకున్న హక్కును ఉపయోగించుకొన గోరుతాము క్రైస్తవ మతము సామాన్యమైన అనుభవానికి ఆలోచనకు మరింత సన్నిహిత సంబంధాన్ని కల్పించగల్గి ఉండటం ఇప్పటి అవసరాలలో ఒకటని మేము విశ్వసిస్తాము.

ముఖ్యంగా ప్రాచ్య ఖండాన్ని ఉద్బోధించడంలో మనము మన మతాన్ని క్రైస్తవ సిద్ధాంత చరిత్ర బోత్తిగా ఎరుగనివారు కూడ అర్థంచేసుకొనే మాటలలో చెప్పడం తప్పనిసరి....

ముందు ముందు బయటి దేశాలకు వెళ్ళే మిషనరీలు తమ తెగలవారి తనపు సామానునంత ఇక్కడే వదలివేసి, వెళ్ళి సమైక్య క్రైస్తవ మతానికి, విశ్వజనీనమైన చర్చికి కృషి చెయ్యడానికి పోవాలి. అంతేకాదు అంత కంటె ఎక్కువే కావలసియున్నది. మాతృదేశం లోనున్న తెగలవారి చర్చీలు తమతమ ప్రత్యేక స్వరూపాలను అధిగమించి విదేశాలలో వలెనే స్వదేశంలోనూ అత్యవసరము, ముఖ్యము అని భావించి క్రైస్తవ మతము ప్రపంచ మంతట విస్తరిల్లేటట్లు సహకరించ డానికి తగిన ఒక మార్గాన్ని కనుక్కోవాలి. క్రైస్తవ మతాన్ని ఇప్పుడు సవాచేస్తున్న పనులకు సంయుక్త చర్చియొక్క సమగ్ర వివేకము, ఆధ్యాత్మిక సంపత్తి అవసరమవుతున్నవి. ఇది ఉద్ధరింపబడుతున్న దేశాలకు ఎంత సంబంధించినదో అమెరికాకు గూడ అంతే సంబంధించినవి. మిషనరీలు విదేశాలలో ఆరంభించిన కృషిని పూర్తి చేయుటకుగా తయారు చేయబడిన ప్రపథకము గూడ అమెరికాలోని చర్చీ లన్నియు ఒక సంయుక్త ఆధ్యాత్మిక కార్యానికి కలసికొని రాలేకపోతే ఆ పథకం పనిచెయ్యదనుట కొంచెం ఇంచుమించు నిశ్చయము....

చైనా, జపాన్, ఇండియా లలోని ఆగమశాస్త్ర సంబంధములైన సెమి నరీల సంఖ్య తగ్గించాలని, నగర జన సమాజాలలోనూ గ్రామీణ జనసమాజా లలోని వర్తమాన ప్రపంచంలో ఆధ్యాత్మిక నాయకునికి ఎదురయ్యే యదార్థమైన సాంఘిక మానుష ధర్మాలకు తరిబీదు నివ్వటమే ప్రధాన మగునట్లు శిక్షణను పూర్తిగా మార్చి వెయ్యాలని మేము సిఫారసు చేస్తు న్నాము. ఈ దేశాలలో ఆధ్యాత్మిక నేతలు కాబోతున్నవారి ఆంతర జీవి తాన్ని అభివృద్ధిచేసి గంభీరం చెయ్యడానికి మరింత ప్రయత్నం చెయ్యాలి. కృషీవులకు శిక్షణ ఇవ్వడంలో క్రైస్తవ జీవితంలోని, క్రైస్తవ భావిసేవల లోని విశ్వజనీనమైన ప్రధాన లక్షణాలను కనుకొని తెలియ చెప్పుట సెమి నరీ లక్ష్యంగా ఉండి శిక్షణలలోని తెగలవారీ గుణం పైదానికి లోబడిన స్థానంలో ఉండాలి.

# ఎగ్జిబిట్ VII

## చర్చీల సాంఘిక ఆదర్శాలు (1932)

ఫెడరల్ కౌన్సిల్ ఆఫ్ చర్చెస్‌వారు తమ 1912 నాటి ప్రకటనకు పునః పరిశీలిత పాఠముగా ప్రచురించినది.

1. సమాజ శ్రేయస్సు అను క్రైస్తవ మతసూత్రాన్ని ధన సంపాదనకు దాని వినియోగమునకు ఆచరణలో అమలుచేయుట. సృజనాత్మక తత్త్వానికి సహకార తత్త్వానికి చట్టా వ్యాపార లక్షణాన్ని లాభోద్దేశ్యాన్ని లోబడునట్లుగా చేయుట.

2. అప్పుల పద్ధతిని ఆర్థిక విధానాలను ఆర్థిక పరిణామ పద్ధతులను సాంఘిక ప్రణాళికలువేసి అదుపులో పెట్టి సర్వులకు శ్రేయస్సు కలిగించుట.

3. తన్ను తాను పోషించుకొనే అవకాశాన్ని సర్వులకు కలహక్కు; మరింత విస్తృతంగా, మరింత న్యాయంగా ధనము పంపకమగుట; కనీసం భృతికి కావలసినంత వేతనము దానికిపైగా ఒక న్యాయమైన భావము పరిశ్రమలలోను, వ్యవసాయంలోనూ వచ్చేవానిలో శ్రామికునికి ఉండుట.

4. పనిచేసే చోట అపాయకరమైన పరిస్థితులనుండి, వృత్తిలో కలిగే గాయములనుండి, రోగములనుండి నాగర గ్రామీణ శ్రామికుల అందరను పరి రక్షించుట.

5. జబ్బు, ప్రమాదము, ముసలితనములో బీదరికము, నిరుద్యోగము మొదలగు వానికిగా సాంఘికమైన భీమా విధానం.

6. పరిశ్రమలో సామాన్యంగా ఉత్పత్తిశక్తి ఎక్కువైన కొలది పనిచేసే గంటలు తగ్గించుట; ఐదు రోజులలో కనీసం ఒకరోజైనా పనినుండి విశ్రాంతి. వారంలో పనిదినాలు తగ్గతవన్న ఆశ.

7. స్త్రీల శ్రేయస్సును, కుటుంబ శ్రేయస్సును సమాజ శ్రేయస్సును పరిరక్షించునట్లుగా స్త్రీలపనికిసంబంధించిననియమాలనుతగినప్రత్యేకవిధంగా నియమించుట.

8 సామూహికంగా బేరమాడడానికి సాంఘిక చర్యకు పూనుకోవడానికి తగినట్లుగా సంఘాలుగా ఏర్పడుటకు పనివారికి యజమానులకు కూడ ఒకే విధంగా హక్కు ఉండటం; ఈ హక్కును చెలాయించడంలో రెండువర్గాల

వారికి రక్షణ; రెండు వర్గాావారు ప్రజా శ్రేయస్సుకు కృషి చేయవలెనన్న బాధ్యత; వ్యవసాయదారులలోను ఇతర వర్గాలలోనూ సహకార సంస్థలను ఇతర సంఘాలను ప్రోత్సహించుట.

9. పిల్లలను శ్రామికులుగా ఉపయోగించుటను నిర్మూలించుట. ప్రతి బిడ్డకు రక్షణకు, చదువుకు ఆధ్యాత్మిక అభివృద్ధికీ పరిశుద్ధమైన వినోదానికి తగినంత అవకాశ కల్పన చేయుట.

10. శుచిత్వమనే ఒకేఒక స్థాయిలో కుటుంబమున పరిరక్షించుట; వివాహమునకు గృహనిర్వణకు జననీ జనకత్వములకు విద్యా సంబంధమైన శిక్షణ నిచ్చుట.

11. వ్యవసాయ దారునికి అతడుకొనే యంత్రముల వెలలకు, కొనవలసిన తదిపర పదార్ధముల వెలలకు అనుగుణముగా శాసన నిర్మాణములోను ఆర్థిక విధానములోనూ, వస్తువుల చేరవేతలోనూ పొలముపంట ధరలలోనూ ఆర్థిక న్యాయం చేయుట.

12. ఇప్పుడు నగరప్రజలు అనుభవిస్తున్న ప్రాథమికమైన సాంస్కృతికావకాశాలను సంఘపరమైనసేవలను, కమతాలమీద కుటుంబాలకు పొడిగించడం.

13 మత్తు పదార్థాలు అలవాటుగా తయారయ్యే ద్రగ్సువల్ల సాంఘికంగా ఆర్థికంగా నైతికంగా వ్యర్థము కాకుండునట్లు వ్యక్తిని, సంఘాన్ని పరిరక్షించుట.

14. నేరస్తుల పాలనలో క్రైస్తవ పునరుద్ధరణ సూత్రాన్ని అమలుపరచుట; క్రిమినల్ కోర్టుల పద్ధతులను శిక్షించుటకు, సరిదిద్దుటకు సంబంధించిన, పద్ధతులను, సంస్థలను సంస్కరించుట.

15. అందరకు న్యాయము, అవకాశము, సమానమైన హక్కులు. జాతి, ఆర్థిక, మతవర్గాలలో పరస్పర, సౌముఖ్య సహకారములు.

16. యుద్ధమును తిరస్కరించుట, ఆయుధ సంపత్తిని తీవ్రముగా తగ్గించు వేయుట, వివాదాలను శాంతియుతంగా పరిష్కరం చేయుటకు అంతర్ జాతీయ సంస్థలలో పాల్గొనుట; సహకార ప్రపంచవ్యవస్థను నిర్మించుట.

17. వాక్ స్వాతంత్ర్యము, సమావేశ స్వాతంత్ర్యము పత్రికా స్వాతంత్ర్యములకు సబంధించిన హక్కులను, బాధ్యతలను గుర్తించి నడిపించుట, సత్యాన్వేషణకు ముఖ్యమైనదిగా ఒకని మనస్సుతో మరియొకని మనస్సు నిరాటంకముగా సంపదించుటను ప్రోత్సహించుట.

# ఎగ్జిబిట్ VIII

## కాథెలిక్ సాంఘికచర్యా సూత్రములు

ఈ సాంఘిక సూత్రాల ప్రకటన రోమన్ కాథలిక్ చర్చికిచెందిన అమెరిన్ బిషప్పులు "కార్యరంగలో క్రైస్తవుడు" అనే విషయంమీద 1948 సం॥ నవంబర్ 20 తేదీన చేసిన ప్రకటనలోని భాగము.

మానవ జీవితమునకు భగవంతుడు కేంద్రము. జీవితమునకు భగవంతుని యందు కేంద్రీకరింపక పోవుట లౌకికత్వము. ఈ లౌకికత్వము, పోయిన సంత్సరము మేము చూచిచెప్పినట్లుగ, క్రైస్తవ జీవనపద్ధతికి ప్రాణకంటక మైన భయకారణము. ఊరక దానిని విడమరచిచెప్పి ఖండించినంత మాత్రాన దీనితో మనము విజయవంతముగా పోరాడినట్లుకాదు. వైయక్తిక చిత్తవృత్తులు నిర్ణాయకాంశములుగా మన్న ప్రతి జీవన భాగంలోను— ఇంటిలో, బడిలో. పనిచేసేచోట, పౌరవ్యవస్థలో— బీటలు వారజేసే ఈ లక్షణానికి ప్రతిక్రియగా నిర్మాణాత్మకమైన ప్రయత్నము అవసరమగు చున్నది. ఏమంటే, మనుష్యుడెట్లుంటే మానవ సంఘంలోని సంస్థలు చివ రకు అట్లే తయారవుతవి....

నైతిక ధర్మంలో వేరూనిన క్రైస్తవసాంఘిక సూత్రాలు ఆర్థిక కార్య కలాపాల అభివృద్ధిలో వ్యతిరేకతకాక సహకారముండ వలెనని, అణచి పెట్టడంకాక స్వాతంత్ర్యముండ వలెనని. విడువకుండ ఉద్బోధిస్తున్నవి. సహకారంకూడ క్రమబద్ధంగా— సర్వుల శ్రేయస్సు కొఅకు క్రమబద్ధమై నదిగా—ఉంచాలి; స్వాతంత్ర్యము క్రమబద్ధంగా—సర్వుల శ్రేయస్సుకొఅకు క్రమబద్ధమైనదిగా — ఉండాలి.

ఈనాడు శ్రామికవర్గాలు కొంతవరకు క్రమబద్ధముగా ఉన్నారు. అయితే ముఖంగా తమ హక్కుల కొఅకే. పెట్టుబడిదార్లు లేదా నిర్వాహకులు మరింత పెద్ద ఎత్తున క్రమబద్ధంగా ఏర్పడినారనటం సాధ్యమే; కానీ ఇక్కడ కూడ వారిహక్కుల కోసమే. సాంఘిక వ్యవస్థను గూర్చిన క్రైస్తవ దృక్ప థమునుబట్టి మనకిప్పుడవసరముగా కావలసినది అందఱి శ్రేయస్సునకు గాను పెట్టుబడిదార్లు శ్రామింవర్గాలు శాశ్వతములైన సహకార ఏజెన్సీలుగా

స్వతంత్రంగా క్రమబద్ధులు కావటం. ఈసంస్థ సర్వశ్రేయదృష్టి చెడకుండ నుండుటకై ప్రజాహిత దృష్టితో బాధ్యతాయుత రక్షకవ్యవస్థ అయిన ప్రభుత్వమున కిందులో పాత్రఉండాలి. కాని ప్రేరేపించి, దారిచూపి, తాదాచెప్పడం వరకే ఈ పాత్రను నిర్వహించాలి కాని బలవద్వర్తనం కూడదు. "న్యాయ ప్రతిష్ఠాపనం చేయుట" కే కాక "సాధారణమైన శ్రేయోభివృద్ధి నెగడజేయు" టకుగూడ ప్రభుత్వమున కధికారమిచ్చిన ఫెడరల్ రాజ్యాంగానికిది ఏమాత్రం వ్యతిరేకం కానేకాదు,

అర్థిక జీవితంలో ఈ సమగ్రాభివృద్ధికి కాథలిక్ సాంఘికతత్త్వ సిద్ధాంత మొక నిర్మాణాత్మక కార్యక్రమమును తయారుచేసినది. లియో XIII కూర్చిన సాంఘిక సూత్రములను పమగ్రముగా చేయుచు పోప్ పయస్ XI ఈ కార్యక్రమము స్థూలరేఖలను 17 సంత్సరాల క్రితమే రూపొందించి నారు, నిర్మాణాత్మకమైన ఆప్రణాళిక ననుసరించి—ప్రతి పరిశ్రమలోను, మొత్తంగా అర్థిక వ్యవస్థలోను పెట్టుబడిదార్ల, శ్రామికవర్గాల అధికారిక ప్రతినిధుల మధ్య క్రమబద్ధమైన సహకార ముండవలెనని, అదికూడా ప్రభుత్వంవారి అధికారం క్రిందకాక అజమాయిషీలో జరుగవలెనని మేము వాదిస్తున్నాము.

స్వతంత్రంగా నిర్మితములైన ఈ సహకార ఏజెన్సీలను పలువిధము లైన పేరులతో పిలచినారు: ఉద్యోగవర్గాలు, వృత్తివర్గాలు, లేదా మొన్న మొన్న, పారిశ్రామిక పరిషత్తులు. (పోప్‌గారి) సాంఘిక శ్రీముఖాలు పరి శీలించే అమెరికన్ కాథలిక్ విద్యార్థులు మన అర్థిక వ్యవస్థ క్రమంగా రూపొందాలనుకుంటున్న ఒకానొక క్రైస్తవ అమెరికన్ అర్థిక ప్రజాస్వా మ్యంలోని మూలభూతములైన అంగాలను సూచించినట్లుగా "పారిశ్రామిక పరిషత్తు" అన్న పేరే బాగుంటుందనే అభిప్రాయం సూచించినారు. సర్వుల శ్రేయస్సు సాధించే బలవత్తరమైన లక్ష్యంలో న్యాయధర్మముల దృష్టిలో నుంచుకొని న్యాయమైన అస్తిహక్కులను, న్యాయమైన శ్రామికవర్గాల హక్కులను, పరిరక్షించే ప్రయత్నం, వానిని కష్టపడి పరిశీలించడము జరి గినప్పుడే దానికి ఫలితముగా ఈ కోరినటువంటి పరిణామము రాగలదు.

## ఎగ్జిబిట్ IX

# "ఎహోవా సాక్షుల" భవిష్యనిర్ణయము

నాయకుడైన ఎన్. హెచ్. నార్ "ఇరవయ్యో శతాబ్దంలో మతం" అను వర్జిలియస్ ఫెర్మ్ సంపాదించిన గ్రంథము (1948), పుట. 389. లో "అధునాతన కాలపు ఎహోవా సాక్షులు" అనుశీర్షికతో వ్రాసిన ప్రకటన నుండి గ్రహింపబడినది.

అర్మగెడన్ (ఘోరకలి) భూలోకంలోని సైన్యాలుగాని సిద్ధాంతాలుగాని తలపడి పోరాటంకాదు కనుపించని స్వర్గవాసులు పోరాడేయుద్ధం. ఎహోవా భగవంతునికి అతనిక్రింద రాజైనక్రీస్తు జీసస్‌కు విజయంగా అది ముగుస్తుంది. రాక్షసుడైన సైతాను అతని (అనుయాయులైన) రాక్షసులు నశిస్తారు. లోకంలోని సమస్త క్రౌర్యము, పాపకర్మలు తుడిచివేసినట్లు పోతారు. ఎహోవా పేరు సంపూర్ణంగా సుప్రతిష్ఠిత మవుతుంది. (జెకేరియా 14:3,12; దర్శనము 19: 11—21, 20: 1—3). భగవంతునియందు సద్భావమున్న మానవులు పాటించి, భగవన్నిర్మితమైన పరిరక్షణలో ప్రాణ ప్రాణములతో నిలుచునట్లుగ భగవంతుడైన ఎహోవా భూమిమీద తన సాక్షులద్వారమునమనుష్యులకు జాతులకు ఈరాబోవు యుద్ధమునుగురించి హెచ్చరికచేస్తున్నాడు ...ఈముందుచెప్పినదానినిబట్టిఎహోవాసాక్షులవిశ్వాసాలకు సాధారణంగా క్రమ వ్యవస్థితమైన మతానికున్న విశ్వాసాలకు మధ్య ఎంత తేడావున్నదో తెలుస్తున్నది.... పరిష్కారమార్గం క్రీస్తు రాజ్యమొక్కటే. ఎహోవా సాక్షులు శాశ్వతమైన శాంతికి దారిచూపుటకు చిత్తశుద్ధితో వాంఛించి దీనినే ప్రకటిస్తున్నారు. ప్రకటింస్తూఉంటారు. ప్రపంచ నాయకులకు ఈ నివారణోపాయం తెలివితక్కువ తనముగా కనబడుతుంది. క్రీస్తుదూతగా అవతరించిన పాల్ ఇది "ప్రచారము యొక్క తెలివితక్కువ తనముగా" కనబడుతుందని చెప్పనే చెప్పినాడు. కాని భగవంతుని దృష్టిలో మనుష్యవివేకమే తెలివి తక్కువతనం.

# ఎగ్జిబిట్ X

## "దివ్యపిత" నుండి ఒక దర్శనము

ఫాదర్ డివైన్ పీస్ మిషన్ వారు ప్రచురించే సర్వాధిక పత్రిక ది న్యూ డే అను 1944 సం॥ అక్టోబర్ 14 తేదీనాటి ప్రతినుండి గ్రహింప బడినది; చార్లెస్ ఎస్. బ్రాడెన్ "దీజ్ ఆల్సో బిలీవ్" (వీరూ విశ్వసిస్తారు) అనే గ్రంథములో పుట: 43లో ఉదాహరించినారు.

వినుము లోకంబ! నీకుఁ దెల్పెదము కోరి
దివ్య పిత మేము పూజించు దేవుడంచు.
అతడు స్వర్మర్త్యముల జేసి నట్టివాడు,
అతడ ఈ తత్త్వభవ మిచ్చినట్టి వాడు,
కనుక— మూతలు బడ్డ నీ కన్నుదోయి
తెరచు నాతనిం బ్రక్కగా తీరి నిలచి
తిట్టగా నేల? వినుము, సాధింపు చాలు!
ఇచ్చటున్నాడు నీదైవ, మెటనో పైన
మిన్నులందున లేడంచు లెన్ని తెలియు
ఖిప్పుడో ప్రచారక! ఇది నొప్పి గూర్చు
టెఱుఁగుదుము మేము, కాని నీవిట్లు చర్చి
నాటకంబుగ నాడ నెన్నాళ్లో చూచి
యిచ్చ విసిగెను దైవమం చెఱుఁగు దీవు
నతడ కదలించు మాటల నత్తి నీకు
నెఱుఁగ జూపక వచ్చినాడిటకు దాని
నందుకే నీయసూయతా నటుల రేగె.
అయిన కానిమ్ము తండ్రి దయాప్రపూర్ణు
డీవు బీదవారిని దోచి యెట్లు వారి
సిద్ధి కడ్డంబు పడితివో చెప్పుకొన్న—
అంగడకు లోగి మనుజుండు దొంగిలించు
గాదె? కాని దైవంబు తాఁ గానబడియె!
పొమ్ము! నీకాల మదిచెల్ల పోవనయ్య.

## ఎగ్జిబిట్ XI

లిమన్ అబాట్ అభిప్రాయానుసారమైన మాడర్నిస్ట్ సువార్త. అతని పరిణామవాది అగమసిద్ధాంతం (1897) అనే గ్రంధంలో కనబడేవాక్యాలు.

మతం— అనగా, మనుష్యుని ఆత్మలో భగవంతుని జీవితము— అనేది సర్వప్రాణులను భగవత్సంబంధులుగాను, భగవంతుని క్రియాపద్ధతిని ఒక స్థిరశక్తి ద్వారమునను కొన్ని నియమముల ననుసరించుచును చేసెడి పద్ధతిగాను చూచు తత్త్వ సిద్ధాంతమునకే చక్కగా అవగత మవుతుంది. దాని వల్లనే మతం మరింత అభివృద్ధి అవుతుంది. ప్రకృతి శక్తులచేత, ప్రకృతి ధర్మాల ననుసరించి కొన్నిక్రియలు జరుగుతాయని, మరికొన్ని బయటి నుండి తప్పులు దిద్దడానికో సందులు పూడ్చుటకో భగవత్సంకల్పము ప్రత్యేకంగా జోక్యం చేసుకోవడంవల్ల జరుగుతాయని ఊహించే తత్త్వ సిద్ధాంతానికి మతము అంతబాగా అవగతమూకాదు; దాని అభివృద్ధికూడా అంతగా జరగదు....

ఈ క్రొత్తవిమర్శను ప్రాతకాలపు నైష్ఠికులు విప్లవాత్మకమని తలచుట సరియైనదే. చర్చి విషయంలో ప్రొటెస్టెంట్ సంస్కరణ విప్లవాత్మకమైనట్లుగానే బైబుల్ విషయంలో ఇది విప్లవాత్మకము......పొల్లుపోని ప్రమాణం అంత కోరదగినదికాదు. భగవంతుడు తన సంతానాని కట్టి ప్రామాణికతను ప్రసాదించలేదు. అంతకంటె ఎంతో మెఱుగైనదానినే ప్రసాదించినాడు— జీవితం. ఆ జీవితం దానికిగా పోరాడితేనేగాని రాదు. సద్గుణానికివలెనే సత్యానికికూడా సులభమైన అడ్డదారి లేదు ... సాధనక్లేశాన్ని తప్పించాలని గాని తద్ద్వారమున కలిగే పెరుగుదలను తప్పించాలనిగాని కాక మనము ఉన్నతుల మగుటకుగా పోరాడుటకు ప్రోత్సహించుటకే అది మనకు ప్రసాదింపబడింది....

క్రీస్తు జీవితము మనల రక్షించినప్పుడు— క్రీస్తు జీవితము మన కలవరింపబడుట ప్రసాదింప బడుటలద్వారా— క్రీస్తు రక్తమే మనల రక్షించింది. బాధ, బాధానుభవము అనేవాని ద్వారానే జీవితము నందింప సాధ్యపడు

తుంది. ఇదే మనల రక్షించింది. జీసస్ క్రీస్తు బాధానుభవము ఒక గంట సేపో మూడేండ్ల పరిమితి మాత్రమో గల ఒకఅనుభవము మాత్రమే కాదు: అనాది కాలమునుండి భగవంతుడు ప్రాణదాత అని, మనకు ఖర్చు అగునట్లుగానే ప్రాణమిచ్చుటకు భగవంతునకు గూడ కొంత వ్యయప్రయాస లున్నవని— ఈ శాశ్వత సత్యాన్ని జీసస్ క్రీస్తు బాధానుభవము తెలియ జూపుచున్నది. అయినప్పుడు ప్రాణము నిచ్చుటకు కొంత వ్యయమవుతుందని, ప్రాణము నిచ్చుటే వృద్ధియగుటలోని రహస్యమని పరిణామ సిద్ధాంతము నేర్పు తున్నది. మనము విపరీత త్యాగమని పిలిచేది బైబులు దృష్టిలో ఇట్టిది.... దీన్ని అధ్యాహార్యం చేసుకొని క్రైస్తవ మతం క్రీస్తు తన మరణం తర్వాత అనుయాయులకు దర్శనమిచ్చి ప్రతి చావు వెనుక ఒక పునర్జన్మ ఉంటుందనే దాన్ని ఋజువు చేస్తాడని విశ్వసిస్తుంది...

అందుచేత ప్రాకృత లక్షణాలను పరిశీలించి ప్రకృతివిజ్ఞానం స్పష్టపరచిన జీవన సూత్రాలు ఆధ్యాత్మిక జీవితసూత్రాలకు సారూప్యములు కాకపో యినా అటువంటివేనని ఈఆధ్యాత్మిక సూత్రాలను ప్రకృతిసూత్రాల ద్వారా వ్యాఖ్యానించవలసి ఉంటుందని నేను విశ్వసిస్తున్నాను.

## ఎగ్జిబిట్ XII

సంస్కరణ జూడాయిజం అభిప్రాయం ప్రకారం ఆధునికత. 1885నా పిట్స్‌బర్గ్ చర్చావేదికనుండి II మరియు I అంశాలు.

ప్రతి మతము భగవంతుని అనంత స్వరూపాన్ని తెలుసుకోడానికి ప్రతి పద్ధతిలోను ప్రతి మతంలో పవిత్రములుగా భావింపబడే ఏ ఆకర గ్రంథ ములోనైనను మనుష్యునిలోని అంతరదైవమున్నాడను ప్రజ్ఞానమును తెలుసుకోడానికి ప్రయత్నిస్తుందని మేము గుర్తిస్తాము. మన మతగ్రంథాలు బోధించిన విధంగాను యూదు గురువులు తమతమ యుగాల నైతిక తాత్విక పురోభివృద్ధి ననుసరించి అభివృద్ధిచేసి ఆధ్యాత్మిక మొనర్చిన విధంగాను జూడాయిజమ్ ఉత్తమోత్తమమైన భగవద్భావాన్ని చెపుతుందని మేమం టాము. జూడాయిజమ్ ఎడతెగని పోరాటాల, పరీక్షల మధ్య, విధిలేని ఏకాంతిక పరిస్థితులలో మానవజాతికి కేంద్ర మతసత్యముగా ఈ భగవద్భా వాన్ని పరిరక్షించి సమర్థించిందని మనము చెపుతాము...

జూడాయిజమ్ తర్కసూత్రాల కనుగుణంగా ఉండటాని కెప్పుడూ ప్రయత్నించే అభ్యుదయమతమని గుర్తిస్తాము. గడచినకాలంతో చారిత్రక సారూప్యమును పరిరక్షించుకోవలసిన తీవ్రావశ్యకతను గూర్చి మేము సమ్మతిస్తాము. క్రైస్తవమతము, ఇస్లాము జూడాయిజమ్ బిడ్డలగుటవల్ల ఏకేశ్వరసత్యాన్ని నైతికసత్యాన్ని వ్యాపింపజెయ్యడంలో సహాయపడే వారి దైవచింతనను మసము కొనియాడుతున్నాము. మనమీ దైవ కార్యాన్ని సమగ్రంగా నిర్వహించడంలో మన యుగంలోని విస్తృతమైన మానవతాభావమే మనకు సహాయకమని ఒప్పుకొంటాము. అది కారణం గానే మనుష్యులలో సత్యపరిపాలనము న్యాయశీలత ప్రతిష్ఠించుటలో మనతో సహకరించేవారందరికి మన సాహచర్యహస్తాన్ని అందిస్తాము.

## ఎగ్జిబిట్ XIII

క్రైస్తవ ఉదారవాదసారము.

చార్లెస్ ఇ. జెఫర్‌సన్ వ్రాసిన సనాతనవిషయాలు (1930) అను గ్రంథములోని వాక్యాలు.

చర్చి అధికారికంగా అడిగే విశ్వాస మెట్టిది? న్యూ టెస్టమెంట్ కావలె నని వాదించే విశ్వాసమెట్టిది? అదృష్టవశాత్తు దాన్ని గురించిన నిర్వచనం హిబ్రూలకు వ్రాసిన ఉత్తరం పదకొండవ ప్రకరణంలో మొదటి పద్యంలో మనకు దొరుకుతున్నది: ఇంక ఆశింపబడువాటి సారమే విశ్వాసము లేదా రివైజుడు బైబుల్ మార్జిన్‌లో మీరు చూడగలట్లుగా విశ్వాసమంటే "ఆశింపబడినదానికి ఆకృతినిచ్చుట." జీసస్ క్రీస్తులో నమ్మక ముండుటయే క్రైస్తవ విశ్వాసము. అయినను నమ్ముట అనగా ఆయన తాను చేయగలనని చెప్పినవానిని చేయగలడని ఆశించుట. మానవులను వారి పాపములనుండి రక్షింపగలనని ఆయన చెపుతాడు. మానవులు తన్నను గమించి తనవలె కావచ్చునని ఆయన అంటాడు,

ఇప్పుడు ప్రశ్న ఏమంటే ఒక మనుష్యుడాయనవలె కాగలనని ఆశింప గలడా? ఆయనలో నుండిన బుద్ధి తనకుండునని ఒక మానవుడాశింపగలడా? ఆయన అంతశ్శక్తి, చిత్తస్థితి, మనఃప్రవృత్తి తనకు రాగలనని ఆశింప గలడా? ఇట్లా ఆశించవచ్చుననుకోండి! దానినాశింపలేదంటే దానికి

కారణం నైతికంగా కుళ్ళిపోయి ఆకాంక్షించే శక్తినికూడా పోగొట్టు కొని యుండుట; వెలుగునకంటే చీకటినే ప్రేమించుట; చీకటిని ప్రేమించుటకు కారణమేమంటే అతనివన్నీ పాపకర్మలు. మంచి మనుష్యుడుగా ఉండాలని ఆశింపని మానవుడు తన్నుతానే ఖండించుకొన్నవాడు. మరి, ప్రతివాడు తాను క్రీస్తువలె కావలెనని ఆశింప సాధ్యమైతే ప్రతివానికి తాను ఆశించే ఆ దానికి పూర్తిగానో తక్కువగానో ఆకృతి కల్పించడం సాధ్యమే అవుతుంది. తన ఆశలు పండించుకోడానికి తగిన మార్గంలో నడుచుకోడానికి వెంటనే ఆరంభించవచ్చు శక్తిమంతంగా పనిచేసి చూపిన పద్ధతిని తన జీవితంలో నిర్మించుకోవచ్చు. అందుచేత విశ్వాసంలో రెండు అంశాలు ఉన్నవి: మొదటిది ఆశించుట, రెండవది ఊర్జస్వితతో కృషిచేయుట – ఈ రెండు అంశాలుకూడా మనుష్యుని సంకల్పబలానికి లోబడి ఉన్నవి. మన మాశింపగలము; ఎక్కువో తక్కువో అయిన సిద్ధితో మన ఆశలకు ఆకృతులు కల్పింపనుగలము. ఆశించి తన ఆశకు ఆకృతి కల్పించే ప్రతివాడు విశ్వాశముగల మానవుడే.

## ఎగ్జిబిట్ XIV

1920 తర్వాతి కాలంలో మినిష్టర్ల ఆగమవిద్యార్థుల ఆగమసంబంధి విశ్వాసాల పోలిక.

ఈ ప్రశ్నలు జార్జ్ హెర్బర్ట్ బెట్స్ మినిస్టర్లను ఆగమ విద్యార్థులను అడిగిన ఏబదిఆరు ప్రశ్నలలోనుండి ఏరుకొనబడినవి. ఫలితాలను 700 మినిస్టర్ల నమ్మికలు (ఆబింగ్డన్ ప్రెస్, 1929) అనే గ్రంథంలో Iవ పట్టిక IVవ పట్టిక అని రెండు పట్టికలుగా పుటలు 26–30, పుటలు 53-56లలో క్రమంగా కూర్చబడి ప్రచురించబడినవి.

25వ పుటలో ఈ వివరణమున్నది: "మొదటి వర్గమైన 500 మంది మినిష్టర్ల లో తెగలవారీ చర్చీల సంఖ్యా విభాగాలు ఇట్లా ఉన్నవి. బాప్టిస్ట్ 50; కాన్గ్రిగేషనల్ 50; ఎపిస్కోపలియన్ 30; ఎవాంజెలికల్ 49; లూథరన్ 105; మెథడిస్ట్ 111; ప్రిస్బిటీరియన్ 63; తక్కినవన్నీ (13 తెగలు), 43. తెగలవారీచర్చీలకు గాని సంస్థలకుగాని ఇబ్బంది కలగకుండా ఆగమప్రస్థానాల పేర్లను వెలికిరానియ్యలేదు."

ఈ పట్టికలను కాపీరైట్ ఉన్న మిస్టర్. వోర్లన్ సి. బెట్స్‌గారి ఉదారమైన అనుజ్ఞతో ప్రచురిస్తున్నాము.

మీరు విశ్వసిస్తారా—

| | 500 మినిస్టర్లు శాతాలు | | | 50 విద్యార్థులు శాతాలు | | |
|---|---|---|---|---|---|---|
| | అవును | ? | కాదు | అవును | ? | కాదు |
| 2. భగవంతుడు ముగ్గురు వేర్వేరు వ్యక్తుల ఏకరూపం? | 80 | 7 | 13 | 44 | 21 | 35 |
| 7. ప్రపంచసృష్టి జెనిసిస్‌లోచెప్పబడిన పద్ధతిగా అందులో చెప్పబడిన కాలంలోనే జరిగింది? | 47 | 5 | 48 | 5 | 6 | 89 |
| 10. ఒక్కొక్కప్పుడెప్పుడైనా భగవంతుడు క్రమసూత్రాన్ని పక్కనబెట్టి అద్భుత కార్యం చేస్తాడని? | 68 | 8 | 24 | 24 | 16 | 60 |
| 12. డెవిల్ ఒక యదార్థ ప్రాణిగా ఉంది? | 60 | 7 | 33 | 9 | 9 | 82 |
| 20. బైబుల్ వ్రాయడంగా పలించిన దివ్యోత్సాహం తక్కిన గొప్పమత వాఙ్మయములరచనోత్సాహం కంటె భిన్నమైనది? | 70 | 5 | 25 | 26 | 6 | 68 |
| 22. బైబిల్ పురాణకథలుగాని కట్టు కథలుగాని బొత్తిగా లేవు? | 38 | 7 | 55 | 4 | 1 | 95 |
| 23. ఇతర సాహిత్యానికి చరిత్రకు అమలుపరచే విమర్శసూత్రాలను నిర్ణయపద్ధతిని బైబుల్‌కు అమలు పరచాలి? | 67 | 5 | 28 | 88 | 5 | 7 |

| | అవును | ? | కాదు | అవును | ? | కాదు |
|---|---|---|---|---|---|---|
| 24. అన్ని మతసంబంధమైన తెగలను మనుష్యులలోని విశ్వాసాలను వాటి సత్యాన్ని యోగ్యతను నిర్ణయించడానికి న్యూటెస్టమెంటే ఖండితమైన పొల్లుబోని స్టాండర్డ్. | 77 | 3 | 20 | 33 | 12 | 55 |
| 26. జీసస్ మానవుడైన తండ్రి లేకుండా కన్యకకు జన్మించినవాడు | 71 | 10 | 19 | 25 | 24 | 51 |
| 32. జీసస్ భూమిమీద ఉండగా అతనికి చచ్చినవారినిబ్రతికించేశక్తిఉండింది దాని నతడుపయోగించినాడు. | 82 | 9 | 9 | 45 | 28 | 27 |
| 34. జీసస్ చనిపోయి ఖననము చేయబడిన తర్వాత గోరీని వట్టిదిగా వదలి చచ్చినవారినుండి లేచి వచ్చినాడు. | 84 | 4 | 12 | 42 | 27 | 31 |
| 37. స్వర్గమనేది ఒక యదార్థమైన చోటుగా ఉన్నది. | 57 | 15 | 28 | 11 | 20 | 69 |
| 38. నరకమనేది ఒక యదార్థమైన చోటుగా ఉన్నది. | 56 | 13 | 34 | 11 | 13 | 76 |
| 39. చావు తర్వాత జీవితం కొనసాగుతుంది. | 97 | 2 | 1 | 89 | 7 | 4 |
| 40. శరీర పునరుత్థానమునందు మీకు విశ్వాసమున్నదా? | 62 | 5 | 33 | 18 | 13 | 69 |
| 44. భూమిమీద జీవించినవారందరికీ చివరకొక (పాపపుణ్య) నిర్ణయదినము ఉంటుంది. | 60 | 8 | 32 | 17 | 16 | 77 |

| | అవును | ? | కాదు | అవును | ? | కాదు |
|---|---|---|---|---|---|---|
| 49. మనుష్యులంతా ఆదాము సంతాన మగుటవల్ల విపరీతములు పాపపూరితములు నీచములు అయిన స్వభావములతో పుట్టినారు. | 53 | 4 | 43 | 13 | 7 | 80 |
| 50. ప్రార్థనకు స్వభావ లక్షణాలను మార్చే శక్తి - అనావృష్టివంటి లక్షణాన్ని మార్చేశక్తి ఉంది. | 64 | 11 | 25 | 21 | 22 | 57 |
| 51. ఇతరులకొరకు చేసే ప్రార్థన ఆ ఇతరులకు తెలిసినా తెలియక పోయినా వారి జీవితాలమీద ప్రభావం చూపిస్తుంది. | 83 | 9 | 8 | 58 | 25 | 17 |
| 52. భగవంతుడిప్పుడు హోలీ స్పిరిట్ సాధనంగా అతని వ్యక్తిత్వంద్వారా మనుష్య జీవితాలమీద పనిచేస్తాడు, | 94 | 1 | 5 | 82 | 11 | 7 |
| 53. తెగ, వ్యక్తిగత విశ్వాసములతో సంబంధం లేకుండ-భగవంతుని ప్రేమించి తోడి మానవులతో న్యాయంగా వ్యవహరించే మనుష్యులు క్రిష్టియన్ చర్చిలోకి స్వీకరించడానికి అర్హులు, | 56 | 5 | 39 | 85 | 4 | 11 |

# ఎగ్జిబిట్ XV

అథారిటేరియానిజమ్ మీద ప్రెసిడెంట్ ఇలియట్ విమర్శ.

జె. విర్నపీ మార్గన్ సంపాదించిన ఇరవయ్యో శతాబ్దావతరణ కాలంలో ఆగమశాస్త్రం (1901) అనే గ్రంథంలో (పుటలు

510,514) చార్లెస్ డబ్ల్యు. ఇలియట్ వ్రాసిన "ముగిసిన శతాబ్దంలో వచ్చిన శతాబ్దంలో అభ్యుదయ ఉదార సిద్ధాంతం" నుండి.

కడచిన శతాబ్దంలో బైబుల్ అధికారమొక్కటే తగ్గిపోలేదు; సమస్తమైన అధికారానికి-రాజకీయమైన, మతసంబంధమైన, విద్యాసంబంధమైన, గృహవిషయకమైన ... అధికారానికి శక్తి తగ్గింది. పడిపోవుచున్న ఈ అధికారాల స్థానానికి ఏ అధికారం, కొంతవరకైనా, వస్తున్నది? కొంతవరకైనా అని ఎందుకంటున్నానంటే లోకానికి ఈ అధికారంతో చాలు చాలుగా అయింది. తగినంత ప్రేమ స్వాతంత్ర్యము లేవు. కడచిన శతాబ్దాంతంలో క్రమంగా పలుకుబడిని పెంచుకున్న అధికారం ఒకటున్నది. అది అభివృద్ధి అవుతున్న సాంఘికభావం లేదా బాంధవ్యభావం...

క్రమబద్ధమైన ఆగమశాస్త్రం శతాబ్దాల తరబడి గొప్పగా చెప్పుతూ వచ్చిన ఒక ఉద్దేశాన్ని సాంఘికవిజ్ఞానశాస్త్రం త్రోసివేస్తున్నది. వ్యక్తికి సంబంధించిన మోక్షోద్దేశం. ఇది ఈ లోకానికి సంబంధించినా పరలోకానికి సంబంధించినా ప్రధానంగా స్వార్థపూరితమైన ఉద్దేశం, భూమిమీది మన యీ కొన్నాళ్ళ జీవితాలకే అంతమంచిది కాని ఈ ఉద్దేశం అనంత కాలానికి నిశ్చయంగా మేల్తరమైన ఉద్దేశం కాబోదు...పరలోకంలో సౌఖ్యాలు (చేసిన పుణ్యకార్యాలకు) ప్రతిఫలాలు ఉంటాయనే వంచనమాటలతో ఆశ గొలిపి ప్రజానీకాన్ని ఇహలోకంలోని దౌర్భాగ్య జీవితానికి సమాధాన పరచటం ఇకమీద సాధ్యం కాదని సాంఘిక విజ్ఞాన శాస్త్రం చూడగలుగుతున్నది: ఈ లోకంలోనే ఆనందం కావాలని గట్టిగా అడుగుతూ వారికి సానుభూతి చూపుతున్నది. చనిపోయిన తర్వాత అబ్రహామ్ హృదయం వస్తుందని లాజరస్ ఇప్పుడు ద్వారంకడ భిన్నశరీరుడై పడి ఉండటానికి సమాధానపడలేము. ఇహలోకంలోని దౌర్భాగ్య స్థితివల్ల తాము ఇప్పుడు గాని తర్వాత కాలంలోగాని ఆనందమనుభవించడానికి కొఱగాకుండా పోతామని ప్రజానీకం తామే తెలుసుకుంటున్నారు. ఉత్తమమైన ఆనందానుభవం కలిగించే మానసిక నైతిక శక్తులు కుంచితములై పోవచ్చునుగనుక. మనుష్యులకు ఒకదానివల్ల ఆశగాని రెండోదానివల్ల భయంగాని ఉండరాదని స్వర్గానికి అంటుపెట్టడానికి ఒక చేతితో దివ్వెటి నరకదాహం తీర్చడానికి ఒక చేతిలో నీటికుండ ధరించిన దేవదూత స్వభావంవంటి చిత్తవృత్తి సాంఘిక విజ్ఞాన శాస్త్రానిది.

ఫాస్‌డిక్ నవీనత నధిగమించిపోవుట.

ఉదారవాదుల నాయకుడుగా పేరెన్నికగన్న హారీ ఎమర్సన్ ఫాస్‌డిక్ తన రివర్ సైడ్ చర్చిలోచేసి క్రిష్టియన్ సెంచరీ డిశెంబరు 4, 1935లో ప్రకటించిన విస్తర ప్రచారంగల ధర్మోపన్యాసంలో ఇప్పటి ప్రపంచ సంకట పరిస్థితికి మాడర్నిస్ట్ ఆగమశాస్త్రం చాలదని ఒప్పుకున్నాడు. తన ఉదార వాదాన్ని వెనుకకు త్రోయకుండా అతడు ఇంకా స్పష్టమై విశిష్టమైన క్రైస్తవ సువార్త అవసరమని భావించే వారితో చేరినాడు.

నేను నవీనతావాదిగా ఉండి ఇప్పటికి ఉంటున్నాను కనుక నవీనతో ద్యమము మనుష్యుడు కేంద్రంగాగల సంస్కృతికి తన్నుతాను సవరించు కుంటు, ఈ చిత్తవృత్తిని తరచుగా ప్రోత్సహించి, దివ్యతా సంబంధమైన భావాన్ని పలుచనచేసి, ఎవరో తెలియని దేవుని పీఠము ముందు ఆత్మలను పూర్వపు ఎధీనియనులవలె నిలబడి ఉండేటట్లు (పాపము శాంతించుగాక) చేసిందని అంగీకరించడం సమంజసం. ఈ అంశంమీద చర్చి నవీనతను అధిగ మించి పోవాలి. ఎవరికేది కావలెనో వారికది సమకూరుస్తూ ఉండటం మనకు చాలా నాళ్ళుగా పరిపాటి. ఎంతో కాలము మారుతూ సర్దుకుంటూ సవరించుకుంటూ వచ్చినాము. ఒక్కొక్కప్పుడు మనము ఎంత దిగజారి పోయినామంటే ఎవరో కొందరు వైజ్ఞానికులు భగవంతుడున్నాడని నమ్ము తున్నారని చెప్పడమే సర్వశక్తుడైన భగవంతునికి మనము సమర్పింపగల మేలైన కొనియాటగా మాట్లాడినాము. అయినా ఎప్పుడూ మనము హక్కుగా ఒక స్వతంత్ర భూమిక మీద నిలచి మానవజాతికి ఆశ ఉన్న మన ఏకైక సందేశాన్ని అందిస్తూనే వచ్చినాము.

## ఎగ్జిబిట్ XVII

యువక అమెరికన్ ఋషులకు ఒక ప్రార్థన గీతం ప్రొటెస్టెంటు ఎపి స్కోపల్ చర్చివారి ప్రార్థన గీతాలనుండి గ్రహింపబడినది.

తాము ప్రేమించి యెరుగుచుఁ దనరి నట్టి
ప్రభువుకై పోరి, శ్రమించి, ప్రాణమిచ్చి
నట్టి జాంతులు, ధీర సత్యాత్ములైన
దివ్య ఋషులను గూర్చి కీర్తింతు నేను.
ఒకడు వైద్యుడు మరియు దానొకతె రాజ్ఞి
గట్టి పట్టున గొఱ్ఱెలం గానె నొకతె
వారలందరు ఋషులైన వారె చూడు
అరయ నేనును ఋషినౌట కాత్మఁ దలతు.

* * * *

పూర్వ యుగములందునె కాక పూజ్యఋషులు
పరగ నున్నారు లక్ష లిప్పటికిఁ గూడ
ఏసు నిచ్చను ప్రీతితో నెసగ జేయు
నట్టి యానంద ఋషులఁ దీయంబు జగము
నందులందున బళ్ళలో సంద్రమందు
రైళ్ళలో, చర్చిలోన, నంగళ్లయందు
చూడవచ్చును వారల చూడగాను
వారు గూడను నావంటి వారె కాదె
అరయ నేనును ఋషినౌట కాత్మఁదలతు.

## ఎగ్జిబిట్ XVIII

ఒక మెతాడిష్ట్ మినిష్టర్ పూజావిధానములో "కోపెర్నికన్ విప్లవము" ను ప్రకటించుట.

ఫ్లాయిడ్ యస్. కెన్నీ మానవాభ్యుదయమునకు సంబంధించిన మతము అను మిమియోగ్రాఫ్ పుస్తకమును వ్రాసి ప్రచురించిన (1940) పుటలు IV-VI నుండి.

మతము సహజముగా ఒక కళ. అదికూడ సృజనాత్మక వర్గానికి చెందినదే కాని కళలన్నిటి వలెనే దాని సర్జన శీలమునకు నిర్మితి కావాలి. దాని నిజమైన విలువ సంస్థలకు, కార్యాలయాలకు, అంటుకొనిపోతుంది. మతాన్ని మానవుని సృజనాత్మక బుద్ధి అంతశ్శక్తి అనువాని క్రియగా చూచుటకు

నిర్మాణమునుగురించి ఆలోచించడం అవసరమవుతుంది. మత సంస్థను సంస్కృతి పరిధిలోనికి తీసుకుని వచ్చుటవలన మతం కూడ సాంస్కృతికమైన మార్పుల సూత్రాలకు గురియగునట్లు చేయబడుతుంది.

అందుచేత మనం ఒక కళాఖండాన్ని విమర్శ పూర్వకంగా పరిశీలించునట్లు మతము జోలికి పోయినప్పుడు దాన్నికూడ ఒకానొక పద్ధతిలో చూడాలి. దానిని సృష్టించిన సంస్కృతిని అనుసరించి ఒక మతాన్ని అర్థం చేసుకుని వెల కట్టాలి. జీవితంలో ప్రచోదక శక్తులైన ఆదర్శాలకు సాంఘిక లక్ష్యాలకు సంబంధించినంతవరకు ఒక మతం విలువను దానిని ఆవరించుకుని ఉన్న సంస్కృతి విజయాన్నిబట్టి నిర్ధరించాలి...

ఇప్పటినుండి మతం శాస్త్రీయమైన ప్రజాస్వామ్య సంస్కృతిలో మానవీయములైన విలువలను పూర్తిగా అనుభవంలోకి తెచ్చుకొనుటకు మానవుని ఆధ్యాత్మిక జీవితానికి తెలివితో ప్రయోజన దృష్టితో దారి చూపించేది అవుతుంది... ఇటువంటి దృక్పథంలో వ్యవస్థారూపమైన మతానికి కోపెర్నికన్ విప్లవము లాంటిది ఏర్పడుతుందని పూర్తిగా ఒప్పుకోవచ్చు. ఏమైనా ఈ దృక్పథము దానిలో ఇమిడియున్న మతసంబంధమైన పునర్నిర్మాణము అనేది మతంలోని ఆంతర జీవితంనుండి "ఎడబాయుటయే" అనే దానిని తిరస్కరించినారు. ఇటువంటి గవేషణలో మానవుని ఆధ్యాత్మిక స్వభావాన్ని మేలుగొల్పడం దర్శనసిద్ధి, దివ్యావేశము అవుతవి,

## ఎగ్జిబిట్ XIX

నవీన ఆచారములకు తగినట్లు చేయబడిన వైరాగ్యమునకు విలియమ్ జేమ్స్ సి. ఫారస్ ఆయన వ్రాసిన మ తా ను భ వ ము ల ర కా లు, పుటలు 364-369 నుండి గ్రహింపబడినది. ఈ భాగము సామ్రాజ్యవాదుల యుద్ధమును గురించిన ఆయన తలపోతలకు సంబంధించినది.

బుద్ధికి వివరించ శక్యముగాని, శిలువ దోషానికి ఇంకా దాని అనశ్వరమైన మహార్థం ఉన్నది, అయినప్పుడు, మునుపటి కాలపు తెలియని వారు దానిని ఎన్ని అస్పష్ట మార్గాలలోకి నడువనిచ్చి నప్పటికిని ప్రాతినిధ్య దృష్టికి సంకేత దృష్టికి వైరాగ్యమనేది జీవిత ఫలాన్ని చక్కగా సవరించుకొన

డానికి సహాయపడుతుందని నా విశ్వాసం. పోల్చిచూస్తే ప్రకృతి సిద్ధాంత వాదుల ఆశాదృష్టి కేవలం ఒక పొగడికగానూ మెత్తని మాటలుగానూ పాలు, ద్రాక్షసారాయి కలిపి చేసిన పంచామృతముగానూ ఉంటుంది, అందుచేత మతాభి రతిగలవారుగా మనము చేయవలసిన కార్యమార్గం ఈనాడు మనలో అనేకులు చేస్తున్నట్లు, వీపు మళ్లించడంకాక కష్టదారిద్ర్య మార్గాలలోని ఫలాలకు ప్రయోజన ఫలమేర్పడేటట్లుగా వైరాగ్య చిత్త వృత్తికి ఒక మార్గం కల్పించడం...ఉదాహరణకు ఈనాటి "తత్త్వం"లో ప్రముఖ భాగంగా ఉన్న ధన భోగానుభవాల పూజ కొంత ఆడుతనమునకు పురుషానుచితవృత్తికి కారణమగుచుండుటలేదా? ఈనాడు ప్రత్యేకమైన సానుభూతితో ముద్దు మాటలతో పిల్లలను పెంచే - నూరేండ్లనాటి విద్యా విధానంకంటే ఎంతో భిన్నమైన, ముఖ్యంగా ఎవాంజెలికల్ వర్గాలలో- ఈ పద్ధతిలో ఎన్నో మంచి గుణాలు ఉన్నప్పటికి ఒక విధమైన పనికిమాలిన తనము అందులో ఏర్పడుటలేదా? ఈచోట చక్కబరచిన, పునఃపరిశీలితమైన సంయమిక శిక్షను అమలు పరచడానికి వీలైన అంశాలులేవా? మీలో అనేకులు ఈ లోపాలు గుర్తిస్తారు. కాని వ్యాయామక్రీడలు, సైనికశిక్షణ వైయక్తిక, జాతీయ కార్యధురంధరత్వము సాహస చర్యలు మొదలైన ప్రతిక్రియలున్నాయి చూడమంటారు.

వేడికి మెకానికల్ ఈక్వివలెంట్‌ను గురించి వింటుంటాము. మనమిప్పుడు సంఘంలో కనుక్కోవలసింది యుద్ధానికి సరితూగగల నైతికమైన ఈక్వివలెంట్: యుద్ధమెంత వీరంగా పలుకుతుందో అంత వీరంగా పలుకగలది; యుద్ధంవలె ఆధ్యాత్మిక విలువలతో పొందికలేనిదిగాక తమతమ ఆధ్యాత్మిక విలువలతో పొందిక సంపాదించగలది. ప్రాతకాలంలో సన్యాసులు - దాని కెంత లూలామాలపు తనం వచ్చినా - దారిద్ర్యాన్ని ఆరాధించినపద్ధతిలో మనం వెదకుతున్న యుద్ధానికి నైతిక ఈక్వివలెంట్ లాంటిదేదైనా దొరకవచ్చునని నేను తరచు అనుకుంటాను. బలహీనులైన జనులను అణగ ద్రొక్క నవసరం లేకుండ స్వచ్ఛందంగా అంగీకరించిన దారిద్ర్యం "కష జీవనము" కాకూడదా?

దారిద్ర్యము నిజంగానే కష్టజీవనం - మేళాలు, యూనిఫారాలు, నివ మెత్తినట్లుగా తోచే ప్రజల చప్పట్లు, అబద్ధాలు. డొంకతిరుగుళ్ళు లేని కష్ట జీవనం. ఈనాటి మన తరంవాళ్ళ మజ్జాస్థికలలోకి ధన సంపాదన లక్ష్య

మెట్లా ఇంకుతున్నదో చూచినప్పుడు దారిద్ర్యమనేది యోగ్యమైన మత కర్మానుభవమన్న నమ్మిక "ఛాత్ర స్థైర్యం పరిణామముగా" ఇప్పటి మన కాలానికి కావలసిన ఆధ్యాత్మిక సంస్కరణగా మారగూడదా అనిపిస్తుంది.

జనరంజకాలు కాని విషయాలలో మనకు శ్రద్ధ ఏర్పడినప్పుడు దారిద్ర్యముమీది వ్యక్తిగతమైన ఉపేక్షాభావం ఎంత బలమిస్తుందో ఆలోచించి చూడండి. మనం నోరు మూసుకొని ఉండనక్కరలేదు; విప్లవ వాదికో సంస్కరణవాదికో ఓటు వెయ్యడానికి భయపడనక్కరలేదు. మన స్టాక్ వాటాల వెల పడిపోవచ్చు, పై ఉద్యోగంవస్తుందన్న ఆశ అంతిరించిపోవచ్చు, జీతాలు రాకపోవచ్చు, మన ముఖాలమీద క్లబ్బు తలుపులు దభాలున మూతపడవచ్చు; అయినా మనం బ్రతికి ఉన్ననాళ్లలో అట్టి అంతశ్శక్తికి మనమే సాక్ష్యంగా ఉంటాము. మన తరంవాళ్లకు మనము మార్గదర్శకులమై విమోచనము కల్గిస్తాము. ఈ ఉద్యమానికి దానికి కావలసిననిధులేమో కావాలి. అయితే మన దరిద్రంతో మనమెంత తృప్తిగా బ్రదుకగలమో దానికి అనుగుణంగా ఆ ఉద్యమ సేవకులమైన మనము దానికి సమర్థులము కాగలము.

ఈ విషయాన్ని మీరు గంభీరంగా ఆలోచించాలని కోరుతున్నాను. ఏమంటే చదువుకున్నవారిలో దారిద్ర్యమంటే ఉన్న భయం మన నాగరికతలోని హేయమైన నైతిక రోగమనుట తథ్యం.

## ఎగ్జిబిట్ XX

ఆధ్యాత్మికశక్తి — మంత్రజ్ఞానము.

ది టెంపుల్ ఆర్టిసాన్, 1949, 1951 లలోని వాక్యాలు కాలిఫోర్నియాలోని హ్యాల్సియాన్‌లో ప్రచురితము.

"భగవంతుడు తన పవిత్రాలయములో నున్నాడు. ఆయన సన్నిధిలో జగమంతా మౌనము వహించుగాక."

శతాబ్దాల తరబడి అసంఖ్యాకమైన చర్చిలలో ఈ మాటలతో సర్వీసులారంభమౌతూ వచ్చినవి. ఈ మాటలు ఉచ్చరించుతూవచ్చిన క్రీస్తులందరిలో ఎందరు వీటిని సరిగా వ్యాఖ్యానించినారో ఆలోచించండి ... ఆలయము

స్థూలముగా, అభివ్యక్త విశ్వము. దాని చిన్నచిన్న భేదాలలో ప్రతి అణువు శక్తి, చైతన్యము, ఉన్నవి. జీవించి ఉన్న ప్రతి ప్రాణికూడ ఆ భగవచ్ఛక్తికి నిలయమైన చిన్న ఆలయమే.

పవిత్రాలయ గర్భాంతరాళంలోనే, నిశ్శబ్దంలోనే భగవదాత్మ అభివ్యక్తమవుతుంది. ఆలయ సిద్ధాంతంలోని రహస్యమైన పవిత్ర నిశ్శబ్దములోనే ఏ సభ్యుడైనా దాని ప్రాభవశక్తి యశస్సులను కొంచమైనా చూడ వీలవుతుంది....

1898 సంవత్సరములో భూలోకంలోని సమస్త ప్రాణులకు ఒక అవతారాభివ్యక్తి కాలం, ఒక బీజకాలం, ఆరంభమైంది. చక్రనేమిక్రమాన్నిబట్టి-రాబోవు యుగాని కార్యకలాపాల కేంద్రంగా పరిపాలకుడైన "రెడ్ రే" యొక్క రీజెంటు అయిన—మాస్టర్ హిలారియన్ ఇంకొక ఆరుమంది ఉపదిష్టుల సహాయంతో ఏడు మందిని ప్రజల దేవాలయానికి న్యూక్లియస్‌గా ఉండ పిలచినాడు. నాల్గవ మెట్టుగా ఉన్న ఈ కేంద్రం అనేక ముఖ్య చాక్రిక్ కారణాలవల్ల ఎడతెగక ఒక హృదయ స్థానంగా పనిచేస్తుంది. దీనివల్ల పెద్ద పెద్ద వ్యవస్థిత సంఘాలలో పునర్జన్మ బీజాలు నాటడం అవి మొలకెత్తడం సాధ్యమవుతుంది.

అమెరికా ఒక క్రొత్తజాతికి పొత్తిళ్లవంటిది. కాలిఫోర్నియా ఈ క్రొత్త జాతి దేశము - మునిగిపోయి మళ్లా రానున్న ఒక ఖండంలో భాగము. హాల్సియాన్ - రాబోయే జాతికి మెక్కా - ఒక నివాసకేంద్రము. చరిత్ర పూర్వపు లక్షణాన్నిబట్టి, మరికొన్ని తాంత్రిక కారణాలనుబట్టి దీన్నిఎన్నుకొని ఆ కార్యాని కర్పించినారు.

దిక్కు తెలియనీయక చీకాకు పరుస్తున్న పరస్పర విరుద్ధశక్తుల మధ్యకు ఈ నవ విధియొక్క అవతారశక్తి వస్తున్నది — విశ్వజనీనమై దయాపూరితమై, బాధానివారకమై, జ్ఞానదమై, సంసర్గ రహితమై ఏకీకరించే శక్తి ఇది...మానవ జాతిని తాకించి విడుచుచున్న వర్తమాన చక్రములోని శక్తులు బహుముఖములుగా నున్నవి. వింగడింపు చేయగా ఇవన్నీ పూర్తిగా కర్మకు, కలియుగానికి - ఇనుపయుగం - సంబంధించినవి. ఇప్పటి ఈ సంధి కాలం అవతారోదయకాలమూ, క్రీస్తు విరుద్ధకాలము. అందుచేత గొర్రెలను గొర్రెలుగా, మేకలను మేకలుగా విడదోలేసమయం, "జగజ్జ్యోతికి యుగశక్తులకు ఇది ఒక యుద్ధం - లోని భగవంతునికి లోని - నివాసశక్తులకు మధ్య-

ఒక నిజమైన మతయుద్ధం...అందుచేతనే ప్రపంచమంతటా సిద్ధాంతాల ఉడికి పోతున్నాయి. ముఖ్యంగా అమెరికాలోను పాశ్చాత్య దేశాలలోను.

పండితలోకంలోని సంఘవైజ్ఞానికులకు "లాడ్జి" అనుయాయులకు ముఖ్య భేదమిది: ఒక దానిలో నేర్చుకొనేపద్ధతి తిర్యఙ్మార్గంలో ఉంటుంది. రెండవదానిలో ఊర్ధ్వగతిలో ఉంటుంది. ఒకదానిలో (పదార్థముల) గురించిన బుద్ధి, విజ్ఞానం విస్తృతంగాపోతుంది. రెండవదానిలో ఊర్ధ్వ గతిలో లోటులు వెదుక్కుంటూ ఇతర విధమైన చైతన్యమార్గాలుచూస్తూ పోతుంది. ఈ రెండవది శిష్యరికమార్గం. మనుష్యులలో ఇది వ్యాపించే కొలదీ మరి ఇంక ఎన్ని ఇతర నామధేయాలైనా ఇవ్వవచ్చు. ఇది కష్ట మైన మార్గం. ప్రతివ్యక్తికి ఎప్పుడో ఒకప్పుడు ఈ దారి తప్ప వేరేదారి లేనిపరిస్థితి వస్తుంది. సామాన్యునికి విశ్వాసమనేది వట్టి నమ్మకం మాత్రమే. పుట్టి, పెరిగి, వ్యాపించి, మని, చివరకు నశించిపోవలసిన ప్రతి అభివ్యక్త జీవి కేంద్రంనుండి విద్యుచ్ఛక్తిలాగ విశ్వాంతరాళంలో సర్వత్ర వ్యాపించిన శక్తి అనుకుంటాడు పారంగతుడైన తాంత్రికుడు...

కొండలను కదలించే విశ్వాసం ప్రతి ఉపదిష్టుడు సాధింపజూచే శక్తి— చివరకు ప్రతి సాధకుడుగూడా సాధింపజూచేది.

సమస్తజనులు, జాతులు ముందో వెనుకనో తెలుసుకొనే ఒక గొప్ప విషయం — ఈ అవతార చక్రకాలంలో — న్యాయమే విశ్వాన్ని పరిపాలిస్తుందని ... ఈ చక్రకాలంలో వెలుగు సంపూర్ణంగా అభివ్యక్త మౌతుంది. సమస్తము జ్యోతి కుమారుడైన క్రీస్తు ఎదుటకువచ్చి అతని దృష్టిలో పడుతుంది. ఎందుకంటే లోకానికి న్యాయాన్ని తేవడం ఆయన నియతకర్మలలో ఒకటి ... పైనుండి వచ్చే ఆ కాంతిని ఓర్చుకోగలిగితే తప్ప క్రిందినుండి మానవునిలోని జాంతవ శక్తులను ఉత్తమోపయోగానికి మళ్ళిక చేస్తే తప్ప "చిన్నవానికి" సహాయపడలేము ... భౌతికములైన ఆస్తిపాస్తులమీద, భావబుద్ధులకు చేరికగా ఉన్నవానిమీద మూగి ఉన్న వానిచేతికి ఈ తాళపుచెవి పెద్దదవుతుంది. చేతులో ఏమీ లేనివాడే ఇది గ్రహింపగలడు. అటువంటివాని చేతిలో ఇది ఒక చైతన్యద్వారం తెరు స్తుంది. ఇందులో మనుషులంటూ ఉండరుగాని ఐకమత్యం, స్వాతంత్ర్యము, ఆధ్యాత్మిక కేంద్రీకృతి నిలచిఉంటాయి. ఆచోట ప్రతివానికి తన తమ్ము

డెటువంటివాడో చెల్లెలెటువంటిదో, తానెటువంటివాడో తెలుస్తుంది. మనమంతా ఒకటే — ఎడబాటులేదు ... బుద్ధి శక్తికి ఆధ్యాత్మికశక్తికి మధ్య విశ్వజనీనమైన ప్రేమ అనే వంతెన కట్టవలసిన అవసరం ఉన్నట్లు తోచుచున్నది —

---

# మేధావిషయక

## పునర్నిర్మాణము

వర్తమాన శతాబ్దము తొలిదశకమునాటి మతవిశ్వాసమును ఈనాటి యువకులకు పొందికైనదిగా గనుపింపజేయుట కష్టము. 1900 నాటి ఉపేక్షాభావమునకంటె 1800 నాటి దిక్కుతోచనితనమే అర్థమగునట్లుగ తోచును. ఈ ఉపేక్షాభావము రెండు రూపాలుగా వచ్చినది. ఒకటి అతివాదు అది. రెండవది ఆచారపాక్షికతా సంబంధమైనది; ఒకటి నవీనతాసిద్ధాంత సంబంధి రెండవది బైబుల్ సంబంధి కాని ఈ రెండును మతవిషయకమైన ఆత్మవిశ్వాసమును వ్యక్తీకరించునవే. ఆకాలమునకు ప్రధాన వక్త అయిన జార్జ్. ఎ. గార్డన్ "మనకాలపు జీవితము ఆశాభావమను పునాదులమీద నిర్మింపబడిన" దని వ్రాసెను; మతభావము ఆ కాలతత్త్వమును ప్రతిఫలింప జేయవలెనని సిద్ధాంతితముగ గ్రహించెను. మన తండ్రి తాతల ఈ "విశ్వాసము"నకు రెండు పార్శ్వములు, పదార్థమొక్కటే—ఆనాటి మంచి డాలర్ల వలె. ఒకవైపు అనుగ్రహపూర్ణమైన దైవమునందు విశ్వాసము— "భగవంతుని యందు మాకు విశ్వాసము" రెండవవైపు ఆత్మవిశ్వాసము లేదా పురోభివృద్ధినిగూర్చిన నమ్మిక; నిరాటంకమైన వినిమయమును గూర్చిన విశ్వాసము; సరియైన మార్గమున నడచుచుంటి మను విశ్వాసము; ప్రధానమైన సత్యస్వరూపము దొరికినదను విశ్వాసము.

## ఉపేక్షాభావముతో బైబుల్‌పై ఆధారపడుట.

బైబుల్ సంబంధించిన ఉపేక్షాభావమును ఎక్కువగా వివరించనక్కర లేదు. అది నేటికిని సజీవముగా నున్నది. ఇంచుమించు పరిచితమైనది. 1900 నాటికి ఒల్డ్ టెస్టమెంట్‌ను గురించిన కొంత చారిత్రక విమర్శను ప్రాటిస్టెంట్లు, కాథలిక్‌లు, సంస్కరణ యూదులులో విస్తారంగా అంగీకరించినారు. శ్రుతిశబ్దమాధారముగ దివ్యావేశముగలుగునను విశ్వాసమునది యెంతవరకు అడుగుననుండి భగ్నముచేసినదో అంతవరకు ఆఫలము మతాధి

కారులకు చదువుకొన్న లౌకికులకు రాదగనిదిగ తోచలేదు. ఎందువల్ల ననగా శ్రుతివాక్యములవల్ల దివ్యోత్సాహము కలుగునను నమ్మకము తాను తీర్చినవానికంటె కల్పించిన సమస్యలే ఎక్కువ. బైబుల్ వాక్యాలలోని శబ్దగతమైన యాదార్థ్యమునకంటె శ్రుతిగ్రంథము ప్రామాణికతను వేరుగా చూచుట మరింత మంచిది. మతదృష్టిగల అమెరికనులలో అధికసంఖ్యాకులకు బైబుల్ అంటే ప్రధానముగ భగవద్వాక్కు; సంతోషానికి మోక్షానికి మార్గదర్శకము. భగవంతుడు బైబుల్‌ను విజ్ఞానశాస్త్ర పాఠ్యగ్రంథముగా ఉద్దేశించుటకు చూపగలిగిన కారణమేదియులేదు. విజ్ఞానశాస్త్రము స్పష్టముగా మనుష్యశక్తికి లోబడిన ఆలోచనకు సృష్టికి సంబంధించినది. కాని టోరా, సువార్త అనేవి జీవనపద్ధతులుగా, పైనుండి కనబడిన సత్యదర్శనముగా ఉంటూనే వచ్చినవి. బైబుల్‌ను ఒక ప్రామాణికసిద్ధాంతముగా ఆరాధించేవారు. పొల్లుపోని జ్ఞానమందులో ఉందన్న భావంతో కాదు. నిర్ణయము చేయవలసిన విషయములలో తప్పుపోని దారిచూపుతుందన్న భావముతో. "సత్యదర్శనము వేరు నమోదుచేయబడుట వేరుగా మేము గుర్తిస్తాము" అన్నాడు లూయీ ఎఫ్. స్టియర్న్స్.2 బైబుల్‌లోని సత్యాని (లేదా కొందరన్నట్లు క్రైస్తవ విజ్ఞానాన్ని) ప్రయోగాత్మక భౌతిక విజ్ఞానమునుండి పృథక్కరించుటచేత ఐహిక పారమార్థిక వివేకములు రెండును పరస్పర మొకదానిలో నొకటి చొచ్చుకొనిపోవుట తప్పి ఆచరణకు సంబంధించిన శిక్షణ విషయమున ప్రామాణికములైన విధులతోపాటు భావస్వాతంత్ర్యముకూడ కలసివచ్చుట కవకాశమేర్పడును. ఇట్లు ఆచారపాక్షికమైన బైబుల్ విమర్శను కొంత ఉపేక్షాభావముతో వ్యాఖ్యానించి అది మూలసిద్ధాంతములను మరింత భద్రపరచినదనియు, పందొమ్మిదవ శతాబ్దములో విజ్ఞానశాస్త్రమునకు మతమునకు మధ్యరేగిన యుద్ధకలాపాన్ని అంతరింపజేసినదనియు చెప్పవచ్చును. విదేశాలలో ఈపాటికే క్రైస్తవ మత మూలసిద్ధాంతాలను తినివేసిన అతివాదుల న్యూటెస్టమెంట్‌ను గూర్చిన విమర్శను యునైటెడ్ స్టేట్సులో అనేకులప్పటికింకను తీవ్రంగా పట్టించుకోలేదు. ఆది నిపుణులెవరో పాండిత్యగరిమతో వివేచింపదగినదని భావించేవారు; చాలవివేచింపదగిన విషయమని నిశ్చయంగా భావించేవారు బైబుల్ ప్రామాణికతను గూర్చిన ఇట్టి ఉపేక్షాభావము మునుపటి శతాబ్దముల బైబుల్ ఆచారపరాయణతకంటెను, లేదా విధివతుగాచెప్పే ఆగమశాస్త్రం

కంటెను వేరు. ఎందుకనగా అస్పష్టంగా బైబుల్‌పైన ఆధారపడుట అనే ఈ లక్షణాన్ని ఆయా తెగల మధ్య ఉన్న వివాదాలను అంతరింపజెయ్యడానికి, భిన్నభిన్న ప్రస్థానాలను అతిగా నొక్కి వక్కాణించడానికి వాడుకొన్నారు. ఆగమసంబంధములైన భేదములెన్ని ఉన్నను క్రమముగా పన్నిహితములగుచున్న క్రైస్తవ తెగలవారీ చర్చిలనే కాక జూడాయి–క్రైస్తవ సంప్రదాయమని అస్పష్టంగా పిలువబడుచున్న మార్గాన్ని ఆరాధించే క్రైస్తవులను, సంస్కరణయూదులను కూడ కలిపి బైబుల్ ఒకే భూమిక మీదికి తేగలదని భావించినారు "బైబుల్ ప్రమాణగ్రంథమనుట మాని ఆకరగ్రంథమైనది" ఈ ఈకారణములచేత బైబుల్ — ధర్మోపన్యాసకులకు, మతవిద్యకు ప్రధాన విషయమైనది. కళాశాలలలో గూడ పాఠ్యవిషయాలలో మతమునుగూర్చిన ప్రాథమిక పాఠ్యవిషయముగా బైబుల్ పాఠాలు (తరుచు అవిమాత్రమే) ఉండేవి ఈశతాబ్దపు తొలి సంవత్సరాలలోని "బైబుల్ పరిచయాలు" అను గ్రంథాన్ని మచ్చుకు పారచూచినట్లయితే పాఠకునికి ఆనాడు బైబుల్‌ను ఎట్టి ఉపేక్షాభావంతో, "నిర్మాణాత్మక" దృష్టితో చదివేవారో తెలిసిరాగలదు. నిజానికి బడిచదువుకు ధర్మోపన్యాసాల వ్యాఖ్యానానికి మధ్య స్పష్టమైన తేడా ఏదీ కనిపించేదికాదు. చారిత్రక దృష్టికిగాని విజ్ఞానశాస్త్రదృష్టికిగాని పొల్లుబోనిది కాకపోయినను బైబుల్‌ను మతవిషయకమైన మూలగ్రంథంగా వాడుకోవటం మనీషాపరిరక్షితులై పొల్లుబోని ప్రమాణంకావలెనని కోరేవారికి అంత సుఖంగా లేదు. మరి అటువంటి పిరికివారి కనేకులకు సులభమైన శరణ్యాం పొల్లుబోనిచర్చి. ఆరోగ్యమైన మనస్సుగలవారికి హఠాత్ అసౌఖ్యంకల్పింపరాదు కల్పించినప్పుడు మత్తుమందులాంటిదే దానికి ప్రతిక్రియ. "అవితథముకాని ప్రమాణము".ను వెదకులాడే కష్టతరమార్గాన్ని అనుసరింపబూనిన ప్రొఫెసర్ వాల్టర్ ఎమ్. హోర్టన్ ఈ పరిస్థితినిగూర్చి వివేకపూరితంగా వ్రాసినారు.

"అవితథత్వమనే ఈడన్" వదలిపెట్టి వచ్చినవాడు మరల అక్కడకు చేరుకొనుట ఎట్లని ఎవరైనా అడిగినట్లయితే డొంకతిరుగుడు మార్గంలో పోవలసిందేనని దానికి సమాధానము. అవితథమైన బైబుల్‌మీద విశ్వాసాన్ని మరల తెచ్చుకోలేని హతాశులైన ప్రొటెస్టెంట్లకు అవితథమైన చర్యవాక్కు సమ్మోహకంగా -- క్రొత్తది అపరిచితము అగుటచేత -- కనబడు

తుంది. హేతావాదుడైనవాడు తన తండ్రితాతల విశ్వాసమనే ఒక్కవిష యాన్నిమాత్రం గమనింపడు. అయినా అక్కడికే రావాలని ఏదోడొంక తిరుగుడు మార్గంలో, రహస్యంగా ప్రయత్నిస్తూనే ఉంటాడు. 4

## ఉపేక్షా పూర్వక నవీనత

ఇరవయ్యో శతాబ్దపు తొలినాళ్ళనాటి ఉపేక్షాపూర్వకమైన అతివాద సిద్ధాంతము లేద నవీనతాసిద్ధాంతము పూర్తిగా వేరువిధమైన ఒక విశ్వాసము సంస్కరణ జూడాయిజమ్‌లో బాగుగా వ్యాపించి ఉండినా అమెరికన్ క్రైస్తవులలో నూటికి ఏకొద్దిమందిలోనో వ్యాపించి ఉండింది. న్యూ ఇంగ్లండ్ అనుత్తమ సిద్ధాంతము, ఖండితమైన ఆదర్శవాదము అనేవి దీనికి ముఖ్యమైన అమెరికన్ జన్మస్థానాలు - వీనికి పరిణామ సిద్ధాంతో త్సాహమనుకారాన్ని కొంచెం కలిసినారు. ఇటువంటి ఈ మతం నిజంగా యూదు మతమూకాదు క్రైస్తవమతమూ కాదు. పలుచని బురఖా వేసుకొన్న లౌకికమైన తత్త్వసిద్ధాంతము జాన్ ఫిస్క్ పరిణామపద్ధతి "భగవంతుని క్రియా పద్ధతి" అంటూ డార్విన్ సిద్ధాంతంలోని ప్రధానదోషాన్ని పరిహరించినాడు. ఆగమజ్ఞులు పరుగెత్తివచ్చి విశ్వపరిణామ తత్త్వాన్ని మతపరిభాషలో పొదిగి ఉపన్యాస వేదికలకు "లభ్య" మగునట్లు చేసినారు.

పందొమ్మిదవ శతాబ్దాంతంలో న్యూ ఇంగ్లండ్‌లోని ఉదారాగమజ్ఞులలో "నవీన ఆగమశాస్త్ర" మనేదొకటి పెరిగింది. కాల్విన్ సిద్ధాంతములనుండి ప్యూరిటన్ సిద్ధాంతములనుండి పూర్తిగా తెగ్రదెంపులు చేసుకొనుట దీని ప్రధానలక్ష్యము. ఆండోవర్ సెమినరీ దీని ప్రధానకార్యాలయము. ఆ ం డో వ ర్ రె వ్యూ దీని ముఖ్యమైన వాగ్వస్త్రము కాని ఈశాన్య పశ్చిమ ప్రాంతాలలోని విశ్వవిద్యాలయాలలోను సెమినరీలలోను చెదరిపోయినట్లు సమర్థులైన వ్యాఖ్యాతలు దీనికనేకులుండేవారు. హెగెల్ సిద్ధాంత పక్షంగా వాదించేవారిలో ఫ్రెడరిక్ మారిస్ శిష్యుడు, గట్టి జాతీయవాది అయిన ఎలీషా మల్ఫర్డ్ మసాచుసెట్స్‌రాష్ట్రం కేంబ్రిడ్జిలోని ఎపిస్కోపల్ థియలాజికల్ స్కూల్‌లో ఉండేవారు. "గా డ్, ది క్రి యే ట ర్ అ ం డ్ లా ర్డ్ ఆ ఫ్ ఆ ల్ (సృష్టికర్త సర్వేశ్వరుడు అయిన భగవంతుడు) (1896) అను గ్రంథం| వ్రాసిన శామ్యూల్ హారిస్ ఆండోవర్

సెమినరీకి చెందినవారు. రాచెస్టర్ థియలాజికల్ సెమినరీలో ఉండిన
అగస్టస్ హెచ్. స్ట్రాంగ్ ఇతడు సృష్టిలో క్రీస్తు - నైతిక ఏకత్వ
సిద్ధాంతం (క్రైస్ట్ ఇన్ క్రియేషన్ అండ్ ఎథికల్ మోనోయిజమ్)
(1889) అనే గ్రంధానికి కర్త. జార్జి. ఏ గార్డన్. ఇతని మతవిశ్వాస
చరమస్వరూపాలు (అల్టిమేట్ కన్సెప్షన్స్ ఆఫ్ ఫెయిత్) (1903)
అనే గ్రంథంలోనుండి ఇరవయ్యో శతాబ్దపు ఆగమశాస్త్ర తత్త్వానికి
కేంద్రారంభ బిందువు కావలసిన వారెవరైనా కొన్ని వాక్యాలు ఏరుకో
వచ్చు. పరిణామవాదపక్షాన "ప్రకృతినుండి పరమేశ్వరునివద్దకు" జాన్
ఫిస్క్ ననుగమింప ప్రయత్నించిన వారుండేవారు. వారిలో ముఖ్యులు:
జార్జి హారిస్, అమ్‌హార్స్ట్ కళాశాల అధ్యక్షులు నైతిక పరిణామము
(మారల్ ఎవల్యూషన్) (1896) అనే జనరంజకమైన పుస్తకానికి కర్త;
న్యూహావెన్‌కు చెందిన న్యూమన్‌స్మిత్, ఆగమశాస్త్రాన్ని జీవశాస్త్ర
దృష్టితో చూడవలెనని వాదించిన ఛాత్రవాదులలో ఒకడు; లిమన్ అబ్బాట్
ఇతని పరిణామవాది ఆగమశాస్త్రము (దియాలజీ ఆఫ్ అన్
ఎవల్యూషనిస్ట్) (1897) అనే గ్రంథం ఈ ఉత్సాహానికి పరికాష్ఠగా
రూపొందింది.

ఈ రెండు వర్గాల వారికంటె అతివాదపు పాలు తక్కువగాఉన్న మరొక
ప్రస్థానంవుంది ఇది హొరేస్ బుష్నెల్ నుండి వచ్చినది. దీని నాయకుడు
థియొడోర్ టి. ముంజర్. ఆయన 1883 లో "నవీన ఆగమశాస్త్ర"మునకు
చేసిన వివరణ పందొమ్మిద శతాబ్దము చివరకాలంలో ప్రచారమగుచుండిన
క్రైస్తవ ఆగమశాస్త్రానికి జాగ్రత్తయైన, సమతగల, పరిణామ సిద్ధాంతాను
సారియైన వ్యాఖ్యానము. ఈ క్రొత్తసిద్ధాంతము ఎంత ప్రాచీనాచార
పరతతో కనబడుతుందో చూడండి.

నవీన ఆగమశాస్త్రం చర్చివారి చారిత్రకమైన మతవిశ్వాసాన్ని
విడనాడడు కాని అభివృద్ధి క్రమాన్ని గమనిస్తూ అదేమార్గంలో నడవాలను
కుంటుంది, క్రొత్తగా కొంతముందుకు పోయినపుడల్లా "గడచినదానితో
సహా ఆత్మహత్య"కు పూనుకొనుట దాని ఉద్దేశంకాదు. నిదానమైన విశ్వ
పరిణామముద్వారా వచ్చే అభ్యుదయాన్ని అంటిపెట్టుకుంటుంది. ఉత్పాత
సదృశములైన దూకుళ్ళద్వారా వచ్చేదాన్నికాదు. ఉత్తరోత్తర ఆగమ
శాస్త్రసిద్ధాంతములకంటె పూర్వపూర్వములైన వాటితోనే చేతులు కలిపు

తుంది. అగస్టన్ రూపొందించిన ఆగమసిద్ధాంతాలలోకంటె పూర్వపు గ్రీకు ఆగమసిద్ధాంతలోనే తనకు భావైక్యమున్న అంశాలను దర్శింపగలదు.

పూర్వకాలపు చర్చిలోని నిర్దిష్ట సిద్ధాంతాలను త్రోసివెయ్యదు. ట్రినిటీ అన్నమాటను వాడినా వాడకపోయినా ఆ భావాన్ని వదలిపెట్టదు. కాని క్రమబద్ధమై మనస్సుకు అసాధ్యమైన ట్రినిటీ మాత్రంకాదది; దివ్య సార్వభౌమత్వాన్ని అంగీకరిస్తుంది; కాని తనపద్ధతికి దాన్ని ఒక మూల స్తంభంగా చెయ్యదు, ఆచోటికి దివ్య ధర్మాన్ని ఎన్నుకొంటుంది, అనగా క్రియాచరణమైన ప్రాతిపదికకంటె నైతికమైన ప్రాతిపదికనే ఎన్నుకొంటుందన్నమాట; అవతారవాదాన్ని అంగీకరిస్తుంది కాని భౌతిక సంఘటనగా కాదు. ఎందుకంటే ఇది చాలామతాల్లో ప్రవేశించింది - మానవజాతిని చక్కదిద్ది పునరుద్ధరించే శక్తి ఒకవ్యక్తిద్వారమున లోకంలోకి రావడంగా అంగీకరిస్తుంది, ఆగమశాస్త్రంలోని నాభిస్థానీయమైన దొడ్డసత్యమిది. ఒకలోపమునకు పరిహారముగా మరొకమేలుచేయుట భగవచ్చర్య అనియు అది నైతికంగాను ఆచరణలోను అర్థవంతమైన ఒక క్రమమనియు అంగీకరిస్తుంది, కాని లోకంలోని కష్టయాత్రకు సంబంధంలేకుండ ఏదూర స్వర్గానికో సంబంధించిన అద్భుతరహస్యంగా కాక లోకాన్ని పాపంనుండి ఉద్ధరించడంలోనే ఒకశక్తిగా భావానికి అందేటట్లు అంగీకరిస్తుంది. మనుష్య ముఖ్యస్వభావానికంతటికి సంబంధించే విధంగా పునరుత్థానాన్ని అంగీకరిస్తుంది. నీతి స్వభావాభివృద్ధిలో ఇమిడే విధంగా జడ్జిమెంట్‌ను అంగీకరిస్తుంది... ఈసిద్ధాంతాలలోని ప్రధానవిషయాలను మాటలతో తేల్చిపారవెయ్యదు; తగ్గించదు; శ్రుతులలో దర్శనమిచ్చినట్లుగాను, చరిత్రలో చర్చిజీవితంలో, లోకంలో అభివృద్ధిఅయినట్లుగానుని చూపించడం కంటే వేరుగా ఏమియు చేయుట దీనిలక్ష్యంకాదు.

లౌకికుడైన విశ్వాసికి ఈమత విశ్వాసంలోని "అర్థాన్ని" చెప్పడానికి చేసిన ప్రయత్నాలు ఎంత అమాయకంగా కనబడత విప్పుడు! అయినప్పటికి ప్రతిపదంలోను తర్కగాంభీర్యముంది. తోడి ఆగమజ్ఞులకెవ్వరికీ ఇందులో "విగ్రహారాధన చిత్తవృత్తిగాక నిర్మాణాత్మక చిత్తవృత్తి" కన్పించదు. ఈవిశ్వాసాన్ని "స్థాపించిన" చివరిఘట్టంలో "దర్శనమనేది భగవంతుని నుండి కలిగినదనుకుంటె భగవంతుని గూర్చి కలిగినద" ని చదివినప్పుడు 1950 నాటి పాఠకునికిగూడ కొంచెం అనుమానం కలగవచ్చు, ముంజర్

వలె నవీనాగమజ్ఞులు సమన్వయ మార్గానికి ప్రయత్నించినా ప్రయత్నించ కపోయినా, లేక నవీనతా మార్గంలో ఆదర్శవాద సిద్ధాంతంమీద పరిణా మసిద్ధాంతంమీద ఆధారపడినా పడకపోయినా మ్యుంజర్ చెప్పిన ధాటియైన ఆధికారిక వచనంతో ఏకీభవించినారు;

క్రైస్తవమతానికి ఏదైనా ఒక మానవీయమైన ప్రాతిపదిక ఉన్నదంటే అది దానిని సమగ్రమైన సముచితత్వమే మనస్సుకు బరువుకాకుండ ఉండట మేకాక ఇది మనస్సుతో దాని అన్నిపనుల్లోను కలసి ఉండాలి ... కవులు నాటకకర్తలు చేసినట్లే ఇదికూడ మానవ జీవితంతో పనిచేస్తుంది; మానవ జాతిని ఋజుకాంతిలో చూస్తుంది; నేరుగా మొగంలోకి సూస్తుంది, లోనికి చూస్తుంది, దాన్ని అంతటా అడ్డంగా కలయజూస్తుంది. 7

ఆగమ శాస్త్రాన్ని ఈవిధంగా మానవీయ దృక్పథంతో భావించడమంటే ఏమోమ్యుంజర్ చక్కగా విశదపరిచినారు: "ఆధ్యాత్మిక పద్ధతులను మహిమా (మ్యాజికల్) భావాన్నుండి నైతిక భావానికి తేవలెనని చూస్తుంది నవీన ఆగమశాస్త్రం మతవిశ్వాసపూరితమైన విసీతితో సూటిగా భగవంతుని అంగీకరించి విడువకుండుటగా. ఒక అక్లిష్టమైన, కార్యకారణ వివేకమున్న పద్ధతిగా భావిస్తుంది. 8

క్రైస్తవ ధర్మోపన్యాస వేదికలనుండి ఇటువంటి సిద్ధాంతం ప్రచారమగు చువచ్చినా, దానికి కొంత బైబుల్ పూత పూయుటగూడ జరుగుచువచ్చినా ప్రధానవిషయం మాత్రం భౌతిక విజ్ఞాన తత్త్వమునుండి గ్రహింపబడిన దనుట స్పష్టం. పందొమ్మిదవ శతాబ్దపు చివరిదశకములో ఇంటువంటి సిద్ధాంతము అచ్చమైన "నవీన ఆగమశాస్త్ర" మే క్రైస్తవ సువార్తకొక క్రొత్త వ్యాఖ్యానము. కాని ఇరవయ్యోశతాబ్దము తొలిదశకాల్లో ఇటు వంటి ప్రచారము నిశ్చయంగా ఆగమ వ్యతిరేకమైనది; క్రైస్తవ మతము కంటె విశ్వజనీనమైన మతవిశ్వాసమొకటి కావలెనను ఆకాంక్ష స్పష్టముగా ఉండినది బైబుల్ వార్తికవివరణలు ప్రస్థాన వ్యాఖ్యానాలు జటిలంగా, విసుకు కలిగించేటట్లు, అసంబద్ధంగా తయారైనవి. సిద్ధాంతంలోని ప్రత్యేక మైన క్రైస్తవ అథవా యూదు సంబంధమైన అంశాలను మతవిశ్వాసానికి అపకర్ష హేతువులుగా, మరింత విశ్వజనీనమైన తర్కబద్ధమైన భగవత్పూజకు అడ్డువచ్చువానినిగా భావించినారు. చికాగో ప్రపంచ సంతలో మతప్రతినిధి సభ (1.౮౯౩) లో ప్రాచ్యదేశమతాలలో ఒక అచ్చమైన ఆశక్తి. క్రైస్తవ

మతాన్ని తదితరమతములలో ఒకటిగా చూచుటకు సౌముఖ్యము కల్పింపబడినవి. ఈవిధంగా "క్రైస్తవమతమే అద్వితీయము"న ప్రశ్న క్రైస్తవ ఆగమజ్ఞులకు కూడ మామూలు సిద్ధాంతిక సమస్యకంటె మిన్నగా తయారై ఆగమశాస్త్రానికి లోటు కలిగినను ఫర్వాలేదని మతాన్నిగురించి పుస్తకాలు వ్రాయనారంభించినారు. ఉదాహరణకు లిమన్ ఆబ్బాట్ తన ది థియాలజీ ఆఫ్ యాన్ ఎవల్యూషనిస్ట్ (పరిణామవాది ఆగమశాస్త్రం) అనే గ్రంథంలో తన ఉపన్యాసాల శీర్షికలో ఆగమ శబ్దాన్ని ఉంచుకొన్నప్పటికిని, దర్శనము, పాపము, త్యాగము, దేవపూజ, మహిమలు క్రీస్తు మొదలగు వానిని గురించి చర్చించినను వీనివన్నిటిని పరిణామసిద్ధాంతానికి లోబడజేసినాడు (ఉదాహరణకు "పరిణామములో క్రీస్తు స్థానము") స్పష్టంగా "నవీన ఆగమశాస్త్ర" మిప్పుడు నవీనమూ కాకుండా ఆగమశాస్త్రమూ కాకుండా పోయింది. తర్వాత కాలంలోవారు వెనుకటిదాన్ని పిలచినట్లుగ అది "నవీన ఆచారపరాయణత" లేదా "నవీనమైన డాగ్మటిజమ్" అయింది. వీటి ప్రధానలక్ష్యం సమస్తమైన ఆగమశాస్త్రాలకు, ప్రస్థానాలకు, పద్ధతులకు అతీతంగా విశ్వజనీనమైన పరిణామ భూమికి మీద విశ్వజనీనమైన మత విశ్వాసమునందు కొనుటగా ఉండింది.

ఇది అప్పటి నవీనతాసిద్ధాంతము. లిమన్ అబట్, తాను బ్రూక్లిన్‌లోని హెన్రీనార్డ్ బీచర్ గారి ప్లిమత్ చర్చిలో ఉపన్యసిస్తుండినా, (ఎమర్సన్‌వలె) ఇతడు దేశమంతటా ఉపన్యాసాలు చేస్తూ, అవుట్ లుక్ అనే పత్రికను సంపాదించుతూ, సాధారణంగా ఆధునికమైన ప్రచారపద్ధతుల నవలంబిస్తూ ఈ సువార్తను ప్రచారంచేసినాడు. తన దినోత్సాహానికి మూలకారణం ఆస్తిక పరిణామసిద్ధాంత వాదులైన (జోసఫ్ లె కాంట్, హెన్రీడ్రమాండ్) తాత్త్వికులని అరలేకుండా పదేపదే చెప్పినాడు, జాన్ ఫిస్కెచెప్పిన "పరిణామము భగవంతుని క్రియాపద్ధతి" అనుదానిని ఒక నినాదంగా తయారు చేసినాడు. ఇటువంటి ప్రచారాన్నిగురించి వినని అది సర్వసాధారణంగా ఉండిందే అయినా - యువకులైన పాఠకుల సౌకర్యముకొఱకు ఆయన ఉపన్యాసాలనుండి కొన్ని భాగాలు ఎన్నికచేసి ఒకచోట కూర్చినాను ఏభై సంవత్సరాలనాడు "సంస్కారులైన" క్రైస్తవులు లిమన్‌అబ్బాట్ ధర్మోపన్యాసవేదికనుండి మాత్రమేకాక మూర్లకొలది ఇతర వేదికలనుండి గూడ విన్న సువార్తఎట్టిదో వీనిమూలంగా తెలియగలదు, (చూడు. ఎగ్జిబిట్ XI)

ఇది పలుకుల్లో మాత్రమే క్రైస్తవ సిద్ధాంతమని నిరూపించుటకు వ్యాఖ్యానములవసరము లేదు. ఆనాటి జనబాహుళ్యములోని తత్త్వసిద్ధాంతమునే క్రైస్తవ పరిభాషలోని కనువదించినారు. "ప్రకృతి ధర్మము"ను "ఆధ్యాత్మిక లోకమున" కలవరించుటద్వారా అది క్రైస్తవసిద్ధాంతాన్ని, సంకేతాలను ఉపయోగించి "బ్రతుకుటకు పోరాటం", "పోరాటం ద్వారా అభ్యుదయం" వంటి సత్యాలను, తప్పొప్పులద్వారా సత్యము నెఱుగుట, మొదలైన పరిణామసిద్ధాంత నీతులలో సాధారణములైన వాటిని వ్యక్తీకరించింది.

ఇదేవిధంగా ఈ కోవకే చెందిన ఇజాక్ ఎమ్. వైజ్, కౌఫ్మన్ కోలర్, ఎమిల్ జి. హర్ష్ వంటి "ఆగమవేత్తలు" ఇవే అభిప్రాయాలను జూడాయిజమ్‌లోని సారమంటూ యూదులలో ప్రచారంచేస్తూ వచ్చినారు. ప్రసిద్ధమైన వారి "చర్చావేదిక" సంస్కరణ మతవిశ్వాసానికి దశాబ్దాల తరబడి మూలప్రతిజ్ఞగా నిలచిఉండింది. (చూడు. ఎగ్జిబిట్ XII)

ఈఉపేక్షాపూర్వక అతివాదులకు దివ్యోత్సాహం కలిగించిన విశ్వజనీనతా సిద్ధాంతవాదుల ఉత్సాహమును రాబీ ఇసాక్ ఎమ్. వైజ్ సువార్తాప్రచారకుని అమాయకత్వంతో దాని తొలినాళ్ళలో వ్యక్తీకరించినాడు. జాన్ ఫిస్క్ విశ్వతత్త్వము అన్న గ్రంథమే ఈయన విశ్వేశ్వరుడు (కాస్మిక్ గాడ్) అనుగ్రంథానికి ఈక్రిందివిధంగా చోదకశక్తి అయినది:

ఓయి వైజ్ఞానికుడా! ఎవనిని దర్శించుట అనుత్తమజ్ఞానమో, నీవెవనిని వెదకులాడుచున్నావో అట్టి నీ భగవంతుడు, ప్రభువు ఇక్కడున్నాడు. అనుమాన ప్రమాణము (ఇండక్షన్) వలన తెలిసిన, అవశముగా ననుభవమునకు వచ్చిన దైవమితడు. తాత్త్వికులారా! ఎవనినేర్పడజెప్పుట మానవ మేధకు అనుత్తమ యశస్కరమో - కాంట్ తదితర చింతకులు ఆగమ శాస్త్రములోని ఏదైవముయొక్క మానవరూప సదృశమూర్తికి వ్యతిరేకముగ వాదించిరో అట్టి మీ దైవమిచటనున్నాడు; తత్త్వసిద్ధాంతముయొక్క ఆద్యంతార్థములు విశ్వేశ్వరుడు. సరళమనస్కులారా! మీదైవమిచటనున్నాడు. మీరతనిని వెదుకనక్కఱలేదు. ఎందుకనగా అతడు సర్వవ్యాపి. మీకు లోపల, బయట, పదార్థముల ప్రతిగుణమునందును, మనస్సుయొక్క ప్రతికదలికలోను ఉన్నాడు. మీరున్నచోట అతడున్నాడు. మీరు చూచిన

చోట ఆలోచించినచోట అతనినే యోజించుచున్నారు, పిల్లలార! మీదైవమిదుగో మీపూలవాసనలో, వసంత కుసుమాల సుందరవర్ణాలలో, ఉఱుములలో, గుసగుసలలో, ఆకాశపు టింద్రనీలపు కప్పులో, భూమి హరితవసనంలో, అమాయకమైన మీ చిఱునవ్వుల్లో, మీతల్లి తియ్యని హృదయమార్దవంలో ఉన్నాడు. ఓయి ఋషీ! అథవా మూర్ఖుడా! గొప్పవాడా! అల్పుడా! నీదైవమిక్కడున్నాడు, నీవతనిని తప్పించుకొనలేవు. అతడు నిన్ను తప్పించుకొనలేడు. అతడు నీలోనున్నాడు నీవాతనిలో నున్నావు. భవిష్యద్వంశ్యులారా! సర్వమానవభావ సమన్వయలయలో, జ్ఞానంలో దైవమున్నాడిడుగో. సర్వేశ్వరుడు, శాశ్వతుడు, విశ్వేశ్వరుడు, మహానస్మియన్నవాడు, అద్వితీయుడు. 9

ఈ రకమైన "నవీనత"ను అమెరికన్ కాథలిక్కులలో కూడ పోప్‌గారి పాసెండి గ్రెగిస్ (1907) అనే శ్రీముఖమువచ్చి కనీసము కాథలిక్ ధర్మోపన్యాసవేదికలలోను పత్రికలలోను దీనినంత మొందించినదాక సాధనచేసినవారున్నారు. కాని నవీనతాసిద్ధాంతము వ్యక్తీకరించిన ఆత్మవిశ్వాసవాతావరణము, అభ్యుదయము, విశ్వజనీనమైన సౌభ్రాత్రము అనువానికి అమెరికన్ సంస్కృతిలో వ్యాప్తిశీలత ఉన్నంతవరకు పోపు నిషేధాజ్ఞలవల్ల అంత మార్పేమీ కలుగలేదు. మినాట్ జె. శావేజ్‌తో పాటు ఈక్రింది మాటలను విశ్వసించే అమెరికనులు ఇప్పటికీ ఉన్నారు:

ఇక్కడ అమెరికాలో భారీయెత్తున చరిత్రలో తొలిసారిగా ప్రజా ప్రభుత్వరూపముగా స్వాతంత్ర్య భద్రతల సమస్యను పరిష్కరించినాము, ఈప్రభుత్వము అన్నిపరిస్థితులకు అనువుగా మారగలదు. నిరవధికంగా విస్తరిల్లడానికి అభ్యుదయాన్ని సాధించడానికి శక్తిగలదిది. తెలిసినదానినిబట్టి వినీతిపొసగించి ప్రకృతిశక్తులను స్వాధీనపరచుకొని మన భౌతిక, మేధా, ఆధ్యాత్మిక జీవితావసరముల కక్కఱకు వచ్చునట్లు చేసుకొనుటను అధికాధికంగా నేర్చుకుంటున్నాము. అయినా ఇంతవరకు మనముచేసిన దారంభము మాత్రమే. ఇది చెడబాఱుతున్న ప్రాత, అరిగిపోయిన ప్రపంచంకాదు; మూడీగారు వర్ణించినట్లు ఇది "నావికులలో చేతనైనంత మందిని రక్షించి మునుగ విడువవలసిన, మునుగకతప్పని ప్రాతనౌక" కాదు. దీర్ఘరాత్రి గడచినది; తూర్పున ఆకాశము ఉషస్సుతో ఎఱ్ఱగా సిగ్గులు చిలుకుతున్నది, మనఅందఱకు ముందున్నది దినమే - మరింత వివేకము, మరింత ఆనందము గల మేల్తరమైన ప్రజలుండేదినము, భూమిమీద సాక్షాత్తు "భగవ

ద్రాజ్యము" 10

మేము ఇప్పుడు ఉదాహరించిన మాటలంతగా బయటపడి అతివాద రూపకంగా మతప్రచారకు లెవ్వరూ మాట్లాడకపోయినా అమెరికనుల ఉపేక్షా భావగతమైన సమైక్యము పందొమ్మిదవ శతాబ్దంలో ఆగమశాస్త్రాన్ని విచ్ఛిన్నంచేసిన బైబిలీయ ఆస్తికవాదులు, పరిణామసిద్ధాంత ఆస్తికవాదులు అన్నవింగడింపునకంటె మరింత కొట్టవచ్చినట్లు కాన్పించేది. థియొడోర్ ముంజర్ అన్పటి పరిస్థితిని సంగ్రహంగా ఇట్లా చెప్పినాడు:

చిత్తశుద్ది తెలివితేటలుగలవారు ఈనాడు ఎవరితరువాత ఎవరు అవతరిస్తారన్నిగాని, బాప్టిజమ్ పద్ధతులనుగూర్చిగాని, నిరంతర శిక్షనుగూర్చిగాని శ్రుతిగ్రంథాలవాక్యాలవల్ల కలిగే దివ్యోత్సాహాన్నిగూర్చికాని చర్చింపరు. ఈ సిద్ధాంతాలమీద జన్సుగా రెపరెపలాడుచుండిన గొప్ప ప్రకటన పత్రాలు ఈనాటికి చేతబట్టుకొని తిరుగుతున్నారుగాని వాటిచుట్టు యుద్ధాలుమాత్రం చెలరేగడంలేదు; నిజానికి ఏవో చిన్న చిన్న తగవులాటలు తప్పితే యుద్ధాలేలేవు- ఏదిచేస్తే అత్యుత్తమంగా ఉంటుందన్న ప్రశ్నలుమాత్రమే...

ప్రాచీనమైన మతప్రస్థానాలనుండి అసహ్యములైన భాగాలు ఛేదించి ఛిన్నశేషమును బ్రతుకవదలుట సమయానికి తగినదైనా బలహీనమైన క్రియ దీనిని మొండిగా అల్లేచేస్తూపోతే చర్చి, మినిష్టర్లు పతితులైపోవడమే ఫలమవుతుంది; ఏమంటే బలవంతులు బలహీనమైన చర్చలుతీసుకోరు. ధర్మోపన్యాస వేదికలు పతనమైపోవడం నిజమైతే, సరియైన చూపుగలవారు క్రొత్తద్రాక్షసారాయిని ప్రాతసీసాలలో పెట్టరు, సారాయము కాని సీసాలుగాని లేని మినిష్టరు ఉద్యోగాలకు రావడానికికూడా అంతగానే విముఖంగా ఉంటారు అనే యథార్థవిషయమే ప్రధానకారణమవుతుంది.

## లోకజ్ఞతాపురస్సరమైన ఔదార్యవాదము

మినిష్టర్ల ఉద్యోగానికి మరి సాధారణంగా క్రమబద్ధమైన మతాలకు ఇటువంటి అపాయం రావచ్చునని అభ్యూహించి అమెరికాలోని మతభావాధినేతలు మరికొంత "నిర్మాణాత్మక"మైన సందేశంకొఱకు వెదకులాడసాగినారు. ఈశతాబ్దపు తొలిరోజుల్లో ఆమగశాస్త్ర నిపుణులకు అనుభవా

నికి రాదొడగిన ఈనవజీవనము రెండవదశాబ్దపు నడికాలంలో అదికైస్తవులలో ఒక క్రొత్త "ఔదార్యవాదంగా" ను యూదులలో "ఆచారపాఠికత్వము" గానూ గుర్తింపబడ వచ్చినంతవరకు ఒక సార్వత్రికమైన మనీషా శక్తిగా రూపొందలేదు. ఉజ్జాయింపుగా చెపుతే 1900 నుండి 1915 మధ్యకాలంలో నవీనతా సిద్ధాంతం మనీషా విషయకంగా ఎంత బలవత్తరంగా ఉండిందో 1915 నుండి 1930 మధ్యకాలంలో ఔదార్యవాదం మనీషా విషయంగా అంత బలవత్తరంగా ఉండింది.

ఔదార్యవాదానికి రెండుపక్షాలు: సాంఘికసువార్త విమర్శపూర్వకమైన లోకజ్ఞతను ఆకట్టుట, తత్వశాస్త్రాన్ని, భౌతిక విజ్ఞానాన్ని వదలి లోకజ్ఞతకు నచ్చచెప్పుట. జర్మనీలో అతినిపుణమైన ఆగమశాస్త్రంగా ఉండినదానికి అమెరికనుల విశిష్టమైన హ్రస్వరూపం, అందుచేత ఆగమ వ్యతిరేకమైన ఉద్యమము వెనుకనున్న ఆగమశాస్త్రాన్ని కొలదిమాటలలో వివరించుట అప్రస్తుతముకాదు. విలియమ్ జేమ్స్ వ్రాసిన వి వి ధ ము లై న మ తా ను భ వా లు (1902) అను గొప్ప సిద్ధాంత గ్రంథముచే ప్రేరేపింపబడి తత్వశాస్త్రంలో "విజ్ఞానసిద్ధాంతము" "స్వానుభవ సిద్ధాంతము" అనువాని ఎడల విస్తృతమైన వ్యతిరేక భావం ఏర్పడింది కాని జేమ్సు మతానుభవాన్ని గురిచేసిన చికిత్సాపద్ధతిని పోలినపద్ధతి, విశ్వాసము, అనేవి ఏరకమైన ఆగమ శాస్త్రానికి కూడ తగిన పునాదిగా ఉండడానికి ఉద్దేశింప బడినవి కాదనుట స్పష్టము. అతనిపద్ధతి చాల వైయక్తికము, చాల యౌగికము, చాల ఆధిపూరితాత్మకము కనుక "నిర్మాణాత్మకమైన" ధర్మోపన్యాసాలకు పనికివచ్చేదికాదు, కాని అమెరికన్ ఔదార్యవాదులకు జర్మనీలో తాము వెదకుచున్నదే కన్పించినది-ఆల్ బ్రెక్ట్ రిట్ షెల్ (డి 1899) స్థాపించిన నవీన స్వానుభవ ఆగమ ప్రస్తానము.

రిట్ షెల్ ప్రకృతిశాస్త్రంలో కాని దైవచింతనలో కాని మతసంబంధమైన సత్యాన్ని వెదుకక "క్రైస్తవ చైతన్యములో" అనగా చర్చిఅనుభవములో కాని లేక జనసమాజము యొక్క చరిత్రాత్మకమైన అభివృద్ధిలో కాని పరంపరగా కూడివచ్చిన దివ్యదర్శనములందు వెదుకాడెను. కాథలిక్ ఆగమశాస్త్రమునందు కంటె మరింత బహిరంగముగా చెప్పిన ఈ జనసమాజపు చారిత్రకానుభవము ప్రాధాన్యము వలన ఒక మతము యొక్క సారమును దానిచరిత్ర రూపముగా (లేదా మన అమెరికనులు మామూ

లుగా అనునట్లు సాంఘిక పరిణామ రూపముగా) నిర్ధరించుటకు సాధ్య పడినది. ఈపద్ధతిలో భగవదభివ్యక్తి, దైవనిర్ణయము ఉన్నవి, కాని అభి వ్యక్తమయ్యేది (మనుష్యజ్ఞానమునకు అందని) భగవత్ తత్త్వముకాదు. చరిత్రలో భగవంతుని విలువచేతా భగవంతుడన్న వానిఅర్థము నవీనతా సిద్ధాంత నాయకుడైన డాక్టర్ గార్డన్ "భగవంతుని మానవజాతి" "ఒక అనంత రహస్యము" అనిపలికి "మానవజాతి" అనుపదమును మానవత్వము నకు, అవతారమునకు, వ్యక్తిత్వమునకు ఒక అస్పష్టమైన పర్యాయపద ముగా వాడినాడు. రిట్ష్లియన్‌లు తమ ఆగమశాస్త్రమును విశ్వసృష్టి ఆధ్యాత్మికముల ప్రసక్తినుండి తప్పించుట ద్వారా మానవ సంబంధి దైవము నకు ఒక చారిత్రక నిర్వచనమును చెప్పగల్గిరి. ఇట్లు క్రైస్తవ మతసార మును (చారిత్రకముగా) నిర్వచించి సమర్థించుట సాధ్యమైనది; ఆచార పరాయణులు పరిణామ సిద్ధాంత నవీనతావాదులు దైవమునకు సర్వజ్ఞ త్వము ఉన్నదని చెప్పిన పద్ధతిగా అభినయించి చెప్పనక్కర లేకుండానే ఇదిసాధ్యమైనది. అడోల్ఫు ఫాన్ హార్‌నక్ వ్రాసిన క్రైస్తవ మత మ న గా నే మి (1901) అను పుస్తకము క్రైస్తవ ఆగమశాస్త్రంలోని చారిత్రక - స్వానుభవ సిద్ధాంతమును వివరించు జనరంజక గ్రంథమైనది. ఈవిషయమును ఎత్తుకొనిన మొదటి గొప్ప అమెరికన్ గ్రంథాలు డేవిడ్ స్వింగ్ వ్రాసిన ది థి యా ల జి ఆ ఫ్ ఆ ల్ బ్రె క్ రి ట్ షె ల్ (1901) అనుగ్రంథము, హె న్రీ సి కి ం గ్ వ్రా సి న రీ క న్ స్ట్ర క్ష న్ థి యా ల జి (1900) అను గ్రంథము మరియు థి యా ల జి అ ం డ్ ది సో ష ల్ కా న్షె స్ నె స్ (1902) అనుగ్రంథమును విలియమ్ ఆడమ్స్‌బ్రౌన్ వ్రాసిన ఎ సె న్సు ఆ ఫ్ క్రి స్టి యా ని టి (1902) అను గ్రంథమును, జార్జి బి. ఫాస్టర్ వ్రాసిన ది ఫై నా లి టి ఆ ఫ్ ది క్రి స్టి య న్ రె లి జి న్ (1906) అను గ్రంథమును క్రమంగా ఇటువంటి పుస్త కాలును త్వరత్వరగా అనేకం వచ్చినవి. క్రైస్తవమత విశ్వాసములోని "సారము" ఎడల వచ్చిన ఈదృష్టిని గూర్చి ఫాస్టర్ క్లుప్తముగా ఇట్లుచెప్పి నాడు:

నీతిబోధ చేయుటయే నీతికానట్లు, కళకు సంబంధించిన అభిప్రాయములు కళకానట్లు, దేశాభిమానమునకు సంబంధించిన సూత్రవాక్యములు దేశాభి మానములు కానట్లు మతసంబంధమైన బోధనకూడ మతములోని సమగ్ర

విషయము కాదు. మతమే జీవితమన్నప్పుడు జీవితమే జీవితానికి లక్షణము కావలెనుకాని అభిప్రాయములుకావు. మతజీవితమును మతసంబంధము లైన అభిప్రాయములతో కొల్చుట పూర్ణవస్తువును ఒక భాగముతో కొల్చు టవంటిది. సామాన్యముగా అన్నివిషయముల యందును, ఇట్లు యదార్థ మైన ఈమాట క్రైస్తవ మతము విషయమున కూడ యదార్థమే. 12

జర్మనులు క్రైస్తవ సంస్థల ప్రసక్తిలో క్రైస్తవ భావ చరిత్రను విస్తా రంగా పరిశీలించి ఈఆగమ పద్ధతిని అభివృద్ధిచేసినారు. బైబుల్ కేంద్ర ప్రామాణిక స్థానంలో చారిత్రిక మైన లేదా "సజీవమైన" క్రీస్తును తెచ్చి పెట్టుట దీనికంతటికి అనుకోని ఫలమైనది. లేదా లూయీ ఎఫ్. స్టియరన్స్ చెప్పినట్లు, "మనము మన భగవంతునికి సంబంధించిన సిద్ధాంతాన్ని క్రైస్తవీ కరింప ప్రయత్నించు చున్నాము" 13 ఇటువంటి పూనికవల్ల "చారిత్రిక క్రీస్తు"ను వెదకుటలో న్యూటెస్టమెంటును పునర్వ్యాఖ్యానించుటకు కొంచె మించుమించు మితిలేని అవకాశాలు ఏర్పడినవి.

కాని ఔదార్యవాదులలో చాలమంది మరింత సమకాలీన రూపమైన "క్రైస్తవ చైతన్యమును" సృశించి ఈ కష్టసహితమైన చారిత్రిక గవేష ణకు స్వస్తిచెప్పించినారు. జొనాథన్ ఎడ్వర్డ్స్ "అతని అనుయాయులతో పునరుద్ధరణ దృష్టిలో ఆరంభమైన" ప్రయోగాత్మక మతము "మొదలుకొని ఆండోవర్ ప్రస్థానము వారు చెప్పిన "క్రీస్తుతో ముఖాముఖ" 14 అన్న దానిలో మరల తలఎత్తి మతానుభవమును విశ్లేషించు విలియమ్ జేమ్స్ ఆసక్తివలన పెరుగుచువచ్చిన మత సంబంధమైన వైయక్తిక మనస్తత్త్వముగా పరాకాష్ఠను పొందిన స్వానుభవాగమ పద్ధతి యొక్క ఒక సుదీర్ఘ సంప్రదాయం అమెరికాలో ఉండినది. ఫలితముగా రిట్ షెల్ "క్రైస్తవ చైతన్యమును" మరింత ఆచరణదృష్టితో, అతడు ఊహించిన దానికంటె "దూరదృష్టితో" వ్యాఖ్యానించుట ఈ అమెరికన్ ఔదార్య వాదులకు సులభముగా గెంతుట అయినది. హెన్రీ సి. కింగ్ ఇట్లువ్రాసినాడు:

ఇట్లు క్రీస్తు నైతికముగా తాత్త్వికముగా భగవంతుని పక్షమునుండి ఆయన సంకల్పమునకు కొదువలేని బదులుపలికి ఖండితముగా విశిష్టుడగుట యేకాక సారమును మూలకారణ దృష్టితో వ్యాఖ్యానించినప్పుడు ఆయన ఆధ్యాత్మికముగా కూడ భగవత్పక్షమున నున్నాడనియే చెప్పవచ్చును. సరిక్రొత్తదైన వైయక్తిక ప్రతిజ్ఞావాక్యము, మరింత ప్రాతదైన ఆధ్యా

త్మిక ప్రతిజ్ఞావాక్యము, రెండును ఈవిధముగా పరాస్తములగుచున్నవి; కాని మనుష్యులలో అధికసంఖ్యాకులకు క్రీస్తు దివ్యత్వమును వైయక్తికముగా నిత్యాచరణలో నొప్పుకొనుటయే మరింత తర్కసహము నిశ్చాయకమునైన పరీక్ష అనుటలో సందేహముండరాదు 15

క్రీస్తు దివ్యత్వమును గూర్చిన మనుష్యుల ఈనాటి ఒప్పుకోలులో ఆచరణ దృష్టితో అథవా మూలకారణదృష్టితో క్రీస్తు ప్రామాణ్యమును దర్శించుటనుండి ఈ ప్రామాణ్య సమస్యను ప్రాప్తకాలజ్ఞులై పూర్తిగా నొల్లగిల్ల జేయుటకు సులభమైన ఒక గంతువేయుట చాలును. ఉదాహరణకు 1[illegible]09 లో మిచిగాన్‌లోని ఎపిస్కోపలియన్ బిషప్‌నుండి వచ్చిన ఈక్రింది మాటలనిం[illegible]మక చిత్తగింపుడు:

ఈనాటి చిత్తవృత్తి కేవలము ప్రాప్తకాలజ్ఞమార్గమున నడచునది కాక పోయినను తీవ్రమైన ఆచరణదృష్టిగలది. మూలములను బట్టిగాక ఫలములను బట్టి నికరమైన క్రైస్తవము తనకెఱుగరావలెనని దాని పట్టుదల మతమును సమర్ధించువారితో అది, ఒక్కొక్కప్పుడు కొంతచిరాకుతోగూడ, ఇట్లనుచున్నది "మీ పురాతనములైన ఊటలు, చెఱువులు, నెఱియవిడని ఆనకట్టలు యథార్థములేనని వాదముకొఱకు (మాకు ఏమాత్రము నమ్మిక కుదరకున్నను) ఒప్పుకొన్నను అంత మాత్రమున నేమైనది? మాకు ముఖ్యమైన ప్రశ్నయేమనగా ఈ మూలస్థానములనుండి ఈ కాలువల గుండా మాకు వచ్చుచున్న ఈ ప్రవాహాలక్షణ మెటువంటిది? జీవన ప్రవాహము నాటివలె నేడున్నదా? మా ఆత్మపిపాసనది తీర్పగలదా? మనుష్యహృదయములోని మాలిన్యమునది ఇప్పటికిని క్షాళనముచేయ గలదా? మానైతిక ధార్మికజీవితమును ఊర్జితముగా చేయగలదా? ఈ పనులన్నియు చేయగలిగినచో నది ఈనాటికి తగినదని దాని నంగీకరింతుము. చేయలేనిచో దాని పుట్టుక, సంప్రదాయములు ఎంత ప్రామాణికములైనను సరే దానిని విడువక తప్పదు. 16

బహిరంగముగా ప్రాప్తకాలజ్ఞులవలె ఫలముల గురించి మాటలాడు అమెరికనుల క్రైస్తవానుభవ పాఠరూపము రిట్ష్‌ల్‌నుండి తెచ్చుకొన్న క్రైస్తవ చర్చీల చారిత్రకమైన అనుభవముతో చేరినపుడు ఉదారాగమ శాస్త్రమునకు చక్కని పునాది కల్పించినట్లైనది. ప్రాప్తకాలజ్ఞస్వానుభవ సిద్ధాంతమువల్ల కొంత ముందుచూపు, చారిత్రక స్వానుభవ సిద్ధాంతమువల్ల

ఒక సంప్రదాయ నేపథ్యము దాని కబ్బినవి. ఈరెండును చేరగా శాస్త్రీయ పద్ధతి, మతప్రామాణికత తయారైనవి. ఇట్లు అమెరికన్ ఉదారవాద మతప్రచారకులు, గురువులు విమర్శాపూర్వకమైన లౌకజ్ఞతాదృష్టితో చూచుట నేర్చుకొని దానిని పట్టుకొనవచ్చిరి.

ఈ ఔదార్యవాద వాఙ్మయము కట్టలు కట్టలుగానుండి, అందరెఱిగినది యగుటచే దానిని నేను వివరముగా చెప్పబోవుటలేదు. 17 ఈవాఙ్మయము హారీ ఎమర్సన్ ఫాస్‌డిక్ వ్రాసిన అత్యంత జనరంజకములైన ధర్మోపన్యాసములలో భక్తిగ్రంథములలో పరాకోటికి వచ్చినది. ఆయన మాటలిప్పటికి ఇంకను మన మనస్సులలో వాడిపోలేదు. ఆయన ప్రభావము ఇప్పటికిని కనుపించుచునే ఉన్నది; అందుచేత లౌకజ్ఞతా మార్గంలో ఆయన బోధించిన పద్ధతిని వివరించుట అనవసరము. ఆయన విస్తారంగా సంచారముచేసి ఎన్నో తెగలవారి చర్చిలలో మతప్రచారము చేసినా న్యూయార్కులోని రివర్ సైడ్ చర్చి నిర్మాతగా అచటిప్రచారకుడుగా సుప్రసిద్ధుడు. ఈచర్చి తెగలవారీచర్చిల మధ్య ఔదార్యవాదానికి జాతీయమూలస్థానమై ప్రతీక యైనది. ఆయన నిరాడంబరమైన వాగ్ధాటి, లౌకజ్ఞతవల్ల ఆగమశాస్త్రాన్ని పట్టించుకొనక తమ సంస్కృతిలోని నిత్యకేంద్ర భాగముగా చర్చిజీవితములో శ్రద్ధగా పాల్గొనెడు మధ్యతరగతి ప్రాటిస్టెంట్ల పెరుగుచున్న జనసంఘానికి ప్రీతిపాత్రుడై వారితరపున మాటాడువాడైనాడు. "నవీన - ధనకోటి" (పాజిటివ్) సువార్తను జనరంజకముగా చేయుటలో చాల ప్రభావము చూపినది ఫాస్‌డిక్ పుస్తకములలో బహుశః ది మాడరన్ యూజ్ ఆఫ్ ది బైబుల్ (1924) అను పుస్తకము; మనుష్యులను క్రీస్తు సన్నిధికి తెచ్చుటయే బైబుల్ ప్రధాన ప్రయోజనమనియు, క్రీస్తు సజీవ యాథార్థ్యముగా క్రైస్తవ మతవిశ్వాసమునకు పునాది వంటివాడనియు, మనలను అట్టి "మరపురాని అనుభవము"నకు క్రీస్తుకడకు కొనిపోగల బైబుల్ శక్తియే "మారుతున్న రకాలు" గల బైబిలీయ విమర్శలకంటె ముఖ్యమైనదనియు ఆయన ఇందులో వివరించినాడు.

ఫాస్‌డిక్ వాడిన ఇదే నిరాడంబర వాగ్ధాటితో ఇదే దృక్పథాన్ని చార్లెస్. ఇ. జఫర్‌సన్ 1903 లో బోధించిన ధర్మోపన్యాసాల ప్రాచీన సంకలనంలో చూడవచ్చు. ఈ ఉపన్యాసాలు థింగ్స్ ఫండమెంటల్ అనే శీర్షికతో ప్రచురింపబడినవి. ఔదార్యవాదాన్ని దాని తొంటసొగసుతో

చూపగల కొన్నిభాగాలను నేనా ఉపన్యాసాలనుండి ఏరిపెట్టినాను. (చూడు, ఎగ్జిబిట్ XIII)

## సంఘదృష్టిగల ఆగమశాస్త్రము

ఉదారవాద మత ప్రచారకుల ప్రసిద్ధవర్గమొకటి ఇట్లు క్రైస్తవమత విశ్వాసమును లోకజ్ఞత సౌముఖ్యముగలవారికి నచ్చునట్లు చేయుచుండగా మరియొక వర్గమువారు సాంఘిక సువార్తను ప్రచారముచేయుచు మరింత సూటిగా కార్యోన్ముఖుల జేయుచుండిరి. సంఘదృష్టిగల క్రైస్తవమతము అభివృద్ధిని దాని యభిప్రాయమును పూర్వప్రకరణమునఈవరకేచెప్పినాము. సాంఘికసువార్తకు దోహదము చేసినవారు తయారుచేసిన ఆగమశాస్త్రము మనమిప్పుడాలోచించు చుండిన ఔదార్యవాద సిద్ధాంతములనెట్లు పటిష్ఠ ముచేసినదో మాత్రమే ఇక్కడ చెప్పవలసియున్నది.

మతసంబంధమైన ఔదార్యవాదమునకంటే మరింత తక్కువగానే అమెరికాలో మతసంబంధమైన సాంఘికచర్య సిద్ధాంతరూపముగా యోజిం పబడినది. తొలికూర్పులో అది ఆగమవ్యతిరేకముగా నుండుటయేకాదు. చర్చికే వ్యతిరేకముగా నుండినది. ఉదాహరణకు తొలినాళ్ళవేడికోలు పత్రాలు చాలవాటిలో చర్చి అనేది భగవద్రాజ్యము ఏర్పడవలసిన మను ష్యనిర్మిత సంస్థ అనియు, దానికి విముఖమైన లేదా "లౌకిక" సంఘము నుండి దానిని విడిగానుంచుటకు బదులు తక్కిన సంఘవ్యవస్థాక్రమము మారుటతో పాటు దానినిగూడ మార్చవలెననియు వ్రాసినవ్రాతలు చదువవచ్చును. క్రైస్తవ సంఘమేర్పడుట వలన సంస్థలన్నియు భగవదను గ్రహ మార్గములుగా మారును; ప్రపంచమంతయు సామూహికముగా పరిరక్షితమగును. ఆగమశాస్త్రమునకు సంబంధించిన ఈ పద్ధతి రెండు గ్రంథముల రాకవలన స్పష్టముగా తెలియవచ్చినది: 1913 లో చికాగో లోని జెరాల్డ్ బిర్నీస్మిత్ సోషల్ ఐడియలిజమ్ అండ్ ది ఛేంజింగ్ థియాలజీ అను గ్రంథమును ప్రచురించెను. 1917 లో వాల్టర్ రౌషన్‌బూష్ ఎ థియాలజీ ఫార్ ది సోషల్ గాస్పెల్ అను గ్రంథమును ప్రచురించెను. సాంఘిక సువార్తలో ఇమిడి ఉన్నది ఏరకమైన ఆగమశాస్త్రమను దానికి ఈ రెండును రెండు రకములైన సమాధానములు. కాని ఈ రెండునుచేరి ఈ ఉద్యమానికి ఒక

విశాలమైన మనీషాసంబంధమైన వ్యక్తీకరణము నిచ్చినవి. ఇది ఉద్యమ మిత్రులకు శత్రువులకుకూడా ఉపకరించింది.

రెంటిలో జి. బి. స్మిత్‌గారి ఆగమపద్ధతి అమెరికనులకు నవీనతాసిద్ధాంతమునకు సన్నిహితమైనది. అలనాటి తొలికాలాలనుండి లోకమునుగూర్చి వారికి 'పట్టినసంప్రదాయసిద్ధమైన "కులీనవర్గ చిత్తవృత్తి"ని కలియనిబుద్ధిని తెంచుకొనవలసినదని క్రైస్తవులను అరలేకుండా వేడుకొనుటయేగాక "లౌకికము" లైన నైతిక సాంకేతికాభివృద్ధి నవీనశక్తులతో కలియవలసినదనియు వేడుకొన్నది. దీని నతడు ప్రజాస్వామికమైన ఆగమపద్ధతి అన్నాడు. ఇట్లు ఆగమశాస్త్ర మేర్పరచుట చాలమంది పాఠకులకు ఇప్పటికిని క్రొత్తదోచునుగనుక ఒక సార్థకమైన మచ్చుభాగము నుదాహరించుట మంచిది.

...నైతిక సూత్రములను పరిశీలనతోను అనుమాన ప్రమాణముతోను గాక ప్రామాణిక శ్రుతిగ్రంథాల వ్యాఖ్యానాలచేత నిర్మింపబడవలెనను నమ్మిక మానవ సమస్యలయెడ జీసస్ పద్ధతి సూచించిన స్వానుభవవాద చిత్తవృత్తిని పెరికివేసినది. ఈ లక్ష్యము శతాబ్దాల తరబడి మొండిగా నిలచినది ఈనాటికిని చాల చర్చీలలోని మతవిద్యలో గతార్థముగా భావింపబడు మూలభూతమైన విషయముగానున్నది...

కాని వికసిస్తూన్న మానవమేధాశక్తి క్రొత్తప్రయోగములకట్టులు చాచెడు దినములు వచ్చినవి; ఈ ప్రయోగములలో కొన్ని మానవవిజ్ఞానము పొలిమేరలను విస్తృతముచేసి జీవితపరిస్థితులను మెఱుగుపరచి ఆశ్చర్యకరమైన సిద్ధి సంపాదించినవి. ఈ "ప్రకృతి" సిద్ధాంతముల నైతిక గుణములు కొంచెముకొంచెమే అనుభవములోనికి రా నారంభించినవి...

ప్రాచీనపద్ధతిలో శిక్షితమైన మతచైతన్యముగలవారికి ఈ "లౌకిక" "పదార్థ" మూలస్థానముల నాడించుపద్ధతిలో వారికి కావలసిన తాత్త్వికమైన గుణము కనుపింపదు. భగవదనుగ్రహోపకరణములు ప్రధానముగా మన శాశ్వతశ్రేయస్సునకైన అద్భుతచర్యారూపములు గావింబడినవి... విజ్ఞానశాస్త్రపద్ధతిలోనున్న లక్ష్యమునకు మతదృష్టిగల వ్యాఖ్యానము రాకున్నచో అది చర్చికే ఒక బలీయమైన ప్రతిస్పర్ధి కాగలదు; అట్లుకాక క్రైస్తవమతము విజ్ఞానశాస్త్రమార్గ చోదితమైన ప్రయత్నములోని అంతర

మతగుణమును వెలికి దెచ్చినచో క్రైస్తవాకాంక్షా కార్యకలాపభూమి విస్తరిల్లి అనంతమైన ఉత్సాహము కలిగించును.

ఆగమశాస్త్రము మతానుభవములోని ఇట్టి మార్పులకు తగినట్లుగా మారలేదనియు "మన మతానుభవ నిర్దేశముల ననుసరించి దివ్యత్వమును నిర్వచింపవలసిన" సమయమెప్పుడో వచ్చినదనియు స్మిత్ తర్వాత చూపుచున్నాడు.

దివ్యత్వమనునది ప్రధానముగా ఒకానొక "పర" లోకమునకు సంబంధించినదనియు ఒక ప్రత్యేక పద్ధతిలోనే దానిని లోకములోనికి గొనిరావలసియున్నదనియు మనమీనాటికిని ఊహించుచున్నాము. దానిని గుర్తించుటకు దానిని "ప్రాకృత" వ్యవస్థకంటె వేరుగానుంచి అదేదో విశిష్టమైనదిగా గనబడజేయవలెనను భావముగూడ మనకున్నది. కాని మునుపటి కాలములో దివ్యత్వములోని గుణవిశేషములుగా భాసించిన అద్భుతలక్షణముల కత్తిరించి, మార్చవలెనని మన సంస్కృతిలోని వైజ్ఞానిక నైతికాంశములు మనలను ఒత్తిడిచేయుచున్నవి. నైతికదృష్టిగల ఆగమశాస్త్ర మభివృద్ధియగుటలో తరువాతిమెట్టు దివ్యత్వజాతులను ప్రజాస్వామ్యములోని నీతుల కవిరుద్ధముగా ననువదించుట. భగవంతుడనగా మనమందరము లోబడియున్న సార్వభౌమునివంటివాడనియు, పోషకుని వద్దనుండివలె మనము ప్రత్యేకలాభముల దెచ్చుకొన నిచ్చువాడనియు భావించుటకంటే నిరంతరము తనబిడ్డలతోగూడి శ్రమించుచు శాశ్వత సర్వవ్యాపిగానున్న సహకృషికుడని తలంపనేర్చుకొనవలెను... ఎందుచేతననగా అనంతముగా తరుగని మూలములున్న ఈ అద్భుత ప్రపంచమున మానవతత్త్వమునకు ప్రియమైన ప్రతిదానికిని చోటున్నది. బహువిధములైన వర్ధనపద్ధతులలో మార్పుల చమత్కారములు చూపుచు దాని ద్వారమున సౌందర్యమునకు, నైతిక జీవితమునకు, పూజకు దారికల్పించును. భగవంతుడు దర్శనమిచ్చుచున్నాడు. ఆశ్చర్యము, భక్తి, నైతికాంక్ష అనువానిని కలిగించు దేనినైనను అసహ్యించుకొనరాదు.

ఆధునిక ప్రపంచమును దాని నీతులను పరిగ్రహించిన ఈ యుత్సాహమునకు సూటిగా ప్రతియోగ మార్గమునబడినది వాల్టర్ రోషెన్‌బూష్ ఆగమశాస్త్రము. ప్రవక్తవలె లోకము మంచిచెడ్డలను నిర్ణయించి తప్పని

సరిగా "భగవద్రాజ్యము" రాబోవుచున్నదన్న దృష్టితో లోకము తన తప్పులకు పశ్చాత్తాపపడవలసినదని ఆదేశించు పద్ధతి అతనిది. ఇట్టి తన దర్శనమునుగూర్చిన సూచనను ఊర్జితముగ పునరుద్ఘాటించును దానికి తోడుగా సామూహికదోషము, పాపము, ఉద్ధారము అనువానిని పునరుద్ఘాటించును. ఏమైనను భగవదాగ్రహమునుగురించి రోషెన్‌బూష్ ప్రచారముచేయడు. భగవంతుడు ప్రేమమయుడు తండ్రి. క్రీస్తు జీవితములోను, చర్చి వారి క్రీస్తు "రహస్య స్వరూపము" లోను అతడు సామూహిక యాథార్థ్యమగును. సామూహికముగ లోకమందరకు మోక్షము గలుగుటకై భగవంతునియందు భగవంతునితోగూడియున్న జనసమాజము క్రైస్తవులు. మోక్షమునకు సంబంధించిన ఈ చారిత్రకక్రమమే భూమిపై భగవద్రాజ్యము. మానవులందరు తమ సామూహికభారములను మోసికొనుచు "సంఘవ్యవస్థను క్రైస్తవముగా చేయుటకు" కృషిచేయుదురో అప్పుడెల్ల ఇది "వచ్చును."

రోషెన్‌బూష్ ఆగమశాస్త్రమువంటిది "సువార్తా ప్రచారసిద్ధాంతమునకు సంబంధించిన ఔదార్యము" పై బలవద్వర్తనము నెలపుననుట స్పష్టము; కాలము కఠినతరము కష్టతరము కాగాకాగా అతని భవిష్యవాక్కు చికాగోవర్గమునకు చెందిన జార్జి బర్నీస్మిత్, జార్జి బి. ఫాస్టర్, షేలర్ మాథ్యూస్ వంటి వారి తాత్త్వికముగా అతివాదరూపమైన ఔదార్యవాదమును ఉపేక్షాభావపురస్సరముగ లౌకికము ప్రచారము చేయుటను బలవంతముగా వెనుకకు నెట్టివేసినది. ఏమైనను, షేలర్ మాథ్యూస్ ఒకచోట తన ఆత్మచరిత్రను రేఖామాత్రముగా చిత్రించుచు అనిశ్చిత నవీనతా సిద్ధాంతములోని సాంఘిక ఫలములనుండి సాంఘిక కృషికి తన ఆలోచనను మరలించిన శక్తులనుగూర్చి క్లుప్తముగా వ్రాసినాడు:

ఒక మతోద్యమానికి ఆగమశాస్త్రమొక దశయనియు అందుచేత సాంఘికవర్గాల కార్యకలాపాలకు సంబంధము లేనిదానివలె దానిని చూచినచో అది అర్థముకాదనియు క్రమక్రమముగా స్పష్టపడుచు వచ్చినది. అమూర్తములుగా యోచించిన సత్యములకంటె వర్గజీవిత సమగ్రతకు ఒక ప్రాతిపదికగా, పరీక్షగా ఉపకరించెడు ఆగమశాస్త్రము చాల

భిన్నముగా నుండును. గాని నాధ్యాత్మిక దృష్టితోకంటే సాంఘిక చారిత్రక యాథార్థ్య దృష్టితో చూడవలసియుండును.

క్రైస్తవ క్రైస్తవేతర మతవిశ్వాసములకుచెందిన నానావిధములైన మనుష్యులుగల సంఘాలలో పెండ్లతరబడి అనుభవంవల్ల మతసంబంధములైన విశ్వాసములయెడ ఎవని దృష్టి అయినా తప్పక మారుతుంది. మతములో చాల క్లిష్టములైన సాంఘిక పరిస్థితులతో, చరిత్రలతో వ్యవహారమను భావము కలుగుతుంది. ఒక సిద్ధాంతముయొక్క చరిత్ర సిద్ధాంతముల నిర్మించిన ప్రజల చరిత్ర అవుతుంది. ఆగమశాస్త్రజ్ఞుడు తాత్త్వికుడుగా కంటే సోషల్ ఇంజనీర్‌గా, కొంచెమించుమించు సోషల్ సైకోఅనలిస్ట్‌గా కనబడతాడు. క్రైస్తవమతమును ఒక మతతత్త్వముగాగాని, అవితథ విశ్వాస సమూహముగాగాని చూడక మతసంబంధమైన ఒక సాంఘికోద్యమముగా చూచినచో దానికెంతో విస్తృతమైన అర్థమేర్పడుతుంది.

రెండవదశకము కాలములో ఇటువంటి క్రైస్తవ ఔదార్యవాదము ఉచ్చస్థితిలో నుండినది. (చూడు. ఎగ్జిబిట్ XIV). కొలదిమంది తప్ప చర్చిలలో ఆగమసంస్కరణ సాంఘిక సంస్కరణ నాయకులందఱు తమ శక్తులు కూడగట్టుకొని తమ క్రమబద్ధమైన పరస్పర సహకారముద్వారా మనమీవరకు పరిశీలించిన వ్యవస్థా పునర్నిర్మాణ నైతికపునర్నిర్మాణోద్యమములకు ఆశ్చర్యకరమైన వేగమునిచ్చినారు. ఈ శక్తిమంతమైన ఔదార్యవాదముమీద వచ్చిన విమర్శలను చెప్పుటకుముందు జూడాయిజమ్‌లో తత్సదృశోద్యమమునుగూర్చి సంగ్రహముగా చెప్పితీరవలెను.

తమ పొరుగువారైన క్రైస్తవులవలెనే యూదు మతనాయకులుకూడ పందొమ్మిదవ శతాబ్దాంత్యమునను ఇరువదవ శతాబ్దపు తొలినాళ్లలోను సాహజిక సిద్ధాంతమునకు మొగ్గియుండిన సంస్కరణ జూడాయిజమ్ ఆగమశాస్త్రమునకంటే చారిత్రకదృష్టితో సుసజ్జితము చేయబడిన సిద్ధాంత మార్గమునందే చాల సౌకర్యములున్నవని గుర్తించినారు. సంస్కరణవాదులైన అగ్రగామిరాబీలు జూడాయిజమ్‌కు మరింత సన్నిహితమైన ఆగమశాస్త్రమునకు మారవలసిన అక్కరను గుర్తించినారు. "క్రొత్తగా తన్నుదానభివ్యక్తము చేసుకొను" అక్కరను నమ్మెడి నవీనతాసిద్ధాంత విశ్వాసము నంటిపెట్టుకొన్నను సంస్కరణ జూడాయిజమ్ ఇప్పుడు జూడాయిస్ట్ భావములను పైతృక సంస్కృతిని స్పష్టముగా వక్కాణించుటలో వ్యగ్రమై

ఆచారపాక్షికమైన జూడాయిజమ్‌తోపాటు సాంస్కృతిక జాతీయతా భావ మును చాలవరకంగీకరించుచున్నది. 1950 మార్చి 19 తేదీ జరిగిన సంస్క రణ యూదీయ ఆగమశాస్త్ర సంస్థ సమావేశంలో రాబీ శామ్యూల్ ఎస్. కొహాన్ ఇట్లు చెప్పెను:

ప్రాచీన యూదుమతస్వరూపమువలెనే సంస్కరణ యూదుమతముకూడ కాలగతిలో నిరంతరము మారుచున్న సాంస్కృతిక మనీషా వాతావరణ ములకు అనువుగా నిరంతరము తన్ను తాను సుసజ్జితము చేసుకొనుచుండ వలెను...జూడాయిజమ్‌కు తనదైన ఒక విలక్షణశీలము, తనవైన సూక్ష్మ దృష్టి నెలవులు, బల స్థానములున్నవి, సమగ్రావగాహనకు, మనపైతృక మతసంపత్తిని మరింత సారవంతముగ నమరించుకొనుటకు మనము అధు నాతన జ్ఞానసంపత్తి యిచ్చిన ఉపకరణములతో వానికొఱకు గవేషించవ వలెను. మనుష్య స్వభావమునకు నిరాశగొల్పు వివేకమును స్వాతంత్ర్య మును తూలనాడు ఔదార్య వ్యతిరేకశక్తులతో జూడాయిజమ్ చేరక నిలిచినట్లయితే ఆగమశాస్త్రములో మరల వచ్చిన ఆసక్తి, ప్రసిద్ధులు గంభీరబుద్ధులు అయిన లౌకికులు, రాబీలు దానికి చాల మేలుచేయగలరు.

ఈ సజ్జీకరణమునుండియే ఆచారపాక్షిక జూడాయిజమన్న ఉద్యమము వచ్చింది. ఇది ఆచారపరాయణులకు చాల ఉదారదృష్టిగలదిగాను సంస్క రణ జూడాయిజమ్‌కు అతి జాతీయముగాను ఉండినది. ఈ ఉద్యమము అమెరికాలోని కెట్లు తేబడినదియు వృద్ధిపొందినదియు ఈ వరకే క్రమ ముగా వివరించితిమి. ఇప్పుడిది జూడాయిజమ్‌లో కేంద్రస్థానము నాక్ర మించినది; కాని ఈ ఉద్యమము యొక్క ఆగమశాస్త్రము, భావసిద్ధాంతము రాబీల పరిషత్తులోనేకాక దానికి వెలుపలగూడ చాలదూరము అంగీక రింపబడినవనియు, ఈనాటి ఆమెరికన్ యూదుల మతభావమార్గములలో ఇదేస్పష్టముగా చాల పలుకుబడిగల పద్ధతియనియు ఇక్కడ చెప్పవలసి యున్నది. ఏమైనను ఇది ఇంకా ఒక పద్ధతిగానే ఉన్నదిగనుక అనిశ్చిత స్థితిలోనున్నది. ఇది ఎంతదూరము పోగలదో ఇప్పుడెవ్వరును చెప్పజాలరు. పునర్నిర్మాణవాదమని పిలువబడుచున్న ఈ ఉద్యమవామపక్షము ఆగమ శాస్త్రవిషయంలో అతి నవీనవైఖరి నవలంబించినది; తాత్త్వికముగ ఎంత ఔదార్యమునకు పూనుకొన్నారనగా ఆచారపరాయణులు దానిని ఖండించి

నారు, కాని ఆచారపాఠీకులైన సభ్యులలో టోరా, ప్రవక్తలు, దర్శనము, భగవంతుడు అనువాని విషయమున - ఇవన్నియు నవీన చారిత్రక బైబిలీయ విమర్శ పరిధులలోనివే - చాల సహనభావమున్నది. యూదు సంప్రదాయ సంస్కృతుల విశిష్టతయందును అవిచ్ఛిన్నతయందును విశ్వాసము దానికి ద్రోహముచేయకుండుట అను "మూలభూత విషయములు" చారిత్రకములైనంతగా సిద్ధాంతసంబంధులుకావు. దీని ననుసరించి ఈ రకమైన జూడాయిజమ్‌కు జియానిజమ్ యూదుల అవిచ్ఛిన్నమైన చారిత్రక జీవనమునకు ఒక సంకేతముగానైనది కాని యూదు సాహిత్యము, చట్టము, దైవచింతన అనునవి మరల సజీవమైన సంస్కృతి రూపము గైకొననియు, విశ్వజనీనమై ఏకేశ్వరవాదమునుచెప్పు మతమునకు మారురూపముగా భావింప నవసరముండదనియు ననుకొనుట కాకతాళీయమైనది. క్లుప్తముగా చెప్పినచో క్రైస్తవ ఔదార్యవాదమునకు క్రీస్తువ్యక్తియే కేంద్రబిందువైనట్లు యూదుల దైవచింతకు ఇజ్రేల్ మాతృభూమి వారికి అప్పగింపబడుట కేంద్రబిందువైనది. ఈ రెండుగుణాలు బైబుల్ ప్రామాణికత్వమునుగూర్చి అతిగా చెప్పుటను తిరస్కరించునవైనవి.

## సనాతన సిద్ధాంతవాదుల విమర్శ

ఔదార్యవాదముపై పలుదిక్కులనుండి మేధావి వర్గ విమర్శవచ్చి బహుముఖమైన పోరాటమును తెచ్చిపెట్టినది. ఈ పోరాటమింకను సాగుచున్నది. దీని ఫలితమును బహుశః మేధావి వర్గేతరశక్తులు నిర్ణయింపవచ్చును. ఇది యిట్లుండగా, ఈ విమర్శ నాలుగు ముఖ్యమార్గములలో వచ్చినదని గుర్తించుట సాధ్యమే: (1) సనాతనత్వ సిద్ధాంతము (మనీషా దృష్టికిది ఆచార పరాయణతగా గోచరించును); (2) నవీన - ఆచార పరాయణవర్గము (దీనిని కనీసము అమెరికాలోనైనను నవీన - అతివాదమనుట లెస్స); (3) అస్తిత్వవాదము (ఇది ఆగమశాస్త్ర యథార్థదృష్టికొక రూపము); (4) మానవతావాదము (ఇది ఉదారపంథాగలదేకాని ఆగమ సంబంధిమాత్రము కాదు).

ఇరవయ్యో శతాబ్దపు ఉద్యమముగా సనాతనత్వ సిద్ధాంతమునకు సాంఘికముగా నైతికముగానున్న గుణమునుగూర్చి ఇతర ప్రకరణములలో చర్చించియున్నాము. ఏమైనను, ఆగమశాస్త్రమునకు సంబంధించిన

వాదముగా లేదా వైఖరిగా సనాతనత్వ సిద్ధాంతము పందొమ్మిదవ శతాబ్దిలో ఆచారపరాయణులు సిద్ధాంతములో ఏ మార్పును రాకుండ ఎదుర్కొనుటకు పదేపదే చేసిన ప్రయత్నముల అవిచ్ఛిన్నగతిరూపమే. ప్రసిద్ధ పండితులైన చార్లెస్ ఏ. బ్రిగ్స్ (యూనియన్ థియలాజికల్ సెమినరీ 1891), హెన్రీ ప్రిజర్వుడ్ స్మిత్ (ప్రిస్బిటీరియన్ మినిష్ట్రి, 1892), ఏ. సీ. మాక్‌గిఫర్ట్ (ప్రిస్బిటీరియన్ మినిష్ట్రి, 1900), బోర్డన్ పి. బౌన్ (మెథడిస్ట్, బోస్టన్, 1904), ఏ. ఎస్. క్రేప్సీ (ఎపిస్కోపలియన్, రాచెస్టర్, 1906) వంటి వారి నాశ్రయించి జరిగిన "మతద్రోహ" విచారణలు పలుదశాబ్దాలముందు ఆండోవర్ సెమినరీలో జరిగినవాని వంటివి. ఆమాటకువస్తే, సోక్రటీస్ కాలమునుండి జరిగిన విషాదపూరితమైన సుదీర్ఘ పట్టికలో వీనినికూడ చేర్చవచ్చును. మఱి ప్రాటెస్టెంట్ చర్చీలలో ప్రధానమైన తెగలవారీ చర్చీలలోని మినిష్ట్రిలో నవీనతాసిద్ధాంతమునకు సంబంధించిన క్రొత్తక్రొత్త విషయాలేమీ రాకుండ చేయుటకు చేసిన ప్రయత్నము జయించలేనిదిగా నిరూపితమైనది. ఆచారపరాయణుల వైఖరికి ప్రిన్స్‌టన్ సెమినరీ విషయంలో పరాకాష్ఠకువచ్చి ప్రాతపద్ధతి బైబుల్ వ్యాఖ్యానములకు తెగలవారీచర్చీల కేంద్రస్థానముగా ఫిలడెల్ఫియాలో వెస్ట్ మినిస్టర్ సెమినరీ స్థాపించిన ఆచారపరాయణవర్గంవారు తిరోగమించుటగా ఫలించినది. ప్రొఫెసర్ గ్రెషామ్ మాచెన్ అనేకవిధములుగా సమర్థుడైన న్యూటెస్టమెంట్ పండితుడైనను ఆయన తన విద్వత్తును సనాతనత్వసిద్ధాంతమున కుపకరింపజేయచేసిన ప్రయత్నము వ్యర్థమైపోయినట్లు ఈపాటికి నిరూపించుకొన్నది. చారిత్రకవిమర్శ సూత్రముల విషయమున వాటి పరమార్థమునుగూర్చిన సామాన్యమగు ఏకవాక్యత లేనప్పటికిని బైబుల్ అధ్యయనమును ఈ సామాన్య చారిత్రక విమర్శసూత్రముల మీదనే క్రమాధికముగా స్థాపింపబడుచున్నది.

పోపు తన పెసెండి గ్రెగిస్ (1907) అను శ్రీముఖములో నవీనతాసిద్ధాంతమును ఖండించిన ఆధారాంశములు, "వింతవలె చూడగోరుట, గర్వము" అనునవే ఈ రగడకు కారణములని అన్నమాట, ప్రాటెస్టెంట్లు బైబుల్ ప్రామాణ్యమును సవాలు చేసినదానికంటే మరింత "ఆడ్ హోమినియమ్" గా నున్నవి. ఏమైనను పోపును సనాతనత్వవాదులను కదలించిన నిజమైన ఆధారాంశాలు: నవీనతాసిద్ధాంతాన్ని తీవ్రబుద్ధితో

గ్రహించినవాడు క్రైస్తవమత విశ్వాసాన్ని ప్రామాణికముగా ఎందుకు తీసుకొనవలెనన్నచో వివరించుటకు కష్టమగునని తెలిసివచ్చుట; కనుకనే చర్చి సభ్యుడెవడును చారిత్రకమైన మతవిశ్వాసానికి నవీనతాసిద్ధాంతానికి, రెంటికి, హృదయపూర్వకంగా విశ్వాసము చూపలేడనుట. "ఈ 'సనాతనాంశాలు' దేనికి మూలభూతవిషయాలు?" అని ఎవరైనా అడిగితే ఆసక్తిలోని భేదాలు వెంటనే బయటపడుతవి. చార్లెస్ ఇ. జెఫర్సన్ ఔదార్య ధర్మోపన్యాసములలోని "సనాతనపదార్థాలు" సనాతనత్వవాదులు కావాలని పట్టుపట్టిన నమ్మకాలనే ఇరికించినవి. కాని జెఫర్సన్ చెప్పినదానినిబట్టి నమ్మకాలకంటే "పదార్థాలు" మతజీవితంలో మూలభూతవిషయాలు; ఇంకొకరకంగా చెబితే బైబుల్ కల్పించు దివ్యోత్సాహముమీది నమ్మకముకంటే బైబుల్ మరింత సనాతనమైన పదార్థము. కొన్ని అద్భుత కార్యాల మీద నమ్మికకంటే అద్భుతకార్యాలు సనాతనములు, పాపము క్షమ అనునవి పరిహార సిద్ధాంతములకంటే సనాతనములు, ఇల్లే. అయితే పోపులు, బిషప్పులు, పాదర్ కన్వెనర్లు, మత ప్రచారకులు ప్రామాణికముగా మాట్లాడవలెను; మతప్రామాణ్యానికి కొన్ని నమ్మకాలు నికరములగుట మూలభూతమైన విషయము - మతజీవనమునకవి మూలభూత విషయములు కాకున్ననుసరే. వారి దృష్టిలో ప్రామాణికత మూలభూతమైన విషయమైనపుడు చర్చి నిస్సందేహముగా మూలభూతమైనదే అగును. కాని ఉదారవాదులు ప్రామాణికతను భగ్నముచేయుచుండిరి. హార్వర్డ్‌లోని ప్రెసిడెంట్ ఇలియట్ "లోకానికి ఈ ప్రామాణికత 'చాల' అయిపోయింది!" (చూడు. ఎగ్జిబిట్ XV) అని ప్రకటించినపుడు ఆలోచనలో పడవలసిన కారణమున్నట్లే.

ప్రామాణికతకు భయం కలుగుతుందనడానికి సుష్ఠు ఆధారాలే ఉండినవి. కాని నవీనతాసిద్ధాంతాన్ని వైజ్ఞానికంగా నైతికంగాఖండించడానికి అదిచేసిన ప్రయత్నాలు దీనంగా ఉండినవి. బహుశః నవీనతావాదాన్ని ఆపడం సాధ్యమే. అయితే మనీషా విషయకంగా ఆచారపరాయణులను సమర్థించడం అంత సులభంకాదు. మరికొన్ని పాండిత్య మార్గాలు కావలెనన్నసంగతి కాథెలిక్కులు వెంటనే తెలుసుకున్నారు; సనాతనత్వవాదులు

కఠినంగా గ్రహించినారు. కాథలిక్ విశ్వాసాన్ని బలపరచేదిగా నవీన - థామిజమ్ వృద్ధి కావడం ముఖ్యమైన ఒక ఆధునిక విజయము. ఇది చర్చికి బాగా ఉపకరించింది. ఎట్లనగా చర్చి మతాధికారుల ప్రామాణికతకంటే థామిజమ్ వివేచనాశక్తి నుద్దేశించి మాటలాడుటకే ఎక్కువగా ఉపయోగించుకొన్నది. ఈ మార్పునుగూర్చిన కథ మనలను యునైటెడ్ స్టేట్స్ ఆవలకు తీసుకొనిపోతుంది. ఎందువల్లననగా అమెరికన్ థామిజమ్ మొన్న మొన్నటివరకుగూడ యూరోపియన్ పండితులు వెలుగజేసిన మార్గాలనే నీరసంగా అనుకరించింది. ఏది యెట్లున్నను పాండిత్యపద్ధతి నిలువబెట్టిన క్రమబద్ధమైన ఆచారపరాయణత సనాతనత్వవాదులు బైబులు చూపుట కంటే చాల భిన్నమైనది. అమెరికన్ ప్రొటెస్టెంట్లలో యవాంజలికల్ పాండిత్యపద్ధతి తలఎత్తేసూచనలు అక్కడక్కడ ఉన్నవి. కొందరు యవాంజలికల్ ఆగమజ్ఞులు బైబుల్ ప్రామాణికతతోకంటే స్వానుభవవాదంతోనే ఆచారపరాయణతయొక్క మూలసూత్రాలకు సమర్థింప ప్రయత్నించుచున్నారు. ఉదాహరణకు కెంటకీ రాష్ట్రంలో స్కోప్సు విచారణ జరిగిన చోటికి అనతిదూరంలో లూయీవిల్ లో, విలియమ్ జెన్నింగ్స్ బ్రియాన్ మరియు సనాతనత్వవాదులు పరిణామ సిద్ధాంతబోధనను నిషేధించిన టెన్నెస్సీ చట్టమును సమర్థింప ప్రయత్నించిన ఆచోట సదరన్ బాప్టిస్ట్ థియలాజికల్ సెమినరీకి అధ్యక్షుడైన ఎడ్గార్ వై. మల్లిన్స్ "సిద్ధాంత రూపమైన" క్రైస్తవ మతమును తర్కబద్ధమైన క్రైస్తవ అనుభవముగా ప్రదర్శించుటకు తీవ్రముగా ప్రయత్నించి తన విద్యార్థులమీద చెదరిపోని ముద్రవేయుచుండెను. వై. ఈజ్ క్రిస్టియానిటి ట్రూ? (1905) అనేది ఆయనవ్రాసిన చాల జనరంజకమైన గ్రంథాలలో ఒక దానిపేరు. దీనిలో యవాంజలికల్ సిద్ధాంతానికి కనీసం ఒక తాత్విక స్వరూపమును ఇచ్చుటకు దానిని ఖండించుటకు విరోధులువాడిన పద్ధతులతోనే దానిని సమర్థించుటకు ఆయనచేసిన ప్రయత్నము ప్రతిఫలిస్తున్నది. ఏమైనను ఆచార పరాయణ గురువులలో చాల కొద్దిమందిమాత్రమే తమ విశ్వాసమును స్వానుభవ భూమికమీద నిలుపుకొన నిచ్చగించుచున్నారు. లేదా మరింత నికరముగా చెప్పినచో స్వానుభవవాదములో తమ విశ్వాసమును పణముగాం నొడ్డ నిచ్చగించుచున్నారు.

## ఆగమశాస్త్ర పునరుద్ధరణ

ఆగమశాస్త్రములోని నవీనాచారపరాయణత లేదా నవీన అతివాదము అనబడునవి నవీనతాసిద్ధాంతము ఔదార్యవాదములలోని లోపములను ప్రదర్శించి అవి తగినంతదూరము సహకరించునవి కావని నింద మోపుచూ, వానిని చక్కగా ఎదుర్కొన్నవి. మతసంబంధమైన అవసరములకు సంకట పరిస్థితిలోపడిన ప్రపంచానుభవములకు తగినంతగా ఔదార్యవాదము అభి వృద్ధికాలేకపోయినది. నిజముగా ఔదార్యవాదము సంకటపరిస్థితుల అనుభవమును అభ్యూహించి సిద్ధపడినవికాదు. అభ్యుదయమునందు పరిణామరూపమైన దైవమునందు ఆశాపూరితమైన విశ్వాసము మొదటి ప్రపంచసంగ్రామము తర్వాతకూడ బ్రతికినది. ఎందుకనగా ఉదారవాదు లనేకులు తమ ప్రిజ్బిటేరియన్ నాయకుడైన ఉడ్రోవిల్సన్ వలెనె "యుద్ధము నంతమొందించుటకు యుద్ధము" అనుదానిని క్రైస్తవ భూమిక మీదనేకాక ప్రాప్తకాలజ్ఞతా భూమికమీదకు సమర్థింపవచ్చుననియు రాబోవు దివ్యరాజ్యమునందలి తమ విశ్వాసమునకు అభ్యూహించనిదైన నాటకీయమైన ఇట్టి పరాకాష్ఠ ఉండవచ్చుననియు తమ్ముతాము సమాధాన పరచుకొనిరి. కాని లీగ్ ఆఫ్ నేషన్స్ విఫలమగుటనుబట్టియు వివిధము లైన చర్చి "ప్రపంచోద్యమాలు", సంస్కరణలు (ముఖ్యముగా మద్యనిషేధము) విఫలమగుటనుబట్టియు, ఆర్థికమాంద్యమునుబట్టియు, లౌకిక అధి కారవాదములతో పశుప్రవర్తనలతో లోతుగా ఏర్పడుచున్న వ్యతిరేకత అనుబట్టియు చూడగా ఉదారవాద మతప్రచారకుల ధర్మోపన్యాసములు సంఘసంస్కర్తల ప్రయత్నములు గతకాలమునుండివచ్చు కంఠస్వరమువలె కనుపించినవి. లోకముమారినది. వేరువిధమైన సువార్త కావలసివచ్చినది. రీన్ హోల్డు నీబూర్ వ్రాసిన రిఫ్లెక్షన్స్ ఆన్ ది ఎండ్ ఆఫ్ యాన్ ఈరా (1934) ఈ క్రొత్త చిత్తవృత్తిని వ్యక్తముచేయుటయే కాక నవశకానికి ఆయత్తపరిచింది, ఇందలి భావముల ప్రకారము మాన వుడు మనుష్యప్రకృతినిగాని లేదా చరిత్రలోని తర్కమునుగాని అనుస రించుచూ పోయినచో వాని ఉద్ధారమునకు అవకాశమేలేదు. అందుచేతనే అనుగ్రహమునుచెప్పెడి మతయొ లేక ఉద్ధరించెడి అత్త్యుత్తమశక్తి ఒకటి ఉన్నదని ఆశచూపెడి ఒక సువార్తయొ, "ప్రకృతిలో మా చరిత్రలోనూ

తప్పనిసరిగా ఓడిపోయెడు మానవుని అంతస్థునకు" బలము కాకపోయి ననూ నెమ్మదినైనను తేగలవు. దినిని మార్క్సిస్టులు రాజకీయనైతిక పరాజయములకు ఆధ్యాత్మికతయను "మత్తుమందు" ను చక్కెరపూతగా పూసియిచ్చుట అనవచ్చును. కాని, చర్చీలు తమ ఉపేక్షాపూర్వకమైన సాంఘిక రాజకీయములు వీరి భగవంతునియందు మరింత భక్తివిశ్వాసము లుంచరావలెననియు, చరిత్రలోని తర్కము ఉదారవాదులకు చారిత్రక దైవమునందున్న విశ్వాసమునకెన్ని ఇబ్బందులు కలిగించినను ఇది జరుగ వలెననియు దాని యుద్దేశము.

సంకటపరిస్థితి ప్రవక్తలు ఔదార్యవాద సభ్యులనుండియే వచ్చినవారు. ఇది గమనింపదగిన యథార్థవిషయము. ఔదార్యవాదము (భగవంతుని నాయకత్వమున అనుకోండి) తన్ను దాను సంస్కరించుకొనుచుండెను. ఖండనము బయటివారినుండి వచ్చినట్లున్నది. మూడు నాలుగు దశాబ్దు లలో జర్మనీనుండి దిగుమతియైన క్రమబద్ధమైన శోకారావాలు ప్రళయ వాక్కువలె అమెరికాపైకి దిగబడినవి. స్పెంగ్లర్ తర్వాత కార్ల్ బార్త్ వచ్చినాడు. తర్వాత ఎమిల్ బ్రన్నర్. పిమ్మట కార్ల్ యాస్పర్స్ పాల్ టెల్లిష్‌లు. ఇంతలో ఇంకొకరకమైన శోకాత్మకరచనలు కిర్కగార్డ్ శిష్యులనుండి ఆయన గ్రంథాల అనువాదాలనుండి వచ్చుచుండెను. ఒక క్రొత్త శబ్దజాలము, ఒక విచిత్రమైన చరిత్ర తత్వసిద్ధాంతము, "భగవ ద్వాక్కు" అనేదాన్ని అతినిపుణముగావాడుట, అత్యుత్తమ నిర్ణయాన్ని చాటడము అమెరికనుల ఉపేక్షాభావానికేగాక అమెరికన్ ఆదర్శవాదానికి కూడ దిక్కుతోచనీయలేదు. ఈ విధంగా వాతావరణంలో ఎక్కడ చూచినా దర్శనాత్మక సిద్ధాంతసంబంధమైన నిర్ణయమే కనబడేది. "గతి తార్కిక ఆగమశాస్త్రం" చేసిన రణగొణధ్వని పేలిపోతున్న సంస్కృతి మీద దొర్లిపోయిన ఆగమస్ఫూర్జథూరవమైనది. ఔదార్యవాదముగన్న కలను అంతరింపజేసిన సంకటస్థితి స్వరూపమది. దానితత్త్వము వైదేశి కము. అయినను బయటినుండికూడా వచ్చి తమపాలబడిన విధికృతమును వర్ణించుటకు దాని నమెరికనులలో వాడినారు. ఈ తరమువారు విధిగా అనుభవింపవలసివచ్చిన క్రూరకర్మ తమ స్వీయపాపమునకు అథవా అంధ త్వమునకు ఫలము కావచ్చుననునది అమెరికనులకు మొదట సాధ్యమైన విషయముగా తోచలేదు. వైదేశిక "రాక్షస" శక్తులు తగని ఈ విషాద

మును తెచ్చిపెట్టినవని నిందిస్తూ వారు జాబ్ వలె తమ ఆదర్శవాదము యోగ్యతను సమర్థించుకొనజూచినారు. కాని క్రమముగా గడచిన రెండు దశాబ్దములలో అమెరికనులు ఆత్మవిశ్వాసము అడుగుననుండి విచ్ఛిన్నమైనది. మునుపటి సాంఘిక సువార్తా ప్రవక్తలు చూచినదానికంటె మరింత తీవ్రముగా, విమర్శగా కనీసము అమెరికన్ మతనాయకులైనా సామూహిక మనుష్యపాపమును చూచుచున్నారు. ఏమైనను, "ఆశావాదము మంచి పునాదులున్న మత" మని గార్డన్ వ్రాసిన 1908 సంవత్సరములో అది ఎంత నిజముగానుండినను, ఆ ఆశావాద పునాదులు పోయినవనియేకాక ఆశావాదమునకు క్రైస్తవ విశ్వాసమునకు ఏమియు సంబంధములేదనికూడ ఇప్పుడు స్పష్టమైనది. హారీ ఎమర్సన్ ఫాడిక్ 1935 లో బోధించిన ఒక అబ్బురముగొలిపే "ఒస్పుకోలు"లో ఔదార్య వాదంలోని మానవీయలక్షణాలను తిరస్కరించి "నవీనతా సిద్ధాంతమున కావలి" నున్న ఆగమశాస్త్రమున తనకు నమ్మికగలదని ప్రకటించెను. (చూడు. ఎగ్జిబిట్ XVI) తక్కిన ఔదార్యవాదనాయకులుకూడ మరింత ఆగమశాస్త్రసంబంధము, సిద్ధాంత సంబంధముగల సందేశమునకే తిరిగివచ్చిరి.

ఏమైనను నవీన అతివాద సందేశము పనికివచ్చేమాటలు చెప్పుటలోకంటే నిందించుటలోనే స్పష్టముగాచెప్పినది; దాని అనుగ్రహసిద్ధాంతముకంటే పాపసిద్ధాంతమే కొట్టవచ్చినట్టు కనబడేది. అయినను కొన్నికొన్ని పనికి వచ్చే మాటలుండినవని సిద్ధముగానే చూడవచ్చు - అది ఛాత్రమైన ప్రొటెస్టెంట్ పద్ధతిలోనుండినది. అధవా నవీనసంస్కరణ ఆగమశాస్త్ర పద్ధతిలోనుండినది. సాంఘికసమస్యలమీద కాథెలిక్కుల సహకారము నాచరణలో సంపాదించుటకొక ప్రాతిపదిక సాధించు ఆశతో ఔదార్య వాదము కాథెలిక్కుల ప్రొటెస్టెంట్ల మధ్యనున్న సిద్ధాంతభేదములను తగ్గించివేసినది. ఇప్పుడు, ఆగమశాస్త్రచర్య తిరిగివచ్చుటతో థామిజమ్ చెప్పిన "వివేకవాదము", "నిర్దోషవాదము" లకు ప్రతియోగమార్గమున లూథర్, కాల్విన్ సిద్ధాంతముల ననుసరించి మానవుని స్వరూపము నిర్ణయించుటను, మనుష్య స్వభావములోని "నైరాశ్యము" "అవివేకము" అను వానిని గూర్చిన వాదమును సరియైనవను మొండితనము ఒకటి వచ్చినది. కాథెలిక్ ఆగమశాస్త్రమును ఖండించుట, కాథెలిక్కులు

సామ్యవాదలక్ష్యమున చేవిడచినందులకు వారి రాజకీయములను ఖండిం చుట ఒకేసారిగా వచ్చినవి. నవీన అతివాదులు చాలవరకు శాస్త్రసామ్య వాదులు. రోమ్ తన సాంఘిక తత్త్వసిద్ధాంతమును ప్రకటించిన తర్వాత తాముక్రైస్తవసామ్యవాదనాయకత్వమును గెలుచుకొందుమనిఆశించినవారు యునైటెడ్ స్టేట్స్‌లో మార్క్సిజమ్ అంత బలంగా లేకపోవుటవల్ల ప్రాటెస్టెంట్ క్రైస్తవ సామ్యవాదులు అమెరికన్ శ్రామికవర్గాల సాను భూతిని చూరగొందుమని ఆశించినారు. సాంఘికసువార్తఉన్న భూమిక మీద నిశ్చయములుగా "వామపక్షమునకే" జరిగినారు. కాని శాస్త్రపద్ధతి పెరిగి, సామ్యవాదము సిద్ధాంతములోను ఆచరణలోను (వెనుకటి ప్రక రణములో మనము గమనించినట్లు) రానురాను క్లిష్టతరముకాగా ఈ నవీన అతివాదులు తమ అతివాద "భూముల"ను తెలియజెప్పుటకు, ఆలంకారికములు కాకపోతే అస్పష్టమైన పద్ధతులను అవలంబించినారు. తరుచుగా కుడిచేతిలో నేమిపట్టుకొన్నదియు "ఎడమ" చేతికి తెలిసెడిది కాదు. ఇటువంటి కలగాపులగపు పరిస్థితిలో మతానికి సాంఘికవ్యాఖ్యా నముచేయువారు చేయ నాశింపగలిగినదంతయు మోక్ష "క్రమము"ను గుర్తించుట సాధ్యముకాదని ఒప్పుకొనుచునే మానవచరిత్రకు దివ్యరాజ్య మునకు ఒక ఆచరణీయ సంబంధమున్నదని విశ్వాసమును నిలుపుచు వచ్చుట. లేదా నాయకులలో ఒకరు అరలేకుండా చెప్పినట్లు, "మన కాలములో ఫలితముల నూహించుటమీద ఆధారపడని చరిత్రలో భగ వంతుని ఉద్దేశాలకు విశ్వాసముచూపుటకై మనలో అనేకులము ఒక ప్రాతిపదికకుగా వెదకులాడుచున్నాము."

ఈ అర్ధశతాబ్దమునం దంతటను వచ్చిన ఆగమశాస్త్రభావ ప్రవాహ ములో సర్వత్రకనుపించు గమనినపదగిన విషయమొకటి ఉన్నది - పరి హారసిద్ధాంతము. పందొమ్మిదవ శతాబ్దపు చరకాలములోని ఆగమ శాస్త్రము తన భయంకరయుద్ధాల నీ సిద్ధాంతమునుగురించియే నడపినది. చాలవరకు ఈ తీవ్ర వాదోపవాదములవల్లనే ఆగమశాస్త్రమునకు వ్యతి రేకమైన నవీనసిద్ధాంతభావము లారంభమైనవి. ఈ ప్రతీకారభావముల నడుమనే జోసయ రాయ్స్ తన ప్రాబ్లమ్ అఫ్ క్రిష్టియానిటీ (క్రైస్తవమతము సమస్య) (1913) లో దాని తాత్వికచర్చను మరల తెచ్చిపెట్టి పరిహారవిషయకమైన సాంఘికసిద్ధాంత మొకదానిని చర్చి

సిద్ధాంతమునకు ప్రాతిపదికగా చేసినాడు. క్రీస్తు సిలువ మొండితనము, దగా, లంచగొండితనము, ఛాత్రవృత్తి, అసమానత అను "మనపాపముల భరించున"దని సాంఘికమైన వ్యాఖ్యానము నొకదానిని రోషెన్‌బూష్ ప్రచారముచేసెను. ఔదార్యవాదులలో ప్రాతవాడైన షేలర్ మాథ్యూస్ చివరిరోజులలో వ్రాసిన ఒక పుస్తకమునకు ది అటోన్‌మెంట్ అండ్ ది సోషల్ ప్రాసెస్ (1930) (పరిహారము - సాంఘిక క్రమము) అని పేరుపెట్టినాడు. దానిలో క్రైస్తవ ఆగమశాస్త్రమునకు మూలభూతమైన ఈ సిద్ధాంతము పునరుద్ధరింపబడవలసిన అవసరము నాతడు గ్రహించలేకపోయినాడని బయటపడుతుంది. ఉద్ధారమునకు మొదటిరూపముగా ఒప్పుకొన్నను ఒప్పుకొనకున్నను ప్రత్యామ్నాయ బాధననుభవించుట నైతికజీవితములోని, విషాదపూరితమైనను ప్రధానమైన అంశముగా భావింపబడుచున్నది. నీతిశాస్త్రమున కేంద్రస్థానమునకు ఇట్లు సిలువ వచ్చుటవలన క్రైస్తవమతము, క్రైస్తవ ఆగమము చాల ఔదార్యవాద వర్గాలలోనికి వచ్చినట్లయినవి. ఈ వర్గాలు తొలిదశాబ్దాలలో ప్రత్యేకముగా క్రైస్తవత ననుసరించినవారుకారు. ప్రాటెస్టెంట్లు, కాథలిక్కులు, యూదులు అంగీకరింపగల సాంఘికాగమశాస్త్రమును తయారుచేయుప్రయత్నము ఈ మూడుపక్షములవారికిని ఆకర్షణీయముగా నుండుట మానివేసినదని సామాన్యముగా చెప్పవచ్చును. చురుకుగా ఆగమశాస్త్ర నిర్మాణమెక్కడుండునో అక్కడ మతాలమధ్య గోడలు బలపడిపోవడం ఉంటుంది. ఎందుకనగా ఆగమశాస్త్రములోని విషయాలు ఎంత విశ్వజనీనములైనప్పటికిని ప్రతిపద్ధతికిని నిర్దిష్టమైన భాషీయములుండును. ఆ పద్ధతి ఒక నిర్దిష్టమత విశ్వాసమున నొకభాగముగానుండును. మానవజాతినంతటిని ముంచెత్తెడి విపన్నతాభావము ఎంతవరకు సర్వమతములు ఏకీభవించి ఈ భావమును వ్యాఖ్యానించునో అంతవరకు వానికొక క్రొత్త ప్రాణమునిచ్చును. కాని వ్యాఖ్యానపద్ధతులు విధిగా భిన్నరీతులబోవును. సిలువ, మతమునకు ప్రాణార్పణచేయుట అనునవి తిరిగివచ్చుటతో ప్రాటెస్టెంట్, కాథలిక్, జూడాయిస్ట్ ఆగమజ్ఞులు అటువంటి బాధానుభవమును ఏకేశ్వరవాదనుతో సమన్వయించు తమ భిన్నపద్ధతులను పునరుద్ధరించుకొనవలసివచ్చెను; కాని సంప్రదాయకమైన సరిహద్దుల నధిగమించి ఈ విషాదవిషయమున విశ్వజనీన సౌభ్రాత్రముతో వివిధ ఆగమశాస్త్రజ్ఞులు

పాలుపంచుకొనునట్లు చేయగల "విపన్నతా సామాజికభావము"ను సృష్టించినది. ఇట్టి విపత్కర పరిస్థితులలో క్రైస్తవుల నందరిని ఒకటిగా క్రైస్తవ ప్రపంచోద్యమములోనికి చొరద్రోలుటకు సమాంతరవిషయము ప్రతి మతములోను అందరును పరీక్షింపబడుచున్నారనియు అందుచేత అందరును మతవిషయకమైన భక్తిశ్రద్ధలను సామాన్యముగా గౌరవించవలెననియు గుర్తించుటలోనున్నది.

## ఆగమశాస్త్రము యథార్థదృష్టి: అస్తిత్వవాదము

అతివాదసాంఘిక ఆగమశాస్త్రంలోని ఈ లక్షణములతోపాటు మత సంబంధమైన భావములను తాత్త్వికముగ సజ్జితమొనర్చుటలోగూడ పూర్తిగా మార్పువచ్చినది. ఔదార్యవాదమునకు ప్రోదిచేసిన ఖండితమైన ఆదర్శవాదము ఆగమశాస్త్ర యథార్థదృష్టికి. పరిణామసిద్ధాంత సంబంధమైన ఉత్సాహమునకును, లోకముతో మనుష్యుని సంబంధములగూర్చిన అస్తిత్వవాదుల వింగడింపులకు దారివదలినది. వర్తమాన తత్త్వసిద్ధాంతమున వచ్చిన మూలభూతమైన మార్పు ఏ ఆగమజ్ఞునికైనా తెలియును. అయినను ఆ వచ్చిన మార్పుఏమిటో స్పష్టముగా నిర్వచించుట సులభము కాదు. ఎందుకనగా ఆ వచ్చినమార్పులో కొంతభాగము భావమునకు (ఇమోషనల్) సంబంధించినంతగా మేధకు సంబంధించినదికాదు; భగవంతునిగూర్చియు దైవమునుగూర్చియు వచ్చిన చిత్తవృత్తిలోని మార్పు.

ఖండితాదర్శవాదమునకు వ్యతిరేకముగా విలియమ్ జేమ్స్ సాంకేతిక తత్త్వశాస్త్ర, ఆధ్యాత్మిక దర్శనములమీద ఖండన ప్రారంభించినప్పటి నుండి పెరుగుచువచ్చిన ప్రతీకారభావము ఒక సూటియైన దర్శనముగా రూపొందనారంభించినది. ఆత్యంతిక పరిణామవాద పాఠరూపమైన విశ్వక్రమ సిద్ధాంతము నొకదానిని వైట్ హెడ్ బాగుగా ప్రచారముచేసెను. శామ్యూల్ అలెగ్జాండరువంటి పరిణామసిద్ధాంతవాదులు సాంప్రదాయిక పద్ధతి ననుసరించి విశ్వక్రమంలో పరాకాష్ఠకువచ్చు ఆత్యంతకుడుగా "దైవము" ను భావించగా, హెగెల్ సిద్ధాంతానుయాయులు శాశ్వత "సత్యస్వరూపుని" "సంజ్ఞాన" క్రమమునకు "విషయ"మైన వానినిగా, భావించగా, వైట్ హెడ్ భగవంతుడు ఆ క్రమములోని "యథార్థ్య" సూత్రమని బావించెను. భగవంతుని ఇట్లు కాలములోనికి దెచ్చిపెట్టి ఆయన

ఎడతెగక ఆదర్శవస్తువులకు స్థూలరూపమిచ్చు సర్జనశీలమైనక్రియ నాపాదిం చుట ఆగమశాస్త్రరీతిలో భేదములను తెచ్చిపెట్టినది. "శాశ్వతవస్తువుల"ను భూమిమీదికి దెచ్చి వానిని చరిత్రలోనికి "చొచ్చుకొనిరా"నిచ్చుట అను నర్థములో "యథార్థీకరించుట" అనునది ఆదర్శవాది "సంజ్ఞానము"నకు తలక్రిందులైనది. ఏమనగా ఈ రెండవది స్వాతంత్ర్యము జ్ఞానము తమచరమ "విషయీకరణస్థితి"కే వచ్చుటతో నామరూపాత్మకములైన వన్నియు క్రమముగా "స్థూలవిశ్వజనీనములు"గా మారిపోవుచున్నవని అధ్యాసచేసి కొనును. వైట్ హెడ్ చెప్పిన యథార్థవాద సంబంధియైన భగవద్రూపమువలన (రిట్ షెల్ నుండి తీసుకొన్న) చారిత్రక ఆగమశాస్త్ర మును ప్రకృతితత్వమునకు అన్వయించి, మునుపు కేవలము మనుష్యసహజ ముగ గన్పించుచు వచ్చిన అవతార సిద్ధాంతమునకు విశ్వసంబంధియైన చట్రమొకదాని నిచ్చుట కవకాశముగలది. జాన్ డ్యూయీ ప్రచురించిన ఎ కామన్ ఫెయిల్ (1934) అను గ్రంథమువలన యథార్థదృష్టి గల ఆగమశాస్త్రమునకు ప్రోత్సాహము లభించెను. ఈ పుస్తకముకూడ యథార్థాదర్శముల మధ్యనున్న అవిచ్ఛిన్నతను గూర్చి స్వానుభవ యాథార్థ్యానుగతమైన పద్ధతిలో చెప్పును.

లౌకిక యథార్థవాదమునకు సంబంధించిన సరిక్రొత్త "క్రమతాత్విక సిద్ధాంతముల"ను యథార్థమతాచారములతో విశ్వాసములతో సమన్వయ పరచగల సామాన్యమైన తాత్త్వికఆగమశాస్త్రమును నిర్మించుట కాగ మజ్ఞులు మొదలుపెట్టినారు. ఈ మార్గమున గమనింపదగిన ప్రయత్నములు చేసినవారు డగ్లస్ సి మాకింటోష్, వాల్టర్ హోర్టన్, హెన్రీ ఎన్. వీమన్, చార్లెస్ హోర్ట్ షార్న్ గారలు. వారి పద్ధతులను గూర్చి ఇక్కడ తగినంతగా చెప్పుట అసాధ్యమైన విషయము; వాటి భేదములను వివరించి చెప్పుట తికమకకు కారణమగును. ఏమైనను సాధారణముగా యాథార్థ్యవాదుల ప్రతిభావము ఔదార్యవాదములోని మానవీయతా రేఖలను పడగొట్టినది. నైతిక ఆశాదృష్టి పడిపోగా భగవంతుని "మనుష్యధర్మ"ము చెప్పు సిద్ధాంత మునకు తాత్త్వికఆగమజ్ఞులమీద పట్టుతప్పినది. "విశ్వాస-యాథార్థ్య వాదులు" (వారిని ఔల్లిష్ ఈ పేరుతో పిలచినాడు) భగవంతుడు ఖండిత ముగా పరుడనియు, చిట్టచివర కెదురుపడు అస్తిత్వభూమిక యనియు,

యాథార్థ్యధర్మమనియు, మాయాస్వప్నములనుండి మేల్కొలుపు వాద నియు చూపదొడగిరి. భగవంతుడు మనుష్యునకు మనుష్యప్రపంచము నకు అతీతుడుగా నిలచియున్నాడని వారు వివరింతురు; భగవంతుని సామ్రా జ్యము ప్రకృతికి సంబంధించినదియుగాదు, సాంఘికమునుగాదు. యాథా ర్థ్యవాదమును సమర్థించిన వారిలో ఒకడగు యేల్‌లోని రాబర్ట్ ఎల్. కాల్‌హూన్ మాటలలో: "మానవు లందరి మనస్సుల కతీతుడుగా పరము, (ఒకటో అనేకమో), ఉన్నది—దాని స్వభావమునుబట్టి దానిని దివ్యమనిగాని దైవమనిగాని పిలుచుటయుక్తము - మత యాథార్థ్యవాదమునకు ఇది మానవనిర్మితముకాదు. మానవుల కోరికలను నడవడికలను నియమించి, పోషించి, కొంతవరకు తొలగించెడి మార్గములుగల పరితాపరహితవృత్తి గల పరిసరాంశము."

లౌకికతాత్త్వికవర్గములలో బాగా వ్యాపించి అమెరికాలో యాథార్థ్య వాదమువలె ఆదర్శవాది ఆధ్యాత్మికతను పడగొట్టిన యూరపుఖండము లోని అస్తిత్వవాదము కేవలమొక మత తత్వసిద్ధాంతముగా అమెరికా లోనికి గొనిరాబడినది. హెగెల్‌ను విమర్శించిన డేనిష్ ప్రాటెస్టెంట్ విమర్శకుడు స్యారెన్ కీర్కగార్డ్‌ను, అతని శిష్యుడు స్పెయిను దేశీయుడు కాథలిక్ అయిన మిగ్యూల్ యునామునో అనునాతడును సాంఘిక సువా ర్తకు అతివాద విమర్శకులుగా, వ్యగ్రతావేదనాపూరితమైన అంతరాత్మను కాల్పనికముగా వివరించువారుగా పరిచయము చేయబడినారు. లౌకిక సాహిత్యమున "ఫేషనబుల్" గాను వైద్య నీతిశాస్త్రములలో ముఖ్య మైనదిగాను అయిఉండిన వ్యక్తిగత వ్యగ్రతను, వింగడింపును మతదృష్టితో ఆలోచించుట కందించినారువారు. కాని "మానవ సన్నివేశము" ను గూర్చిన వారు వింగడించిన వింగడింపులు అమెరికాలోగాని అమెరికనులకు గాని యథార్థములుగా ఎవరును గ్రహించలేదు. ఏచోటికో సంబంధించిన విచ్చిపోవు లక్షణములుగా అమెరికనులు వాటిని ఆతురతతో చదివినారు. ఏమైనను, అమెరికన్ ఆదర్శవాదమునకు ఆత్మవిశ్వాసము తగ్గిపోగా క్రమముగా సామాన్యమైన మనుష్య సన్నివేశమునుగూర్చిన నిదానమైన వ్యగ్రత పెద్దగా పెరుగజొచ్చింది. ఆగమజ్ఞులలోను. తాత్త్వికులలోను ఒక విమర్శసాహిత్యముపుట్టి మత పునరుద్ధరణలలో కన్పించెడు వ్యక్తిగతమైన పొందికచాలమి, వేరుపాటు, ఆశాభంగమగుట, దోషముచేసితిమన్న భావ

ములు మొదలగువానిని చక్కగా కనబడజేసెను. ఇప్పటికన్నియు అధునిక మైన అనుభవములో సంస్కృతిలోఉన్న విషయములని ప్రదర్శించి, మానవుడు వ్యతిరేకశీలమైన ప్రపంచమున దారి తప్పినవాడని చెప్పెడు క్రైస్తవ యూదు ఆగమశాస్త్రములు యాథార్థ్యము ననుసరించియే చెప్పినవనియు అవి నాటికెట్లో నేడుగూడ నట్లే అక్కరకువచ్చుననియు చెప్పి చూపినారు. యునామునో "జీవితములోని విషాదభావమ"ని చెప్పినదిట్లు వృద్ధియైనది. ఆగమజ్ఞులలో ఆగమములలోని పాపము, నరకము, ఎన్నిక, "పైనుండి మోక్షము" అను విషాదభరిత విషయములమీద గౌరవము పెరిగినది.

కొన్ని సంవత్సరాలపాటు యూదు, కాథెలిక్, ప్రాటెస్టెంట్ ఆగమజ్ఞులను పరస్పర మొకరిమాటలొకరు ఆలకించునంతపాటి సన్నిహితముగా దెచ్చుచున్నట్లు కనబడిన అస్తిత్వవాదము వింగడింపు ఇప్పుడు చాలవరకు ప్రాటెస్టెంట్ నడవడికకు కట్టుబడిపోతున్నట్లు కనబడుతున్నది. అస్తిత్వవాదమునుగూర్చిన పోప్ ఖండన (హ్యూమనీ జెనెరిస్ శ్రీముఖము, 1950) బహిరంగమైన బోధనను ఆగమవిషయాల ప్రచురణను నవీన థామిజమ్‌కు చెందిన సాంప్రదాయకపద్ధతులకే పరిమితము చేయుననుటలో సందేహము లేదు. ఏమైనను ఈ రోమన్ పై పూతకు వెనుక ఆచారపరాయణతను ఆధునిక భావములదృష్టితో పునర్నిర్మించు ప్రయోగములు తప్పక జరుగుతూనే ఉంటవి. ఈ ప్రయోగాలు కాథెలిక్ భావములను ప్రతి యుగములోను సారవంత మొనర్చుచు వచ్చినవి. మార్టిన్ బూబర్, గాబ్రియల్ మార్సెల్, జాక్స్‌మారిటేన్, పాల్ టెల్లిష్, నికొలస్ బెర్డ్యేవ్ వంటి వారి భావములు పరస్పర మొకదానిపై నొకటి ప్రభావము చూపకుండ అపుటకు పోపు శ్రీముఖము చాలదు, అమెరికాలో ముఖ్యముగా ఈ అంతర్జాతీయ అంతర్మతభావాల పరస్పర ప్రభావము ఫలిస్తూ రావలసిందే; పోపులు సనాతనత్వ సిద్ధాంతవాదులు ప్రార్థించెడు నట్టిదియు, ఆగమశాస్త్రమునకుగాని అథవా పెరుగుతున్న మరి యే యితర శాస్త్రమునకుగాని అందక పొందకయున్న పెడసరపు శుద్ధివాదమును అడ్డగించుచు రావలసిందే.

తాత్త్వికమైన ఆగమవిషయాలలోని యథార్థదృష్టిలక్షణాలు ఒకవైపు అస్తిత్వవాద సిద్ధాంతముతోను మరొకవైపు చారిత్రక, సాంఘిక ఆగమ

విషయాలతోను సన్నిహితమగుట సంభవించినచో - ఇది చాలవరకు సాధ్యమైన విషయముగానే కనబడుతుంది - మనకాలమున ఏర్పడిన గొప్ప మేధావిషయక పునర్నిర్మాణములలో ఒకటిగా ఒక అమెరికన్ ఆగమశాస్త్ర ప్రస్థానము ఏర్పడవచ్చును. మరొకవిధముగా చెప్పినచో, కడచిన రెండు దశాబ్దములలోను అస్తిత్వవాదము పుట్టివచ్చిన ఐరోపియ వేదనలో తమకుగూడ భాగమున్నదని అమెరికనులకు తెలిసివచ్చినది. ఈ విషాదవిషయక మతాభివ్యక్తిని అమెరికనులిప్పుడు ఎవరో వికలచిత్తులైన కొందరి మనసులలోని వాగుడుమాటలుగా భావించుటలేదు. అతిశయోక్తిగా చెప్పినప్పటికిని ఈ విషాద విషయక ఆగమశాస్త్రాలు (ప్రాచీనగ్రీకు విషాదాంత నాటకాల పునరుద్ధరణతోకూడా చేర్చుకొని) మనకాలాన్ని, ఇప్పటి పరిస్థితిని యథార్థదృష్టితో చిత్రించునవే అయినవి. మన "చారిత్రకమైన అవసానకాలము" అర్థంకాని అనుభవముకాదని, శతాబ్దాల తరబడి జరిగిన మానవుల పోరాటములోని ఒక దశ అని, మన ఆగమశాస్త్రము సమర్థముగా నుండవలెనన్నచో క్రొత్తగా ఉండుట చాలదనియు ఇతరదేశప్రజల చారిత్రక జీవితములతో ఇతర మత విశ్వాసములతో సంబంధము కలుపవలెననియు తెలుసుకొనుటవలన మన మతసిద్ధాంతములకొక అంతరమైన గాంభీర్యము, మన్నికైన అర్థము ఏర్పడుతవి. దీనివల్ల సామాన్యముగా భవిష్యత్తును గూర్చి చెప్పు వాఙ్మయము నర్థము చేసుకొనుటగూడ సులభతరమగును. నవీనతా సిద్ధాంతంతో చేతులు గరుసు వారి ఉన్నను ప్రవక్తల వాక్కు బైబిలీయముగా నుండవలెను. "భగవద్వాక్కు" ను "బోధపడుట కఠినమైన" నిత్యనూతన దర్శనముగా ప్రచారముచేయుట, ఔదార్యవాదు లూహించుకొన్నట్లు, ఛలము కానక్కరలేదు; కష్టమునందున్న లోకము మూలుగునే చక్కగా విన్పింపజేయునది కావచ్చును.

జూడాయిస్ట్ పండితులలో మతభావముల నిట్లు యథార్థదృష్టితో కలిపివేయుట క్రైస్తవులలోకంటే ముందుకుసాగినది. జూడాయిజమ్ అభివృద్ధిసంఘమువారు ఏర్పరచిన పునర్నిర్మాణోద్యమము జూడాయిజమ్ లోని చారిత్రక, తాత్త్విక సాంఘిక పార్శ్వములను చాల చక్కగా, అతివాదమార్గమున కలిపివేసినది. కాని యూదు నాగరికతకు జాతీయ కాంక్షలకు సంబంధించిన ప్రత్యేక సిద్ధాంతమగుటవల్ల పద్ధతికొక ఉదా

కారణముగా తప్ప అది మరింత విశ్వజనీనమైన ఆగమశాస్త్రమునకు సూటిగా అతుకునదిగాదు. దీనికితోడు ఈ రకమైన పునర్నిర్మాణమును వినాశక మార్గమునుండి తప్పించి ఎంతవరకు నడుపవచ్చునను దానిని గూర్చి రాబీలలోనే పరస్పరము భావైక్యములేదు.

## నవీన మానవతావాదము

ఇప్పటి మేధావిషయకమైన పరిస్థితినిగూర్చిన ఈ విషయమును ముగించుటకు ఔదార్యవాదముపై వచ్చిన మరియొక విమర్శదశనుగూడ చెప్పవలెను. జరిగిన సంఘటనలనుబట్టిచూచి ఔదార్యవాదము తగినంత ఉదారముగా లేకపోవుటచేతను, దారిపొడుగునా - ఆస్తికవాదంతోను, జాతీయవాదముతోను, అతిమానుషవాదముతోను, చర్చి రాజకీయాలతోను, తెగలవారీ జనుల హక్కులవిషయంలోను - రాజీమార్గ మవలంబించుటవల్లను అప్రతిష్ఠపాలైనదని ఔదార్య సిద్ధాంతవాదులలోని కొంద రల్పసంఖ్యాకులు, వారిలోని నవీనతాపక్షమువారు, నిశ్చయించుకొన్నారు కారణ కార్యదృష్టిని వదలడం, చారిత్రకములైన ప్రస్థానాలను సమర్థించుట, మతవిశ్వాసాన్ని సంస్థారూపముచేయుట, మతములమధ్య సౌభ్రాత్ర గౌరవము లోపించుట అనునది వారిదృష్టిలో స్వతంత్రమైన మతానికి ముఖ్యశత్రువులు. ఆగమశాస్త్ర పునరుద్ధరణమువల్లను, మతసంస్థలమధ్య ఏర్పడిన అసమాన భావములవల్లను నిరుత్సాహపడినవారై పలువిధములైన మతవిశ్వాసాలకుచెందిన ఈ నవీనతావాదులు మానవతావాదంక్రింద ఒకటైనారు. తాముకూడ మరొక తెగగా మారిపోరాదని వారెంత ప్రయత్నించినా, ఆ కారణంచేతనే అనేక మతాలలోని మానవతా సిద్ధాంతవాదులతో సామాన్యమైన సాహచర్యాన్ని సాధనచేస్తున్నా, తప్పని సరిగా శాస్త్రమార్గంలో పడుతున్నారు; ఉద్ధరణ కార్యకలాపాలకు ఏర్పాట్లు చేసుకొంటున్నారు. మానవతావాద ప్రస్థానాలు వ్యాపిస్తున్నా, "నాల్గవ విశ్వాసపద్ధతి" ఒకటి ఏర్పడుతున్నా, మేధావిషయకంగా మానవతావాదం తనకొక స్వంత ఆచారపరాయణవరాన్ని ఇంకా తయారుచేసుకోలేదు. మొదటిసారిగా 1933 ప్రకటింపబడి ఆ వరంవారిచేత ఇప్పటికీ, ప్రస్థాన వ్యతిరేకమైన ప్రస్థానంగా వాడుకొనబడుతున్న

ఎ హ్యూమనిస్ట్ మ్యానిఫెస్టో అను గ్రంథములో మతమును గూర్చిన ఈ క్రింది నిర్వచనముగల పదవస్ఫుట నిశ్చితాంశమిది:

మానవతా విలక్షణతను చూపు చర్యలు, ఉద్దేశాలు, అనుభవాలీ మతము – మానవసంబంధముగల దేదీగూడ మతస్పర్శగలదానికి విజాతీయము కాజాలదు. ఇందులో శ్రామికవర్గాలు, కళ, విజ్ఞానశాస్త్రం, తత్త్వశాస్త్రం, ప్రేమ, స్నేహం, వినోదం - మానవజీవితమునకు తెలివిగా తమతమ యోగ్యతనుబట్టి తృప్తినిచ్చునదంతయు చేరివచ్చును. పవిత్రమైనది లౌకికమైనది అన్న వానిమధ్య చెప్పెడి భేదమును ఇకమీద సమర్థించుట సాధ్యముకాదు.

మతనిర్వచనముగా ఈ ప్రకటనను వెంటనే విమర్శించుట సాధ్యమైనను చాలా ప్రస్థానాలు ఉపకరించునట్లుగానే ఇదికూడ మతాన్ని సామాన్యంగా నిర్వచించక ఒక నిర్దిష్టమతవిశ్వాసంలోని అభిప్రాయాన్ని ప్రదర్శించుటకు చాల చక్కగా ఉపకరించుచున్నది. పవిత్ర లౌకిక వినోదస్థానంలో మానవతా అమానవతల భేదాని తెచ్చిపెట్ట ప్రయత్నమీ విశ్వాసమార్గంలోని మూలభూతమైన విషయం.

మానవతావాదుల్లో ఎమర్సన్ ఔదార్యవాదాన్ని ప్రతిబింబించి ఆయనవలెనే క్రైస్తవమత సంబంధమైన పరిచితులకు లొంగి ఉండడానికి ఇష్టపడని వామపక్షమువారైన యూనిటేరియన్లున్నారు. భౌతికవాదమును (లోకాయతన సిద్ధాంతము) ను వల్లెవేస్తున్నవారుగాకాక "ఆత్మ" "అమరమైన" "అత్యుత్తమమైన" "భగవంతుడు" "తత్త్వము" మొదలైన మాటలువాడే ఆగమజ్ఞులను అనుమానంగా చూచే భౌతికవాదులూ ఉన్నారు; వాళ్లకు లౌకికసత్యాలు చెప్పడానికి లౌకికభాషే కావాలి. అతిమానుషవాద సంకేతాలను కట్టుకథలను నిపుణముగా వాడుటచూచి విసుగుపుట్టిన నవీన అతివాద ఆగమజ్ఞులు, క్రమబద్ధమైన మతాలవల్ల ప్రయోజనం లేదంటూనే వివేచనాప్రాణాన్ని రక్షించడంలో "మతం" వంటి వ్యగ్రత చూపించేవారు అయిన సాహజిక సిద్ధాంతవాదులున్నారు. మానవతా దాక్షిణ్యవాదం విశ్వజనీనమైన మతంగా విఫలమగుటకు దుఃఖిస్తూ అదికారణంగా మత మానవతా వాదులని పిలుచుకొనుట కంగీకారముగల ప్రాతకాలపు వివేకవాదులు, స్వచ్ఛందభావుకులు, లేదా వృత్తిగా నాస్తికత్వమును గ్రహించినవారు కొందఱున్నారు. క్రైస్తవ

చర్చిలలోను, జూడాయిజమ్‌లోను, నైతిక సంస్కృతిలోను, ఇతర ప్రత్యేక మైన మత సంస్థలలోను తమ సంస్థల ప్రత్యేకతను సహించక తమ వైయక్తిక విశాల విశ్వాసము ననుసరించి మానవతావాద సభ్యత్వమున చేరిన ఉదారహృదయులెందరో ఉన్నారు. ఏ మత సంస్థలోగాని, లౌకికప్రపంచ విషయాలలోగాని స్పష్టంగా ఇముడకపోవుటచే ఏ పేరూ పెట్టుటకు వీలు లేని వ్యక్తులెందరో ఉన్నారు; అయినను వారుకూడా "మనుష్య వ్యక్తిత్వం పూర్తిగా వికసించుట" ను "స్వతంత్రమైన విశ్వజనీనమైన సంఘము"ను ఏర్పాటు చేయుటయందు, తమకుగల గాఢవాంఛ నభివ్యక్తము చేయకోరు వారు వారు. మానవతావాద సంఘాలు ఈ పలువిధములైన ఉదారవాదులను సభ్యత్వమునకు, బోధనకు, ప్రచురణకు, సామాన్యముగ ఆసక్తిగల విషయాలకొఅకు పనిచేయుటకు ఒకచోటికి తెచ్చి విజయం సాధించినారు. సభ్యులసంఖ్య తక్కువైనప్పటికిని మానవతావాదమొక స్వతంత్రమైన మతోద్యమంగా తిరిగి కనుపించుట గమనింపదగిన విషయం. నవీనతా సిద్ధాంత సంబంధముగల ఔదార్యవాదము ఇప్పటికి ఒక సూటియైన మత విశ్వాసముగా ఉన్నదనియు, సాంప్రదాయికమైన మతసంస్థలు సరఫరా చేయడానికంటే ఎక్కువగానే మతసంబంధమైన అభివ్యక్తి మారమునకు అవసరమున్నదనియు తాత్వికులు అనుసారిబుద్ధులకు కనిపించినట్లుగా అంత బొత్తిగా వైయక్తికముగా ఉండుటలేదనియు ఇది నిరూపించు చున్నది. సాంప్రదాయికముగా మతాన్ని పాటించి గృహములోని సౌఖ్యము లనుభవించే రికి స్వతంత్రమైన దేశంలో స్వతంత్రమైనమతమే ఎదురౌ తుంది. బుద్ధి జీవితాలు మరింత సౌఖ్యంగా కలియగలుపుగా ఉన్నవారికి స్వచ్ఛందభావకులు మతవిషయంలో దిక్కులేని బిడ్డలకు లేదా ద్రిమ్మరులు కనబడవచ్చు. ఈ స్వతంత్ర తత్వాలు తమ సంచారాలలో వెదకులాటలలో తమవంతు ప్రవక్తలను తయారుచేసి జ్ఞానానికి సౌభ్రాత్రానికి సేవ చేస్తున్నాయి, ఈచివరి రెంటిని పేరు పెట్టుకొన్న ఏమతముకూడ ధైర్యంగా తృణీకరించ లేదు. వీటిని చేవిడచినప్పుడు అందరము సిగ్గుపడు తున్నాము కనుక.

మత సంబంధమైన మానవతోద్యమముకంటె కొంత తక్కువగా క్రమ బద్ధమైనవియు, స్పష్టమైనవియు అగు రూపములలో తగినంతమంది మత లౌకికవాదులు ఉన్నారు వారికి లౌకికతా సిద్ధాంతమనగా మతరాహి

త్యము కాదు. మతముమీద ఉపేక్షా భావమూ కాదు. పవిత్రములుగా భావించి అవసరమైనచో వ్యవస్థారూపమైన మతమునకు విరుద్ధముగా పోరాడియైనను తాము సమర్థింపగోరెడు కొన్ని విలువలను సంస్థలనుగూర్చినవారికివ్యగ్రతా రూపము ప్రజాస్వామ్యమును స్వాతంత్రమును విజ్ఞానశాస్త్రమును సమర్థింపవలసిన వారమని వారు భావింతురు. తరుచుగా థామస్ డరుఫర్ సన్ ను తమ అమెరికన్ అధిష్ఠానఋషిగా చెప్పి అతని తత్వమును ఉల్లే ఖింతురు. వీరు సాధారణముగా మతోద్యోగ వ్యతిరేకుల స్వతంత్రమైన తత్వములుగలవారందరు విశ్వాసము చూపగల ఒక "సామాన్య విశ్వాస మును" వ్యక్తీకరించుట సాధ్యమేననియు, అట్టిది వ్యవస్థారూపమైన మతము వేర్వేరుగా విభజించెడి వారినందరిని ఏకము చేయుననియు విశ్వసింతురు.

చావక అడ్డువచ్చెడి మత సంబంధమైన బాలిశత్వమును తుడిచివేయు ప్రయత్నములలో ఎంతమంది సంస్కర్తలు ప్రవక్తలు నానాబాధలుపడి ప్రాణములొడ్డినారో! పరిణతమనస్కుడికి ఆచార పరాయణులు వలలు ఎంత పసితనపు చేష్టలుగా కనబడుతవో సంప్రదాయ సిద్ధాంతవాదులు సనాతనత్వ సిద్ధాంతవాదులు, ఆధునికమానవుని హృదయపూర్వకమైన ప్రోద్బలాన్ని తెచ్చుకొను శక్తిని పోగొట్టుకొను మతముయొక్క సిద్ధాంత మును రూపాలను ఎంత ఆతురతగా అంటిపెట్టికొని యున్నారు! మన మందరము ఏకమై పెద్దవారికి తగినమతాన్ని నిర్వచింప ప్రయత్నించి దాని నాచరించవలసిన సమయము ఎప్పుడో వచ్చినదికాదా?

హోరేస్ ఎమ్. కాలెన్ తన ఆఫ్ క్లెరికలిజమ్ యండ్ సెక్యూలరిజమ్ ఇన్ రెలిజన్ అను పుస్తకములో ఇటువంటి మతానికి సమర్థమైన ప్రతినిధిరూపమైన వ్యక్తీకరణమును ఇచ్చిఉన్నాడు. అమెరికన్‌లలో మతవిషయకంగా "ఎక్కడా చెందని" ముప్ఫయి శాతము వారిలో దాదాపు ఎంతమంది తరఫున ఇతడు మాట్లాడుచున్నాడో చెప్పుట కష్టము. కాని లౌకికతాసిద్ధాంతము లేదా తత్‌సమానమైనది ఒకటి ఒక మతవిశ్వాసముగా ఉంటున్నదనియు, క్రమవ్యవస్థితముగా లేక చక్కని ఆగమశాస్త్రముగా ఉన్నప్పటికిని "దేవుడులేనిది" అనుటకు వీలు లేదనియు, మతవిషయకముగా నిరతురాస్యము కాదనియు గుర్తించుట అవసరము. సాహిత్య మేధావులలోనూ, రాజకీయ వర్గములలోనూ

సాంఘిక వైజ్ఞానికులలోనూ మాజీ మార్క్సిస్టులలోనూ ఈ మత ప్రతి నిధులు అనేకులు ఉన్నారు, మతోద్యోగుల సహాయములేకుండ మతము దొరకుట, సులభముకాకపోయినను, ఊరక వచ్చినట్లె కాని సామాన్య ముగా చర్చివారు ఇటువంటి మతము "తేలికైన ఆత్మను" ప్రతిఫలిస్తుందని చెప్పే సరిపోనిమాట, చాలాచోట్ల నిరాధారమైన విషయం చూచేవానికి అడ్డమువచ్చే ముఖ్యమైన కష్టము ఏమంటే ఇటువంటి మతానికి మతరాహి త్యానికి మధ్య ఎక్కడ గిరిగీసుకోవలెనా అని, ఎందుకనగా మేయర్ షపీరో చక్కగా చెప్పినట్లు "ఇప్పుడు మతానికికూడ తనతోడి ప్రయా ణీకులు ఉన్నారు."

# 5. బహిరంగపూజ, మతవిషయక కళల తీరుతెన్నులు

ఆగమశాస్త్రానికి రెండు విధులున్నవి: విజ్ఞానము పెరిగినకొలది మత విశ్వాసాన్ని దాని మట్టానికితెచ్చి నిలుపుచు ఉండవలెను. ఒక నిర్దిష్టపూజా పద్ధతిని తెలియునట్లుగ చెప్పవలెను. ఈ శతాబ్దారంభకాలంలో ఆగమ శాస్త్రం పూజాపద్ధతికంటె విజ్ఞానశాస్త్రవిషయంలో తన విధినిగూర్చి గెలివిగా ఉండడం జరిగింది. సిద్ధాంతానికి పూజాపద్ధతికి మధ్య పరస్పరము ఎడబాటు కలిగినట్లు కనబడింది. సిద్ధాంతం (క్రిందటి ప్రకరణంలో చూపి నట్లుగా) విజ్ఞానశాస్త్రంతోను తత్వశాస్త్రంతోను సౌభ్రాత్రం నెఱపితే పూజాపద్ధతి సంఘసేవలో దూకింది, ఈ సంచారాలమధ్య పరస్పరము ఒకదాని కొకటి ఎంత అవసరమో ఈ రెంటికి తెలిసివచ్చింది. ఇప్పటి సమన్వయమువల్ల రెంటికిగూడ ఒక ఊర్జస్వితవచ్చింది. ఆగమజ్ఞులు లౌకి కులుకూడ మతానికి పూజ ప్రాణంవంటిదని ఇప్పుడు తెలుసుకున్నారు; అంతరానుగ్రహానికి "బాహిర" సాధనంగా తలవడం మానుకొన్నారు. జీవితానికి గాంభీర్యాన్ని ప్రసాదించే "మానవజీవిత సంబంధులైన విష యాల"లో ఒకటిగా, అమెరికన్ సంస్కృతిని సంపన్న మొనర్చేదిగా, దానికదే పరమార్థముగా భావిస్తున్నారు. పూజచేయవలెనన్న ఈ గెలివైన సంకల్పాన్ని సృష్టించుకోవడం అమెరికనులకు ఇరవయ్యోశతాబ్దంలో సాధించిన విజయంగా భాసిస్తుంది. మనకాలపు వేదనవల్ల పుట్టినదిగా, చాల వరకు, భావిస్తారనికూడా నేను అనుకొంటాను. "ఎప్పుడో ఒకప్పుడో మోకరిల్లవలసివస్తుందని అనుభవంవల్ల నేర్చుకుంటాము; భగవంతుని ముందు మోకరిల్లుటలోనే ఏమాత్రం చిన్నతనం లేనిది" అన్నాడొక వివేకి యైన ప్రెంచివాడు. పూజించుట అనేది చర్చికి సంబంధించిన విధి గా కంటె మతానికి సంబంధించిన అక్కర అని అమెరికనులు అనుకొన వచ్చినారు. తాము భయపడనేర్చిన ప్రేమింపనేర్చిన భగవంతుడున్న చర్చి లకు ఆలయాలకు భక్తిగా తిరిగివచ్చినారు. ఈ విధంగా తెలివిలోనికివచ్చి, మోకరిల్లునట్లుగా చేయబడినారు. అమెరికనులు తమ తండ్రులకంటె ఎక్కువగానే బహిరంగపూజ కావాలంటున్నారు.

## అర్చనకళమీద సాంప్రదాయకమైన అవిశ్వాసము

ఏబదియేండ్లనాడు మతంమీద భక్తిశ్రద్ధలున్నవాళ్లమధ్యగూడ పూజా పద్ధతిని బాధించిన సరిపోనితనాలను ఇరుకులను కొంచెం వివరించడం అవసరం. అవి ఈనాటికి ప్రజలలో చాలా భాగాలలో బ్రతికిఉన్నవి. తెలిసి ఈ పూజాకళను సాధనచేయడానికి అడ్డంకులైనవాటినిగూర్చి అర్థం చేసుకుంటేనే ఈమధ్య జరిగిన సర్జనశీలమైన కృషిని న్యాయంగా మెచ్చుకోవడం సాధ్యమౌతుంది.

అన్నిటికంటె మొదటి "పోపరీ" గా భాసించే ఆచారాలు, నియమాలు సంస్కారాలు అనువాని విషయంలో ప్యూరిటనులకు ప్రతికూలభావం చాలా కాలంగాఉంది. పూజనుగూర్చిన పోపుసిద్ధాంతము ఈ మధ్య మీ ది యే ట ర్ డె య్ అనే శ్రీముఖంలో (1947) పునరుద్ఘాటింపబడింది. పూజకు సామాన్య ప్రయోజనం "భగవంతుని అధికతరయశస్సు, మానవపవిత్రీకరణము" అని నిర్వచించిపోపు ఇంకా ఇట్లా వివరించినారు: "స్వకీయమైన ప్రార్థనకంటే బహిరంగముగా పూజాప్రకరణగ్రంథములతో ధ్యానించుటలో మరింత మేలైన గుణమున్నను విశ్వాసి అయినవాడు స్వీయధ్యానముద్వారానే అర్చనకాండ పవిత్రీకరణ ఫలాన్ని గ్రహించడానికి తగిన చిత్తవృత్తిలో ఉంటాడు."

భగవంతుని కీర్తించుటకే అర్చనమనుట లోకమంతయు ఒప్పుకొన్నదే. కాని అర్చనగ్రంథసంబంధమైన ప్రార్థన స్వీయప్రార్థనకంటే మరింత "ఉత్కృష్ట" మైనదనుమాట (భగవంతుని మరింతగా సంకీర్తనచేయుటకని కావచ్చును) ప్యూరిటనులకు కోపకారణమైనది. ఋషిపూజకంటే సంస్కారసంబంధమైనపూజ పవిత్రముగా చేయునదనుట చిత్రమైన తార్కిక సమస్య. ప్యూరిటనులు తమ చర్చిలలో ఏవస్తువులు లేకుండచేసి బోడికొంపల వలె లేదా వారే అన్నట్లు సమావేశగృహాలవలె కనుపింపజెయ్యడమే కాక నలుగురూకలిసి జరుపుకొనే విందులు ఉపవాసాలు పెండ్లిండ్లు అంత్యక్రియలువంటి వాటిలో పాల్గొన నిరాకరించినారు. నిరాడంబరత, నిష్ఠురత, నైష్ఠికతలను సాధనచేసినారు. మఱి వారికళలు (ముఖ్యంగా వాస్తువు, ధర్మోపన్యాసాలు) ఈ ఆదర్శాలనే ప్రతిబింబించినవి. వీటి ననుసరించియే వారు తమ మినిష్టర్లను ఉపాధ్యాయులుగాచేసి కాన్గ్రెనేషనల్ సమావేశా

లను చాలవరకు బోధన కుపయోగించినారు. బహిరంగప్రార్థన చాలవరకు నీత్యుద్బోధకంకా ఉండేది. భగవత్సాన్నిధ్యములోనికి వచ్చుటగాకాక (వాళ్లు రోజూ దైవసన్నిధిలోనే పనిచేసేవారుగదా) దైవ వాక్కును, ధర్మాన్ని వ్యాఖ్యానిస్తే వినడానికి అంతా ఒకచోట చేరడంగా ఉండేది.

వీరు ఈ విషయంలో ఆలయంలోని అర్చనకాండను సినెగాగ్‌లోని అధ్యయనతంతును విడివిడిగాచేసే యూదులవంటివారైనారు. అందుచేతనే పూజారితనాన్ని ప్రాచీన బలివిధానాలను మరొకవిధమైన దైవచింతనకు, "ధర్మముమీది ప్రేమకు", లోబడజేసినారు. ఇటువంటి నైతికమైన నీత్యుద్బోధకమైన ప్రార్థన సదస్సులనుగూర్చినభావాలు అమెరికాలో చాల వ్యాపించిఉన్నవి. ప్యూరిటనుల పద్ధతులుగాని లేదా ప్రాచీనమైన ఇజ్రేలు పద్ధతులుగాని తెలియనివారిలోకూడా ఇటువంటిభావాలు వ్యాపించి ఉన్నవి. సమావేశగృహాలు సినెగాగ్‌లు "మనుష్యకృత్యములు" బైబల్ వ్యవస్థలు కావన్న ఈ కారణంచేతనే "నిజమైన" మతానికి ఇది బాహ్యమైనవిగా పరిగణింపబడుతున్నవి. చర్చి ఉత్సవాల అడంబరత లేదా సంస్కారసంబంధులైన పారాయణాలు మరింత స్పష్టముగా మనుష్యకృతము లగుటచేతనే వీరికి దైవభక్తి వక్రతగా, కృత్రిమభూషలను చర్చి విధులుగా మార్చుటగా కనబడుతుంది. "ప్రభువునకు నీ నుండి ఏమి కావలెను?" తక్కినవన్నియు అనవసరములైనవి. "తంతునడుపుట మతముకాదనియు, కేవలము మత ప్రాధాన్యమును గుర్తించుటయే యగుననియు, సామాన్యమగు అనుష్ఠానమునకు సహకారిమాత్రమే అగుననియు వ్యవస్థితమైన మతానికి ఇది ఒక పద్ధతియనియు నొక్కి వక్కాణింపవలసిన అవసరమున్నది." ఈ మాటలు హారోల్డ్ స్కాట్ అను లిబరల్ యూనిటేరియన్ వ్రాసినవైనను అమెరికన్ ప్రొటెస్టెంట్లలో అత్యధికసంఖ్యాకుల అభిప్రాయమును ప్రతిబింబించుచున్నవి. ఒక సనాతనత్వవాదియైన మత ప్రచారకుడు తన ఉపన్యాసాన్ని పరాకోటికితెచ్చి "సోదరులారా, నేను చెపుతున్నాను: భగవంతునికి మతమంటే ద్వేషం. అతనికి విశ్వాసం కావాలి!" అని కేకపెట్టడం విన్నట్లు నాకు జ్ఞాపకం. మతమంటే మతపిచ్చి అని పూజాపద్ధతి అంటే అటు విగ్రహారాధనమో ఇటు మూర్ఖత్వమో నని అనుకోవడం అమెరికనులలో చాల దైవభక్తిగలవారిలోను కొత్తిగా దైవభక్తిలేనివారిలోను ఉన్నది.

అర్చనకు సంబంధించిన నీత్యుద్బోధనభావం పారాయణగ్రంథాలతోడి ప్రార్థనలో కావలసిన వ్యక్త్యతీతభావానికి వ్యతిరేకమవుతుంది. మఱి ఇది అభిరుచిమాత్ర సంబంధిమైన విషయంకాదు. ప్రాటెస్టెంట్ నీతిశాస్త్రం అమెరికాలో వ్యక్తిసంబంధముగలదిగా వైయక్తికంగాః ఉండింది, మానవునికి దైవానికి మధ్యగల సంబంధంకూడా వ్యక్తిసంబంధంకూడా వ్యక్తి సంబంధంగానే వ్యాఖ్యానించబడింది. వ్యక్త్యతీతమైన "అనుగ్రహ మార్గాలు", ధ్యానపద్ధతులు ఈ కారణంచేత పొందికకుదురని ఆచారాలుగా కనుపించడమేగాక సన్నిహితమైన వ్యక్తిగతసంబంధానికి నేరుగా అడ్డువచ్చేవిగాకూడా కనబడతాయి. అర్చనను తెచ్చి మర్యాద నెరిగిన వ్యక్తుల సంఘంలోని "సౌకర్యాలు మర్యాదల" ప్రకరణంలోపెట్టి చూడడం అమెరికన్ జీవితంలోని "చొక్కా చేతిమడుపుల" ఆషామాషీ తనానికి సమానతాసిద్ధాంతానికి కోపకారణమై ఛలంగా కనబడుతున్నది; ఉత్సవపూర్వకమైన బలి నిజమైన బలికాదు. తంత్రవతుగాచేసే నిజమైన తపనను వ్యక్తీకరింపకపోవచ్చు -

ఇటువంటి కారణములచేతనే ప్రాటెస్టెంట్ నిష్టర్లు సంస్కారము లిచ్చుటలోను నియమపూర్వకమైన ప్రార్థనలలోను కావలసిన "ఆచార్య వృత్తితత్వాన్ని" అసహ్యించుకొన్నారు. "పరమపవిత్రుడైన వానిని గురించి చెప్పవలసిన ప్రతి ఉదయము తానెంత ఛండాలత ననుభవిస్తు న్నాడో మంచి ప్రీస్ట్ ఎప్పుడూ దైవంతోగాని జనులతోగాని చెప్పడు. అయినా ఈ శిశునుండి నిత్యకృత్యంగా మనసునరిలేదని చలంచేయ డానికి ఒక్క చిన్న అడుగువేస్తేచాలు" ఈ ఛలంమీది ద్వేషం (ఎమర్సన్ మినిష్టరీ వదలి రావడానికి ఇదే కారణం) ప్రీస్టు ఉద్యోగ నిర్వహణకు, అర్చనలో వృత్తిసంబంధమైన "నటన"గా కనుపించే మరి దేనికైనను ఈనాటికీ ఒక తీవ్రమైన అడ్డంకిగా ఉంటున్నది.

ప్రచారంచేసే మిషన్లకు, సువార్తాప్రచారకుల వేడికోలులకు ఏర్పడిన శక్తిని అమెరికనుల ఈ చిత్తవృత్తి వివరిస్తున్నది. బిల్లీగ్రహామ్‌వంటి మత ప్రచారకులు రేడియోద్వారా, పత్రికలద్వారా, లేది చర్చినధిగమించిన ధర్మోపన్యాసవేదికలద్వారా "బైబుల్ అధ్యయనమును" అధారముగా చేసుకొని స్వయంగా వ్యక్తిగతంగా "క్రీస్తువద్దకు రమ్మ" ని జనుల నుద్బోధింపగలుగుచున్నారు. చర్చి ఉత్సవాలుగాని మతవిద్యగాని ఈ మాత్రం

కూడా చేయలేకపోతున్నవి. పైవిధంగా జనులమనస్సు స్పృశించి చెప్పడం "ప్రాతకాలపు మతము" ను బట్టియే ఇప్పుడు జరుగుచున్నదనుట, ఇటువంటి మతప్రచారాన్ని ఇప్పుడు జనసామాన్యం పూజకంటె వినోదానికి సన్నిహితంగా చూచుచున్నదనుట గమనింపదగినసంగతి. ప్రాతకాలపు సువార్తలోని విషయమదే అయినా ఈ రోజుల్లో దానికే ఒక క్రొత్త అర్థమేర్పడుచున్నది. పురాతనవస్తువునకుండే విలువ ఒకటి దానికి వచ్చింది. అమెరికన్ ప్రజలలో ఇటువంటి మమకారము ఒక యథార్థమైనగుణం. మరి వాళ్ల అర్చనలోకూడా ఈ లక్షణం ప్రతిఫలిస్తుంది.

ముఖ్యంగా వ్యవస్థిత మతానికి చెందింది గనుక సాంప్రదాయకమైన అర్చనమీద నమ్మకము లేకపోవడం సాంఘికశాస్త్రజ్ఞులు చెప్పే "తెగల" లో కూడా ఉంది. తెగలకు పూజాపద్ధతులవసరము లేదు. ప్రత్యేకదర్శనమొకటి ఉండడంవల్ల వారు మామూలు పూజను దాటి వెళ్లుతున్నారు. వారు భగవంతునిచే ఎన్నికచేయబడినవారు, నిగూఢసత్యాన్ని ప్రకటించేవారు ఎహోవా సాక్షుల తరపున జడ్జ్ రూథర్‌ఫోర్డ్ "వ్యవస్థితమతం ప్రభువైన భగవంతునికి సంబంధించనిదిగా ఖండనకు గురిఅవుతున్న"దని ఉద్ఘాటించినాడు; "మతం క్రైస్తవమతానికి మారని శత్రువుగా తెలిసిపోయింది." క్రొత్తగా పుట్టినప్పటి క్రైస్తవమతంవలెనె భవిష్యంపలికే ఉద్యమాలు, రహస్యాలు "వ్యవస్థితమతాల" ను తిరస్కరించి దర్శనవిశ్వజనీనత నిస్తామంటారు. దీన్ని పరిగ్రహిస్తే సాంప్రదాయకమైన పూజ పనికిరానిదై పోతుంది. హఠాత్తుగా కలగుటవల్ల పుట్టిన ఈ ఉద్యమాలలో తరుచుగా సత్యదర్శనం చేయించుటలో చర్చిలు తృప్తిపరుపలేకపోవుటను గూర్చి చెప్పడంవల్ల అవి బహిరంగపూజా విధానంలోని చాలనితనానికి సమర్థమైన సాక్షులు కాకున్నా ముఖ్యసాక్షు లగుచున్నవి దైవపరినిష్ఠిత మనస్కుడగుటలో ఒక అంతఃస్థితమైన సహజమైన తీవ్రతఉన్నది. అమెరికాలో ఈ మతప్రాంతం ఇంకా సమసిపోలేదు. "వ్యవస్థితమతాన్ని" అస్లే సాధనచేయుట కిష్టపడేవారికి, పూజలుచేయుట కిచ్చగించేవారికి భగవంతుని విశ్వసించడానికి మతాన్ని విశ్వసించడానికి మధ్యఉన్న గొప్ప భేదాన్ని తెలియునట్లుగా చేస్తుంది ఇది.

పూజ అనేది సహజంగా అవశంగా పుట్టుకొని వస్తుందని, దానిని గురించి చదువుచెప్పితే ఆచదువు పూజను చెడగొట్టవచ్చునని ఒక విశ్వాసం

చాలాచోట్లఉంది. ప్రొఫెసర్ జోసీ ఇట్లా వ్రాస్తున్నాడు: "కన్యకయందు సౌందర్యం, దివ్యోత్సాహం, మనసెఱుగుట మొదలైన గుణాలు కన్పించి యువక హృదయంలో ప్రేమ ఒత్తుకొని వచ్చినట్లుగానే భక్తుని హృదయంలో అవశంగా పూజాభావము కలుగుతుంది...పూజాభావము లేకపోతే అది వానిమతంలోని గొప్పదోషం. పూజ విలువను నొక్కిచెప్పినంత మాత్రంతో ఆలోటు తీరదు." ఇది చాలవరకు యథార్థమే కావచ్చు. కాని "భక్తునిహృదయాన్ని" "యువకహృదయం" వలె ఆలోచనా రహితంగా ఉండనిస్తే పూజకూడ "సహజమైన" ఉద్రేకంవలె ఎక్కువై పోయి, "ఆరాధించే" యువకునిలోవలె అరాధనాభావం "రొమాంటిక్" గా తయారుకావచ్చుననే యథార్థవిషయాన్ని గమనింపకపోవచ్చు. ఒకవ్యక్తి ఒక మతసంబంధమైన వాతావరణంలో పుట్టినట్లయితే పూజ అనేది సాధారణంగా ఒక అలవాటుగా ("అవశం"గా కాక సాంప్రదాయకంగా) ఆరంభమౌతుంది. బుద్ధి పరిణతినొందినప్పుడు అలవాట్లన్నిటివలెనె ఇది కూడా విమర్శ దృష్టికి వస్తుంది. అప్పుడు దాన్ని పూజాభావంతో వెల కట్టాలిగాని, ప్రొఫెసర్ జోసీ నిర్దుష్టంగా వివరించినట్లు, "జీవితాన్ని సారవంతంగా చేసిందా లేదా" అనిగాని సాచ్ఛీల్యాన్ని గట్టిపరచిందా లేదా" అని గాని కాదు. కాని గెలివిగా పూజాభావాన్ని సాధనచేయ ప్రయత్నించడం ఆచరణసాధ్యంకాదని భగవతత్త్వంచేసే పనిలో మనం దైవభక్తిపీడి వేలుపెట్టినట్లవుతుందని అనేకుల విశ్వాసం. మమకారపూరితము వైయక్తికము అయిన సంప్రదాయంగల అమెరికనులకు కాల్రిడ్జి కావ్యంలోని చివరిపద్యం చాల పరిచితంగా ఉండడం చాల సహజమైన లక్షణముగదా:

> పెద్ద చిన్నన కన్నిటి పెరిమ జూచు
> వాడ చక్కగ ప్రార్థించు వాడు బొమ్మ
> మనల ప్రేమించు భగవంతుడెనని తాన
> అన్నిటిని జేసి ప్రేమించు నట్టివాడు.

మొదటిపద్యంలో ఏదో క్రొత్తదనం కనబడుతుంది;

> పెండ్లి విందుకంటె పెందీపుగానుండు
> అరయ చాల తీయనగునురనాకు

కలసినడచుకొనుచు నల చర్చికిని బోవ
తగిన సంగడంబు దనరగూడి!

భగవంతుడు తానే స్వయంగా ఒక నిర్దిష్టమైన అర్చనపద్ధతిని విధించి - బహిరంగప్రార్థనకు, సంస్కారాలకు, హోమాలకు విధింపబడి యుకారిస్టిక్ హోమంగా పరాకాష్ఠకువచ్చి దేవతాచర్య అయిన "దివ్యోద్యోగం"- అవధులేర్పరచినాడన్న నిశ్చితాభిప్రాయమొకటి ముఖ్యంగా కాథెలిక్కులలోను గ్రీకు ఆచారపరాయణులలోను కనబడుతుంది. ఇది చాల వేరువిధమైన నమ్మిక తమ పారాయణగ్రంథాలను దివ్యచర్యగా భావింపని లిటర్జికల్ చర్చీలుకూడా సంప్రదాయికరూపాల సెంతగా గౌరవిస్తారంటేవా పారాయణగ్రంథాల కళాదర్శాలు ముఖ్యంగా ఆచారపాతికంగానే ఉంటవి. విశ్వాసువులైన వారందరు అర్చన విధానాలన్నీ శాశ్వతంగా వ్యవస్థితములై పోయినట్లుగ భావించి వాటిని అనుసరించడం ఒక విధమైన మతభావాభివ్యక్తిగా కాక మతసంబంధమైన విధిగా చూస్తారు. దీనికి తోడుగా తంతులో ఏదో మహిమా లక్షణముందన్న సామాన్యజనుల నమ్మిక ఒకటి ఉన్నది. దీనితో అర్చనకు ఒక ప్రయోజనాత్మకమైన అంగీకారం ఏర్పడింది.

బహుశః వీటన్నిటికంటె తీవ్రమైన విషయం చక్కని అభిరుచి, కళాభ్యానము ఉన్నవారిలో అర్చనపద్ధతులు బొత్తుగా ప్రాతబడిపోయినవన్న భావం పెరుగుతూరావడం. చర్చీలు ఇట్లాఉన్నపుడు ఇటువంటి చర్చి వ్యతిరేకభావం పూర్తిగా సరిపోనితనంవల్లనో దుర్బుద్ధివల్లనో వచ్చిందనడానికి వీలులేదు. ప్రాత సారాయి క్రొత్తసీసాల్లో పోయడంవల్ల కలిగే ప్రయోజనమేమి? ఇక్కడ ఒక కొంచెం నవీనతామార్గమునకుచెందిన చర్చి నిర్మాణవాస్తువు. అక్కడ ఒక నవీన ప్రార్థనగీత, ఒక కొంచెం మతసంబంధమైన నాట్యమో అథవా రూపకమో, అరుదుగా "అంచులు తీర్చి కట్టిన సిలువ స్థానమో" - ఇలాంటివన్నీ సర్జనశీలతను విసర్జించి సౌందర్యాభివ్యక్తి రంగంలో లౌకిక కళలతో పోటీపడటం మానుకున్న చర్చి కార్యకలాపాల్లోకి కళాతత్త్వం కృతంగా వేలుపెట్టడమే అవుతుంది. ఈ శతాబ్దాల తొలిసంవత్సరాలలో ఉదారవాదులైన మతోద్యోగులలో అనేకులు ఇటువంటి సంశయభావంపొంది చర్చి ప్రార్థనలను ఆకర్షణీయంగా చేయడం మానుకొని సాంప్రదాయకమైన పూజకు బదులుగా నవీన విషయాలకు పోయినారు.

## పారాయణగ్రంథాలమీద ఆసక్తి పెరుగుట

ఇన్ని ఇబ్బందులున్నప్పటికి మతకళాకారులు (వారి నా పేరుతో పిలవ డాన్కి మీరనుమతిస్తే) పూజలలోని అంతరగుణవిశేషాని రసించగల మట్టాన్ని పెంచడంలోను, ఆచారతంత్రాన్ని మన సంస్కృతికి తగిన అభి వ్యక్తి రూపాలుగా పునర్నిర్మించడంలోను మంచి ఫలితాలే సాధించినారు.

అర్చనా పునర్నిర్మాణానికి మొదటి ప్రోత్సాహము విదేశాలనుండి వచ్చింది. కాథలిక్ సిద్ధాంతములోని లిటర్జికల్ ఉద్యమము ఆక్స్‌ఫర్డ్ ఉద్యమంనుండి డామ్ ప్రాస్పర్ గ్వెరెంజర్ కృషినుండి ఉత్సాహాన్ని స్వీకరించడంచేత ఒక శతాబ్దానికిపైగా ప్రాతది. ఆక్స్‌ఫర్డ్ ఉద్యమం చర్చివారు "క్రీస్తు యోగతనువుగా" "భగవంతుని సామూహికంగా ఆరాధించా" అని నొక్కచెప్పింది. రెండవది ప్రాన్సులో సొలెమీస్ కేంద్రంగా గ్రెగేరియన్ సంగీతాన్ని తక్కన ప్రాచీన లిటర్జికల్ రూపా లను, ముఖ్యంగా బెనిడిక్టైన్ మతాలలో, వ్యాపింపజేసింది. పోపు పోష కత్వంలో ఈ ఉద్యమం అమెరికాలో ఇరవయ్యో శతాబ్దంలో పాదు కొన్నది. దీని అమెరికన్ కేంద్రకార్యాలయం మిన్నెసోటా రాష్ట్రంలోని కాలేజ్‌విల్‌లోగల సెయింట్ జాన్‌గారి బెనిడిక్టైన్ అబీ. ఈ ఉద్యమానికి లిటర్జికల్ ఆర్ట్స్ సొసైటి (1930 లో ఏర్పరుపబడింది) వారి 'లిటర్జికల్ ఆర్ట్స్' అనే మేగజీన్, కాథలిక్ ఆర్ట్ అసోసియేషన్‌వారు ప్రచురించే 'ది కాథలిక్ ఆర్ట్ క్వార్టర్లీ' అనేది ప్రచారాన్నిస్తున్నవి. ఈ ఉద్యమంవల్ల రెండు ప్రత్యేకమైన లక్ష్యాలను కల్పించినవి. ఈ రెండూ కలగాపులగం కావడం ఏ ఒకటికూడా సిద్ధి సాధించడానికి ఒక అడ్డంకి కావచ్చు: అర్చనాభివృద్ధికి లిటర్జికల్ కళలను ప్రోత్సహించుట ఒకటి. రెండవది కాథలిక్ కళాకారులను, కళావిమర్శలో రసనలో కాథలిక్ ప్రస్థానాన్ని పోషించడం. ఈ రెండు లక్ష్యాల కలయికవల్ల పవిత్ర రూప కాల కళను పునరుద్ధరించే ప్రయత్నానికి దారితీసింది. పూజా వినోదాల ఈ కలయికల మధ్యయుగపు సంస్కృతిలో ముఖ్యమైన అంశాలు అను కోండి. ఈనాటి దుస్తులతో అవి మరల బ్రతికిరావడానికి కారణంలేదు. కాని ప్రస్తుతానికిమట్టుకు ఇవి కొంత జాలికల్గించే స్థితిలోనే ఉన్నవి –

అర్చనవచ్చి లౌకికమైన వినోదకళలతో పోటీపడేటట్లు చేయడం స్పష్టంగా కనబడిపోతూఉంటుంది. యుకారిస్టిక్ బలివిధానం నాటకీయంగా ఉంటుందనేది నిజమే; అర్చనలోకూడా అంతరమైన సౌందర్యలక్షణం ఉండాలనేది నిజమే; కాని లిటర్జీకి తగిన కళారూపాలను నాటకరంగ పద్ధతులతో కలిపి రెంటిని చెడగొట్టక నిలపడానికి గొప్ప ప్రతిభాశాలి కావాలి. లిటర్జీ లుండవలసిన విధంగా రూపకాలు "కఠినంగా సాంప్రదాయికంగా" మారినప్పుడు, రూపకసంగీత కాబోవుచున్నప్పుడు అర్చనకూడా అపెరాలాగ మారినప్పుడు ఫలితాలు మతవిషయకంగాగాని మెచ్చుగా ఉండవు. క్రైస్తవ మతంలోని సారాన్ని రంగస్థలంమీద ప్రదర్శించడానికి వాగ్నర్ ఫార్సిఫాల్ లో చూపినదానికంటె ఎక్కువ ప్రతిభగలవాడు కావాలి. (నీట్జీ దానికంటే సున్నితమైన ఉత్ప్రాప్తకావ్యంగా వాగ్నర్ ఉద్దేశించి ఉండవచ్చు). టి. యస్. ఇలియట్ వ్రాసిన మర్డర్ ఇన్ ది కెతెడ్రల్ స్ఫూర్తిమంతమైన మతరూపకం. ముఖ్యంగా చర్చిలో ప్రదర్శింపబడినప్పుడు. కాని దాన్నొక అర్చనారూపభేదంగా గ్రంథకర్త గ్రహించినట్లులేదు. నేనుచూచిన పాషన్ రూపకాలు(Passion plays) జానపదకళగా కొంత ఆసక్తికరంగానే ఉంటవి. కాని అవి జాలిగొలిపే "టాబ్లూ" లు కాని పాషన్‌రూపకాలు కావు. అయినప్పటికి ప్రచ్ఛన్న రూపధారణగల మాస్కులను, నృత్యాలను, చర్మవాద్యాలను, విషాద రూపకాలను, పాటకచ్చేరీలను ఇంకా తక్కిన వ్యక్తీకరణమార్గాలను అర్చనాపద్ధతులుగానో మతోత్సవాలుగానో ఉపయోగించడం సిద్ధాంత విషయకంగా సాధ్యముకాదని చెప్పవీలులేదు. కాని ఇటువంటి ఆచార రూపాలు అచ్చమైన సజీవసంస్కృతిరూపాలు క్రమంగా వట్టిపోవుటవల్ల రావలసిందేగాని, ఎంత ఆనందపరచే లక్షణమున్నప్పటికిని ఈ పురాతన ప్రాకృత రూపాలను తెచ్చిపెట్ట ప్రయత్నించుటవల్లరావు. మమకార సహితమైన అర్చనమీది తిరుగుబాటునుగురించి చెపుతూ ఈ సమస్యను డీన్ స్పెర్రీ చాల బాగుగా క్లుప్తపరచి చెప్పినాడు:

'వానిల్లా' వ్యతిరేకమైన తిరుగుబాటునకు సమయం అప్పుడూ మంచిదిగానే ఉండింది. ఇప్పుడూ ఉన్నది. మధ్యయుగపు పద్ధతులకు, లాటిన్ గ్రంథాలకు తిరిగివెళ్ళడమనే పరిచిత పరిష్కారమార్గము, చాల సులభమూ స్పష్టంగా కనిపించేదీ అయినా, ఈ సమస్య కంతటికి చాల తేలికైన

పరిష్కారమార్గంగా కనబడుతుంది. ఈ సంగీతాన్ని ఎన్నుకోవడంలో కొంతవరకు పండితులు సంగీతాభిరుచిని బాగుపరచడానికి చేసిన ప్రయత్నం వల్ల జరిగిందేమోనని అనుమానం కలుగుతుంది అభివృద్ధిక్రమంగారావాలి; అదెప్పుడూ ఒకసారిగా మారిపోవడంకాదు ఏమైనా మనకు తెలియజెప్పి మనను బాగుపరచాలనే పండితులప్రయత్నం మనము సిద్ధంగా అనుకొంటూ ఆలోచిస్తూ ఉండేవాటిని వ్యక్తీకరింపగల సమర్థమైన మార్గాలను వెదకే ప్రయత్నాన్ని అధిగమించి నడచినప్పుడు ఏర్పడుతున్న అర్చనకార్యం యొక్క స్వభావం సూక్ష్మంగా మారిపోతున్నది. మంచి సంగీతంపాడే చర్చికి పోవడంవల్ల కొంతకాలానికి నా సంగీతాభిరుచి అభివృద్ధి కావచ్చును చివర కటువంటి అభివృద్ధి ఒకటి ఏర్పడటం అనేది ఉన్నా మొట్ట మొదట నేను నా సంగీతాభిరుచిని వృద్ధిచేసుకోవడానికి చర్చికి పోవడంలేదు.

మతం ఎంతకళనైన వాడుకోవచ్చు. ఎన్నికళలనైనా వాడుకోవచ్చు. అర్చనాకళమాత్రం అది గొప్పగా సాధించిన విషయమే. మొత్తంమీద కాథలిక్ లిటర్జికల్ ఉద్యమం అర్చనలోని ఈ ప్రత్యేకతనుగూర్చి జనుల అభిరుచిని చక్కగా వ్యాపింపజేసింది, కాథలిక్ ఆచారాలు "మధ్య యుగాని"కి చెందినవనుకొనే వారిలోగూడా వ్యాపింపజేసింది. లిటర్జికల్ కళను సాధన చెయ్యడంలోఉన్న ఒకచిక్కు ఏమంటే పురాతనమైన ప్రాకృతమైన రూపాలమీది ప్రేమకలగటం మీ ది యే ట ర్ డె య్ శ్రీముఖం ఉద్దేశాలలో ఒకటి ఏమంటే "పఠా"నికి బదులుగా "మేజాబల్ల" వాడటం. దేశభాషలు వాడటంవంటి పురాతనపద్ధతులను పునరుద్ధరించ రాదని నిరసన తెలపడం. ఇంకోవైపు ఇటువంటి శాసనంవల్ల కేవలం సాంప్రదాయికమైన వ్యవస్థలకు ఉపకారముగానై లిటర్జికల్ కళయొక్క పురోభివృద్ధి చాలా ఇరుకుదారుల్లో పడుతుంది. స్వభావంచేతనే "పవిత్రీక రించే" కళ లౌకికకళలకంటే తక్కువ స్వాతంత్రముకలది. యధార్థంగా దివ్యవిస్ఫురణముగలవిగా భావింపబడుదానిని అది గౌరవింపకతీరదు. ఈ యధార్థవిషయం జానపదకళ. సదస్సుగాఏర్పడి గ్రెగీరియన్ కీర్తనల్లో పాల్గొనుట, జనరంజకములైన ఉత్సవాలు, తక్కిన సాంప్రదాయికమైన భక్తిమార్గాలు ముఖ్యములు కావలసియుండునని సూచింపబోవునట్లున్నది.

ఏమైనను ఈ సందర్భమున యవాంజలికల్ రిఫారమ్డ్ చర్చిలలో వచ్చిన గమనింపదగిన అమెరికన్ లిటర్జికల్ ఉద్యమాన్ని పేర్కొనవలెను. ఇది 1870 తర్వాతి కాలంలో వచ్చిన "మెర్సెల్స్ బర్గ్ ఆగమశాస్త్రం" ముకు (మెర్సెర్స బర్గ్ అకాడమీ, పెన్సిల్ వెనియా) కి సంబంధించి ఏర్పడినది. ఈ మెర్సర్స బర్గు ఆగమశాస్త్రం కొంతవరకు ప్లిమత్ సోదరులతో ఫిలిప్ షాఫ్ గారి పరిచయమున పుట్టుకొనివచ్చినది. నెలిన్స, షాఫ్, మెర్సెర్ బర్గ్ ప్రస్తానమునకుచెందిన ఇతర సభ్యులు సృష్టించిన విమర్శాత్మకమైన సర్జనశీలమైన పారాయణగ్రంథసంబంధమైన ప్రాధాన్యము కేవలము ఒక స్థానికమైన లక్షణముగా కనుపించినది. కాని గడచిన రెండు దశాబ్దములలో దీనికి కొత్తప్రాణమువచ్చి యవాంజలికల్ రిఫారమ్డ్ చెర్చిలలో సార్వత్రికముగా పారాయణగ్రంథముల అభివృద్ధిని ప్రోత్సహించినది. ఈ చర్చిలను దాటి కూడ ఇది వ్యాపించు అవకాశము ఉన్నది.

ఏపిస్కోపల్ చెర్చిలోని ఉన్నతచర్చి ఉద్యమముకూడ ఒక జపగ్రంథ సంబంధమైన ఉద్యమం. ఇది అమెరికాలోని ప్రాటెస్టెంటు చర్చిలకు అర్చనను గురించిన సంస్కారభావమును మరలతెచ్చి ఇచ్చుటకు సహాయపడినది, యునైటెడ్ స్టేట్సులో ఈ ఉద్యమచరిత్ర మనలను 19వ శతాబ్దపు తొలినాళ్ళలోకి బిషప్ హోబార్టు రోజులకు తీసుకొనిపోతుంది. కాని 1916 లో ప్రార్థన గ్రంథమును పునఃపరిశీలించుటకు ఏర్పరుపబడిన సంఘమువారు నిర్మాణాత్మకమైన జపగ్రంథ సంబంధమైన మార్పులను నొక్కి చెప్పినప్పటినుండి ఎర్బాడ్ చెర్చివారు హై చర్చివారితో సహకరించినారు. ఈ సహకారమువల్ల 1928 నాటి ప్రార్థన గ్రంథము తయారగుటయేకాక ఆగమశాస్త్రములో "ఉదార కాథలిక్" లక్షణము అన్నదికూడ ఏర్పడినది. ఈ చివరిదానిలో చారిత్రకవిమర్శ రంగములో నవీనతావాదమును అంగీకరించుట, అర్చన కళలో ఆచారకాండను అంగీకరించుట ఇమిడి ఉన్నవి. ఈవిధముగా ఈ కొత్త ప్రార్థన గ్రంథము సామ్స నుండి విమర్శాత్మకమైన ఎన్నిక చేసుకొని "సామ్స" గ్రంథములోని మరింత స్పష్టముగా అక్రైస్తవమైన భాగములను పూర్తిగా బహిరంగపూజలో ఉపయోగములోనికి రాకుండునట్లు ప్రయత్నించినది. ప్రార్థనసమయములో చదివెడి శ్రుతిఖండముల గ్రంథమునందు అపోక్రిఫాను మరింత ఎక్కువగా

ఉపయోగించినారు. ఈ అపోక్రిఫాను మంచి ప్రాటెస్టెంట్లు అందరు ఒక ప్పుడు గర్హించినారు. ఎపిజిల్స్‌లోనూ గాస్పెల్స్‌లోనూ కూడా అంతటను శ్రుతిగ్రంథమును గూర్చిన ఒక నిశ్చితమైన స్వాతంత్ర్యము ఉండినది. పాఠములను దిద్దుటగూడ ఎక్కువగానే జరిగింది" కాథెలిక్ బ్రెలియరీ (సంగ్రహగ్రంథము) లోని క్షమాపణపద్ధతిని కన్వెషన్ తర్వాత చేర్చినారు. "ఈ జీవితమును వదలిన నీ సేవకుల కొఅకు" అన్నప్రార్థనలను కలిపి "ఋషుల సంవాదము" వైపు మొగ్గు చూపించినారు. "దిహోలీ కమ్యూని యన్" అన్నచోట "ది హోలీ యుకారిస్ట్" అన్న శీర్షిక నుంచవలెనని కాథెలిక్ వర్గమువారు చేసిన సిఫార్సు త్రోసిపుచ్చబడింది. ఇట్లే "ప్రాటె స్టెంట్ ఎపిస్కోపల్ చర్చి" లో నుండి "ప్రాటెస్టెంట్" తీసివేయవలెనని తరుచు వచ్చిన అభ్యర్థనలుకూడా త్రోసిపుచ్చబడినవి. కొంద ఎపిస్కొ పలియన్లు తమ కాథెలిక్ ఉత్సాహంలో రోమన్ కాథెలిక్కులకంటే ఎక్కువ ఉత్సాహముచూపి అనుగ్రహ "సాంఘిక" మార్గములను లేదా సంస్కారములను సమర్థించినారు. ఇట్లు థియొడోరే వెడెల్ వ్రాస్తు న్నాడు: "హోలీస్పిరిట్ ఇప్పటినుండి వ్యక్తికి చెందినవాడుగాక సంఘము నకు చెందినవాడు. ఈ బిందువునుండి చర్చి, హోలీస్పిరిట్ అవినాభావ సంబంధముగలవి ... సంముగాకూడిన ఈ జనన సమాజముకాక హోలీ స్పిరిట్ ఇచ్చిన వరదానమెమియు లేదు."

అర్చనలోను చర్చి పరిపాలనలోనుగల అపాసలిక్ ప్రామాణికసిద్ధాంత మును ఏపిస్కోపలియనులు బైబుల్, ఆగమశాస్త్ర సిద్ధాంతములలోని ఆధునిక ఔదార్యవాదంతో కలుపుట చాల తెగలలోని ప్రాటెసెంట్ ప్రీస్టులకు జనరంజకమైన ఒక పద్ధతిని ఏర్పరచినది ఈ ప్రీసులు క్రైస్తవ సంప్రదాయమునకు, భవిష్యసందేశము కాని దివ్యవాక్ప్రామాణికతనుగాని అభినయించకుండ ఒకపాటి అభిప్రాయాలను చెప్పడానికి ధర్మోపన్యాస వేదికను ఉపయోగించుకొను స్వాతంత్ర్యమునకు వ్యక్తీకరణముగా లిటర్జీని ఆహ్వానించేవారు. దీనివల్ల "భగవద్ వాక్కు" నకు సాధారణముగా ధర్మోపన్యాసములలో తక్కువైన వ్యక్త్యతీతమైన గాంభీర్యము, ప్రామాణి కత వస్తుంది. సాంఘికసిద్ధాంతములనుగూడ పారాయణ వాఙ్మయ సంబం ధమైన ప్రకరణములో పెట్టుటకు ప్రయత్నము జరిగినది. ఇదికూడ రోమ్ కంటె మరింత కాథలిక్‌గా ఉండటమే. ఇట్లు ఎపిస్కోపల్ చర్చిలో

"కాథలిక్ లిటర్జికల్ వింగడింపును లౌకిక, ఆర్థిక క్రమములకు అమలు పరచు" ఉద్దేశముతో ప్రీస్టులు లౌకికులుకల కాథలిక్ కామన్ వెల్త్ సొసైటీ 1౯౩౯ లో స్థాపించబడినది.

ఇంతలో మెథడిస్ట్ చర్చి తన స్వంతరకపు లిటర్జికల్ పునరుద్ధరణ జరిపినది, ఇది అవతారపురషక్రమమును ఒక చర్చి ప్రభుత్వపు సిద్ధాంతముగా ప్రజాస్వామికమైనది. అదేసమయములో మెథడిస్టులు యాంగ్లికన అర్చనమార్గములో లేదా వారే అన్నట్లు వెస్లన్ "అనాది" మెథడిజమ్ మార్గములో ఒక కొన్ని పిరికిప్రయత్నాలు చేసినారు. 1916 నాటి జనరల్ కాన్ఫరెన్సు కమ్యూనియన్ సర్వీసులో సామూహికంగా పాల్గొనడం మరింత అధికం కావలెననియు, సూత్రములను నిష్కర్షగా పాటింపవలెననియు, కోరినది. 19౩౨ లో "దిలార్డ్సు సప్పర్" అనుదానికంటే "కమ్యూనియన్" అను మాట పరిగ్రాహ్యాముగా భావింపబడినది. ఆదాని క్రియను, "ఆయన (క్రిస్తు) ద్వారా దివ్యప్రకృతిలో పాలుపంచుకొనుట" అని నిర్వచింపబడినది 1944 లో బుక్ ఆఫ్ వర్షిప్ ఫార్ చర్చ్ అండ్ హోమ్ ను చాల విస్తరిల్లచేసి ప్రార్థనా పుస్తకమునకు సన్నిహితమగునట్లు చేసినారు. ఈమధ్యలో పెద్ద చర్చిలలో సంగీతము, దుస్తులు, ప్రార్థనక్రమము రానురాను ఎక్కువ ఆచారకాండను పెంచుకొనుచు వచ్చినవి.

రోమన్ కాథెలిక్ చర్చివారు ఇప్పుడు పూజలో ఎవాంజలికల్ ప్రాధాన్యానికి మొగ్గుచూపుట, ఎవాంజెలికల్ చర్చిలలో ఇప్పుడు పారాయణ సాహిత్యంవైపు చూపుతున్న మొగ్గు అనేవానిలో ఒక చిత్రమైన విరోధాభాసము కనుపిస్తుంది. వారు పరస్పర మొకరినుండి ఒకరు నేర్చుకొనుట కావచ్చును. లేదా అమెరికన్ జానపద రీతులకు సంబంధించిన జనరంజకమైన అభిరుచులకు లొంగిపోవుటయైన కావచ్చును. కాని ఆచారపాటికులైన సాంప్రదాయిక సదరన్ బాప్టిస్ట్ జనసమాజంమీదికి హఠాత్తుగా ఫ్రాన్సిస్కన్ సెమినరీల చనువ "ది బాట్ డోర్ అపాస్టొలేట్" "ఎవిడెన్స్ గిల్డ్" "మోటార్ పుల్ పిట్" అథవా "కాథెలిక్ కాంపెయినర్స్ ఫర్ క్రైస్ట్" అనేపేరు కాగితాలు అతికించిన మోటారు ట్రెయిలర్లలోనో లేక ట్రక్కులలోనో వచ్చిపడే దృశ్యాన్ని చూచి చరిత్రకారుడు చిఱునవ్వు నవ్వితీరుతాడు - వారిలో కొందరు తాము "మార్క్సు నుండి

క్రీస్తుకు మతం మార్చుకొన్నవాళ్లమ" ని ప్రచారం చేసుకుంటారు. వీరంతా బజారు మీటింగులుపెట్టి, మతవిషయకమైన లఘువ్యాఖ్యా గ్రంథాలు పంచిపెట్టి, నిజమైన సువార్తవినుటకు ఆకలిగొన్నవారికి "సమాచారం" అందజేస్తారు. ప్రాత మెథడిస్ట్‌ను బైబిలీయ నిరాడంబర సుదినాలను స్మరింపజేసేటంత అచ్చమైన గ్రామీణమైన మతప్రచారాన్ని నేను కాథలిక్ ధర్మోపన్యాస వేదికలనుండి విన్నాను - అట్లే బాప్టిస్ట్ గాథిక్ కాథెడ్రల్‌ను కాథలిక్ "వలస" సమావేశగృహాన్ని ప్రక్కప్రక్కనే చూచినపుడు చరిత్రకారుడు తప్పక సన్నగా నవ్వుకొంటాడు.

మౌనపూజ క్రమాధికంగా బహిరంగ ఆచారకాండగా రూపొందుతూ మన్ననగొన్నది. "ప్రభువు ఎదుట నిశ్శబ్దంగా" ఉండడమనే క్వేకర్‌పద్ధతి మీది గౌరవం సొసైటీ ఆఫ్ ఫ్రెండ్స్ (మిత్రసంఘం) అవరణదాటి చాలా దూరంగా వ్యాపించింది. ముఖ్యంగా కళాశాలా జనసమాజాల్లో, అన్ని తెగలవారూ కలిసే సర్వీసులలో, సాంప్రదాయికమైన ఆచారకాండ ఆచారణసాధ్యంకాని అథవా ఉచితముకాని సమయాలలో కొంచెము సేపు "మౌన ప్రార్థన" తరుచుగా వాడకానికి వస్తుంది. ఈ ప్రార్థనారూపంవల్ల నోటితోచెప్పకోలేని స్థితిని ఒప్పుకుంటున్నామనిగాని, వైవిధ్యాన్ని సూచిస్తుందనిగాని విధిగా చెప్పలేము. కాని మాట, బొమ్మ, సంగీతం వ్యక్తము చేయగలదానికంటే ఒక్కొక్కసమయంలోని భావసంబంధమైన విషయం ఎక్కువకావచ్చునని స్పష్టంగా ఒప్పుకోవడంకావచ్చు. యోగసంబంధమైన అయోగసంబంధమైన వాదములు రెంటిలోను అర్థగాంభీర్యము, అసంవాధితకూడ జతగా ఉంటాయి. ఇంకొకవైపు, మౌనానికి పాల్పడుటవల్ల చిక్కులుకూడాఉన్నవి. డాక్టర్ ఫెలిక్స్ అడ్లర్ చూపి చెప్పినట్లు: "తమ ఆలోచన వ్యక్తీకరణకు అతివిస్తరం కావడంచేత గొప్ప భావుకుల మౌనంగా ఉండవచ్చు. కాని లోకంలో ఒక అభిప్రాయానికి సంబంధించి మౌనమే విధిగా పాటింపబడితే ఆ అభిప్రాయం అప్పుడిక పూర్తిగా నశించిపోతుందని మీరు నిశ్చయంగా అనుకోవచ్చు."

## మతసంబంధములైన నిర్మాణవాస్తు, సంగీతములలో మార్పులు.

చర్చి నిర్మాణ వాస్తువులో వచ్చినమార్పులు అర్చన కళాసాధనను ప్రతిబింబిస్తున్నవి. (చూడు ఎగ్జిబిట్. బి). మతంతో సంబంధంలేక నిర్మాణ కళలోవచ్చిన మార్పులను ప్రతిబింబించే మార్పులు కొన్ని ఉన్నవి. మతమునకు సంబంధించిన భవననిర్మాణంలో ఆధునిక వస్తుసామగ్రి నిర్మాణ రూపాలు వాడుట ఆరంభమైనది. కాని సామాన్యంగా "దివ్యపరికాస్తి" గల రూపాలు పవిత్రమతకళలో చాలకాలము జీవించి నిలుచుట సహజము. ఆధునిక భావప్రవాహాన్ని ఏకారణంచేత అడ్డుకొంటున్నారో ఆ కారణంచేతనే ఆధునికమైన రూపురేఖలనుగూడ అడ్డుకొంటారు - అవి శ్వాసితాభయం. కాని కడచిన దశాబ్దాలలో కొన్ని ఆధునిక చర్చీలు కట్టబడినవి. రెక్స్‌ఫర్డ్ న్యూకొంబ్ చెప్పుతున్నాడు:

1900 నాడే కాలిఫోర్నియా రాష్ట్రంలో బెర్కిలీలోని యూనివర్సిటి యన్లకు బెర్నార్డ్ మేబెక్ ఒక విశిష్టమైన మౌలికమైన చర్చిని నిర్మించినాడు. ఒక ఆరేండ్లతర్వాత ఒక పార్కులోని ఫ్రాంక్ లాయిడ్ రైట్‌గారి యూనిటి టెంపుల్ ఏర్పడింది. దీని వెనువెంటనే రైట్, అతని శిష్యులైన బ్రూస్‌గాఫ్, బారీబిర్నలు నిర్మించిన వేరుకట్టడాలు వచ్చినవి. రైట్ శిష్యులిద్దరు ఆధునికచర్చి రూపురేఖలను తీర్చి దిద్దుటలో గమనింపదగిన కృషిచేసినవారు. అధునికపద్ధతిలో తీర్పబడిన అమెరికన్ చర్చీలలో మరింత ఆసక్తిగొలిపేవి ఒక్లహామా రాష్ట్రంలో టుల్సాలోఉన్న బోస్టన్ అవెన్యూ మెథడిస్ట్ చర్చి (1929). గాఫ్ నిర్మించింది; టుల్సాలోని చర్చి ఆఫ్ క్రైస్ట్ ది కింగ్ (1930), మొ॥ రాష్ట్రంలో కెన్సాస్ సిటీలోని సెంట్ ఫ్రాన్సిస్ జేవియర్ (1948), అయోవాసిటీలోని సెయింట్ థామస్ మోర్ (1948), ఇది బిర్న నిర్మించినవి. ఇండియానా రాష్ట్రంలో కొలంబస్‌లోగల టాబర్‌నాకిల్ చర్చి ఆఫ్ క్రైస్ట్ (1940) ను ఎలియల్ సారినెన్ నిర్మించినాడు. పెన్సిల్‌వేనియా రాష్ట్రంలో లాట్రోబీలోని సెయింట్ విన్సెంట్స్ ఆర్చిఅబీ (1948) ని ఎమిల్ ఫ్రెయ్ నిర్మించినాడు.

కాని శైలిలో కొన్ని మార్పులు వచ్చినవి. మతవిషయక పునర్నిర్మాణమునకు ఫలములుగా వచ్చిన వివి. ఈ శతాబ్దపు తొలసంవత్సరాలలో

పెద్దవైన సంస్థా చర్చిలవృత్తి అవసరాలనుబట్టి ప్రార్థనసదస్సుకు వచ్చేడి వారి వివిధ కార్యకలాపాలకు - విద్యా, వినోద, సంఘసేవా కలాపాలకు - చోటుచేయవలసివచ్చింది. దీనికి ఫలితంగా ఒకరకమైన భవనం పుట్టింది. ఒక ముఖ్యుడైన మినిష్టర్ ఈ రకమైన భవనాలనుగూర్చి "చర్చి అన్న పేరుతో పిలువబడే మన ఆధునికమైన, అంచులుతీర్చిన, మోటారు బండ్లసాలల" న్నాడు. ఇది "మన సంఘంలోని సంస్కృతికి లౌకికత్వానికి ఎట్లు చర్చి కొన్ని నియమాలుపెట్టి లొంగిపోతున్నదో మరొక సాక్ష్యం" ఇస్తున్నవి ఈ భవనాల ప్రధాన లక్షణగా ఒక ఆడిటోరియం ఉండేది. ఇది నాటకశాలవలె ఉంటుందిగాని వేదికకు ముఖంచేసి ఆసనాల వంకరవరుసలకు బదులుగా వంకర బెంచీలు ఉపయోగింపబడినవి. వేదికమధ్య పుల్ పిట్, మూడుకుర్చీలు, ఒక పైప్ ఆర్గన్, (తలటోపి మట్టానికి క్రిందుగా తెర చీరలు మూసిన) గాయకమేళమువారి ఆసనాలు. పుల్ పిట్ కు క్రిందుగానో వెనుకనో ఒక చిన్న పీఠమో లేదా కమ్యూనియన్ టేబుల్. శ్రవణశాలకు చుట్టును అధికారపుబడినడిపే తరగతిగదులను వేరుచేయుటకు అథవా మంది ఎక్కువైనప్పుడు ఉపకరించడానికో జారుడుతలుపులు. అడుగుభాగాన, గోపురంలో, లేదా భవనానికి వెనుకవైపు - లేదా ఈ మూడింటిలోను - క్లబ్ గదులు, వంటసాల, భోజనశాల, సాముగరడి, రంగస్థలం. కార్యాలయాలు, వగైరాలు.

ఇటువంటి భవనాలు ఇప్పటి శైలికాదు. వాటిని ఇప్పుడెవరూ ఆదరించడంలేదు. చక్కని క్రమము ఏర్పరచబడిన ప్రార్థన సదస్సుకు ఈ ప్రత్యేక భవనాలుంటవి: పూజకొరకదేవాలయము, ఒక పారిష్‌గృహమో లేదా ఆ కార్యకలాపాలకు తత్సదృశగృహమో, క్రీస్తుగాని మినిష్టరుగాని నివసించేటందుకు రెక్టరీ అథవా పార్సనేజ్. దేవాలయాలు సమావేశ స్థానాలుగా, దైవచిహ్నములెత్తిన చిత్తశుద్ధిగల, స్పష్టంగా కనుపించేచోట్లు అయినవి. నిర్మాణవాస్తువునకు సంబంధించిన విద్వాస్సభలలో అంతకు మునుపు పునరుద్ధరింపబడిన గాథిక్ శైలి ఇప్పుడు చాల జనరంజకమైన ముఖ్యంగా ప్రాటెస్టెంట్లలో స్థాయినిపొందింది. ఇది సంస్కరణ జూడాయిజమ్ మీదకు (న్యూయార్క్ అయిదవ అవెన్యూలోని టెంపుల్ ఎమోన్యుయల్ చూడు), పెన్సిల్ వేనియారాష్ట్రంలోని బ్రిన్ అథన్‌లో

స్వీడెన్‌బర్గోనియన్ కమ్యూనిటీ మీదకుగూడ విరచుకపడింది. కనీసం ఒక ఇరవై గాథిక్ స్మారకనిర్మాణాలైనా ఈమధ్య కట్టబడినవి. మొన్న మొన్నటి గాథిక్ పునరుద్ధరణ నిర్మాణవాస్తు, సిద్ధాంతస్వరూపములకు రాల్ఫ్ ఆడమ్స్ క్రామ్ నాయకుడు. అక్కడక్కడా ఒక కొంచెం రోమనెస్క్, బిజాంటైన్ పద్ధతులు తలదూర్చినవి. (న్యూయార్క్‌లోని మెథడిస్ట్ "క్రైస్ట్ చర్చి" గమనింపదగినది) క్రైస్తవచరిత్రలోని భగవదర్పిత శైలులకిట్లు తిరిగివచ్చుట లిటర్జికల్ ఉద్యమంలో ఒక భాగమే ననుకొండి. పీఠాలు, తెరపిడైనగర్భగుడులు, మచ్చలగాజు, శిల్పాలు, తదితరములు పారాయణవాఙ్మయాన్ని చాల కొద్దిగా వాడే ఔదార్యవాదులుకూడా అంగీకరించినారు.

దీనితో లిటర్జికల్ సంగీత పునరుద్ధరణకూడ వచ్చింది. క్వార్టెట్లు (నాలుగు వాద్యాలుగాని నలుగురు గాయకులుగాని పాడేపాటలు) పోయి అచ్చమైన బృందగానం (కాయర్) వచ్చింది. అర్ధలౌకికములైన ఆపెరా పాటలవంటి సంకీర్తనలు పోయి పవిత్రసంగీతంవచ్చింది. చర్చి సంగీతపు స్థాయి, ప్రాటెస్టెంట్లకు కాథలిక్కులకుకూడ, పోప్ పయస్ X గారి మోటు ప్రియయో శ్రీముఖంలో నిర్వచింపబడిన స్థాయికి సన్నిహితంగా వచ్చిందిప్పుడు: సంగీతం "నిజమైనకళ" గా "పవిత్రమైనది" గా "విశ్వజనీనం" గా ఉండవలెను. "ఇతర జాతికిచెందిన ఎవరుకూడ ఈ పాటలు విన్నప్పుడు మంచితప్ప తదితరభావం కలుగకుండు" నట్లుగా సంగీత స్వరూపాన్ని "పవిత్రసంగీతము సామాన్య లక్షణాలకు" లోగి ఉండేటట్లు చేయవలెను. సామాన్యమైన అమెరికన్ గాయకబృందంవారి పాట "బాగుంద"నలేము. కాని ఆచారకాండకు తగిన సంగీతం పాడ ప్రయత్నిస్తే ఒక "సదభిప్రాయమై" నా కలగవచ్చు. సరిక్రొత్త సంకీర్తన గ్రంథాలనుండి మమకారపూరితమైన "సువార్తా సంకీర్తనలు" తీసివేయబడినవి. ప్రొఫెసర్-ఆర్చిబాల్డ్ టి. డేవిసన్‌గారి సూత్రధారికక్రింద హార్వర్డ్ హిమ్నల్, గాయకబృందంవారు ఒక అతినిష్ఠురమైన, కొంచెమించుమించు గ్రెగోరియన్, స్థాయిని, తయారుచేసినారు. ఈ ప్రమాథాలు యధార్థానికి చాల కఠినముగా మమకారభావ వ్యతిరేకముగా నుండుటవల్లనే మమకారభావపూరితులైన జనసందోహంలో దానికి పరిమితమైన అంగీకారము

ఆచరణ లభించినవి. కాని ఇవి విషయము "విశ్వజనీనము" అయిన దాని వైపు పోయే తీరునకు పొరబాటులేక కన్పించే ఆరంభానికి గుర్తులు.

ఈ మధ్యలో ఇట్టి "వ్యవస్థితమతం" సరిపోని తెగలు గుంపులు తద్వ్యతిరేకతాంచలాలకు పోయినారు. ముఖ్యంగా మన పెద్ద పెద్ద నగరాల్లో "అంగడిముందు" చర్చీలు, సువార్తా మిషన్లు, అర్చనస్థలాలు పుట్టగొడుగులవలె వెలసినవి. వీటిలో అంతటా ప్రాతకాలపు మతవ్యవహారము అంతా కసితీర్చుకుంటున్నట్లుగా జరుగుతున్నది. సువార్తా సంకీర్తనలు, మమకారపూరిత మతగేయాలు - "సమగ్ర సువార్త" ఎవాంజలిస్టులు అలంకారికంగా, భావోద్రేకపూరితంగా ప్రచారానికి పాటుపడుతుండగా - ఇక్కడ వర్ధిల్లుతున్నవి.

ఈ అర్ధశతాబ్దంలో అర్చనకు ఏమిజరిగిందనేది క్లుప్తంగా చెప్పితే శతాబ్దపు తొలిరోజుల్లో అర్చనలోఉండిన సామాన్యతాలక్షణం మరికొంత మెరుగుదనానికి మరికొంత తరుగుదనానికి అవకాశమిచ్చింది. రస్యమానతా సంబంధమైన ఈ అతివాదాల అడుగున వర్గభేదాలేమైనా ఉన్నవా అనేది తర్కింపదగిన విషయము ఇందులో కళకు సంబంధించిన సామాన్యమైన సాంఘికశాస్త్రము, విద్య అనేవికూడా ఇరుక్కుంటాయి.

లక్ష్య మమకారవిషయాలమధ్య రేఖలు స్పష్టంగాలేవు. ఉదాహరణకు క్రొత్తగావచ్చిన ఎపిస్కోపల్ సంకీర్తనగ్రంథంలో "పిల్లల కీర్తనల" మధ్య ఉన్న ఒక "కీర్తన" ను ఒక అమెరికన్ రాగనిర్మాత (జాన్ హెన్రీ. హాప్కిన్స్, 1940) తేలికదనమైన ఉత్సాహం ఉట్టిపడే పాటవంటి రాగానికి ఎక్కించినాడు. దానిని "ఊర్జిత" కంఠంతో పాడవలెనని గుర్తించినారు. ఇది బాగా జనరంజకంగా అయింది. అమెరికన్ సంస్కృతిలోని హుషారైన, ప్రజాస్వామ్యతత్వాన్ని అనేకవిధాల ప్రతిఫలింపజేస్తున్నది. (చూడు. ఎగ్జిబిట్ XVII). అసెన్షన్ డే తర్వాతి ఆదివారంనాడు లిటర్జికల్ ఉదయప్రార్థన సందర్భంలో ఒక ఎపిస్కోపల్ ప్రీస్టు పిల్లలకుచేసిన ధర్మోపన్యాసాన్ని నేను వినడం ఈ సందర్భంలో స్మరిస్తాను. అసెన్షన్ అనేది మతపంచాంగంలో చాల ముఖ్యమైన విందు అని వివరించి "పిల్లలార, అసెన్షన్ మనకు బోధించే పాఠమేమంటే పైన మనకెప్పుడూ చోటు ఉందని" అంటూ ముగించినాడు. పోపు నవీనతను ఖండించినప్పుడు ఆయన మనస్సులో ఇటువంటి నవీనతాభావమే ఉండిందనడం నిస్సంశయం. కాని

వర్జిన్ శరీరము ఆమె ఆత్మతోకూడా స్వర్గమైన భగవత్సాన్నిధ్యంలో ఉండడం ముఖ్యమంటూ "స్వర్గంలో శరీరాలు" అన్న భావాన్ని పూర్తిగా ఒక అర్థంకాని విషయంగా విడిచిపెట్టి వివరించినపుడు పోప్‌లుమాత్రము ఏమంత నిగ్రహస్థానం లేకుండా మాట్లాడినారనలేము -

## అర్చనా సిద్ధాంతాలు

లిటర్జికల్ ఉద్యమాలు తమకు తామె "స్వాభిప్రాయపద్ధతి"కి వచ్చినంత వరకు తప్ప తక్కిన చోటంతా ప్రజాసముదాయంలో బహిరంగపూజ, ఆచారభయం అనేవానిపట్ల ఉండిన పురస్సిద్ధాంతాలను చాలవరకు అధిగమించినది. ఆచారాలు అర్థవంతంగా ఉన్నపుడు వట్టి బుర్రలకుగాని శ్రాంతాత్మలకుగాని బురఖాలు కానక్కరలేదు. అమెరికన్ సంస్కృతిలో పాదుకొనిపోయిన మరొక సరిపోనితనాన్ని గూడ - బిహిరంగపూజ సర్వీసు 'లకంటె నిత్యముచేసే సర్వీస్' కృషియే ఘరింత భగవద్యోగ్యమైన సర్వీస్ అవుతుందనే భావం - అధిగమిస్తున్నారు. నా స్నేహితుడైన తాత్త్వికుడొకాయన తాను "కృషికత్వ సువార్త" అనే దానిని ప్రచారం చెయ్యడానికి శ్రద్ధగా పనిచేస్తున్నాడు. తలతంతునడిపిన ఔదార్యవాదులలో ఒకరై "ధ్యానజీవితము" ను ఆధునిక మనస్తత్వ శాస్త్రపరిభాషలోను, విలువనుగూర్చిన సిద్ధాంత పరిభాషలోను అర్థమగునట్లుగా చెప్ప ప్రయత్నించిన జార్జి ఆల్బర్ట్‌కో "ఆదివార మెంత పవిత్రయో సోమవారమూ అంతే పవిత్రమైనది. ఎందుకంటే మనకాలమంతయు భగవంతునిది; ... జీవితవిధులను చేతితోగాని మనసుతోగాని చేయడం ప్రార్థనతో సమానంగా మతంలోకివచ్చేదే." 14 అన్న సిద్ధాంతాన్ని చాటినాడు, ఇట్లే డీన్ స్పెర్రీ లెబోరరె ఎస్ట్ ఒరరె అనే ప్రాత నానుడిని అంగీకరించి ఉదాహరించినాడు. తన అంగీకారాన్ని ఆయన ఈ విధంగా విశిష్యం చేసినాడు:

కృషి జీవితంతో - ఎడబాయక ఉన్న అర్చనకార్యం మనుష్యుల పరస్పర సహాయకార్యాలు పలురకాలనుండి గుర్తింప వీలైనకార్యం. మానవసౌభ్రాత్రాన్ని పాటించడం భగవంతుని పితృత్వమునందు విశ్వాసమున్నదని చెప్పుకోవడంవల్ల తప్పనిసరిగా కలిగే ఫలితమనియు, దాన్ని పాటించకపోతే ఆ విశ్వాసం వ్యర్థము మృతమనియు క్రైస్తవమతము భావిస్తున్నది. కాని భగవంతుని దివ్యపితగా చెప్పడం ఊరక చేసిన, మనము

కష్టంలేకుండా వదలించుకోగల, వట్టి అబద్ధపుచర్య అని దీని కర్థము చేయ రాదు. ఇంతమాత్రమేకాదు. మానవ సౌభ్రాత్రముమీద మొగ్గు, ఆచరించు సంకల్పము భగవంతుని తండ్రిగా నిరంతర మారాధించుటమీద ఆధారపడి యుండునని క్రైస్తవమతము చెప్పుచున్నది. మనుష్యులు భగవదారాధనము మానుకొన్నచో మనుష్యులలో సౌభ్రాత్ర వర్తనమునకొక గొప్ప ప్రోత్సాహ కారణమును తీసివేసినట్లగును. ఎందుకనగా పరస్పర సౌలభ్య మునకుగాని అధికసంఖ్యాకుల అధిక శ్రేయమునకుగాని ఏర్పరచుకొన్న సాంఘికమైన ఒప్పందాలకు సర్వమానవపితగా భగవంతుని భావించి ప్రేమించుటలోని చోదకశక్తిలేదు.

మానవుని ఆత్మకు స్వదేశసంకేతంగా, మానవులు ఎల్లవేళల భగవంతుని విశ్వజనీన పితృత్వభావమునందలి తమ విశ్వాసమును పునః పునః స్పష్ట ముగ చెప్పుటకొక ఇంటిని తెరచిపెట్టి ఉంచుటతప్ప చర్చి లోకానికి మరిం కేమియు చేయకపోయినను అది సంఘవ్యవస్థకు సాధ్యమైనంత గొప్ప సేవయే చేస్తున్నది. అది సంఘానికిచేసే ఏ యితర సేవకూడ ప్రాము ఖ్యంలో దీనికి సరిరాదు.

పనికి పూజకు మధ్య "పర్యాయసూత్రము" ను విలియమ్ ఎర్నెస్ట్ హాకింగ్ ఒక సాధారణమైన తత్త్వసిద్ధాంతముగాను అర్చనా సమర్థకమైన వాదంగాను చాల సమగ్రంగా అభివృద్ధి చేసినాడు. తన ది మీనింగ్ ఆఫ్ గాడ్ ఇన్ హ్యూమన్ ఎక్స్పిరియన్స్ (1912) (మనుష్యానుభవంలో భగవంతు డన్నదాని కర్థం) అను గ్రంథంలో ఒక క్రొత్త యోగరహస్య సిద్ధాంతాన్ని స్థూలంగా నిర్మించి యోగరహస్యానుభవాన్ని అర్చనకు అతుకువేసినాడు. సాధారణమైన నిత్యానుభవంలో మనము వివరాలనో "అంగాల" నో చూచుకుంటాము; అర్చనలో మనదృష్టి "సమగ్రమైన దాని" మీదకు మారుతుంది. మనము భాగాలనుబట్టి చూడడంలోనే ఈ సమగ్రతాభావం ఇమిడిఉన్నదిగాని పనిచేస్తున్నప్పుడు మనకది స్పృహలో ఉండదు.

మనము ఏదో ఒక భాగాన్నో, భాగాలనో శ్రద్ధగాచూచే నిత్యకృ త్యంలో తన్నుతాను పరాజితం చేసుకొనే లక్షణమొకటి ఉండుటవల్ల భాగాలను గురించిన దృష్టిని పూర్తిగా వదలిపెట్టి మతం నిర్బంధించు నట్లుగా సమస్తాంగములకు భిన్నమైన పూర్ణత్వమునకు తిరిగి కావలసి

యున్నది. అల్లే సమగ్రమైన దానిమీదనే దృష్టినిలిపే నిత్యకృత్యంలోని శ్రద్ధకూడ తన్నుదాను పరాజితం చేసుకోవడాన్నిగురించి కొంత విషయ మున్నది భాగాలనుగురించి పట్టించుకుంటేనే దానిఫలంరాదు. అందుచేత మన ఈ నశ్వరజీవిత మీ రెంటిమధ్య ఊగుతూ ఉండవలసిఉంది...

"పరిమితికి లోబడిన మన పరిస్థితి" వల్ల మనలోని జ్ఞానరూపుడు ఇందులో ఇరుక్కోకపోయినా మన క్రియాచణజీవాలు వదలించుకోలేని ఇబ్బందిలో పడిఉన్నాము. ఆ కాంక్ష, విధి, తెలిసి స్వాతంత్ర్యాన్ని ఉపయోగించుకొనుట, అన్ని పనులు కూడ తనంతకు తానే ఒక ఆంతర వ్యతిరేకపక్షాన్ని, ఒక తాత్మిక నిగ్రహాన్ని ఏర్పరచుకుంటవి. ఎందుకనగా కృతకాత్మ (జీవుడుకు) తనకువచ్చిన ఊహాలతో, వస్తువులతో చేరి ఏకతానుడైనపుడు ఈ సందు పోవడమనేది పూర్ణతాభావానికి క్రమంగా దారిద్ర్యాన్ని తెచ్చిపెడుతుంది. ఈ పూర్ణతాభావాన్ని వాడు కొనుటవల్ల సమస్తవిషయములకు వాటికున్న విలువ నిస్తుందది. నా వివిధ నిత్యకృత్య కార్యకలాపాలు చక్కగా జరుగవలెనంటే నా కార్యకలాపాల వివిధాంగాలు తమ యోగ్యతను నిలుపుకోవాలి. అవి తమ యోగ్యతను ఆసక్తిని నిలుపుకోవడానికి నా పరిపూర్ణతాదృష్టి నా కార్యకలాపాలన్నిటిలోను చురుకుగా పనిచేయవలెను ... పరిపూర్ణతా భావము యొక్క సహజమైన ఊర్జస్వితను మరల సాధించుట ద్వారా జీవితంలోని విలువను సాధించే చేదైనా అర్చన అథవా అర్చన భాగం ఔతుంది ... అర్చన అనేది విలువను సహజంగా మరల సంపాదించుటలోని తెలిసిచేసెడు భాగమనవచ్చును. అందుచేత ఈ భాగము తక్కిన భాగాలకు ఆ యా వాని స్థానాలను అర్థాన్ని కలిగించేదవుతుంది.

అర్చన మన్నికైనదికాదు. దీనికిగూడ తన్నుతాను పరాజితం చేసుకొనే లక్షణం చనిపోయే లక్షణం ఉంది. శాశ్వతంగా భగవంతుని సన్నిధానంలో నిలిచిపోవాలన్న ఆలోచనతో పరిపూర్ణతను గూర్చిన ధ్యానంలోనే మొండిగా కూర్చుంటే వాడు యంత్రంలాంటి వాడవుతాడు. సరిగా మొండిపట్టుదలతో పనిచేసేవాడు యంత్రమైనట్లు.

పనిదినాలనుండి ఆదివారానికి, "వారపుదినాల్లో అహంకారవృత్తితో నడచి ఆదివారంనాడు నిరహంకారిత పూనడానికి," భగవత్సంకల్పాన్ని నెరవేర్చి దివ్యోదాత్తత నారాధించబోవడానికి, సమస్యాపరిష్కారమైన

ఆలోచనలనుండి నైతికదృష్టిని గలిగింపగల ధ్యానానికి వెళ్లడానికి కావలసిన సహకారమైన సమర్థనను ఈ వాదం సమకూర్చింది. మతాలలో, యోగరహస్యానుభవం సాధించే సంయమి వర్గంలోవలె పూజను వృత్తిగా మార్చరాదనడానికి, పృథక్కరింపరాదనడానికి కావలసిన సమర్థనను కూడ సమకూర్చింది: పూజ అయినా అతిగాచేయడం అసలు చేయకపోవడంకంటె చెడ్డది. ఎందుకనగా అది మనుష్యకర్మను పవిత్రీకరించదు.

నీతివాదులు విద్యావేత్తలు మతాన్ని శీలనిర్మాణంలో వినియోగించి సమర్థించుటకు అర్చననుగూర్చిన ఈ వింగడింపులను ఎందుకు వెంటనే పట్టుకొంటారో వెంటనే తెలియగలదు. "ఏకీకరణ"కు అడ్డువచ్చే దేనినైనా నిందిరచి, భగవత్సంబంధమైనమాట చెప్పబోయినా అది లౌకికత్వానికి అవమానకరమైన కార్యమని, ఆరంభదశలోఉన్న తలతిక్కతనమని, "దుష్టమైన ద్వైతవాదమని" తలంచెడి లౌకికనీతివాదుల నిగ్రహాన్ని పడగొట్టుటలో "పర్యాయమైన" మార్పు సాధారణమైన ఆరోగ్యకరమైన మానసిక క్రమమని, మనుష్యుడు అప్పుడప్పుడు "పూర్తిగా పలకడం" అవసరమని చెప్పెడి ఈ సిద్ధాతం చక్కగా పనిచేసింది. హాకింగ్ తర్వాత చార్లెస్ ఎ. బెన్నెట్, హెన్రీ ఎన్. వీమన్, హాఫ్ హార్ట్‌షార్న్ మరియు ఇతర తాత్త్వికులు అర్చనవిషయంలో అథవా వారు నిష్కర్షలేకుండా పిలచిన "యోగరహస్యా" నుభవ విషయంలో వివేక నీతివాదులు మరింత సహనభావం పూనడానికి దారి ఏర్పరిచినారు. తగినంతగా "విలువలను గూర్చిన భావం" కలిగించుటలో సహాయకములుగా మతసంబంధమైన ఆచారకాండకు చోటివ్వడానికి క్రమంగా ప్రయత్నించినారు. త్రిప్పి చెప్పితే, విలువను తెలుసుకొనుటలోనే అర్చన ఉన్నదన్న సూత్రంమీద మతవిద్యను తీర్చినారు.

అర్చన నిట్లు నైతిక భూమికలమీద సమర్థించుట చక్కగా దిగుతున్న మేకువంటిదైనా నిదానంగా ఆగమశాస్త్రానికిది విపత్కరంగా పరిణమించింది. ఎందుకనగా ఇది మతానుభవాన్ని నైతికవిద్యకు తగ్గుగా పెట్టింది భగవంతునికి ఒక "ఆత్మాశ్రయత" గల అస్తిత్వాన్నిచ్చి, మతానికి ఒక ప్రాప్తకాలజ్ఞత విలువనిచ్చింది. ప్రాటెస్టెంట్ సిద్ధాంతంలోని వైయక్తిక. ఆత్మాశ్రయితా సిద్ధాంతాలకిది మరొక నిదర్శనమని కాథలిక్కులు హేళనచేసినారు. దానినిబట్టి మరింత విషయదృష్టి మత స్వభావరూపతగల

అర్చన కావలసివచ్చింది. విషయాదర్శవాదులు అనేకులు (ముఖ్యంగా హాకింగ్), విషయ యథార్థవాదులనేకులు (ముఖ్యంగా విలియమ్స్ కాలేజి లోని ప్రొఫెసర్ జేమ్స్ బిస్సెట్ ప్రాట్) అక్కర గడుపవచ్చినారు. అర్చకుని భగవంతుని సాన్నిధ్యవిషయంలోని అథవా "నిజమైన" సాన్నిధ్యంలోకి తెస్తేనేగాని అర్చన తన లక్ష్యాన్ని సాధించినట్లుకాదని చూపినారు. ఈ "నిజమైన సాన్నిధ్య" సిద్ధాంతాన్ని హార్వర్డులోని దీన్ స్పెర్రీ తీసుకొని తన రియాలిటీ ఇన్ వర్షిప్ (అర్చనలో సత్యగుణము) అను గ్రంథములో చక్కని వివరణ మిచ్చినాడు. 1925 లో బయటికి వచ్చినప్పటినుండి ఈ గ్రంథము అర్చనను గూర్చిన అమెరికన్ చర్చలలో ప్రధానమైనది ఉంటూవస్తున్నది. అర్చన సిద్ధాంతము యెడల ఈ దృష్టికి గల ప్రాధాన్యము అది సంకేతాలను చూడటంలో ఉన్నది. ఈ దీని అభిప్రాయం ప్రకారం మతసంకేతాలు ఆయా వాని అసలు వస్తువులను సూచించేవి మాత్రమేకావు; దర్శనాన్ని కలిగించేవి; ఒక విగ్రహం దేవుని ఆకారనిర్మితిమాత్రమేకాదు; ఒక "అనుగ్రహమార్గం" లేదా దైవాన్ని వర్తమానసత్వంగా చేయగల సాధనము - అర్చన విలువ ఎక్కడఉన్నదంటే గెలివిగా మనము భగవత్సాన్నిధ్యంలోకి పోయేటట్లు చేయగల శక్తిలో ఉన్నది.

ఏదో జ్ఞాపకంచేసుకుంటూ ప్రొసెసర్ ప్రాట్ తాను బహిరంగపూజ కంత ప్రాముఖ్య మిచ్చునట్లు చేసిన కారణాలనుగురించి ఉల్లాసకరంగా అరలేకుండా ఒకచోట చెప్పినాడు:

ఇప్పటికి దాదాపు ముప్పైఅయిదేండ్లనాడు నేను "మనము మతవిశ్వాసాన్ని నిలుపుకోగలమా ?" అన్న ప్రశ్నమీద తొలిసారిగా పుస్తకం వ్రాయదలచినాను అప్పుడు నేను కళాశాల అధ్యాపకుడుగా నాపని ఆరంభదశలో ఉన్నాను ... గ్రంథనామము నిశ్చయించుకొని ఒక ప్రకరణంవ్రాసినాను. ఆ ప్రకరణం మతంలో చిత్తశుద్ధిని గురించినది. కడచిన సంవత్సరం ఆ ప్రాచీన ప్రకరణాన్ని త్రవ్వితీసినాను ... ఆ ప్రకరణం వ్రాసినప్పుడు క్రైస్తవుల నమ్మకాలను మరింత అరలేకుండా చెప్పవలసిన అక్కరను చాలా ఉందనిపించింది. నా ఆశ ఏమంటే చర్చీలు, వాటి నాయకులు వారి ప్రస్థానాలలోని నజీవవిశ్వాసములుకాని భాగములను వదలివేసి చిత్తశుద్ధితో తమ విశ్వాసాలను బాహాటంగా వ్యక్తీకరించి

నట్లయితే క్రైస్తవమతానికి స్థిరత చేకూరుతుందని - ఇప్పటికీ ఆ చిత్తశుద్ధి అక్కర అగత్యంగా ఉందనే నానమ్మకం. కాని అన్నిటికీ అదే మందు అనే అప్పటంత ఉత్సాహంలేదు. (ఇప్పటి నా నమ్మికప్రకారం) నాకు ఇప్పుడు మతవిషయక సంకేతాల స్వభావము, ఉపయోగము, విలువ అనే వాటిని గురించి మరింత లోతైన సూక్ష్మదృష్టి ఏర్పడింది ... అమెరికన్ రంగం చాలవరకు మారిపోయింది. నిశ్చయంగా కొంతవరకు మంచికే మారింది. కాని కొంత లాభముతోపాటు కొంత నష్టంకూడా ఏర్పడింది. నిశితదృష్టి, చిత్తశుద్ధి పెరిగినవి. ఉపేక్షాభావంకూడా పెరిగింది. మరి క్రైస్తవమతం లేదా ఏమతమైనాగాని మిక్కిలి భయపడవలసింది ఉపేక్షాభావానికే ...

జేమ్స్ మాటల్లో చెప్పితే "మన శుద్ధహృదయం మరెక్కడో ఉండగా" ప్రాచీన సూత్రాలను వల్లెవేస్తుంటాము మనలో చాల మందిమి.

ఈ విధంగా మతంలో సంకేతాల సముచితస్థానమనేది ఎంత కష్టమైనదో అంత ముఖ్యమైన ప్రశ్న ... ఆలోచనలేకుండా సాంప్రదాయికంగా మత సంకేతాలను వాడడం చిత్తశుద్ధి రాహిత్యమేకాకుండా వాటిని చంపుతుంది. కేవలం మర్యాదగా, సాంప్రదాయికంగా, ఒక చేయిమారి వచ్చినదానినిగా చేసినప్పుడు మతంకంటె నష్టపడబోయేది మరేది ఉండదు: మరింత అక్కరగా వ్యక్తిస్వానుభవం, తొలిచేతి తక్షణానుభవం, కాలానికి సమంగావచ్చి దానికంటె ముందు పోగలశక్తి కావలసింది మతానికే. మతం నిజంగా ఉపయోగకరంగాను సుందరంగాను ఉండాలనుకుంటుంది: యథార్థంగాను ఉండవలెననికూడ దాని భావము. నిశ్చయంగా ఆగమ శాస్త్రం కాదు. కాని పారమార్థికవిషయాలనుగూర్చిన ఒకఅచ్చువిశ్వాసంగా ఆగమశాస్త్రమొకటి దానికి ఉండవలెను. మరి ఈ ఆగమశాస్త్రాన్ని అది కవిత్వంగా చూడగూడదు.

తరువాత ప్రాట్ అర్చనలో సంకేతాల సముచితమైన ఉపయోగం వ్యక్తీకరణ సాధకములుగానైన వాటి విలువలో లేదనియు, అర్చించేవాని భావములను భావనాశక్తిని వాని నిర్వచన వ్యక్తీకరణ శక్తులకు అతీతంగా కదలించుటలో ఉన్నదని వివరించుచూ పోయినాడు. మత సంకేతము, సంవాదానికి దారితీస్తుంది కాని వ్యక్తీకరణకు కాదు. పలుకుబడిగల

ఆంగ్లో - కాథలిక్ లౌకికుడు యేల్ లో ప్రొఫెసర్‌గా ఉంటున్న విల్బర్ యం. అర్బన్‌గారి ఒక రచనాభాగాన్ని కూడా ఆయన చూపించినాడు. ఆ భాగం అర్చనను గురించిన "వైషయిక" సిద్ధాంతాన్ని చాల చక్కగా గ్రథితంచేసింది:

మతసంకేతం, దాన్ని చక్కగా అభివృద్ధిఅయిన రూపాలలోకూడ కవిత్వలక్షణాన్ని పోగొట్టుకొనకుండుటకు కారణ మేమంటే మత విష యకమైన భాష తప్పనిసరిగా గేయగుణం కలిగి నాటకీయముగా ఉండ వలసి రావటమే. లేకపోతే అదెందుకూ పనికిరాదు ... మతసంకేతం స్ఫురణను చెదరగొట్టి అనందవిషయాన్ని లక్షణాతిశాయి అయినదానిని సూచిస్తుంది. ఆమాటకు ఎన్నిఅర్థాలు ఉన్నాయో అన్ని అర్థాలలోనూ అది ఎప్పుడూ అతిమానుషముగానే ఉంటుంది. దీనికి అతివాదరూపము ఒక విధంగా మచ్చు అయిన ఉదాహరణ (సామాన్యమైన హైందవదేవతా విగ్రహము.) హిందువుల మతకళ. అనంతమైన దేవతా కార్యకలాపాన్ని అసంఖ్యాకములైన బాహు పాదములుగల దేవతాకృతిగా సంకేతించి నప్పుడు అనంతముగా పరతత్వమైనదానిని తప్పనిసరి లక్షణముగా ఉండే అతిశయితను వ్యక్తము చేయుటకు ప్రకృతిని చెదరగొట్టి చూపించుట కనబడుతుంది. ఇట్లు చెదరగొట్టడం కళలోవలెనే ఒక కల్పన. కాని అది అట్లుగా కళాకారునికిగాని, అర్చకునికిగాని అనిపించదు. ఎందుకనగా దాన్ని సంకేతంగా అవగతము చేసుకుంటున్నారుగాని అచ్చం బొమ్మగా కాదు. పైగా అది "నిజమైని విలువలకంటె మరింత నిజమైన విలువలను" వ్యక్తము చేస్తున్నది.

అర్చన విషయాన్ని గురించి ఈ శతాబ్దపు తొలిసంవత్సరాలనుండి మత భావాలలో వచ్చిన చోటుమార్పును ప్రాట్ స్పష్టముగా చెప్పినాడు: తొలి సంవత్సరాల ఆశ ఏమనగా చిత్తశుద్ధిని సాధనచేసి మతనిష్ఠగలవారు తమ విశ్వాసములో స్పష్టతను సాధించగలరని, కాని తర్వాత సంవత్సరాల అనుభవాన్నిబట్టి భగవంతుడు స్పష్టముగా తెలియకపోయినా ఆయనశక్తి యశస్సు అర్చనయందలి ఉపేక్షాభావాన్ని నిగ్రహించగానే అనివార్యంగా అనుభవానికి వచ్చునని నేర్చుకొన్నారు. మరి అర్చనను దాని లక్ష్యానికి యోగ్యమైనదానిగా చేయుటచేతనే అర్చనలోని ఉపేక్షాభావాన్ని ఎదు ర్కొనుట సాధ్యమౌతుంది. అర్చనలో సంస్కరణను ప్రోత్సహించిన

మరొక రకమైన మతతత్వము "మతము - కళ" అన్న ప్రస్థానము. ఈ శతాబ్దపు తొలినాళ్ళలో ఆగమశాస్త్రానికి, "శాస్త్రీయ" మైన "మతాని"కి వ్యతిరేకంగా సర్వత్రవచ్చిన ప్రతీకారభావంలో ఈ ప్రస్థానము జనులలో వ్యాపించింది. యువకులైన మినిష్టర్లకు తక్కిన ప్రస్తానలను తిరస్కరించి "చిత్తశుద్ధి" గా ఉండటమో లేదా అర్చననుగూర్చి కేవలం రసనాసంబంధమైన వ్యాఖ్యానాన్ని ఒప్పుకోవడమో అన్న పర్యాయ అవకాశాలను ఇచ్చి మతద్రోహాల విచారణలు జరిపిన సమయంలో ఈ ప్రస్థానం వివాదాస్పదమైన విషయమైంది. హార్వర్డు డివినిటిస్కూల్ కు చెందిన ప్రొఫెసర్ కిర్ సాప్ లేక్ యువ లేదా "ప్రయోగవాది" తరము వారు ఈ ప్రస్థానాలకు సిద్ధాంతములోని తమ "అభిప్రాయములు"గా దేనిని అంగీకరించడంగాని అర్చనలోని అంశాలు అని తిరస్కరించటంగాని ఎందుకు వీలుకాదో బలవత్తరమైన కారణాలు చూపి చెప్పినాడు.

ప్రస్థానాలు కేవలము సిద్ధాంతమునకు సంబంధించిన అధికారిక ప్రకటనలుకావు అవి లిటర్జీలో ఒక భాగము. లిటర్జీవిషయము వచ్చినప్పుడు ఇంగ్లీషు చెర్చిలో పుట్టినవారు, మరి నావలె ఆగమశాస్త్ర సమస్యలు ఏవి కూడ తెలియని రోజుల్లో నియమింపబడినవారు మరింత ఎక్కువగానూ - ఉన్నదానిని నాశనము చేయడంకంటె భద్రపరచడమే ఉన్న కష్టమని తెలుసుకుంటారు ... "క్రైస్తవమత చరిత్రల" నిండా వదలివేసిన మరచిపోయిన సిద్ధాంతాలు ఉన్నవి ... ప్రస్థానాలను వదలివేయడం ఒక యదార్థవిషయాన్ని నమోదుచేసినట్లు అవుతుందేకాని ఒక విప్లవాన్ని ప్రవేశపెట్టినట్లుకాదు ... ఇది ఎందువల్లనంటే ప్రస్థానాలు కేవలము సిద్ధాంతప్రకటనలుకావు. తప్పుడు అభిప్రాయాన్ని తప్పించడానికి, మతద్రోహాన్ని తప్పించడానికి ఆగమశాస్త్ర ప్రకటనలుగా వాటి ఉపయోగం చాల పాతబడిపోయినవి. నిరుపయోగముకనుక హేళన పాత్రము అయినది. దీనిని తప్పక వదలివేయవలసినదే ... ఎందుకనగా ఆగమ శాస్త్ర దృష్టికి ఈ ప్రస్థానాలన్నీ సనాతనత్వ సిద్ధాంతాను యాయులే. అవి ఇంకేమీ కావడానికి వీలులేదు .... లిటర్జీలోకి స్వీకరింపబడని ప్రస్థానాలు తిరుగులేకుండా నశించిపోయినవి. కాని చెర్చి సర్వీసులలో చదువబడుచున్నవి మాత్రము బ్రతుకుతున్నవి ... ఈ లిటర్జీయొక్క ఆగమశాస్త్రంనా ఆగమశాస్త్రానికి, లేదా ఏ ప్రయోగవాది అగమశాస్త్రానికైనా పరా

యిదే అనుట పూర్తిగా నిజమే ... అయినప్పటికిని చర్చి సర్వీసుల లిటర్జికల్ కళ, దాని కెథడ్రెలుల నిర్మాణవాస్తుకళవలెనె నాలో ఏ ఆధునిక సర్వీస్ కాని లేదా ఏ ఆధునిక భవనము కాని మేల్ కొలువని భావాన్ని రేపుతుంది. ... సంస్థావాది ... అరలేకుండా నిశ్చయంగా చెప్పవలసి ఉంది. ... "ఈ ప్రస్థానాలు మన విశ్వానికి ప్రతినిధులు కావు. వాటిలోని నేను అన్న అహంకారం గ్రంథకర్తనే సూచిస్తుంది. కాని సర్వీసు మన పైతృకసంపత్తి. దీనిని మనము విడచిపెట్టనురాదు, భంగపరచనూరాదు. ... ప్రస్థానాలను ఉదాత్తభావం కలిగించి దివ్యోత్సాహమునిచ్చు లిటర్జీలో ఒక భాగముగా నిలుపుట. వాటిని భావముల ప్రకటనలుగా గ్రహింపక వదలివేయుట అనేవి ప్రయోగవాది చేయుటకు సాధ్యమైన కార్యక్రమము. చాలమంది సంస్థావాదులు దీనిని అనతికాలములోనే పరిగ్రహిస్తారని నా నమ్మిక.

సనాతనత్వ వారి వ్యతిరేకమైన సంస్థావాదముయొక్క స్పష్టప్రకటన లిటర్జికల్ కళాసిద్ధాంతమునకు పరిమితము. అయినను ఇది కళకు సామాన్యముగా, అమెరికన్ తొలినాళ్ళ ఔదార్యవాదుల వివేకదృష్టి ఇచ్చిన దానికంటె, మతములో సాధారణముగా ఎక్కువ అవకాశము నిచ్చుటకు అంగీకారమును సూచించును. ఉదారులైన మతోద్యోగుల ఈ చిత్తవృత్తికి సాంఘిక వైజ్ఞానికులు దండిగా ఆసరా ఇచ్చినారు. జానపదకళ, సామూహిక చిత్తవృత్తి అనువాని ప్రసక్తిలో వీరిమతసంకేతములను గూర్చిన పూరాతత్వ పరిశోధనలు మునుపటివారు తెలిసి తెలియక మతము "ప్రతి జీవములోనూ ఆత్మ ఉన్నదను భావము" నుండి పుట్టినదని చెప్పిన దానిని పెరికివేసినది.

మతోద్యోగులలో ఈ దృక్పథానికి ఊర్జితంగా పోరాడినవారు చికాగో అతివాదులలోనివారు. ఆగమజ్ఞులుగా ఈ చికాగోవర్గమువారు ష్లియర్ మాఖెర్ చెప్పిన (దస్ ఫెస్ట్లిష్, దస్ ఫైయెర్ లీష్) మతోత్సవ ప్రాధాన్యభావముచేత ప్రభావితులైనవారు, వారి నాయకులలో ఒకరైన జెరాల్డ్ బర్మిస్మిత్ ఆ సిద్ధాంతాని ఈ క్రిందివిధంగా చెప్పినారు:

మతాన్ని బుద్ధితో అర్థంచేసుకొనడానికి చక్కని ఏర్పాటేఉంది. కాని మతం తన ఉత్కృష్టదశలో జీవితార్థానికి ఉత్తమమైన రసభావవ్యాఖ్యానం చేస్తుందనే విషయాన్ని ఇంకా ఎవ్వరూ గ్రహించలేదు. మతం తన

ఉత్కృష్టదశలో మనుష్యుల జీవితంలోకి కవిత్వాన్ని, సంగీతాన్ని, వేడుకను, ఆరాధనను తీసుకొని వస్తుంది. పెరుగుతున్న మతమెప్పుడూ ఈ విలక్షణమైన వ్యక్తీకరణమార్గాలను సృజించుకొంటూనే ఉంటుంది. ... వింగడించినా చివరకు తేలేదేమంటే మతమనేది శాస్త్రమగుటకంటె ఎక్కువగా కళే అవుతుంది.

స్మిత్ సహోద్యోగి, ఫాన్ ఆగ్డెన్ ఫాగ్ట్ కళ - మతము (1921), ఆధునికమైన అర్చన (1927) అను పలుకుబడి సంపాదించిన రెండు గ్రంథాలు వ్రాసినాడు. వీటిలో ఆయన ఈ విషయాన్ని వివరంగా వ్రాసినాడు. "అర్చన అనేది జీవితాన్ని పండుగగా సంబరం చేసుకోవడ" మన్నాడు ఫాగ్ట్," ఆచారమునడుపుట జీవితము సెలవుదినములాంటిది. మనుష్యుని అస్తిత్వంలోని యథార్థ్యాలను విలువలను నియమించి చెప్పి లోకమర్థవంతమైనదని వ్యక్తీకరిస్తుంది మతం. ఈ విషయాలను ఎడ్వర్డ్ స్క్రిబ్నర్ ఆమీస్, హెన్రీనెల్సన్ వీమన్, బెర్నార్డ్ ఈ. మెలాండ్ వంటి మతనాయకులు, అనేకులైన పురాతత్వ పరిశోధన సాంఘికశాస్త్రజ్ఞ వర్గమువారు మరింత చొచ్చుకొనిపోయి పరిశీలించినారు. మతం "కళలకు తల్లి" అగుటయేకాక మానవుని ఆత్మాభివ్యక్తి పరాకాష్ఠరూపమని వారి భావము. కనుక దీనికితోడు, ఫాగ్ట్, ఆ వర్గంలోని మరింత ఆచారపాటీకులైన సభ్యులవలె తక్కిన కళలను మతస్పర్శ కలిగించి వాడుకోవాలని సిఫార్సు చేయుటలో మతం మరల మనుష్యజీవిత సంబంధముగల విషయాలలో ఒకటిగా, మన సంస్కృతిలోని కేంద్రకళగా కావాలని ఈ మానవతావాదు లనిపించుకొన్నవారు కోరుతున్నారు. మానవతా వాదులకు సిద్ధాంతవాదులకు ఇటువంటి సిద్ధాంతము క్రొత్తది కాకపోవచ్చునుగాని మిచిగాన్‌లోని ఒక మెథడిస్ట్ మినిష్టర్ అర్చనకళలో ఒక "కోపెర్నికన్ విప్లవాన్ని" ఏర్పరచి దాన్ని పైకితెచ్చినప్పుడు మతవిషయక భావనలో నిజమైన విప్లవం వచ్చినట్లే. (చూడు ఎగ్జిబిట్ XVIII)

ఈ వివిధసిద్ధాంతాల హక్కులనుగూర్చి న్యాయాన్యాయ విచారణ చేయ ప్రయత్నించకుండా, అర్చన స్వభావ లక్ష్యాలను మరింత బాగుగా అర్థము చేసుకొనుటకుగాను ఈ తాత్త్వికవిమర్శ కంతటికి నికరమైన ఫలమేమో సంగ్రహంగా చూడవచ్చు. ఆదర్శదృష్టికి అర్చన కనీసం నాలుగుపనులు చేయవలెను. (1) సాధారణంగా మానవజీవనంలోని

మూలభూతములైన విషయాలను, ఒకని నిర్దిష్టసంస్కృతిలోని విలువలను విధ్యుక్తముగా సంకేతికంగా చెప్పడం. (2) ఆత్మవిమర్శకు, నైతికబోధనకు (కన్ఫెషన్, థాంక్స్‌గివింగ్, ప్రార్థన, ధ్యానము, స్తుతి, శ్రుతిగంథాలను ధర్మోపన్యాసాలను ఉపయోగించుటవంటి వాటికి) ఒక స్థాయిగల మార్గాలను ఏర్పాటుచేయవలెను. (3) మానవ సౌభ్రాతృత్వభావంతోపాటు ఒక విశిష్టమైన సాహచర్యభావాన్ని లేదా "ఋషిసంవాద" భావాన్ని పైకి తేవాలి. (4) పూజించే ప్రతివానిని ఒక వ్యక్తిగా భగవత్సాన్నిధ్యంలోకి తేవాలి. స్పష్టంగా ఆత్మాశ్రయ పరాశ్రయ విషయాలుకూడా అర్చనలో ఉన్నవి. ఆత్మాశ్రయములైన అంశాలమీద వస్తున్న ఇప్పటి ఖండనలు ముఖ్యంగా కళావిమర్శలోను నైతికాదర్శవాదంలోను "ఆత్మాశ్రయ" మన్నదానిని "మమకారపూరిత మన్న అర్థంలో ఊహించుకోవడంవల్ల ఏర్పడినదే. కాని ఆత్మాశ్రయతా పరాశ్రయతలు, అక్కర-శక్తి, ప్రేమ-కీర్తి అనేవి కలియనిచోట కళయులేదు. అర్చనను గురించి డీన్ స్పెరీ రెండు సిద్ధాంతాలు సమర్ధిస్తాడు అర్చనాక్రియమే మనము దేవుని మొదటిసారిగా నిర్వచించే క్రమపద్ధతి "అనియు అర్చన అనేది" మానవానుభవంలోని చరమార్ధముల సామ్రాజ్యాన్ని 21 సంకీర్తనముచేయుట అనియు వీనిలో మొదటిది "పరాశ్రయమైన విషయాన్ని రెండవది" ఆత్మాశ్రయ విషయాన్ని చూపుతున్నవి. ఆరాధనసంకీర్తనలు రెండును ఒకటికావు; ఒక దానితో ఒకటి పొందనివిగావు. ఒకదాని కొకటి పూరకములు.

## బహిరంగ పూజాభిముఖమైన లక్షణాలు

నాలుగు అర్చనాక్రమములున్నవి: వైయక్తికము, కుటుంబసంబంధమైనది. సమాజ సంబంధమైనది, చర్చి సంబంధమైనది. ఈ యాభై యేండ్లలో వైయక్తికమైన భక్తిశ్రద్ధలేమైనవో గట్టిగా చెప్పుటకష్టము చాలవరకు ఇది పడుబాటైనదని కొంచెమించుమించు ప్రతి ఒక్కరు అనుకొనేమాట కాని ఎంతవరకు పడుబాటైనదో కొలుచిచెప్పుట కష్టము. దానికి కారణము లేమో చెప్పుట మరింత కష్టము. లేడీస్ హోమ్ జర్నల్ కొరకు లింకాన్ బార్నెట్ నిర్వహించిన సర్వే - దీని రిపోర్టు 1948 నవంబరులో "భగవంతుడు—అమెరికన్ ప్రజలు" అను శీర్షికతో ప్రకటింపబడింది - భగవం

తునియందు తమకు విశ్వాసమున్నదని చెప్పుకొన్నవారి నూటికి 95 మంది యనియు, నూటికి 75 మంది చర్చి సభ్యులనియు, నూటికి 40 మంది సక్రమంగా చర్చికి వెళ్లేవారనియు, నూటికి 25 మంది పైగా భక్తిశ్రద్ధలు గల వైయక్తిక మతజీవితమున్నట్లు చెప్పికొన్నారనియు సూచిస్తున్నది. సాధారణంగా తమ వ్యక్తిగత భక్తిశ్రద్ధలు సిథాభ్రిష్టములైనవని ఒప్పుకొనేవారు తాము వ్యక్తిగతముగా మతజీవితమును విడిచిపెట్టినవారమని అంగీకరింప నిచ్చగించుటలేదు. అమెరికాకు వచ్చియుండిన ఒక ఆంగ్లికన్ యాత్రికుడు "అమెరికన్లలో ఘోరమైన వైయక్తిక మతప్రవృత్తి" ఉందని మొన్న మొన్ననే అన్నాడు. యూరపియనులతో పోల్చినపుడును, తమ సంగతి తాము గుర్తించి మాట్లాడుదానిని బట్టియు అమెరికనులు తక్కిన ప్రజలకంటె మతాన్ని ఎక్కువ వ్యక్తిగతమైనదిగా గ్రహిస్తారని తెలియుచున్నది. మతప్రవృత్తిలోనుండి భక్తిశ్రద్ధలు లేక ఉండుట అంటే అమెరికనులుచెప్పే అర్థమేమో చెప్పడం సాధ్యమేకాదు. డీన్ స్పెర్రీ అన్నట్లు వారు "లోపభూయిష్ఠంగా మతరహితులైనవారు." పోల్చి చూచినపుడు నిరీశ్వరవాదాన్ని విశ్వసించినవారు కొద్దిమందిగూడ లేరు. అట్లు చెప్పుకొనేవారిలోగూడ జాత్రిపద్ధతికి చెందినవారు అట్టే లేరు. వాళ్లను జాక్స మారిటేన్ "ఆచరణచేయని నిరీశ్వరవాదు" లన్నాడు. తాత్త్వికులైన ఆగమజ్ఞులలో గెలివిగాను, చాలమంది యితరులలో సగము గెలివిగాను భగవంతుడున్నాడన్న ఒక నమ్మిక ఉండవచ్చును గాని అర్చనచేసే స్వభావముకాని అభ్యాసముకాని లేవు. ఒక ప్రసిద్ధుడైన తాత్త్వికుడు పూజ చేయనందులకు విశ్వవిద్యాలయము చాప్లిన్ అతన్ని చీవాట్లుపెట్టగా అతడు చాల గంభీరముగా "నేను హై చర్చిమన్‌ను నేను చాపెల్ ప్రక్కగా పోయినప్పుడల్లా తరుచు మాకొక గుడి ఉన్నందులకు అందులో ఒక చాప్లిన్ మా కొఱకుగా ప్రార్థిస్తున్నందులకు భగవంతునికి ధన్యవాదాలు చెప్పుకుంటాను" అన్నాడు. వైయక్తికమైన అర్చన విషయంలో ఉన్న తమ ఉపేక్షాభావాన్ని హేతుబద్ధంగా మార్చుకొన నొత్తిడిగల్గించినట్లయితే ప్రజలకొఱకు ప్రార్థింపవలసిన సన్యాసులు, ప్రీస్టులు, క్లెర్జిమెన్, రాబీలవంటి మతప్రవర్తకులున్నారయుని, అర్చన అనేది విధిగాగాక ఏదో భావసూచకంగా ఉన్న ప్రత్యేకసమయాల్లో తప్ప తదితర సమయాల్లో అందులో పాల్గొనకుండా మతసంస్థలను "ఆదుకొనుట" ప్రజల

కర్తవ్యమని మాట్లాడేవారు మరికొంద రుండవచ్చు. కాని అత్యధిక సంఖ్యాకులు మతాన్ని ఆపదకక్కరకు వచ్చేదిగా అనుకుంటారుగాని నిత్య విధుల నాచరింపవలసి నట్టిదిగా భావించరు. ఇరవయ్యో శతాబ్దందాకా షేక్స్పియర్ చెప్పిన

దీనాత్ముడా, దైవము నీకెంతో మేలుచేసినాడు:
పగటినిగాని రాత్రినిగాని దివ్యతేజోనిత్యముగాకుండ గడువనీకుము.
అయినను మంచిది, ప్రభు వేమిచేసినాడో జ్ఞాపకముంచుకొనుము,
(కింగ్ హెన్రీ IV, రెండవభాగం, II అంకము, I రంగము.)

అనే వచనము ప్రాథమికమైన మత విధిగా అయి ఉండవచ్చునుగాని ఇప్పుడటువంటి సలహాను బహుశః ఎలిజబెత్ కాలమునాటిది పొమ్మంటారు. పూజ అనేది చాలమంది లౌకికులకు నిత్యాహారము కాదు. వారు ఒప్పుకొన్నా ఒప్పుకొనకపోయినా వారి వ్యక్తిగతానుభవమునుబట్టి మతం వారి జీవితాలలో మతాధికారులు చెప్పినంత కేంద్రవిషయంగా లేదని తెలియగలదు.

అప్పుడప్పుడు శాస్త తాదాగా ఉండడానికి, వినోదానికి, ధ్యానానికి నిత్యవ్యవహారాల "కాడినుండి తప్పించుకోవడం" చాలమందికి చేత కావడంలేదు - లేదా చేతకావడంలేదని వారనుకొంటారు. దాన్నిబట్టి పూజాపురస్కారములకంటె "చర్చిలో పనే" మేలని భావిస్తారు. చాల మందికి లయబద్ధంగా వారపుదినాలలో పనిచేసి సాబాత్ పాటించడం చిరాకు. ముఖ్యంగా శరీరానికి విశ్రాంతి కావలసివచ్చినప్పుడు. నేటికాలపు పనిదినాల్లో పూజాపురస్కారాలకు వ్యవధిఉందని అనుకోవడము అసంగతమైన విషయమని అంతకంటె ఎక్కువమంది భావిస్తారు. ప్రొద్దున మధ్యాహ్నంగాని రాత్రివేళగాని "తీరిక" అంటూలేదు. ఎంతో గంభీరమైన మతవిషయకవ్యగ్రత ఉన్నదని చెపుతూ తమ "అంత్యకాలాన్ని" మతాభినివేశంతో గడుపుదామని తలంచే ఊర్జస్వులైన వ్యాపారస్థుల ననేకులను నే నెఱుగుదును. యథార్థ మేమిటంటే భక్తిశ్రద్ధలు గలవారు కూడ సాధారణంగా తమ చర్చి విషయంలో ఒక బాధ్యత నిర్వర్తించడంగా పూజలు చేస్తారేగాని వ్యక్తిగతంగా అవసరమన్న భావంతో కాదు. ఫలితంగా పూజ అనేది విధికంటే ఎక్కువగా ఒక ప్రత్యేకహక్కు అని తెలిసినప్పుడు ఆ హక్కును వదులుకుంటారు.

మతమనేది అర్చనగా గుర్తింపబడే రూపంలోనే ఉండాలనేది నిజం కాదనుకోండి. ఆధునిక మానవునికి తగిన "ప్రైవేటు మతజీవనపద్ధతులు" తయారుచెయ్యడంలో ఈమధ్య కొంత ఆసక్తి ఏర్పడింది. వచ్చే ప్రకరణంలో స్వీయపూజకంటే భిన్నమైన "మతసంబంధమైన అనుభవాన్ని" గురించి చెప్పవలసిఉంది. పెద్దపెద్ద వ్యవస్థిత మతసంఘాలు విధించిన లేదా ఆధ్యాహార్యముగా చెప్పుకొన్న వైయుక్తిక పూజాపురస్కారాదులు పడుబాటు కావడమే మతము వ్యక్తీకరించు క్రొత్తరూపాలకైన వెదుకులాటకు ఒక ప్రధానకారణమని ఇక్కడ గమనిస్తేచాలు.

కౌటుంబికమైన పూజాపురస్కారములుకూడా ఇటువంటి కారణాల వల్లనే పడుబాటైనవి. జూడాయిజమ్‌లోతప్ప. యూదులకు మతపరిపాలనకు ఇప్పటికీ కుటుంబమే ముఖ్యకేంద్రము. సినెగాగ్ సమర్పించగల అన్నిటికంటె ఎక్కువగా వారు సీదర్ విందు సంబారము చేసుకొని ఆనందిస్తారు. ఇంట్లో నిత్యకృత్యాలను పవిత్రీకరించుటకు ఎన్నో ఇతర ఆచారాలను పాటిస్తారు. జూడాయిజమ్‌లో కౌటుంబికపూజాపద్ధతిలోని బలానికి కారణాలు యూదు కుటుంబజీవితంలోని ప్రత్యేక లక్షణాలలో లేవుగాని - కుటుంబజీవితంలో ప్రత్యేక లక్షణాలు ఏమైనాఉంటే అవి యూదుల గృహాల్లో కనబడకుండా పోతున్నవి - ఇజ్రేల్ మతంలోని చారిత్రక విలక్షణతలో ఉన్నవి. జానపదులమతం చాలవరకు కుటుంబాచారాలతో కూడి ఉంటుంది. మరి క్రైస్తవమతంవంటి మతం (మరి క్రీస్తుజీవితంవంటి జీవితం) చాలవరకు కుటుంబజీవితంతో సంబంధంలేనిది. ఇది మరింత స్వీయ విషయము అవుతుంది, మరింత బహిరంగవిషయమూ అవుతుంది. క్రైస్తవ మతం తాను విడిపోయివచ్చిన ఇజ్రేల్ మతంలోఉన్నంత ప్రధానగురు సంబంధం ఉన్నదీకాదు; జాతీయతఉన్నదీకాదు. కట్టగట్టుకొన్నట్లుగా ఉండవచ్చునుగాని అంత సామూహికముకాదు. పూజాపద్ధతిలో కుటుంబము కేంద్రం కావడానికి యూదుమతంలో దాని గ్రామీణ వ్యావసాయిక పరిసరాలలోని స్పష్టమైన ఆర్థికకారణాలు ఉన్నవి. కాని ఈనాటి నగర వాసంలోను, యూదులలో రాజకీయమైన జాతీయతా పునరుద్ధరణము వచ్చినను, సమాజంకంటే, జాతీయ మాతృభూమికంటే ఎక్కువగా కుటుంబమే ఉత్సవస్మరణములకు కేంద్రస్థానంగా ఉంటున్నది. ఘెట్టో పరి

స్థితులు మరల ఏర్పడడమో. లేదా జాతి చిత్రవధలు జరగడమో సంభ
విస్తేతప్ప - ఇవి అమెరికాలో అసాధ్య విషయాలుగా కనిపిస్తవి - సమాజ
కేంద్రమో సినెగాగో కేంద్రస్థానం కాజాలదు. గుంపుగూడి పూజించడం
జూడాయిజంలో అంతర్భాగమే. కాని యూదుల దైవభక్తి బ్రతికి ఉండ
డానికి ప్రార్థన సదన్సులుగాని వాటి రాబీలుగాని ముఖ్యంకాదు. ఇంత
కంటె పారిష్ చర్చి, దాని ప్రీస్ట్ లేదా మినిష్టర్ క్రైస్తవమతానికి ముఖ్యులు.
క్రైస్తవుల అర్చనకు కౌటుంబిక పూజాపురస్కారాలు లేకున్నా ఫర్వా
లేదుగాని కుటుంబాచారాలు లేకుండా జూడాయిజమ్ తన పట్టు
నిలుపుకోలేదు.

ఖననసంబంధమైన కర్మకాండవంటి ఒకరకమైన ఆచారము ప్రధానంగా
కుటుంబవర్గానికే సంబంధించుతుంది. ఇతరవర్గాలకూ జనసమాజాలకూ
అది కొంతవరకు సంబంధించవచ్చును. మతసంస్థలు, అంత్యక్రియల సంద
ర్భంలో, సర్వీసులు నడుపుటయందు, కొంత ముందుకుపోయినవి. కాని,
అంత్యక్రియల చావిళ్ళలో జరుపుకోడానికి సులభమైన సర్వీసులుకావాలని
రానురాను ఎక్కువగా కోరుతున్నారు. అంత్యక్రియల డైరెక్టర్ల కొన్ని
అంచనాలనుబట్టి మన పెద్దపెద్ద నగరాలలోని ఖననాలు సగానికిపైగా
అంత్యక్రియల చావిళ్ళలో జరుగుతున్నట్లు తెలుస్తున్నది. అపార్టుమెంటు
ఇండ్లుకాని నగరచర్చీలుకాని తగినవి కాకపోవడమే ఇందుకు కారణము.
అంత్యక్రియల చావిళ్ళలోజరిగే కర్మకాండలో నిశ్చయంగా చర్చీలు
కొంతవరకు పాల్గొంటున్నవి. కాని చర్చి సంప్రదాయానికి ద్వితీయస్థానం
ఇచ్చి సమయానికి, పరిస్థితులకు తగినట్లుగా కర్మకాండను అనుసరించు
కోవడమే, పద్ధతిగాఉంది. అంత్యక్రియల చావళ్ళ అవసరాలను ముఖ్యంగా
మనసులో పెట్టుకొని కర్మకాండను ఏర్పరచి దానిని ఏ హ్యూమలిస్టు
ఫ్యూనరల్ సర్వీస్ అను పేరుతో ప్రకటించిన డాక్టర్ కార్లిస్
అమాంట్ ఈ పద్ధతికి క్రమాధికమైన డిమాండ్ ఉన్నదంటున్నారు.

ప్రొఫెసర్ ఎల్టన్ ట్రూబ్లడ్, ఎంత "నిజంగానో నాకు తెలియదుగాని,
ఈ చావళ్ళవలె అనతికాలంలోనే 'కళ్యాణమందిరాలు' కూడా వ్యాప్తి
లోకి రావచ్చు"నని వ్రాస్తున్నారు.

నికరంగా బహిరంగపూజ అనదగిన సమాజపూజాపద్ధతి 20వ శతాబ్ది
ములో యూదులలోనూ క్రైస్తవులలోనూ పెరుగుతూవచ్చింది, ఇక్కడ

"సమాజ"మంటే నా అభిప్రాయము భౌగోళికంగా ఒక చోటికిచెంది మతసంబంధంగా గుమికూడినవారికి నైతికమైన అర్థాన్నికలిగించే లౌకిక జనసమాజము. జర్మన్ సాంఘికశాస్త్రజ్ఞులు, ఒక మతసంఘము ఇహలోక జనుల ఐకమత్యానికి "అధ్యాత్మక" స్వరూపమునిస్తూ, ఎంతవరకు ఒకానొక లౌకికప్రజలను సేవిస్తుందో దానినిబట్టి ఆ సంఘాన్ని పారిభాషికార్థములో "చర్చి" అంటారు, ఇందులో 'మతము ఎట్లుండవలెను?' అనుదానిని గురించిన "సంస్థాపన" భావాల మిగులుబాటు ప్రతిఫలిస్తున్నది. ప్రాచీన రోమ్ ఇజరేల్ ప్యూరిటన్ న్యూ ఇంగ్లండులను తలపిస్తున్నది. అమెరికాలో న్యూ ఇంగ్లండ్ పేట. పల్లె, సివార్ల జవసమాజం, నగరప్రాంతం, వంటి స్థానిక జనసమాజమో లేక ఇరుగుపొరుగు ప్రాంతమో బలవత్తరంగా ఉంటున్నది. అటువంటి జనసమాజాలను సంవాదంలోకి తెచ్చినప్పుడు ప్రార్థన సదస్సులు బలిష్ఠములౌతున్నవి. తెగలవారి చర్చిలను ఉల్లంఘించి ఏర్పడిన ప్రాటెస్టెంట్ జనసమాజ చర్చిలు లేదా సంయుక్త చర్చిలు బాగా పెరుగుతున్నవి. ముఖ్యంగా కళాశాల జనసమాజాలలో నగరోపాంత పట్టణములలో ఇవి ముఖ్యంగా జనరంజకమైనవి, తెగలమధ్య ఏర్పడిన "సంఘీభావము" పెరిగిరావడం మరింత విస్తృతమై గమనార్హంగా ఉంది, దీనిలక్ష్యం ఒకే జనసమాజంలో నిరుపయోగమైన పోటీ గుణాన్ని తప్పించడం, సభ్యులు ఒకపద్ధతి బహిరంగపూజకు అంగీకరించినపుడు తక్కినవిషయాలను "అప్రధానమైనవి"గా భావించవచ్చు, చాల తెగలవారి చర్చిల మార్గాలబలము అవి ఇప్పటికి అమెరికాలో కొంతబలాన్ని నిలుపుకొనిఉన్న యూరోపియన్ జనసమాజాల జాతులను ప్రతిబింబించుట అను యదార్థవిషయముపై ఆధారపడిఉన్నవి. వేరువేరు రకాల లూధరనులు యూరప్‌లో వేరువేరు భాగాలనుండి వచ్చినవారు. ప్రిజ్బిటీరియనులకు స్కాటులతో సంబంధ బాంధవ్యాలు ఇప్పటికీముఖ్యం. ఎపిస్కోపలియనులకు, కాంగ్రెగేషనలిస్టులకు ఇంగ్లీషువారి సంబంధబాంధవ్యాలు ముఖ్యం. చుట్టు ఇటువంటి చర్చిలు ఉండగా బాప్టిస్టులు, మెథడిసులు తాము నూటికి 110 శాతము అమెరికనులము అనుకొనడము సహజము. స్థానికమైన రోమన్ కాథలిక్ చర్చిలుకూడ అంత రోమన్ మతానుసారంగా ఉండవు. ఎక్కువగా ఇటాలియన్, ఐరిష్, పోలిష్, మెక్సికన్. మొదలైన లక్షణాలే కనబడుతాయి. అమెరికాప్రజల సంస్కృతిలోని బహుత్వమును

ప్రతిఫలించే ఈ సంస్కృతిభేదములు బహుశః మన చర్చీలలోని వైవిధ్యానికి ఊర్జస్వితకు గొప్ప శక్తిమంతమైన కారణము. యూరప్‌నకు సంబంధించిన నేపధ్యాలు క్రమంగా వెనుకబట్టిపోతున్నవనుటలో సందేహము లేదు. క్రైస్తవ పూజాపద్ధతిలో "అమెరికన్ రకానికి" చెందిన ఒకపద్ధతి ఆవిర్భవిస్తున్నదని మనకంటె బాగుగా యూరపియన్ యాత్రికులే చూడగల్గుతున్నారు.

యునైటెడ్ స్టేట్స్ జాతీయజీవనం, ముఖ్యంగా యుద్ధకాలంలో మతసంబంధికులు వ్యగ్రులై నడిపించినదైనది. తొలి దశాబ్దులలో ఉన్నంత వీర తాత్త్వికాదర్శీకరణం బహుశః నేడులేదు. సాంఘిక సువార్తా లక్ష్యాలు నిశ్చయంగా మునుపున్నంత జాతీయదృష్టితో ఇప్పుడులేవు. కాని ప్రజల కష్టాలు మొత్తంమీద అమెరికన్ దేశభక్తికి రాజకీయాలకు ఒక మతావేశాన్ని అర్థాన్ని సమృద్ధిగా ప్రసాదించినవి. రాజకీయమైన ఉత్సవాలు, జాతీయ భగవదర్పణసమయాలు, పబ్లిక్ స్కూళ్లలోని భక్తిపూరితమైన ఆచారాలు లౌకికమైన జాతీయ పూజాపద్ధతికి ఒక కొంత సహాయపడినవి. యూరప్, ప్రాచ్యఖండములలోని రాజకీయమైన తెగలతో పోల్చి చూచినప్పుడు యునైటెడ్ స్టేట్స్‌లో పౌరసంబంధమైన మతం లెక్కలోకిరాదు. మొత్తమీద అమెరికన్‌ప్రజల ఆధ్యాత్మిక జీవనోత్సవము వారి అనేక మతసంస్థలకు అప్పగించబడింది. వీరుకూడ సమయానికి ఆహమహమికతో అందివచ్చినారు. అందుచేత యూరపియన్లు తమ నైతిక సమైక్యమునకు అవసరమేమో అని భావించినంత ఆధ్యాత్మిక సమైక్యముగాని స్టేట్ చర్చి అమెరికనులకు అవసరమన్నభావం కాథెలిక్కులలోగూడ ఏమాత్రంలేదు. ఇట్లు జాతి జనసమాజంలో ప్రత్యేకమైన ఆధ్యాత్మిక సంప్రదాయములతో ఆచారములతోకూడిన పలురకములైన జన సమాజాలున్నవి.

చివరిదిగా, మతవిశ్వాసమొక్కటే ఐక్యతాబంధముగా, తమ మత విశ్వాస మితరులతో లౌకిక జనసమాజములతో పోటీపడుతూఉన్న నిష్కర్షమైన మతసంఘాలకు విలక్షణంగాఉన్న ఒకరకమైన బహిరంగ పూజ ఉన్నది. ఇటువంటి సంఘాలకు, ఆగస్టైన్ "భగవన్నగరము"నకు వలె, కనబడని ఐక్యము భగవంతునియందుండునని తలపబడుచున్నది. అట్లే "ఐహిక" సంఘాలకు, స్వర్గం భూమికి "పైగా" ఉన్నట్లుగానే, విము

ఖంగా ఉండాలనికూడా తలపబడుతున్నది. అవి భగవంతుని స్వంత ప్రజానీకం క్రిందికివస్తవి. వాటి లక్ష్యం వేరురూపంతోఉన్న జనసమాజాన్ని ఉద్ధరించడం. చర్చికి సంబంధించినపూజ, ఆ మాటకున్నఅర్థం ప్రకారం, ఒక దర్శనకునకు వ్యక్తీకరణ మేకాని సంస్కృతిక వ్యక్తీకరణముకాదు. చర్చి "భగవంతుని ఎదుట ఒక ఐకాంతిక సమాజము." అది ఏ ఇతర ప్రజకు సంబంధించినదైనను కాకపోయినను అట్టిదే చర్చిలు తాము లోకమునుండి "బైటకు" రావలసిఉంటిమనియు లోకములో కూడి ఉండుట మాత్రమే తమ విధికాదని యు నమ్మచూ తమ అర్చన రూపమైన సర్వీసును సంస్కృతి పరిసరములనుండి స్పష్టముగా ప్రక్కకు తొలగించినపుడు వారి అర్చనకు మనుష్య విమర్శ స్పృశించని ఒక అతిమానుషమైన హోదాను ఏర్పరచుకొంటున్నది. తాము గొప్ప అనెడి ఈ భావము - దీనినే "భగవంతునిచే ఎన్నికైన వారమను భావము" అన్నారు - అది తక్కిన సంఘాలకు కోపకారణమేకాక సాంఘిక సువార్తగా పేరుపడిన తిరుగుబాటునకు చర్చిలలో ముఖ్యకారణమైనందుచేతచే చాలమంది చర్చివారు సువార్తయొక్క సాంఘికీకరణమును లేదా నైతికీకరణమును, అర్చనా వ్యతిరేక ప్రచారముగా నింపబోయినారు. ఏదిఏమైనను, చర్చి వారి అర్చన ఇతర జనసమాజాలకు అడ్డంగా పోవడమేకాక జనసమాజాన్ని చీలికలుచేసేది అయినది. ఒక్కొక్క మతము లేక ఒక్కొక్క చర్చికూడ అనంతమైన సత్యతత్త్వమును. ఏదో ఒకానొక నిర్దిష్టమైన చర్చి అనే బండ రాతికి కట్టివేయవలెనని ప్రయత్నములు చేయుటలో ఇతరులకు, మరి అందరకు సమానమైన లోకమునకు, విరుద్ధమైన క్షాత్రబలము కావలెననియు ప్రార్థించినపుడు దయాగుణము మాట ఎట్లున్నను, ఏకేశ్వరార్చన లోని గుణము పిటపిటలాడుచున్నది. ఉద్ధారమునకు పూనుకొన్నప్పుడు అర్చనకు తన మనుష్యధర్మమును పోగొట్టుకొనే లక్షణమున్నది. కొట్లాడే మత విశ్వాసానికి తగినచోటు నిశ్చయంగా లోకంలో ఉన్నది. కాని స్వామి పీఠమువద్ద క్షాత్రము ఆ స్థానపలితము.

చర్చివారు ఎక్లిజిసియాస్టిసిజమ్‌లోని దోషమును క్రైస్తవప్రపంచమును పైకితెచ్చి నిగ్రహింపచూచినారు. కాని, అర్చనరంగములో ఐకమత్యము మూర్ఖమైనదికాకపోతే నిరుపయోగమైన లక్ష్యంగా కనబడుతుంది, క్రైస్తవులలో "క్రైస్తవప్రపంచ" సంబంధమైన ఐకమత్యము అర్చనకంతగా

ముఖ్యము కాదుగాని కలిసికట్టుగా పనిచేయడానికి పోరాడటానికి ముఖ్యమైనదని ఈపాటికి బాగుగా తెల్లమైనది. క్రైస్తవ ఐకమత్యోద్యమ నాయకుడు క్రైస్తవులందరు భగవంతునిముందు తమ ప్రార్థనలను ఏకముచేసి ఆ విధముగా "కనబడని" ఐకమత్యమును కనబడునట్లుగా సంకేతింపవచ్చునని ఒక ఆశను పెంచుకొన్నారు. కాని, ఈ ఆశ మరింత మమకార భావపూరితముగా కనబడుతుంది. క్రైస్తవుల దైవభక్తికి నిజముగా కావలసినదానికంటె మరింత ఎక్కువ రాజకీయముగానూ ఉండుట సాధ్యమే. ఏది ఏమైనను క్రైస్తవుల ఐకమత్యము అంతర్ విశ్వాస వర్గాల సహకారమువలె అప్పుడప్పుడు కొన్ని నిర్దిష్ట ప్రయోజనములకు ఆచరణీయము అగుచున్నది. సామాన్యమై మానవ సౌభ్రాత్రాదర్శమువలె చర్చి పద్ధతిలో దేవునిముందు ప్రకటించుచున్నప్పుడుకాక మనుష్యులమధ్య పనిచేసినప్పుడే మరింత ఫలకారి అగుచున్నది.

మనము స్వానుభవసాక్ష్యమును నమ్మినచో, అర్చనలు మరింత గుణవంతముగా చేయవలెనను వ్యగ్రతతో వచ్చిన విమర్శను పరిశీలించినచో, తమ దారిలో తాము బాగుగా అభివృద్ధిగాంచగల బహువిధములైన అర్చన పద్ధతులుగల అమెరికన్ సంస్కృతి బహువిధమైన మత జీవితానికి, బహువిధమైన ప్రజలకు తమ ప్రత్యేక లక్షణమును అందించునట్లు అనేక మతవిశ్వాసాలకు అమెరికాలోనున్న అవకాశమును కాపాడుకొనుచు వచ్చినట్లైతే అది భగవంతుని అధికాధికయశస్సునకు ఉపకరించునట్లు కాగలదు. అమెరికన్ సంస్కృతి తన మతసంబంధమైన శక్తిని ఒకే మూసలోపోసి బలవంతముగా తీర్చినచో ఈ పని చేయలేదు. స్వర్గంలో అనేక గాయక బృందములున్నట్లే భూమిమీదకూడ అనేక బృందాలను నిలుపవచ్చును. ఎందుకనగా భగవంతుడు, మనుష్యుడు ఇద్దరు కూడ "ఒకే ప్రపంచము" లో భిన్న భిన్నములైన స్తోత్ర గానములను "పర్యాయ పద్ధతి" గా విని ఆనందింపవచ్చును. రాజులకు రాజైనవాడు తనకు సృష్టి ఎందుకు లీలయో, ఎందుకది అవిచ్ఛిన్నముగా నడచుచున్నదో వివరించుకొనవలెనా? ... తాను సృష్టించిన ప్రాణులు తాము కూడ తమ స్వంత సృష్టి చేయునట్లు చేయుటలో భగవంతునకు వినోద

మున్నది. అందుకే జనిసిస్‌లో ఇట్లున్నది: "ఆయన మనుష్యుని తన స్వీయాకృతిలో సృష్టించెను" మానవుని ఉదాత్తతకు అత్యుత్తమమైన అధికారము ఇక్కడ ఉన్నది. మనుష్య కార్య కలాపములన్నియు ఎంతవరకు లోకమును నిరంతరము పునఃసృష్టి చేయుటకు ఉపకరించునో దానినిబట్టి వాటికి వెలకట్టవచ్చును.

---

# 6. విలియమ్ జేమ్స్‌నాటినుండి వచ్చిన రకరకాల మతానుభవాలు

## మతసంబంధమైన అనుభవాన్ని గూర్చిన జేమ్స్ వింగడింపు

విలియమ్‌జేమ్స్ స్కాట్లండ్‌లో యిచ్చిన రెండువరుసల గిఫర్డ్ ఉపన్యాసాలను 1900 లో కూర్చుకొన నారంభించినపుడు ఆయన మొదటి వరుసలో "మానవుని మత భుభుక్షల" ను గూర్చియు, రెండవ వరుసలో "తత్త్వశాస్త్రముద్వారా వానిని తృప్తిపరచుట" ను గూర్చియు చర్చింప దలచెను. ఆయన రెండవసగము వ్రాయనేలేదు. మొదటివరుస ఉపన్యాసాలవల్ల తోచిన ది ప్లూ ర లి స్టి క్ యూ ని వ ర్స్ (బహుధా రూప విశ్వము) ను 1912 లో వ్రాసినప్పుడు అది తత్త్వశాస్త్రమెట్లు మత "భుభుక్ష" లను తృప్తిపరుపగలదో చెప్పనదిగాక మతసంబంధమైన అనుభవంలోని యథార్థవిషయాలనుబట్టి ఆధ్యాత్మిక వాఙ్మయము (మెటఫిజిక్స్) ను ఎట్లు పునర్నిర్మింపవలెనను దానిని గురించినదిగా తయారయ్యెను. జేమ్స్‌లో ఈ బుద్ధి మార్పు ఆయన మేధాసంబంధమైన వృత్తికే గాక మత భావములలోను, మతమును గురించిన భావములలోను సాధారణంగా అప్పుడు వచ్చుచుండిన మార్పునకుగూడ ముఖ్యమైనదయ్యెను. గిఫర్డ్ ఉపన్యాసాల నేపథ్యంలోను జేమ్స్ స్వీయనేపథ్యంలోను "సహజ మత" మని అస్పష్టముగాం గుర్తింపబడిన సంప్రదాయమొకటి ఉండినది. ఈ సంప్రదాయ విశ్వాసమేమనగా మనుష్యునికి సహజముగా మతసంబంధమైన "ఉన్ముఖత" ఉన్నదనియు, దానిని సహజమని ఏ తత్వశాస్త్రము చూపగలదో అది దర్శనయుక్త మతముల సాంప్రదాయిక విశ్వాసములు, ఆచారములకంటె మెరుగుగా ఆ ఉన్ముఖతను తృప్తిపరుపగలగనియు, "సహజమతముమీద గిఫర్డ్ ఉపన్యాసకుడు" గా జేమ్స్ ఈ విషయాన్ని గురించి కృషిచేయవలసి యుండినది. స్కాట్‌లెండులోనూ, అమెరికాలోనూ జేమ్సుచుట్టు ఉండిన "ఖండితములైన" తాత్త్విక వాదములు కేవలము మతమునకు సంబంధించిన తత్త్వశాస్త్రములుకావు; సంస్థారూపములను మతములకు, ఆగమశాస్త్రములకు బదులైన మతతత్త్వము. జేమ్సు స్నేహితులు అనేకులు, థామస్ డేవిడ్ సన్, డికిన్ సన్.

ఎస్.మిల్లర్, విలియమ్ టోరీ హారిస్, జోసయరాయిస్, ప్రిన్సిపాల్ జాన్ కేర్డ్, జేమ్స్ మార్టినో ఇంక – అతని తండ్రిమాట చెప్పనే అక్కరలేదు – వీరందరు ఈ అర్థంలో మతతాత్త్వికులు. వారికి తత్త్వశాస్త్రంలో మత విషయకమైన తృప్తి కనిపించింది. వ్యక్తులుగా భగవంతునితోడి వారి సంబంధానికి చర్చిలోని అనుగ్రహ మార్గాలకంటె ఎక్కువగా ఒక ఆదర్శ వాద పద్ధతిగల సిద్ధాంతం మధ్య వర్తిత్వం నెరపింది. ఇటువంటి "జ్ఞాన సిద్ధాంత" మునకు విరుద్ధముగా జేమ్సు తిరుగుబాటు చేసినాడు. ఎందు కనగా అతడెంత మతోద్యోగి వ్యతిరేకిగా ఉన్నను మనుష్యుని "మత బుభుక్షను" తత్వశాస్త్రము ఎన్నటికిని తృప్తిపరుపజాలదని నమ్మినవాడు. ఈ విషయముమీద అతని వివిధాభిప్రాయములు, ఉదాహరింపబడినవి. ఎందుకనగా అవి, జేమ్సు వివేకవాదమునుండి మరలుటమాత్రమేకాక అమెరికాలో ఆదర్శవాద, భౌతికవాదముల ఖండిత తత్త్వములకు వ్యతి రేకముగా వచ్చిన ఒక సాధారణమైన తిరుగుబాటు ఆరంభమగుటను సూచించునవి.

స్థూలతరమైన, సూక్ష్మతరమైన అతిమానుష సిద్ధాంతము ఉన్నది. ఈనాటి తాత్త్వికులు. ఈ సుసంస్కృత భాగమునకు చెందినవారు. సూక్ష్మ మైన అతిమానుషవాదము, విశ్వజనీనత సంబంధముగల అతిమానుష వాదము, స్థూలమైన రకమునకు "తునుకల" అతిమానుషవాదము అను నది మరింత తగినపేరుగా ఉండును ... నేను జనరంజకమైన క్రైస్తవమును గాని మతపండితుల ఆస్తికత్వమునుగాని అంగీకరింపజాలకపోయినను ఆదర్శరూపునితో సంవదించుటవలన లోకములోనికి ఒక క్రొత్తశక్తి వచ్చుననియు క్రింది క్రొత్త ఆరంభములు జరుగుననియు తలచిన నా నమ్మికవలన నేను స్థూలమైన అతిమానుషవాద విశ్వాసువులలో చేర్చ బడుచున్నాను. విశ్వజనీనతా సంబంధమైన అనుమానుషసిద్ధాంతము చాల సులభముగా సాహజికతా సిద్ధాంతమునకు లొంగిపోవునట్లు నాకు కని పించుచున్నది ... ఆదర్శలోకమును విశ్వజనీనతా మార్గమువలన ఇట్లు గ్రహించుటవలన ఆచరణీయత మతసారము హరించిపోవునట్లు నాకు అని పించును. స్వభావముచేతను తార్కిక కారణములవల్లను నేను యదార్థ విషయములతోమారని సూత్రములుండునని నమ్మజాలకున్నాను. అయితే

యధార్థవిషయములన్నియు నిర్దిష్ట యధార్థవిషయములు ... అయినను ... సూక్ష్మమైన అతిమానుషవాదము ... మొత్తము అనుభవముతోనే ... పరతత్త్వము సంబంధములు నడపునని (చెప్పును). వివరమైన వ్యవహారము నకు అది దిగిరాదు.

ఈ రచనాభావములు మతానుభవములగురించి చెప్పినదానిలోనుండి చాల వ్యక్తిగతమైన వేదవైయుక్తికమైన ప్రాధాన్యమును చూపుచున్నవి. ఆగమశాస్త్రములు సాధారణముగా మతవిశ్వాసమును సమర్థించెడి "విశ్వ జనీనతా" సంబంధముగల, వివేకశీలమైన, తాత్త్విక, చైతన్యముకంటె మతమునకు మూలభూతములైన రెండురకముల చైతన్యము ఉన్నదని అతడు రుజువుచేయ ప్రయత్నించుచుండెను: ఆ రెండురకములు ఏమనగా మతసంబంధములైన భావ జ్ఞానోదయములు ఒకటి. మతానుభవమునకు సంబంధించిన ఉద్రేక యోగరహస్య లక్షణములు రెండవది.

ఆయన రహస్యానుభవ ప్రకాశకథనము కొన్ని అమెరికన్ లక్షణము లను ఒత్తి చెప్పుచున్నది. ప్రకృతిసంబంధమైన గూఢానుభవమతమునకు చాల చోటిచ్చి ఆయన "గూఢానుభవ సంబంధమైన చిత్తవృత్తులను" గురించి "నేను సేకరించిన విశిష్టములైన కేసులన్నియు ఆరుబయట జరి గిన" వని చెప్పును. మరింత ప్రకృతిసంబంధమైన. లౌకికము గూఢమతము రకములతో నారంభించుటలో తన లక్ష్యము చర్చి సంబంధమైన గూఢమత ములనివి అవిచ్ఛిన్నముగా కొనసాగించుచున్నవని చూపుటయేయని వివ రిస్తాడు. కాని ఆయన సానుభూతియంతయు లౌకిక గూఢమతవాదుల మీదను "విశ్వచైతన్యము" మీదను ఉండుటచే సాంప్రదాయికమైన ప్రాచీన గూఢమతానుయాయులవద్దకు వచ్చుసరికి ఆయన కథనము కుంటు పడుచున్నది. అమెరికన్ గూఢమతవాదులలో బెంజమిన్ పాతబ్లడ్‌గారి "బాధారహితదర్శన" వర్ణనమునకు, రాల్ఫ్ వాల్డో ట్రైన్‌గారి ఇన్ ట్యూన్ విత్ ది ఇన్‌ఫైనెట్ అనుదానిని, వాల్ట్ విట్‌మన్ చెప్పిన "దివ్యకలకమును, వస్తురాశిని ... వేటకానిచేతిలో మెడత్రాడు గట్టిన కుక్కనువలె కలిపిపట్టిన కనబడని బంధమును ఆత్మతో చూచుటను "ప్రత్యేకముగా పేర్కొన్నాడు. బెంజమిల్ పాల్ బ్లడ్ వ్రాతలలోనూ, అతని - ఆమ్ హర్ట్సు సహచరుడైన జైనోస్ క్లార్కు వ్రాతలలోనూ, గూఢానుభవ ప్రకాశము భావానుభవము కాదు అన్న అంశము

నొక్క చెప్పబడినదని జేమ్స్ అంటాడు. ఆయనదృష్టిలో ఈ అంశము ముఖ్యమైన సిద్ధాంత ప్రాధాన్యముగలది. భావానుభవము జ్ఞానలక్షణ ములులేనిస్థితి. గూఢానుభవము బుద్ధి సంబంధము లేకుండ సత్యమును ఎరుకకు తెచ్చుకొను "ప్రైవేటు ప్రామాణిక" రూపము. అయన బ్లడ్ క్లార్కుల వ్రాతలనుండి ఈ క్రింది చక్కని తర్కమును అనువదించినాడు. దీనిలో అస్తిత్వవాదములోని ప్రధానాంశము ఉండుటచేత అప్పటికంటె ఇప్పుడు మరింత గమనింపదగినది అవుతున్నది:

దర్శనమనునది ప్రధానముగా భావసంబంధము లేనిది. పూర్తిగా నేల బారుగా ఉన్నట్లుండును ... అది భూత కాల ము యొ క్క ఉ ప దే శ ము ... బాధారహిత దర్శనమును విధివల్ అవిచ్ఛిన్నత శిఖర ముగా అభివ్యక్తమైన అస్తిత్వమను బహిరంగ రహస్యము యొక్క అతి పురాతన రహస్యములోనికి మానవునకు ప్రవేశార్హత నిచ్చుట. విధివల్ అన్నదే మాట. దాని ఉద్దేశ్యము అందులోనే ఇమిడిఉన్నది – కావలసి నదే అయినది. రాగద్వేషములకుగాని, దుఃఖావంతములకుగాని, మంచి చెడ్డలకుగాని కాదు, పరిసమాప్తి, ఆరంభము, లేదా ప్రయోజనము దానికి తెలియవు.

పదార్థముల అనేకత్వ వైవిధ్యములను గూర్చిన నిర్దిష్టగుణమును అది చెప్పదు. అస్థత్వములోని, స్వభావమునుగురించియు ఉద్దేశమునుగురించియు నైన లౌకికమైన, సన్నిహిత, వ్యక్తిగత, జ్ఞాన ప్రకాశములతో, చారిత్ర కము, దివ్యము, అగు వానినిచూచును. అస్తిత్యము యొక్క ఉద్దేశ్యము, తత్కాలమును ఏదో జ్ఞాపకముగా - ప్రతిసాధకునికి మునుపు కనిపించి నట్లొ లేదా కనిపింపవలసి ఉన్నట్లొ - అనిపించును.

క్లినికల్ సైకాలజిస్ట్ అయిన జేమ్స్ ఇదంతయు సానుభూతిలో విన్నాడు కాని, ఆయనకు ప్రధానముగా అటువంటి అనుభవము "ఫల ములు" ఏవి అను దానిలోనే ఆసక్తి. ఈ దృష్టికికూడ బెంజమెన్ పాల్ బర్డ్ ఆయనకు ప్రత్యేకమైన ఆసక్తిని కలిగించినాడు. బడ్ల గూఢమతము తెచ్చెడి వైయక్తిక యోఘమును వివరించి వ్యక్తిగత జ్ఞానోదయములవల్ల చర్చివారు చెప్పెడి నరకబాలలతోనూ యహోవా ఉరుములతోనూ బాధ పడుచున్నవారికి మనశ్శాంతి తేగలవు అను జేమ్స్ అభిప్రాయమును సమ రించినాడు. జేమ్స్ ఆసక్తికి ఇది కారణము. బడ్ల ఇట్లు అంగీకరించినాడు:

నేర్చుకొనవలసిన పాఠము ప్రధాన భద్రతకు సంబంధించినది: దైవ రాజ్యము లోపలఉన్నది. అన్ని దినములును జడ్జిమెంటు దినములే: కాని, అనంతకాలమునకు పరాకాష్ఠ రూపములైన ఒక ప్రయోజనముకాని, ఈ అంతటికి ఒక ప్రణాళికకాని ఉండజాలదు ... ప్రపంచము ఇప్పుడు నాకు నేర్పబడిన ఏదో బయటి భయంకర విషయముకాదు. ఇటీవల జహోవా ఉరుములు ప్రతిధ్వనించుచూ వచ్చిన ఆ మేఘమలినమైన కుతకుతలాడు చున్న బురుజుపై గోడను తిరస్కరించి నా ధూమ్రవర్ణపు సముద్రపుకాకి ఆసన్నరాత్రికి అడ్డముగా రెక్కలార్చి ఎగురుచూ నిర్భయమైన చూపులో స్పష్టా స్పష్టమైన దూరములకు గమించుచున్నది. ... అస్తిత్వము యొక్క అర్థము - ఎరిగినవాడను కనుక - నాకు తెలియును: విశ్వమునకు వివేక కేంద్రము - ఆత్మకు ధైర్యమును అద్భుతానుభవమును ఒకే సారిగా ఇచ్చునది.

ఇదేవిధముగా జేమ్స్ గూఢమతములోని ఆసక్తికూడ "విశ్వచైతన్య ముతో"నూ, ప్రకృతిసంబంధమైన గూఢమతములోనూ ప్రయోగములు చేయుటనుండి ఈ గూఢమతము తర్కభావములు అను మాయలజోలికి పోకుండ "వ్యక్తిగతమైన అస్తిత్వము అర్థమును", విధిని, ఎట్లు జ్ఞానప్రకాశ ముతో ఎరుకపరుపగలదో వివరింప యత్నించుటకు పోయినది. రహస్యాను భవము ఒక యథార్థ సత్యముతో లేదా యథార్థవిషయముతో, సంబంధము కనుక (ఒక రకమైన చైతన్యముగా) తర్కమునకు, భావమునకు సంబంధిం చని ఒక అనుభవమో లేదా చూపో అగుచున్నది అని అతడు నమ్మెను.

భావసంబంధులైన మతానుభవముల రకములకు మరలినచో జేమ్స్ వాటిని "ఆరోగ్య మనస్కత", "రోగగ్రస్తమైన ఆత్మ" అను రెండు శీర్షికలక్రింద చర్చించుటను చూపగలము. "ఆనందము జన్మతోవచ్చిన" వారగు ఆరోగ్య మనస్కులలో జేమ్స్ యమర్సన్, థియొడోర్ పార్కర్, యడ్వర్డ్ ఎవరెట్, వాల్ట్ విట్మన్, నవీనభావ క్రైస్తవవిజ్ఞానములందు శ్రద్ధగలవారు - వీరిని పేర్కొన్నాడు. ఇంకా ఇలా చెప్పినాడు:

కడచిన యాభై సంవత్సరాలలో క్రైస్తవమతమున వచ్చిన ఔదార్య వాదాభివృద్ధిని చర్చిలో నరకాగ్నివంటి ఆగమశాస్త్రంతో చక్కగా పొందుపడిన రోగగ్రస్త బుద్ధిమీద ఆరోగ్య మనస్కుల విజయమని న్యాయ ముగా చెప్పవచ్చును. ... నూరేండ్లనుండి పెరుగుతూవచ్చి గడచిన ఇరవై

అయిదు సంవత్సరములలో వేగముగా యూరప్ అమెరికాలలో వ్యాపించిన ఆ "పరిణామసిద్ధాంతము"లో ఒక క్రొత్తరకమైన ప్రకృతి మతమునకు భూమిక ఏర్పడినదనియు, అది మన తరమువారిలో అనేకుల మనసులలోనుండి క్రైస్తవమతమును పూర్తిగా తొలగించివేసినదనియు తెలియగలము, విశ్వపరిణామము అను భావము సాధారణముగా బాగుపరచి వృద్ధిచేయుట అను సిద్ధాంతమునకు అక్కరకువచ్చును. ఈ సిద్ధాంతము ఆరోగ్యమనస్కుల మతావసరములకు ఎంత చక్కగా సరిపోవుననగా అది వారికోసమే సృష్టింపబడినదా అనిపించును.

ఈ భాగమున జేమ్స్ ఒక చిత్రమైన ద్వివిధాభావమును చూపుచున్నాడు. తాను స్వయముగా ఈ "ఔదార్యవాద పురోభివృద్ధి" కి సంబంధించినవాడు. ఇది ఒక క్రొత్త, క్రైస్తవేతరమైన, ఆశావాదిమతమును తయారుచేసినది, జేమ్స్ దీనికి సంబంధించినవాడయ్యును తన స్వీయవారసత్వ సంపత్తిని సవిమర్శముగా పరిశీలించుకొనగలిగినాడని కనపడగలదు. సాంఘిక సమస్యల ఆవశ్యకతాభావము తానెన్నడూ ఎరుగననియు, "భగవంతుడు న్యూ ఇంగ్లండ్‌నకు మేలుచేసినాడు" అని మాత్రమే తానెరుగుదుననియు చెప్పుచు షేలర్ మాథ్యూస్‌తో జతకలిపి ఉండవచ్చును. అయినను షేలర్ మాథ్యూస్‌వలెనే ఇతడుకూడ ఇటువంటి ఆరోగ్యమనస్కతలోని బోలుతనమును గుర్తించినాడు. అది ఏదో పసితనపుచేష్టగా భావించి దానిని ఉదారదృష్టితో చూచినాడు. ఎత్తిపొడుపుగా వ్రాసిన వానిలో ఒక భాగమును ఉదాహరిస్తున్నాను:

మనకందరకు ఎవరో ఒకచెలికాడు ఉంటాడు. బహుశః మగవాడుకాక తరచుగా స్త్రీయో కావచ్చును. ముసలిదికాక, వయసుదే కావచ్చును. ఆచెలి ఆత్మ ఇంద్రనీలచ్ఛాయకలది, దానికి మనుష్యుల మలినోద్రేకములకంటె పూలతో పక్షులతో, మనోహరమైన అమాయక విషయములతో సన్నిహిత సంబంధము. మనుష్యునిగూర్చి గాని దైవమునుగూర్చిగాని చెడ్డగా తలచలేదు. ఆమెలో మొదటినుండి మతసంబంధమైన తృప్తి సంతోషములు ఉండుటవలన ఆవానికి వెనుకటిబరువునుండి విమోచనము కలిగించు అవసరములేదు ... రోమిష్టు చర్చిలో ఇటువంటి పాత్రలు పెరుగుటకు తగినచోటున్నది. నిశ్చయముగా నిరాశామార్గమునకు చెందిన మనస్సులు కలవారు నడిపించే భావపద్ధతులుగల ప్రొటెస్టెంటు సిద్ధాంతము

లలో ఇట్టి పాత్రలకు అవకాశముతక్కువ, అయినను ప్రొటెస్టాంటిజమ్‌లో కూడ ఇట్టివి దండిగానేఉన్నవి. యూనిటేరియానిజమ్‌లోనూ సామాన్యమైన ఉదారదృష్టిలోనూ మొన్న మొన్న వచ్చిన ఔదార్యవాద లక్షణాలలో ఈరకపు మనస్సుకలవారు నాయకులై నిర్మాణాత్మక పాత్రలను నిర్వహించినారు. ఇప్పటికి నిర్వహిస్తున్నారు.

ఇటువంటి "జనరంజక" మతముతో జేమ్స్ సంబంధము పెట్టుకొనడనుట స్పష్టము. "వేదన", "రోగగ్రస్తమైనఆత్మ" కల "ద్విజన్ములి"వంటెకానిఎడ ఆయనకు అంతకంటె గౌరవము ఎక్కువనుటకూడస్పష్టము. జేమ్స్ తన చిన్నతనములో ఎడతెగని మానసిక నైరాశ్యముతో ఎట్లు పోరాడినాడో తెలిసినవారికి అతడు ఇటువంటి మతానుభవమునుగూర్చి రోగమును పరిశీలించినట్లు పరిశీలించుట ఆశ్చర్యమును కలిగింపదు. కాని జేమ్స్ తన స్వీయానుభవమును గణనలోనికి తీసుకొనక మన స్తత్వశాస్త్రజ్ఞులకు, మతనాయకులకు, మతము మార్పులోని లక్షణముమీదగల ఇప్పుడున్న ఆసక్తినిగురించి మాత్రమే తలపోసినారు. హఠాత్స్థాభావముతో కూడ అతడు తలపోసినాడు:

ఆరోగ్య మనస్కత తాత్వికసిద్ధాంతముగా నుండుటకు చాలదనుటలో సందేహములేదు. ఎందుకనగా అది కొన్ని దుష్టవిషయములను సకారణముగా వివరించుటకు అంగీకరింపదు. ఆ దుష్టవిషయములు అచ్చముగా యథార్థవిషయములోని ఒకభాగము. జీవితములోని విశిష్టతను అవియే తరచిచూపునేమో! ప్రగాఢమైన సత్యభూమికలను చూచునట్లుగా మన కన్నులు తెరపించుటకు అవి తప్ప వేరు సాధనములు లేవేమో! సాధారణమైన జీవనక్రమములో వివేకరహితమైన వేదనలో ఉన్నట్టి దుష్టక్షణముల వంటివే ఉంటవి. ఈ క్షణములలో అత్యంత దౌష్ట్యమే గెలిచి తనవంతు చెల్లించుకుంటుంది.

దుఃఖము, బాధ, మృత్యువు అనువానినిగురించి సూటిగా, చురుకుగా ఏమాత్రము శ్రద్ధచూపని ఆరోగ్యమనస్కతాపద్ధతి ఈ అంశమును కనీసము తమ పరిధిలోనికి తీసుకొను తక్కిన పద్ధతులకంటే అసమగ్రము. అందుచేత నైరాశ్యాంశములు చక్కగా తరచబడినవే పూర్ణమతములుగా కనబడుచున్నవి. వీటిలో క్రైస్తవమతము బౌద్ధమనము మన మెరిగినవి. అవి ముఖ్యముగా విమోచనమతములు.

ఆరోగ్యమనస్కత రోగగ్రస్తఆత్మ రకముల చిత్తవృత్తిలోని ఈ ప్రధాన భేదమున్నను, ది వెరైటీస్ ఆఫ్ రెలిజియస్ ఎక్స్పెరియన్స్ అన్న గ్రంథములో ఒక గమనింపదగిన రచనా భాగమున్నది. జేమ్స్ చేసిన రోగనిదానములో ఈ రెండురకముల చిత్తవృత్తులవారుకూడ సాధింపగల ఋషిత్వమును గురించిన వింగడింపు మరింత ప్రధానమైనవిగా ఉన్నదని చూపును. దీనినిబట్టి తన "నిశ్చయములకు" ఈ క్రింది ముఖ్యమైన ఒప్పుకోలును అధసూచికముగా ఆయన ఇచ్చినాడు.

ఆరోగ్యమైన మనస్సునకు రోగగ్రస్తమైన మనస్సునకు మధ్యను, అల్లే ఏకజన్మ ద్విజన్ముల వారిమధ్యను, ఉన్న తేడాలు ... చాలమంది అనుకొనునట్లు అత్యంత వ్యతిరేకములు కావు. ఏకజన్ముని జీవితచైతన్యమును ద్విజన్ముడు "వట్టినీతి" అనియు సరిగా మతముకాదనియు చిన్న చూపు చూచును. ఆచారపరాయణుడైన ఒక మినిస్టర్ ఇట్లు చెప్పినాడట: "డాక్టర్ షానింగ్ తన అతిశయమైన ఋజుశీలమువలన అత్యున్నతమైన మతజీవితమునుండి తొలగింపబడినాడు" ద్విజన్మునకు జీవితముమీదనున్న దృక్పథము మరింత విస్తృతము, మరింత పూర్ణము, అనుట నిజము వారు "వీరము"గా గంభీరముగా జీవితమును గ్రహించుపద్ధతి ఒక "ఉదాత్త సమ్మేళనపద్ధతి." ఇందులో ఆరోగ్యమనస్కత, రోగమనస్కత రెండును ప్రవేశించి కలసిపోవును. చెడ్డను పరిహరింపరు కాని అది ఈ వ్యక్తుల ఉదాత్తమైన మతోత్సాహములో ఉత్కృష్టమైపోవును. ... ఒక్కొక్కరకమువారు దివ్యతత్వముతో సంయోగముపొందు పరమ చైతన్యము వ్యక్తికి నిత్యాచరణలోకూడ చాల ముఖ్యము. తమతమ చిత్తవృత్తులకు అనువైన మార్గములలో వ్యక్తులను ఆ చైతన్యమునకు నడువనిచ్చుటయే మంచిది. ... ఈ పద్ధతిలోని సంకటతీవ్రత ఎక్కువ తక్కువలకు సంబంధించినది మాత్రమే, ఒకడు ఎంతకాలము పాపమును కుడువగలడు, ఎప్పుడు దానిని తప్పించుకొనసారంభించును, ఎప్పుడు దానిని వదలించుకొనును అనునవికూడ పరిమితికి ఎక్కువ తక్కువలకు సంబంధించిన విషయములె. అందుచేత మనము ఒక వ్యక్తిని ఏకజన్ముడనియో, ద్విజన్ముడనియో, చెప్పుట చాలాచోట్ల నియమరహితమే అగుచున్నది.

క్లినికల్ సైకాలజిస్టు, ప్రాప్తకాలజ్ఞత తత్వవాది అయిన జేమ్స్ మతానుభవమునుగూర్చి చేసిన వింగడింపు "ఋషికత్వ ఫలములకు"

వెలకట్టుటగా పరాకాష్ఠనొందుట సహజలక్షణము, ఋషికత్వమనుమాట "మతజీవితము" లోని పలువిధలక్షణములను మొత్తముగా సూచించు విస్తారమైన అర్థమున ఆయన వాడినాడు. నాగరిక జీవితములో మత విషయకమైన సద్గుణములు, దుర్గుణములు, చేసెడివనిని అంచనా వేయుచు నీతివాది చేసెడిపని చేసినాడు ఋషిత్వమున ఏది సాధారణమో, ఏది అసాధారణమో అని గుర్తించుటకు జేమ్స్ చేసిన ప్రయత్నమును చూడగా ఈ శతాబ్దపు తొలినాళ్ళలో అమెరికన్ జీవితమున ఎటువంటి మతాదర్శ ములుండెడివో చక్కగా తెలియగలవు.

మతానుభవము అత్యంతము వ్యక్తిగతమనియు ఊహింపరానిదనియు, క్రమబద్ధము కాదనియు అందుచేత ఆచారపరాయణతలు అన్నియు పులు ముడులన్నియు, కొంచె మించుమించుగా లోకమున "ఋషులం"దరు "ఏకాకుల"నియు జేమ్స్ తొట్ట తొలుతనే అన్నాడు.

మనము పరిశీలిస్తున్న మతానుభవము, వ్యక్తి, స్వీయహృదయములో పుట్టి నశించేది. ఈ రకమైన తొలిచేతి వైయక్తికానుభవము, దానిని చూచినవారికి మతద్రోహచర్యగా కన్పింపబడినట్లు తోచడం ఎప్పుడూ ఉన్నదే. అది లోకములోనికి నగ్నముగా ఒంటరిగా వస్తుంది. అది ఎవనిలో కలుగుతుందో వాడు, కొంతకాలమైనా, పిచ్చిపట్టినవాడిగా కనిపించడం తథ్యమే ... ఒక మతము ఎప్పుడు ఆచారపరాయణమైపోతుందో దాని అంతర్‌దృష్టి కాలము అప్పటికే అయిపోయిన దన్నమాట: ఊట ఎండి పోయినది; విశ్వాసముగలవారు ప్రత్యేకముగా రెండవచేతి అనుభవముతో బ్రతికి తాముకూడ ప్రవక్తలను రాళ్ళతో కొడ్తారు. ... మతానికి అంట కట్టబడుతున్న నైచ్యములన్నియు అచ్చమైన మతమునకు అంటకట్టవలసి నవి కానేకావు. మతమునకు తోడి భాగస్వామి అయిన సంఘీభావ ప్రాంత మునకు అంటకట్టవలసినవి. ఇంక దురభిమానాలలో చాలవాటిని మతము నకు సంబంధించిన బుద్ధి సంబంధమైన భాగస్వామికి అనగా ఇది ఇంతే అను తత్వమునకు ఖండితముగా సిద్ధాంతమును మూసివేసి విధిని ఏర్పరచుపద్ధతికి అంటకట్టవలసివి, ఎక్లిసియాస్టికల్ తత్వమంతయు సాధారణముగా ఈ రెండు తత్వముల కూడికవలన ఏర్పడినదే. అందుచేత సంఘీభావ చిత్త వృత్తిని కేవలము ఆంతరజీవిత లక్షణములతో కలగాపులగము చేయవద్దని

మిమ్ములను వేడుకొనుచున్నాను. అచ్చమైన అంతరజీవిత లక్షణములను గురించియే మనము పరిశీలించుచున్నాము.

వ్యవస్థిత మతమునుగురించిన ఈ దూషణ విలియమ్ తండ్రియైన పెద్ద హెన్రీ జేమ్స్ వ్రాసిఉండవచ్చు. ఈ దూషణకు మతానుభవములోనికి రాజకీయములను రానీయకూడదనియు ఋషులను వారి మతసూత్రము లనుబట్టి కాక వైయక్తికముగా వారి జీవితములోని నీతిగుణమునుబట్టి మంచిచెడ్డలు తేల్చవలెననియు జేమ్స్ చూపిన ఆతురత చాలవరకు కారణము. ఒక సాధువు దైవభక్తి విషయములో అతిగాపోతే అది వాని స్వకీయమైన మతానుభవమునకు చెందవలసిన దోషము. నేరాలుచేసే ఒక ఉద్యమాన్ని కాని ఒక చర్చినికాని అతడు తయారుచేస్తే ఆదోషము, మతాన్ని సూటిగా స్పృసించదు, ఒకవేళ స్పృసించినా డొంకతిరుగుడుగానే.

జేమ్స్ నిర్ణయించినప్రకారముగా మతానుభవమునకు నేరుగా కలుగు ఫలములను సంగ్రహముగా ఇట్లు చెప్పవచ్చును.

(1) భక్తిపరత లేదా దైవభక్తి. అతిగాపోతే మూఢభక్తిని పెంచుతుంది. మూఢభక్తి దుష్ఫలితములుగా జేమ్స్ చెప్పిన జాబితాలో "సద్గుణములను బట్టి ఋషిత్వము వచ్చుట"గూడ ఉన్నది.

(2) భక్తికి సన్నిహితముగానున్న శుచిత్వము. ఇదికూడ "దైవసంబంధమైనవేదన" గా కాగల అపాయమున్నది. ఈ సందర్భముగ జేమ్స్ ఇట్లనుచున్నాడు.

16 వ శతాబ్దములోని కేథలిక్కు మతము సాంఘికన్యాయమును గురించి పట్టించుకొనలేదు. తన ఆత్మను తాను పరిరక్షించుకొంటూ లోకాన్ని పాపానికి వదలటం అప్పుడు తప్పుకాదు. ఈ నాడు, తప్పైనా ఒప్పైనా సామాన్యమైన విషయాలలో ఉపకారబుద్ధి ఒకవ్యక్తి శీలములోని ప్రధాన యోగ్యాంశముగా భావింపబడుతున్నది. నీతిభావములో వచ్చిన లౌకికమైన మార్పుల ఫలితంగా ఇది ఏర్పడింది ఈ మార్పులనుగురించి ఇంతకు మునుపే చెప్పినాను. ఇంక ప్రజాసముదాయానికి బహిరంగంగా ఉపకరించడంగాని ప్రైవేటుగా ఉపకరించడంగాని ఒకవిధమైన దేవతాసేవగా పరిగణింపబడుతున్నది.

(3) మార్దవముకూడ సాధుత్వ సంబంధమైన సద్గుణము. ఎక్కువైతే ఇదికూడ వివేకరాహిత్యముగా "పనికిమాలినవారిని పరిరక్షించి పరాన్న భుక్కులను భిచ్చగాండ్రను పెంచడమే" ఫలితమౌతుంది. దేనినైనను ఎదుర్కొనకుండా ఉండడం మార్దవాధిక్యము అగునా అనునది జేమ్సు చెప్పుటకు సందేహించినాడు కాని ఈ మాట మాత్రమన్నాడు:

ఏ విషయమైనా పైకి పోవలెనంటే ఎవరో ఒకరు తొలియడుగువేసి ఆ బాధ్యతను స్వీకరించడానికి సిద్ధంగా ఉండాలి. ఋషివలె మార్దవము, ఎదుర్కొనని, ఆచరింప నిచ్చగింపని వారెవరునూ ఈ పద్ధతులు విజయ వంతములగునా కావా అని చెప్పజాలరు. అవి విజయవంతములే అయి నప్పుడు బలప్రయోగము లౌకికవివేకము అనువానికంటె మరింత శక్తి మంతముగా విజయవంతములగును. ... లౌకిక వివేకాన్ని భద్రంగా దాటిపోవచ్చునన్న ఈ ఆచరణలోని నిరూపణము మానవజాతికి ఋషి ఇచ్చెడి మహిమాన్వితమైన వరము.

(4) ప్రార్థన. అంతస్సు దివ్యతత్వములో సంవదించుట అన్న విస్తార మైన అర్థములో గ్రహించినట్లైతే ప్రార్థన "మతానికి ఆత్మయు, సార మును" అగును. మోక్షవిషయాలకు లేదా దేహారోగ్యమునకు సంబంధిం చిన "లావాదేవీలు" నిలిచిపోయినప్పుడు అర్జీ పెట్టుకొన్నట్టుగా చేసే ప్రార్థన మూఢ "మార్గ" మే అవుతుంది. మనుష్యుని అంతశ్శక్తులకు మతసంబంధమైన "దివ్యోత్సాహము" ఒక ఫలముగా జేమ్సు భావిస్తాడు.

(5) పాపములు ఒప్పుకొనుటనుగూర్చి కొద్ది క్లుప్తమైన మాటలతో ముగించి వేసినాడు. ఈ ఒప్పుకోలును మరింత "పతనావస్థకు" పోనివ్వవలసి నదేనా లేక దానిని మరింత అచ్చమైన బహిరంగవిషయముగా చేయ వలెనా అన్నది అతని మాటలవలన స్పష్టముగా తెలియదు. అతడిటు వ్రాస్తున్నాడు:

చేసినపాపం చెప్పుకొన్నవానికి దగాలు ముగిసి నిజాలు మొదలైనవి; వాడు తనలోని క్రుళ్ళును బయటికి తెచ్చుకొన్నాడు. వాడు దానిని యథా ర్థముగా వదలకొట్టుకొనకపోయినను కనీసము పైపూత సద్గుణముతో దానిని పులుముకొనుటలేదు - వాడు కనీసము ఒక సత్యవాదిత్వ ప్రాతి పదికమీదనైన బ్రతుకుచున్నాడు. ఆంగ్లోశాగ్జన్ జనసమాజాలలో పాప ములు ఒప్పుకొను ఈ ఆచారము పూర్తిగా పతనమైపోవుట ఎందుకో

చెప్పుట కొంచెం కష్టము. పోపరీ కి విరుద్ధమైన ప్రతీకారభావము చారిత్రక వివరణము ఔతుంది, ఎందుకనగా పోపరీలో పాపము ఒప్పుకొనుటతో పాటు తపస్యలు, తప్పునుండి విడిచిపుచ్చుట, మరి ఇంక కొన్ని ఒప్పుకొనుటకు వీలులేని పద్ధతులుకూడ ఉండును. ఇంక పాపి అయినవాని విషయములో ఒప్పుకోలు అక్కర చాల ఎక్కువై పోయి బొత్తిగా దానిమాటయే పట్టించుకొనక పోవునట్టిస్థితి వచ్చినట్లు అనిపించును. చాలమందిలో ఈ రహస్యపుగుల్ల, లోపలి పుండు ఎప్పుడో పగిలి, కన్ఫెషన్ విన్నవాడు అయోగ్యుడైనా, విశ్రాంతి పొందవలసిఉంటుంది. కేథలిక్కు చర్చివారు తీవ్రమైన బహిరంగ పాపాంగీకారపద్ధతి స్థానంలో హృదయికర్ణిక పాపాంగీకార పద్ధతిని ఒక ప్రీస్టుకు అప్పగించి తెచ్చిపెట్టినారు. స్పష్టంగా ప్రయోజన సంబంధ కారణాలతో ఇది జరిగింది. ఇంగ్లీషుమాట్లాడే ప్రొటెస్టెంట్లు మైన మనకు సామాన్యంగా మనకుండే ఆత్మ విశ్వాసంవలన, మన స్వభావములోని కలియమి గుణమువలన, భగవంతునికి మాత్రము అరలేకుండా చెప్పుకుంటే చాలునన్నట్లు తోచుతుంది.

(6) మునివృత్తి: జేమ్స్ ఈ విషయాన్ని చాల విమర్శపూర్వకమైన శ్రద్ధతో పరిశీలించినాడు. తాత్వికులు దీనిని అవినీతి అని ఖండిస్తున్న సమయంలో జేమ్స్ మునివృత్తిని ప్రత్యేకమైన శ్రద్ధతో సమర్థించినాడు. ఆయనదృష్టిలో దీనిని ఈనాటికి తగినట్లుగా మార్చవలెనన్నది. అతని సమర్థనలోని ఒక నియమము. కలితో చిన్నాభిన్నమైన లోకమునందు దారిద్ర్యము ఒక అవసరమైన శిక్షణగా జేమ్స్ సిఫార్సు చేసిన రచనాభాగాన్ని "యుద్ధానికి ఒక నైతిక పర్యాయము" 15 గా అయినదానిని వ్యక్తీకరించుటగా ఇప్పుడును చదువదగినది. (చూడు ఎగ్జిబిట్టు XIX)

మతాన్ని దాని యథార్థమైన అథవా సాధ్యమైన ఫలములనుబట్టి జేమ్స్ నీతివాదిగా దానికి అంచనా కట్టునట్లు చూపించే చెప్పవలసిన కొన్ని అంశాలలో మతమునకు సంబంధించిన సద్గుణాలను గురించిన ఈ వ్యాఖ్యాన వాక్యములు ఒక కొన్ని ఉదాహరణలు మాత్రమే. జేమ్స్ నీతివాదమునకు అతడు మతానుభవములోని రసభావ అంశమును తిరస్కరించుట కొట్ట వచ్చునట్లు కనిపించే సాక్ష్యము. ఈ రసభావ విషయమును జేమ్స్ మతానికి సంబంధించిన అప్రధానవిషయంగా చెప్తాడు. ఈ విషయంమీద అతడు అన్న ఎత్తిపొడుపు మాటలు కొంతవరకు సాధారణమైన లిటర్జికల్ పద్ధతుల

మీదికి, ప్రత్యేకముగా కార్డినల్ న్యూమన్ మీదికి ఉద్దేశింపబడినవి. కాని ఈ మాటలు మతానుభవమన్న దానిని "రసభావసమృద్ధి", రాజకీయాలు, వగైరాల బాహ్య విషయ సంబంధము లేకుండా చేయుటకుగూడ ఉద్దేశింపబడినవి. వ్యక్తిగతమైన నేటిమతానుభవములోని అంతర్భాగమని ఆయన భావన. కాని కళకు సంబంధించిన చాల వ్యక్తిగతాంశములుకూడ ఆయనకు బాహ్య విషయములుగానే కనుపించినవి. ఈ క్రింది రచనభాగము జాగ్రత్తగా వింగడించి చదువదగినది.

న్యూమన్ (మతపండితులు దేవునికిచెప్పిన గుణాల జాబితాను) లెక్కపెడుతూ వ్రాసిన ధారాళమైన రచనలో ... అతడు వాని రసభావ సంబంధమైన విలువ ఎంత గొప్పదో చూపుతున్నాడు. చర్చిలో ఒక ఆర్గన్, ప్రాత తాళాలు, పాలరాతి విగ్రహాలు, భిత్తికాచిత్రాలు, మచ్చుగాజుల కిటికీలు ఉంటే ఎట్లు శోభ చేకూరుతుందో అట్లే ఈ ఉదాత్తమైన అర్థంకాని మాటలను చేర్చుకోవటంవల్ల మన మామూలు వట్టి దైవభక్తికి శోభ చేకూరుతుంది. గుణవిశేష వాచకాలైన మాటలవల్ల మన భక్తికి ఒక వాతావరణము, గాంభీర్యము వస్తవి. ఈ మాటలు ఒక స్తోత్రగీతము వంటివి, యశస్సంకీర్తనమువంటివి. అర్థము కాకపోవడంవల్ల మరింత ఉదాత్తంగానూ కనిపింపవచ్చును. హిదన్ ప్రీష్టులు తమ దేవతా విగ్రహాలమీద ధగధగలాడే ఆభరణాలనుచూచి వాని శోభకు ఈసుకొన్నట్లుగా న్యూమన్ బుద్ధి కలవారు ఈ మాటల మేల్మికి ఈసుకొంటారు. ... స్థిరతకు ఆరోహణ అవరోహణగతులకు పొందిక చెడనట్టియు, ఎన్నో గొప్ప సంస్థలు పొల్లుపోక పాటించుటవలన ఏ ఒక్క చిన్న అంశముకూడ అప్రధానము కానిదియు ఐన ఈ ఉదాత్త సంకీర్ణ మార్గముతో పోల్చినప్పుడు ఎవాంజెలికల్ ప్రాటెస్టెంటిజమ్ ఎంత నేలబారుగా కనబడుతుంది! "పొదలోని మనిషి దైవాన్ని కలుసుకోవచ్చు" నని డంబాలు చెప్పే ఐకాంతికుల మతజీవితాల వాతావరణం ఎంత వట్టిపోయి ఉంటుంది! ... రాచరికపు ఊహాపోహలను కూడ ఇది దరిద్రగొట్టుగా చేస్తుంది!

ఈ రసభావ భావములలోని బలముచూస్తే నాకు ఇట్లనిపిస్తుంది. ప్రాటెస్టెంటిజమ్ కేథలిక్కు సిద్ధాంతమునకంటే ఆధ్యాత్మిక గాంభీర్యమునందు ఎంత గొప్పదైనను ఈనాడు ఈప్రాత చర్చినుండి ఎక్కువమందిని తన మతములోనికి మార్చుకొనుట బొత్తిగా సాధ్యముగానిపని. ఈ రెండవ

దానిలో మంచి పాస్టెర్ లున్నారు. ఊహకు ఎంతో బాగుంటుంది. రకరకాల తేనెతో ఎన్నో గదులున్నవి. మనుష్య స్వభావాన్ని రకరకాలుగా స్పృశిస్తుంది. కేథలిక్కుల కళ్ళకు ప్రొటెస్టెంటిజమ్ ఎప్పుడూ సత్రశాల లాగ కనబడుతుంది. దాని అత్యంత వ్యతిరేకదృష్టి కేథలిక్కువాని మనస్సుకు అవగతమే కాదు. ... ఈ రెండు ఒకదాని నొకటి అర్థమే చేసుకోలేవు. — ఈ రెంటి భావశక్తి కేంద్రములు చాల భిన్నములు,

ఈ భాగాన్ని సాధారణంగా జేమ్సు ప్రొటెస్టెంట్ అభిమానాన్ని చూపడానికి ఉదాహరిస్తారు. కాని నిక్కచ్చిగా చెప్పితే దీని నతడు ఒక కళాకారుని దృక్పథముతో వ్రాసినాడు జేమ్సు కళాకారుడు. కేథలిక్కుల ఆడంబరాలు, మత కళ విషయంలో కాల్విన్ సిద్ధాంతవాదుల సంశయాత్మకదృష్టి అతనిరసభావాభిరుచికి సరిపోయేవి కావు. రసభావముల విషయంలో కేవలం పాతదన్నది, మోసమైనది సరిపడని ఆధునికుడతడు. సాంప్రదాయికమైన కళ అతని అభిరుచికి సరిపడకుండుటకు బహుశః అతని ప్రొటెస్టెంట్, నైతిక వాతావరణముకంటె కేథలిక్కు సిద్ధాంతముమీద ఉండిన అతని ఎత్తిపొడుపు చిత్తవృత్తియే కారణము కావచ్చును. ఏది ఎట్లున్నను జేమ్సు తన కళానుభవాన్ని, మతానుభవాన్ని సాధ్యమైనంత విడివిడిగా పెట్టుకొన్నాడు.

## మతానుభవాన్ని గురించిన ఇతర వ్యాఖ్యానాలు:-

మ తా ను భ వా ల ర కా లు అన్న పుస్తకము ప్రకటితము అయిన వెంటనే జేమ్సు సహోద్యోగి జార్జి శాంతాయన వ్రాశిన మరియొక పలుకుబడిగల సిద్ధాంతగ్రంథము వచ్చింది. ఈ గ్రంథము జేమ్సుకు ఎక్కువగా ఋణపడియున్నది. అయినను శాంతాయనుని మతంలో రీ జ న్ ఇ న్ రె లి జ న్ అన్న గ్రంథము మంచి విరుగుడు. ఎందుకనగా మతమునకు సంబంధించిన రసభావదృష్టిని, సంస్థానదృష్టిని అది చూపింది. జేమ్సు దృష్టికి ఇవి చాల భిన్నములు. జేమ్సు చెప్పిన మూడురకాల (భావము, బుద్ధి, జ్ఞానప్రకాశము) చైతన్యముల స్థానములలో శాంతాయన మత జీవితము యొక్క పెరుగుదలలో మూడు దశలను చెప్తాడు: కారణ కార్య భావమును ఎరుగనిది (మూఢ విశ్వాసము), కారణ కార్యభావమును ఎరిగినది (తాత్విక విశ్వాసము), కారణ కార్యభావమును అతిక్రమించి

నది (ఊహాపోహాల నిర్మితి). ఈ క్రమము మతమునకు సంబంధించిన రెండు దిశలలోను చూడవచ్చును: దైవభక్తి. కారణ కార్యభావమును ఎరిగిన రూపములో ఇది మన అస్తిత్వభూమికలకు విశ్వాసము నెఅపుటయే అగును; ఆధ్యాత్మికత కారణ కార్యభావమును ఎరిగిన రూపములో ఇది నిరాటంకముగా ఆదర్శములను సాధించుటయే అగును. కారణ కార్యభావమును ఎరుగనప్పుడు దైవభక్తి ప్రమాణ గ్రంథములమీద ఆధారపడుట, సంప్రదాయమును పాటించుటగా ఉండును; కారణ కార్యభావమును అతిక్రమించినప్పుడు దైవభక్తి అస్తిత్వ యశస్సంకీర్తనముగా ఉండును. కారణ కార్యభావమును ఎరుగనప్పుడు ఆధ్యాత్మికత దురభిమానముగా (లక్ష్యము మరచిపోయినపిమ్మట రెండంతలైన శక్తిగా) ఉండును. కారణ కార్యభావమును అతిక్రమించినప్పుడు ఆధ్యాత్మికత దివ్యరూపములను, సారములను, అథవా ఆదర్శములను ఆగమశాస్త్రముద్వారా కళ ద్వారా సాధించుటగా ఉండును. బాలిశత్వమునుండి వివేకమునకు, వివేకమునుండి భావమునకు, ఇట్లు ముందుకు పోవుటలో నాగరిక సంస్థారూపముగా మతమును వ్యక్తీకరించుట సామూహికమైన మతాశక్తి అనునవి పెరుగుట ఏర్పడినది,

అప్పటి తక్షణ పరిస్థితులలో ఈ గ్రంథము కేథలిక్కు నవీనతా సిద్ధాంతమునకు సమర్థకమైనది. కాని అమెరికనుల మతవిద్యకు సంబంధించిన స్థిర ఫలితములనుబట్టి చూచినప్పుడు అది ప్రాచీనపద్ధతిని గూర్చిన ఉత్సాహమునకు చిన్న వ్యాఖ్యానగ్రంథమైనది. ముఖ్యముగా శాంతాయన వ్రాసిన పద్యాలను, కవిత్వము - మతము అను దానిమీద వ్రాసిన వ్యాసాలను చూచి ఈ గ్రంథాన్ని చదివినప్పుడు ఇందలి ప్లాటానిజమ్, అరిష్టాటిలియానిజమ్, మాడరన్ నాచురలిజమ్‌లను భావాత్మకముగా కలుపుట చదువుకొన్నవారిలో సగము క్రైస్తవము, సగము గ్రీకు సంబంధి అయిన క్రొత్త మానవతావాదానికి ప్రమాణగ్రంథము అయింది. ఇది యువకులైన స్వచ్ఛందభావుకులను వ్యవస్థిత మతముతో సమన్వయ పరచింది. కారణం చెప్పకుండా ఇది ఇంతే నను వారి మూఢ విశ్వాసాన్ని పోగొట్టింది. అన్నిటికంటె ఎక్కువగా జేమ్సు ఏది చేయుటకు ప్రయత్నించుచుండెనో దానిని ఈ గ్రంథము చేసింది - వివేకమార్గమునకు అర్హస్థానము నిచ్చుట. ఈగ్రంథ భావముప్రకారము మానవతాత్మను శరీరమునుండి

ప్రతిక్కరింపకుండ, అథవా విశ్వాసమునకు వివేకమును వ్యతిరిక్తము చేయకుండా "వివేకప్రాణము"ను సాధన చేయవచ్చును. జేమ్సు తత్వములోవలెనే ఇందును మనుష్యానుభవములో వివేకమార్గమునకు ఒక మధ్యస్థా వ్యాఖ్యానాత్మక పాత్ర ఇవ్వబడినది. కాని శాంతాయన, జేమ్సుకంటే ఎక్కువగా, వివేకపూరితమైన అనుభవము నిరవధికమై స్వతంత్రమైన భావప్రపంచమునకు లేదా "అంతస్సు"నకు తలుపులు తెరచునదని భావించినాడు.

జేమ్సు, ఆస్తికులు చేసిన విమర్శలను ఎదుర్కొనునట్లుగా పరతత్వమును గూరి‍చ ఆదర్శభావమును మరల దిద్దు వంతు ఇప్పుడు జోసయ్యా రాయ్స్‌కు వచ్చినది. ఈపనిని అతడు తన చివరి గొప్ప గ్రంథమైన ది ప్రాబ్లమ్ ఆఫ్ క్రిష్టియానిటి (1913) అను గ్రంథములో చేసినాడు. ఈ గ్రంథము మతానుభవాన్ని మరింత మానవతా సిద్ధాంత దృక్పథముతో సాంఘిక దృక్పథముతో వ్యాఖ్యానించునది; తత్వశాస్త్రమునకు ఆగమశాస్త్రమునకు మధ్యవచ్చిన సమన్వయ ఆరంభమునకు చిహ్నము. ఈ సమన్వయము జేమ్సు కాలమునుండి వచ్చిన మతభావమునకు సంబంధించిన ఉద్యమములో కనబడుతూనేవచ్చినది. విశ్వానికి సంబంధించిన ఊహాపోహాలను వదలిపెట్టి రాయ్స్ చర్చివారివంటి ఉద్ధారక జనసమాజమును గురించిన ఒక విశ్వజననమైన సిద్ధాంతమును నిర్మింప ప్రయత్నించెను. చర్చివారు ఇతరులను ఉద్ధరించువారుగా భావింపబడుచున్నారు. ఈ తత్వము ప్రకారము మత విశ్వాసము గలవారందరు (పరస్పరము అర్థము చేసుకొనుట, ఒకటికిబదులుగా ఒకరు పరిహారము చెల్లించుట అనుభవములయందు విశ్వాసముతో వర్తించువారుఅందరును) చేరి ఒక అనంతమైన "ఇష్టజన సమాజము" అగుదురు. వీరితత్వము భగవత్తత్వము. సభ్యులందరు ఒకరి నొకరు. ఒకరి అనుభవములను ఒకరు" వ్యాఖ్యానించి పునర్వ్యాఖ్యానించి చివరకు భగవదనుగ్రహమువలన జ్ఞానము, బాధ, ఆనందము, సాధన అను వాని ఏకనిర్మితిలో పాలు పంచుకొన గల్గునట్లుగా ప్రయత్నించుటయందు వీరి విశ్వాసము నెలకొన్నది. మతజీవితమును గురించిన ఇటువంటిభావము చర్చిని ఆచరణలో దైవసదృశముగా చేసి ఆస్తికవాదులు ఒప్పుకొను దానికంటె ఎక్కువగానే "సాంఘిక ఆగమ శాస్త్రము" వైపు పోవుచున్నది. అయినప్పటికినీ రాయ్స్ ఈ శతాబ్ద

ములో క్రైస్తవమతము ఎదుర్కొనుచున్న సమస్యను కన్నులముందుపెట్టి అప్పటి అమెరికన్ తత్వశాస్త్రములోను ఉదారమైన ఆగమశాస్త్రములోను ఉండిన అతివాద వైయక్తిక సిద్ధాంతమును నిగ్రహించినది. పరమానుభవ మును లేదా భగవంతుని విశ్వసత్యములోనో లేదా పృథక్ అస్తిత్వము లోనో చూచుటకంటె మానవునికి వ్యక్తిగత, సాంఘిక, చారిత్రక మార్గ ములలోని మంచిచెడ్డల అనుభవములో చూచి మతానుభవమునకు న్యాయముచేయ ప్రయత్నించిన అమెరికన్ ఆదర్శవాదుల పద్ధతికి రాయ్స్ ప్రోత్సాహమిచ్చినాడు. భగవంతుని శాశ్వతుడుగాకాక నశ్వరక్రమములో మానవుల విలువలలో చూచుటకే ఈ ప్రోత్సాహము.

విలియమ్ యర్నెస్ట్ హాకింగ్, జార్జి ప్లింప్టన్ ఆడమ్స్. ఎడ్గార్డ్ యస్. బ్రైట్‌మన్, జాన్ ఈ. బూడిన్, డి విట్ హెచ్ పార్కర్, జూలియన్ సీలీ బిక్స్లర్ - వీరు వ్రాసిన గ్రంథములన్నియు జేమ్సు. రాయ్స్ ప్రభావమునకు లోనై ఆదర్శవాదములోని పై పద్ధతిని మరింత వివర ముగా వ్యక్తముచేసినవి. ఈ పద్ధతిని ఉదారమార్గమునకు చెందిన ఆగ మజ్ఞులు తమ పంథాలోనికి తీసివేసుకున్నారు. ఈ ఆగమజ్ఞులు, వారిలో ఒకరు చెప్పినట్లుగా దైవము ఒక వ్యక్తి కాకపోయినను వ్యక్తిగత మైన దైవమును ప్రార్థింపగలవాడు. ప్రొఫెసర్ గార్డన్ డబ్లియు - ఆల్ పోర్టు మతానుభవమును గూర్చిన ఈ వ్యాఖ్యానమునే మరికొంచెము స్పష్టముగా భగవంతుడు వ్యక్తిత్వ గుణవిశేషముయొక్క సాధారణీకృత రూపమని భావించుటద్వారా వ్యక్తిగతమైన విలువల రూపముగా చెప్పినాడు:

భౌతికమైన వ్యక్తిత్వమునుండి ఆత్మభావమును, విడిగా భావించుచు, క్రమముగా ఎక్కడనైనను, వ్యక్తిగత, శీల, సంరక్షణకు కారణమైన విలువకు వత్తుము. ... ఆత్మతత్వపు విలువలను వివరించి పరిరక్షించుటకు కావలసిన తప్పనిసరి కడపటివిలువగా వ్యక్తిత్వమునకు పరమోత్కృష్టమైన స్వరూపముగా భగవంతుని నేను ప్రకటించుచున్నాను. ... ఇట్లు భయము, రోగము, ఇష్టజన మరణము, దోషము, నష్టము, భద్రతా రాహిత్యము కలిగిన పరిస్థితులలో మతముద్వారా ఈ విలువలను మరల తెచ్చుకొనఁ చూచుట జరుగవచ్చుచున్నది.

సాధారణముగా అనుభవములను గూర్చిన సిద్ధాంతము మరింత విషయ దృష్టితో సమీపించుట, పెరిగివచ్చుట ఆదర్శవాదములోని ఈ లక్షణముల కంటె ఎక్కువగా మతానుభవమునుగూర్చిన జేమ్స్ సిద్ధాంతదృష్టికి విప్లవాత్మకమైనది. రకరకములైన చైతన్యములను అంతర్ దృష్టిలోని స్థితులుగా వర్ణించుటను స్వానుభవముపై ఆధారపడియెడు తాత్వికులేకాక మనస్తత్వ శాస్త్రజ్ఞులుకూడ బొత్తిగా వదలివేసినారు. జేమ్స్ వ్రాసిన ప్రిన్సిపుల్స్ ఆఫ్ సైకాలజీ లో కనీసం సగపాలులో కనిపించెడు జీవశాస్త్ర లేదా డార్విన్ పద్ధతి అంతర్ దృష్టికి విరుద్ధముగా అందరిలోనూ తిరుగు బాటునకు దారితీసి 1900 లో ఉండిన "మతచైతన్య" పరిశీలనలు పోయి మత సంబంధమైన ప్రవృత్తిని లేదా వడివడికనుగూర్చి పరిశీలించుట వచ్చినది. ఇది మరల పురాతత్వశాస్త్ర, సాంఘికశాస్త్ర, సంబంధములైన విచారములకు తలుపులు తెరచినవి. దానిఫలితముగా ఈనాడు మత స్వానుభవశాస్త్రము పురాతత్వశాస్త్రము, సాంఘికశాస్త్రము, మానసికరోగ చికిత్సాశాస్త్రముల కలగలుపైనది. తాత్వికులలో జాన్ డ్యుయీ ఆగమ శాస్త్రజ్ఞులలో రీన్ హోల్డ్ నీబూర్ లు మతపరిశీలకుల దృష్టిని ప్రైవేట్, "ఏకాంత" అనుభవాంశములనుండి మానవచరిత్ర సంస్కృతులకు, మానవ సంస్థాచారములకు, స్వంత హక్కులకూ కుప్పబోసుకొన్న అర్థాలకు మళ్ళించినారు. మనుష్యుని గురించిన విజ్ఞానములో వచ్చిన విప్లవాత్మకమైన ఈ మార్పులో ఆత్మజ్ఞానమునుకాని వ్యక్తిగతమైన విలువలను గురించిన వ్యగ్రతనుగాని వదలుట అన్నదిలేదు. దీనికి విరుద్ధముగా, గడచిన యాభై సంవత్సరాలలో ఏర్పడిన ఆత్మజ్ఞానముయొక్క పెరుగుదల ప్రధానముగా "వ్యక్తులను" విడిగాకాక వారి పరిసరములలో ఒకరితో మరియొకరికి కల చారిత్రిక, సాంఘిక బాంధవ్యములలో వారి పైతృక సంపత్తిలో పరిశీలించుట అను దానివలన ఏర్పడినది. వ్యవస్థితమతమును, ఇప్పుడు "మలిచేయి" మతముగా భావించుటలేదు, ఎందుకనగా మనుష్యుడు తన బహిరంగ జీవితములోవలెనే ప్రైవేటు జీవితములోనూ "తక్షణ" మతానుభవమునకు దూరస్థుడై వుండవచ్చును.

మతమునుగూర్చిన ఈ క్రొత్త సాంఘిక శాస్త్రమునకు చాల ముఖ్యమైన ఫలము, ఏమనగా ఆగమశాస్త్రముమీద అది చూపిన ప్రభావము,

ఎందుకనగా మనము క్రిందటి ప్రకరణములో గమనించినట్లు "మత సంబంధ మైన పరిస్థితిని" లేదా మానవ భగవత్ సంబంధమును జేమ్స్ భావించి నట్లుగా ఏకాంత స్థితుడైన మానవుడు విశ్వస్థుడైన భగవంతుని చూచుటగా ఇప్పుడు భావించుటలేదు. మత సంబంధమైన పరిస్థితిని ఒక సాంస్కృతిక, చారిత్రక, సంఘటనగా లేదా సంకట పరిస్థితిగా భావిస్తున్నారు. ఈ పరి స్థితిలో మనుష్యుడు తమ మత సంబంధమైన నిర్ణయములు చేసుకొనుట కును తమ విశ్వాసములు ఏర్పరచు కొనుటకును ఒకరి నొకరు చూచు కొనుచు భగవంతుని చూడవలసియున్నది. మతము వ్యక్తిగత విషయమే అనుకొనుడు. కాని వ్యక్తులు సంఘజీవులు. మరి భగవంతుడుకూడ మానవ చరిత్రలో ఈ రెండునూ అగుచున్నాడు, నిర్దిష్టోద్యమములకు అతీతు డగుచున్నాడు. భగవంతుడుకూడ ఒక విశ్వసత్యమని అనుదానిని కాని, లేదా "విశ్వమునకు రాజు" అనుదానినిగాని కాదనుటకు ఆగమశాస్త్రజ్ఞు లెవ్వరును సిద్ధపడలేదు కాని ఆచరణలోని మతమునకు మతము ఎంత సహజమైనదో భగవంతుడు తానుకూడ అంత సహజమైనవాడు అగు చున్నాడు: ఆగమశాస్త్రజ్ఞులలో తాత్త్వికులలో ఇట్టి చరిత్రాభిమానము వచ్చుట ఈ శతాబ్దములో అమెరికన్ సంస్కృతిలో వచ్చిన విస్తారమైన మార్పులో ఒక భాగము. అయితే మతానుభవమునకు ఈ మార్పు చిత్ర ముగా గమనింపదగినదైనది.

వ్యక్తిత్వము అనుభవము అనుదానిని గురించిన విజ్ఞానములో వచ్చిన ఈ క్రొత్త మార్పులకు స్పష్టమై ఆచరణలో కనుపించినఫలము ప్రత్యేక ముగా పాపము, మోక్షము, అనువాని రూపమున భావింపబడిన రకరకము లైన అనుభవములకు ఆరోగ్య, రోగ భావములను వర్తింపజేయుట అయి నది. జేమ్స్ వ్యక్తులను "ఆరోగ్య" లేదా "రోగగ్రస్త" రకములుగా అభి వర్ణించినప్పుడు తాను ఎంతగా భవిష్యము చెప్పుచున్నాడో అతనికి తెలి యదు. ఆరోగ్యమైన మనస్సును రోగగ్రస్తమైన ఆత్మతో తార తమ్య పరీక్ష చేసినప్పుడు అతడు చాల సూక్ష్మమైన భవిష్యమే చెప్పినాడు. ఎట్లనగా ఈనాటి పాస్టర్లు సలహా చెప్పుటలోను మనస్తత్వరోగ నిదానము లోను ప్రధానలక్ష్యము రోగగ్రస్తమైన ఆత్మకు కూడ ఆరోగ్యముగా నున్న మనస్సును కల్పించుట; అనగా మనస్తత్వశాస్త్రము వింగడింపు మనస్తత్వశాస్త్ర రోగనిదానము (కనీసము కొంతవరకైనా) చెదరిపోయిన

అంతస్సునకు తన పరిస్థితినిగూర్చి విమర్శపూర్వకమైన చికిత్సాపరమైన అవగాహనకు శక్తినిచ్చు సాధనముల కల్పించినది. ఇట్లు పాపికి "శిక్ష వేయు" నట్లుగా భగవద్వాక్కునుబట్టి మానవుని పాపిష్ఠ గుణముమీద సామాన్యముగా సాంప్రదాయికముగా చేయబడుచున్న నిర్ణయములను ఇట్లు వివరమైన రోగ నిదానముతో ప్రతిక్రియలతో పూరింపవచ్చును. నేరములకు, నీతులకు మతానికి, శాశ్వతశ్రేయమునకు ఐహికశ్రేయమునకు, మధ్య గీయబడుచుండిన స్ఫుటరేఖలు మసకబారిపోయినవి, కొన్ని భేదములు నిలచి ఉండుననుటలో సందేహములేదు కాని శరీరము – మనస్సు - ఆత్మ అను సంకీర్ణభావము, వ్యక్తి లేదా తాను అన్న భావములో ఏకీకృతమగుటతోబాటు ఆరోగ్యము - న్యాయశీలము - మోక్షము అను సంకీర్ణభావము చిక్కైనదైనను ఏకరూపము దాల్చిన సమస్య కాగలదు. "దైవసంబంధమైన వేదన" ననుభవించు వ్యక్తులను మరింత బాగుగా అర్థము చేసుకొను చుండుటనుబట్టి సాధారణమైన మతానుభవమునుగూర్చి ప్రార్థనలో "జరుగు" చున్నది ఏమిటి, లేదా రహస్యానుభవములోని ఆనంద పరవశతలో యథార్థముగా ఉన్నదిఏమి. లేదా దర్శనములు ఎక్కడనుండి వచ్చుచున్నవి? అనువానిని గూర్చి జేమ్సుకు తెలిసిన దానికంటే మన మెక్కువ ఎరుగుదుమని తెలియగలము. ఈ రకమైన విజ్ఞానము ఇంకను శైశవావస్థలో నున్నది. కాని కడచిన యాభై సంవత్సరాలలో వచ్చిన పురోభివృద్ధి విపరీతము. ఆన్టన్ టి. బాయిసెండ్ వ్రాసిన అంతర ప్రపంచ పరిశోధనము (చికాగో, 1936) అను గ్రంథము మతసంబంధమైన "ఆరోగ్యమనస్కత" ను గూర్చిన సాంప్రదాయిక భావములను నిగ్గదీసి చూచిన తొలి అమెరికన్ గ్రంథాలలో ఒకటి. అటు తర్వాతికాలంలో ఎరిక్ ఫ్రామ్, తదితరులు వ్రాసిన వ్రాతలు మతాచరణములకు మానసిక పరిశుభ్రతకు సన్నిహిత సంబంధము గలదను విషయమును వ్యాప్తికి తెచ్చినవి. డాక్టరు ఆర్. ఎమ్. బక్ 1900 లలో ఒక రోగికి రోగ నిదానముచేసి వాడు "విశ్వసంబంధమైన చైతన్యము"తో బాధపడుచున్నాడనినట్లు ఈనాటి మనోరోగ చికిత్సకులు ఎవ్వరును రోగ నిదానము చెయ్యరు. అయినను జేమ్సు ఈ రోగనిదానమును యథార్థ బుద్ధితోనే గ్రహింపవలసి వచ్చినది. 19 జేమ్సు తన గ్రంథములో వర్ణించిన "రోగగ్రస్త ఆత్మలు" "విభక్తభావులు" అనువారిని జేమ్సు గుర్తించినదాని

కంటే మరింత నికరముగా ప్రత్యేక రోగరూపమున గుర్తింపవచ్చును. ఇంకొకవైపు ఇటువంటిరోగులకు చేసెడి చికిత్సలు ఈనాటికి సాంప్రదాయికమైన పాస్టర్ల పద్ధతులనుండియే వచ్చుచున్నవి.

మానసిక చికిత్సలు చాలవరకు మతోద్యోగులనుండి తెచ్చుకొన్న సాధనములనే ఉపయోగించుచున్నారు. కారణము చిన్నదే: మొన్న మొన్నటి వరకు అంతరవ్యక్తికి సంబంధించిన బాధలను చర్చివారే చూచేవారు. ఎరువు తెచ్చుకొన్న పద్ధతులలో చెప్పినదానిని వినుట, ధైర్యముచెప్పుట, సలహా, వచ్చినవాడు తన సలహాదారునిమీద ఆధారపడి భద్రత పొందగల మార్పిడి సంబంధము అనునవి ఉన్నవి.20

నిశ్చయముగా మనోరోగ ని నవృత్తికిని పాస్టర్లవృత్తికిని మధ్య సహకారము పెరుగుచున్నది. సైకో అనలిష్టులు మతము దానిలోని పలాయన పద్ధతులు బాలిశమైన భ్రమ అని ఇప్పుడు త్రోసిపుచ్చలేదు. ప్రీష్టులు తీవ్రమైన వ్యగ్రతలను "దయ్యాలు పట్టుట"గా ఇకమీదట చెప్పజాలరు. 1923 నాటి నుండి కూడ నక్రమమైన చికిత్సాసంబంధమైన శిక్షణ పాస్టర్లకు ఉంటున్నది. ఇందులో అగమ విదార్థులకు మనోరోగ వైద్యశాలలో క్లినికల్ సెమినార్లు, మినిస్టర్లకు సైకియాట్రి పాఠములు ఉంటవి. పాస్టర్లకు కావలసిన మనస్తత్వ విజ్ఞానము చికిత్సా సంబంధమైన శిక్షణఅనువానికిచాల పత్రికలు ఉన్నవి. సాధారణముగా మతము, ఆరోగ్యము అనువానిని గురించిన ఎన్నోచర్చలు ముఖ్యముగా శెవర్డ్ హిల్ట్నర్ గారి మత మూ ఆ రో గ్య ము (1943), డేవిడ్ ఇ. రాబర్ట్సుగారి మా న సి క చి కి త్స - క్రై స్త వ దృ ష్టి లో మా న వు డు. (1950), కొలంబియా యూనివర్సిటీ సెమినారువారు హోరేస్ ఎల్. ప్రీన్ 21 గారి ఆధ్వర్యమున "మతము" ఆరోగ్యము అను వానిపై సామూహిక చర్చ" అనునవిఉన్నవి.

పాస్టర్లవృత్తికి, సైకియాట్రివృత్తికి మధ్య పెరుగుతున్న ఈ సహకారం వల్ల బైటపడుతున్నట్లు కనిపించే విషయమేమనగా ఈ రెంటిని ఎదుర్కొంటున్న సమస్యలను ఫలవంతముగా పరిష్కరించుటకు చాలినంత శిక్షణ రెంటిలో దేనికిగాని లేదని గుర్తించుట, నైతిక సలహాను ఇచ్చుట యనెడి ఒక క్రొత్తకళ, బహుశః ఒక క్రొత్తవృత్తి రూపొందుచున్నది. దీని సాంకేతిక పరికరాలలో మానసికవ్యాధులకు, ఆరోగ్యమునకు సంబంధించిన చికిత్సారూపమైన అవగాహన, నైతికావసరములను, ఆదర్శములను సవి

మర్మముగా అంచనాకట్టుట, సాంఘిక పునర్నిర్మాణమునందు ఆచరణపర మైన ఆసక్తి అనునవి చేరిఉన్నవి. జేమ్సు దినాలనాటి "మనశ్చికిత్స" ఉద్యమాలు ఎంత తలతంతు నడిపిఉండినా, ఇప్పుడు అతిపురాతనములుగా కనబడుతాయి కొన్ని తెగలవారిలో వాటికి ఉండిన విలువకూడ పడిపోయి నది. ఎందుకనగా "మోక్షము" లో "బాధానివారణము" ఇమిడి ఉన్న దను వాటి గాఢాభిప్రాయమును ఇప్పుడు సాధారణముగా అంగీకరింప బడింది.

ఉదాహరణము 19వ శతాబ్దము చివరకాలంలో న్యూ ఇంగ్లండు ఆదర్శ వాదము విచిత్రంగా సృష్టించిన క్రైస్తవవిజ్ఞానము తన స్థానాన్ని చాల వరకు దిట్టపరచుకొని స్థిరమైన తెగగా అయినది. "మతోద్యోగాలు వృత్తిగా స్వీకరించిన క్లెర్జీనిగాని లేదా ప్రీస్టులనుగాని అనుమతింపని" "సామాన్యుని చర్చి"కి ఉచ్ఛ్రేయమైన ప్రతినిధిగా ఇప్పుడు అది తన స్థానమును ఆక్రమించు కొనుచున్నది. తొలినాళ్ళలో ఉద్యమానికి ప్రాణంగాఉండి, ఇప్పుడు 10,000లకు పైగా ఉంటున్న వృత్తి ననుసరిస్తున్నవారు, చర్చి కృషిలో అముఖ్యస్థితికి వచ్చినారు. మతసంబంధమైన సర్వీసులు - బహిరంగపూజ, బుధవారపు టెస్టిమోనిల్ సమావేశాలు, ఆదివారపుబడులు – క్రీస్తు చర్చి, సైన్సిస్టు యొక్క ప్రధాన కార్యకలాపాలు ఇంక వృత్తిలోనున్నవారి వ్యక్తిగతమైన సేవలుకూడ విధిగా ఇప్పుడు "ఆధ్యాత్మికముగా సలహా నిచ్చుట" లేదా "బాధా నివారణా సహాయము" అను వానికి చాల సన్ని హితముగానున్నవి, ఈ రెండును సాధారణముగా పాస్టర్ల, ప్రీస్టుల విధు లలో ఒకభాగమేకాని అచ్చంగా రోగం బాగుచేయడంకాదు. ప్రత్యేకంగా "క్రిస్టియన్ సైన్సు నర్సింగ్" అను వృత్తి ఒకటి పుట్టిరావడం గమనింప దగినవిషయం. అల్లే క్రిస్టియన్ సైన్సు వాఙ్మయములోనూ ఆచరణ లోనూ కొన్ని నిర్దిష్టరోగాలను తీవ్రంగాచూచి అవి వాస్తవమైనవి అన్న నమ్మకము లేకపోయినా వాటిని వాటి వైద్యశాస్త్రపుపేర్లతో సంకేతిం చడంకూడా గమనింపదగిన విషయమే. ఇట్లు బోధన అభౌతిక తత్వ శాస్త్రంనుండి వచ్చిన బిరుసు ఆగమశాస్త్రంగా ఉంటున్నా ఆచరణమాత్రం ఇప్పుడు, తక్కిన క్రైస్తవచర్చిల కృషికి చాల సన్నిహితముగా ఉంటున్నది.

ఇదే సామాన్య లక్షణము ఆధ్యాత్మికతకుకూడ వర్తింస్తుంది; దాని 19వ శతాబ్దపు వృత్తిలో అది వాహికలుగానున్న సాధకుల ఆశ్చర్యకర

మైన అద్భుతచర్యలవలన బలము సంపాదించుకొని తాను మతముకంటే ఎక్కువగా "శాస్త్రీయ"మైన అభివృద్ధికని గర్వపడింది. కాని ఇరవైయవ శతాబ్దపుకాలంలో వైయక్తికవాహికలు ఆచరించిన అద్భుతాలు తగ్గిపోయి ఆధ్యాత్మికవాద చర్చీలు త్వరగా పెరిగినవి. ఇదేవిధంగా తక్కిన "నవభావ ముల"లోనూ నివారణా పద్ధతులలోనూ యూనిటీ మువ్ మెంట్ అత్యంత విజయవంతమై ఎక్లిసియాస్టికల్ వ్యవస్థకు సన్నిహితమైనదిగా ఉన్నది. ఎమ్మెట్ ఫాక్స్ వంటి కొందరు అత్యుత్కృష్టులయిన మతప్రచారకులు తమ పుల్పిట్లవద్ద చాలవరకు స్థిరమైన సదస్య సమూహాలను గుమి గూర్చుకోగలిగినారు. మొత్తముమీద నవభావము లౌకికభావమునకు, సైకియాట్రీకి అవకాశ మిస్తున్నది. ఇటువంటి కారణములచేతనే ఎపిస్కో పల్ చెర్చిలోని, ఎమాన్యువల్ ఉద్యమము స్వల్ప కాలికమైనది.

సామాన్యంగా మతరూపమైన చికిత్స మునుపటికంటె ఇప్పుడు తెగలవారీ చెర్చిలలో పరస్పరముగాను, మరింత వైద్యపరముగాను ఉంటున్నది. దీని ఆగమశాస్త్రం మోక్ష సిద్ధాంతానికి మరింత సన్నిహితసంబంధముకలది. ఎట్లనగా ఆత్మలమోక్షము "శాశ్వతజీవిత" విషయము అన్న సిద్ధాంతమును నిర్వహించుకొనుట ఆగమశాస్త్రమునకు ఎంత ముఖ్యమైనను అటువంటి మోక్షమునుగురించిన వ్యగ్రత ఈ జీవితములో జరుగుచున్నదనుట, అది పుట్టించెడి ఆశలు, భయాలు, ఆకాంక్షలు అనువానిని ఇక్కడే ఇప్పుడే చూచుకోవాలనుట యదార్థవిషయముగా ఉంటున్నది. ఇంతేకాక ఈ లోకము మరొక లోకముతో పోల్చి చూచినపుడు గణుతింపదగినది కాదని త్రోసిపుచ్చుటతో కాక ఆ పరలోకమును గురించిన జ్ఞానము ఈ లోకములో మానవుని శ్రేయస్సుకు ఉపకరించేటట్లుగా వాటిని రూపొందించుకోవాలి, లేకపోతే మతమనేది వివేకులైన మనుష్యుల దృష్టిలో అవినీతికరమైన మూఢభక్తిగా, హేళనగా తయారవుతుంది.

సాంఘికమైన సంకట పరిస్థితులను, ఆతురతలను, అభద్రతలను అనుభ వించుట మనకు చక్కగా పరిచయముచేసిన ఈ శతాబ్దం మతానుభవాన్ని గురించిన స్వరూప భావనలో గొప్ప వ్యాప్తిని మార్పునుకూడ తెచ్చి పెట్టింది. మొట్టమొదట అది అభద్రతలను, ఆతురతలను, హింసలను, బాధ లను, ప్రాణార్పణలను, మన నిత్యానుభవములుగా మరల తెచ్చినది. వీటన్నిటిని మన తండ్రులు "మధ్యయుగానికి" సంబంధించినవని త్రోసిపుచ్చే

వారు. అన్ని యుగాలలోనూ ఇవి మనుష్యులను మోకరిల్లచేసినవే. ఇటువంటి క్రౌర్యము ముందున్నప్పటికి మనుష్యుడు తక్షణమే భగవంతునితో ముఖాముఖిగా ఉంటున్నాడు. శాంతాయన భాషలో దీనికర్థ మేమిటంటే "ఆధ్యాత్మికత" కంటే "దైవభక్తి" ముందు ఉంటుంది; ఆనంద సాధనకు తక్కిన ఆదర్శాలసాధనకు చేసే సూటియైన ప్రయత్నాలు వెనుకకు త్రోయబడునట్లుగా మూలభూతములైన మానవ విశ్వాస ప్రవృత్తులు కఠినముగా పరీక్షింపబడుతున్నవి. చెడ్డను (లోపలను బయటను) ఎదుర్కొనవలసిన సమస్య చెడ్డను నిర్మూలించుటకంటె ఎక్కువగా [illegible]ాడవలసిన నిజమైన సమస్యమనకు. ఇరవైయవ శతాబ్దం సహజంగా "ప్రగతిశతాబ్దం" కానున్నదని ఊహించుకొన్న కారణంచేత అమెరికనులు ఇటువంటి పరిస్థితుల నెదుర్కొనుటకు ఆధ్యాత్మికంగా సిద్ధంగాలేరు. క్రొత్తగా కనిపెట్టుట అను పురోభివృద్ధితోపాటు ప్రమాధికమైన దైవ్యపరిస్థితులు రావటం అనేది హెన్రీ జార్జి బోధనల ననుసరించే కొద్దిమందికితప్ప తక్కినవాళ్లకు నమ్మరానంత అనూహ్యంగా కనబడింది. సాంకేతిక విద్యాభివృద్ధి విశ్వజనీనమైన సహకారములద్వారా ప్రగతి కలుగుతుందని గ్రుడ్డిగా విశ్వసించినవారు బహుళ. అమెరికన్ సోషలిస్టులు-వీరిలో కొందరు అతివాది మార్క్సిష్టులు. చాలమంది "వైట్ - కాలర్" రకం. వీళ్లకు "జాతీయ సామ్యవాదం" సాక్షాత్తు స్వర్గరాజ్యంగా కనుపించింది. పెట్టుబడిఉన్నా లేకున్నా చట్టా వ్యాపారాలకు దిగిన అమెరికన్లకు సాంఘిక వ్యతిరేకతలను దిక్కుతోచనిస్థితిని కనుపించకుండాచేసిన 1920 నాటి మూర్ఖుని స్వర్గం 1930 ల నాటి హతాశాలక్షణాని మరింత దీనంగా భావింపజేసింది. ఈ పరిస్థితి అపోకలిప్టిన్ దర్శనాలకు చాల చక్కనిది రకరకాలు ప్రవక్తలు బయలుదేరినారు. ఎప్పటివలెనే ప్రజలు చెవులు రిక్కించి చేతుల్లో రాళ్లుపట్టు కొన్ని వాళ్లకు స్వాగతం చెప్పినారు.

స్పష్టంగా "సంఘము" తానే నోటిశాపాలకు శాశ్వతమైన దుర్గతికి నోచుకొనిఉన్న రోగగ్రస్తాత్మగా ఉండింది. ఈ అభద్రత "విభక్తాత్మత" లు ఇట్లు సాంఘికంగా మారిపోతాయని జేమ్స్ ఊహించికూడా ఉండలేదు; అతని సమకాలీనులు దీన్ని పసిగట్టలేకపోయినారు. జేమ్స్ మనస్తత్వ ప్రయోగశాలలోనికి దారిచేసుకొని వచ్చిన చిత్రమైన "రకరకాల" చైతన్యాల మచ్చులు మనకీనాడు పరిచిత దృశ్యాలైనవి. ఎంతపరిచితమైనవంటే

నిజానికి, మన ఆగమ సామ్యవాదులు వీటిని "మానవ సన్నివేశా"నికి ఉదాహరణలుగా వాడుకొంటున్నారు; జేమ్స్ వీటిని మతాన్ని "తీవ్రంగా వ్యక్తంచేయుట"కు మచ్చులుగా మాత్రమే వాడుకొన్నాడు. 22 క్లుప్తంగా చెప్పితే, జేమ్స్‌నాటినుండి జరిగిందేమనగా అప్పుడు చైతన్యముయొక్క అస్పష్టవిషయాలుగా పరిశీలింపబడిన మతసంబంధమైన లక్షణాలు ఇప్పుడు అస్తిత్వవాదం వింగడింపుకు విషయసామగ్రి అయినవి. గూఢమతవాది పాపిష్టమైన స్థితులకు మనస్తత్వశాస్త్ర స్పర్శ పోగొట్టుటకు అస్తిత్వవాద మొక ప్రతినిధివంటిది. అస్తివాదుల మానవసన్నివేశకథనము జేమ్స్ మనస్తత్వశాస్త్ర మంతగా అంతర్దృష్టి, మమకారభావము కలదికాదు; సాంఘికంగా లోపలికి మళ్లి ఊహాలుపోయేరకం. జేమ్స్ మనస్తత్వశాస్త్రం ప్రకారం భావ్యంచేసిన దైవసాన్నిధ్యం, ప్రార్థనలో భగవంతునితో జరిగే "లావాదేవీలు" అనే అనుభవాలు సరిగా అస్తిత్వవాది ఆగమజ్ఞులు "ఉత్కృష్టుడైన పరునితో ముఖాముఖి ఎదుర్కోలని చెప్పనవే. వర్ణించే అనుభవాలు రెండుచోట్లా వ్యక్తిగతములైనవే. కాని ఆ అనుభవాల ప్రకరణం మాత్రం చైతన్యస్థితులనుండి సాంఘిక సన్నివేశాలకు మారింది. మత బుభుక్షలను మార్పుగా జేమ్స్‌కు కనిపించింది ఇప్పుడు సాంస్కృతి కమై మార్పు అయింది. ఈ విధంగా మతానుభవాన్ని వింగడించడం విషయకదృష్టిగల సాంఘికమైన యథార్థ దృక్పథంతో గూడిన వింగడింపు మార్గాన్ని అనుసరించింది - ఈ పద్ధతి వింగడింపు ఆ కాలంలో తత్త్వ శాస్త్రంలో సామాన్యంగా ఉంటూ ఉండిందే.

అస్తిత్వవాదం వింగడింపుయొక్క స్వభావము జేమ్స్ మనస్తత్వ శాస్త్రమునకంటె చాల భిన్నముగానుండి మధ్యలో వచ్చిన విషాద విషయములను ప్రతిబింబించుచున్నది. జేమ్స్ నిజమైన విజ్ఞానశాస్త్రవేత్త వలె తన మతరోగులకు వారి ఉద్రేకాలకూ దూరముగా ఉండి అవి ఎంత వరకు సహజములో నిష్పాక్షికముగా అంచనా వేయకలిగియుండెను. కాని ఈనాటి అస్తిత్వవాది పొంగివస్తున్న లౌకికమైన అసక్తులనడుమ మతము నకు సంబంధించిన పవిత్రమైన వ్యగ్రతతో పాలుపంచుకొంటున్నాడు. ఆ రోజులలో మతం విజ్ఞానశాస్త్రంతో సంధిచేసుకోడానికి తన సాహజికతను రుజువుచేసుకోవానికి ప్రయత్నిస్తుందేది. ఈ నాడు మతం తనను ఉపేక్షా భావంతో అసహ్యంతో చూచే సాంస్కృతిక శక్తులకు విరుద్ధంగా తన

ప్రాణాలకొరకు పోరాడుచున్నది. ఈ శతాబ్దపు మొదటి పాదంలో "విజ్ఞాన శాస్త్రయుగంలో మతము" అనే విషయంపై చాలా గ్రంథాలు ఉండేవి. "విజ్ఞానశాస్త్రం" అంటే ముఖ్యంగా ప్రకృతిశాస్త్రం. ఈ పరిస్థితిలో నిష్పాక్షికమైన స్వభావమే సబలైనమతంగా కన్పించింది. జేమ్స్, శాంతాయనుల ప్రభావంక్రింద రాస్తూ నిష్పక్షపాతబుద్ధి "ఉదాత్త మతము" అని పొగడినవాడు వాల్టర్, లిప్‌మన్ 23 ప్రత్యేక సమర్థనలకు పాక్షిక వృత్తికి అతీతంగా ఉండుట స్పినోజావలె మనీషాభిమానంతో భగవంతుని ప్రేమించుట, అవగాహన చేసుకొనుటలో శాంతిని దర్శించుట, అనునవి అప్పుడు దైవభక్తికి తత్త్వసాధనకు పరాకాష్ఠగా తోచినది. మతపరిస్థితి ఇప్పుడంత భిన్నముగానున్నది! మతము ఇప్పుడు ఒప్పందము, నిర్ణయము, విశ్వాసము, వ్యక్తిగతమైన బాధ్యత. మతాభినివేశముతో ఉండటమంటే చారిత్రికమైన నిర్ణయాలలో తీవ్రంగా పాల్గొనడమే అవుతుంది.

మన జ్ఞానము ఎంతముఖ్యమైతే తోడి జ్ఞానులను నేరుగా కలుసుకొనుటయేకాక వారితోడి సాహచర్యముకూడ అంత ముఖ్యమైనది అవుతుంది. ... ఏకాంతమైన అంతరచర్చలో కాక ఒక వ్యక్తి ఇతరవ్యక్తులతో జరిపెడి సజీవమైన సంవాదములోనే మనమొక నిర్ణయముచేసుకొని "ఇతరుల విధులు ఏమైనప్పటికిని ఇది నా విధి" అని చెప్పగల స్థానమునకు చేరుకొనగలము. ... మన వైయక్తిక నిర్ణయాలను మన అస్తిత్వ సన్నివేశములోనే చేసుకొని తీరవలెను. కాని వైయక్తికంగా ఏకాకి క్రీస్తు ఎదుట నిలిచి ఏకాకులైన వ్యక్తులుగా మనమా నిర్ణయాలుచేయము, నిర్ణయ సత్యాన్ని దాని స్వంతమైన వైయక్తిక శీలాన్ని నొక్కిచెప్పిన అస్తిత్వవాదము సద్యఃకాల క్షణమునకు ఉన్న ప్రాధాన్యమునుగూడ తెలియవచ్చునట్లు చేసింది, అనిశ్చితభావాలతో ధ్యానముద్రగల వివేకవాదము గతంలోనూ భవిష్యత్తులోనూ లేదా కాలరహితమైన స్థితిలోనూ జీవించవచ్చు. ... కాని విచార శీలుడు తన యాత్రలనుండి మరలి రావలసియున్నది. ఎందుకనగా అతడు మనుష్యుడు ... మరి నిర్ణయకాలము భూతముకారు, భవిష్యత్తుకారు. వర్తమానము ... సంకటక్షణాన్ని ... అర్థ గంభీరము చేసేది. వ్యక్తి తాను నిర్ణయబాధ్యతతో ఇక్కడ ఒంటరిగా ఉన్నాడన్న యథార్థవిషయంకారు. కాని సహావ ర్తియై ... జ్ఞాపకమునకువచ్చి ఎదురు

చూడవచ్చు, ఒకానొకరు ఉన్నాడు అనునది ... మన నిర్ణయాలు వర్త మాన క్షణంలోనే జరిగి తీరాలి : అనంతకాలంలో వసించేవాని చారిత్రిక జ్ఞప్తి చర్యలచేత పవిత్రముచేయబడిన చరిత్రగల చారిత్రక ప్రాణుల సాన్నిధ్యములోనే జరగాలి. 24

సిద్ధాంత రూపంగా వాల్టర్ లిప్‌మన్ చెప్పిన ఉదాత్త మతాన్ని ఈ రిచెర్డ్ నీబూర్ సాంఘిక అస్తిత్వవాదంతో సమన్వయపరచుట సాధ్యమే అనుకొనుడు. ఎందుకనగా ఒక చారిత్రిక నిర్ణయముచేసే క్షణంలో తన్ను తాను ఒప్పందములోనికి చొప్పించుకొనే నిష్పాక్షికమైన ఉత్కృష్టభూమికి పెళ్ళి మనస్ఫూర్తిగా భగవంతునికి జవాబుదారి వహించడం సాధ్యమే అయితే, ఆచరణలోమాత్రం ఈ రెండురకాల చిత్తవృత్తులకు పొందిక కుదరదు. ఈ రెండు భిన్నవిధములైన మతానుభవములకు చెందినవి. మొదటిది "ఒకకాలము ముగిసినచోట తలపోయుట" రెండవది ఒక సంకట పరిస్థితిలో చర్యకు పూనుకొన వలసినదను పిలుపు, మొదటిది అసంసర్గత, రెండవది సంసర్గము. 25

మతానుభవమునకు సంబంధించిన నిన్న మొన్నటి రకాలు. మతానుభవము స్వరూప భావననుండి అమెరికాలో ఈ మధ్య ఏర్పడిన రకరకాల మతజీవితమువైపు మరలినచో దిక్కు తోచనంత వైవిధ్యాన్ని ఎదుర్కొ వలసి వస్తుంది. ఈ వైవిధ్యం మునుపటి ప్రకరణాలలో మనము శ్రద్ధగా పరిశీలించిన అసంఖ్యాకమైన మత సంస్థలలో చాలినంతగా ప్రతిఫలించినది కాదు, ఎందుకనగా ఈ పరిస్థితిలో చాలవాటిలో ప్రత్యేక రకాల అనుభవాలు వర్ధిల్లుతున్నవి. ప్రత్యేకమైన అనుభవవిధానాలను సక్రమరూపంలో చూపించే సంస్థలు సాధారణంగా ఈ అంశాన్ని తమ విశ్వాసానికి సంబంధించిన అధికారిక ప్రకటనలో దాచుతారు. ఈ ప్రకటనలు ఉన్నది ఉన్నట్లు చెప్పేవి కాక చాలవరకు సమర్థించే ధోరణిలో ఉంటవి. క్రొత్తమచ్చులు సంపాదించే ఉద్దేశ్యముతో మనంకూడా విలియమ్ జేమ్స్‌వలె మరింత దుబారా, "అతివాది" రకాలమీదికి దృష్టి కేంద్రీకరింపవచ్చు కాని, అంత సాంప్రదాయికం కాని చాలా రకాలు నిశ్చయంగా "మలిచేతి" రకాలై, వాటివెనుక అనేక శతాబ్దాల చరిత్రకూడా ఉంది. మిష్టర్ మార్కస్ బాష్, తాను సంపాదించిన మత సంబంధమైన అపరిచితమైన రకాలలో ఆరు రకాలను అభివర్ణించినాడు. ఈ సంకలనం చదవడానికి చాల ఉల్లాస

కరంగా విషయబోధకంగా ఉంటుంది. మత సంబంధమైన ఈ అపరిచితమైన రకాలు అతనికి తన స్నేహితులలో కనిపించినవి. 26 ఆ ఆరురకాలు ఇవి: ఈమధ్య "లౌకికులైన" అమెరికన్ల దృష్టిని ఆకర్షించిన ట్రాపిస్ట్ సన్యాసులు; శరీరమును తపింపచేయు సాధనమార్గముగల తపస్వులు. వీరు ముఖ్యంగా నైఋతిప్రాంతంలో ఎక్కువ. - మూడవతెగ వేదాంతానుయాయులు. వీరు ఇండియాలోని క్రైస్తవ మిషన్లకు బదులుగా అమెరికన్లకు ఇండియాదేశపు దివ్య జ్ఞాన ధ్యానపద్ధతిని వాజయమును వ్యాఖ్యానించి చెప్పినవారు. నాల్గవతెగ స్వీడెన్ బర్గియనులు. వీరికి ఒక ప్రత్యేక దర్శనమయినట్లు పుస్తకరూపములో వేసుకొని హలందా అనుభవిస్తున్నారు. ఈపాటికి వీరు "క్రొత్త జెరుసలెమ్" ప్రవేశించినారు ఐదవతెగ హట్టర్ అనుయాయులు. వీరిమతము చాలవరకు సమాజకృషి రూపముగా ఉంటుంది. ఆరవతెగవారు. మార్మనులు, వీరికి ప్రత్యేకముగా కలిగిన దర్శనము, "తర్వాత దినాలలో" వీరి సమాజ జీవితం స్వీడెన్ బర్గియనుల దర్శన జీవితాలకు ప్రతిస్పర్ధులుగా ఉంటవి. ఈ రకాలన్ని ఒక శతాబ్దానికి పైగా ప్రాతవి. ఒకటితప్ప తక్కినవన్ని అమెరికన్ జీవితానికి భావప్రపంచానికి వెలుపల పుట్టివచ్చినవే.

చార్లెస్ యస్. బ్రాడెన్ వ్రాసిన దీజ్ ఆల్సో బిలీవ్ (1949) అను గ్రంథములో వర్ణింపబడిన పదమూడు "నవీనపద్ధతులు అల్పసంఖ్యాక వర్గమువారి మతోద్యమాలు" అనువానిలో చాల క్రొత్తవి ఇవి: ది పీస్ మిషన్ మువ్ మెంట్ ఆఫ్ ఫాదర్ డివైన్; 27 సైకియానా, ఇది నిజంగా మతమయితే దీనిని జాబువ్రాసి ఆర్డర్ చేయండి అనేకరకమైన మతానుభవంగా చెప్పవచ్చు; నేనే ఉద్యమాన్ని (అయామ్ మూవ్ మెంట్), లిబరల్ కాథలిక్ చర్చి, ఈ రెండు కాలిఫోర్నియాకు అవలకూడ వ్యాపించిన దివ్యజ్ఞాన సిద్ధాంతానికి సులభ రూపాలుగా వచ్చిన వాటిలో సరిక్రొత్తవి; జహోవాస్ విట్నెసెస్ 28 (జహోవా సాక్షులు); ఆక్స్ ఫర్డ్ గ్రూప్ మూవ్ మెంట్ దీనినిగురించి కొంచెంక్రింద చెప్పుతాను.

సమకాలీన అమెరికన్ మతములోని ఈ ఆడంబరమైన, విపరీతమైన అపరిచితమైన, అంశాల మొన్న మొన్నటి వర్ణనలబట్టి నేనిక్కడ కొన్ని రకాల మతానుభవాలనే చెపుతాను. ఇవికూడా ఈమధ్య ఏర్పడినవి.

నేను సమీక్షచేస్తూ వచ్చిన మతానుభవము యొక్క స్వరూపభావనలో వచ్చిన ముఖ్యమైన మార్పులకు నేరుగా సంబంధించినవి.

ఒకవైపు స్వానుభవ పురస్సరమైన విజ్ఞానశాస్త్రాన్ని మరొకవైపు బైబులును పూరించుకొనడానికి అధికారిక దర్శనాన్ని భవిష్యద్వాక్కును అథవా ఆత్మజ్ఞానమును, సంపాదించుకొనుటకు చేసిన ప్రయత్నాలను మొదట యోచించవలసియున్నది. ఈ విజ్ఞానశాస్త్రమును బైబులును, రెండుకూడా ఇప్పుడు మనమిక్కడ వెదకుచున్న ఆచరణలోని మారదర్శ కత్వానికి ప్రామాణికత్వమును నిర్వహించుటలేదు;

సహజమైన జ్ఞానముకంటె మతానుభవము వలన పుట్టిన జ్ఞానము భిన్నమైన దనునమ్మిక, దీనికి ప్రామాణికత్వము ఎక్కువ కార్యకారణ రూపమైన సాక్ష్యము తక్కువ అను నమ్మికకూడ నిదానముగా చోటు సంపాదించుకొన్నవి. భగవంతుడు ఇప్పటికీ నిర్దిష్టమైన వివరమైన ఆదేశాలను ఇవ్వగలడు అని చెప్పెడి సనాతనత్వ సిద్ధాంత సంబంధమైన ప్రామాణికత్వవాదమును వినుటకు చాలమంది వ్యక్తులు, వర్గాలు ఇచ్ఛగించుచునే ఉన్నారు. ఈ మధ్యవచ్చిన మార్మన్ సాహిత్యములో మనకు ఒక మంచి ఉదాహరణ దొరుకుతున్నది. బ్రిగ్ హామ్ ఎంగ్ తన ఒకానొక చర్చిలో ఇట్లు చెప్పినాడు:

మానవజాతికి ప్రాచీనకాలములో లభ్యమైన దర్శనాలు చాలభాగము వారి నిత్యవిధులకు సంబంధించినవి; మనంకూడా అ దారిలోనే నడుస్తున్నాము. బైబుల్‌లోనూ మార్మన్ గ్రంథములోనూ ఉన్న దర్శనములు మనకు ఉదాహరణములైనవి, డాక్ట్రిన్ యండ్ కవెనాండ్స్ గ్రంథములో ఈ చర్చికి సూటియైన దర్శనముఉన్నది. అవి మనకు మార్గదర్శకుని వంటివి. వాటిని మనము వదలించుకొన దలచుటలేదు. అవి ప్రాతబడిపోయి వాటిని మనము ప్రక్కన పెట్టుట మనకిష్టములేదు. అనుదినము ప్రభువైన జీసెస్‌క్రైస్ట్ దర్శనములలోనె నడుస్తూ అతని తత్వము ఎల్లప్పుడూ మనతో ఉండునట్లు చేసుకొనవలెనని మనకోరిక. మనమిది చేయగలము. మనము ఇంక చీకటిలోనడువక జీవనప్రకాశములో నడతుము. 29

ఇటువంటి మార్గ దర్శకత్వముమీది విశ్వాసమును సమర్థించుట కష్టమే. మార్మనులలోకూడా కష్టమే. కాని నవీనతావాదులు చెప్పెడి దర్శన

పాఠములను ఎదుర్కొని జేమ్స్ ఇ. టాల్ మేజ్ ఆచార పరాయణత సిద్ధాంతాన్ని పునరుద్ఘాటించినాడు:

మునుపటి దినాల దర్శనముతోపాటు వర్తమాన దర్శనముకూడ స్పష్టంగా ఈ నియమిత మార్గంలో భగవంతుడు ముందుముందుకూడ మరి కొన్ని పర్యాయములు అభివ్యక్తి అవుతాడని జోస్యంచెప్పుతున్నది. శ్రుతి గ్రంథాల సంప్రదాయం ఇంకా ముగియలేదు. ఎన్నో సూత్రాలు ఇంకా అందులో చేర్చవలసియున్నవి. గ్రంథస్తమైన ఏ దానికంటెనైనను, ప్రాముఖ్యమునందును యశః పూర్ణతయందును అతిశయమైన దర్శనము చర్చికి లభ్యపడజేసి లోకానికి ప్రకటించవలసి యున్నది.

ధ్యానముతోనో, రహస్యవిద్యతోనో, తన్నుతాను వింగడించుకొనుటతోనో, సంజ్ఞానముతోనో ఏదోవిధముగా మనుష్యులు "ఊర్ధ్వ" జ్ఞానమును సంపాదింప ప్రయత్నించుచున్నారు. ఈ ఊర్ధ్వజ్ఞానము విజ్ఞానశాస్త్ర జ్ఞానమువలెనో మరి ఇంకొక ఏ విధమైన "ఒక దానినిగురించిన జ్ఞానము" వలెనో కాక తక్షణమైన, వ్యక్తిగతమైనశక్తి, జ్ఞాన, ప్రకాశముల రూపము. ఇంగ్లీషు మతవిషయక రచయిత జరాల్డ్ హార్డ్‌కు అనుయాయులై అతనితోకూడ క్రిందిమాటలు వల్లెవేసెడి అమెరికనులు చాలమంది ఉన్నారు: "ఎడతెగక నిత్యము వినీతిని. విశ్వాసాశ్చర్యములను యవ్వనదశను తెచ్చుకొని, పునర్నవీనము చేసుకొనుచు, ప్రాకి అలముకొనుచున్న ఉపేక్షాభావమును. లేదా తనమును జనులు ఉండితీరవలెనని చెప్పెడి కన్వెన్షన్ దృష్టిని నేను వదలివేయుచున్నాను," ఇది విజ్ఞానశాస్త్రమును ధిక్కరించుటకాదు, తెలిసినతనమునకు సహాయకము లేదా పూరకము, ఇది యదార్థవిషయములను కాని విలువలను కాని తెలుసుకొనవలసిన అక్కర వంటిదికాదు; అటుతరువాత ఏమిచేయవలెను, అనుదానిని తెలుసుకొనవలసిన అక్కర. ఇది విషయనిశ్చయముకాదు, తనకు తాను ధీమా చెప్పుకొనుట. పాండిత్యముకాదు, ఆత్మవిశ్వాసము ఇటువంటి రక్షకమైన జ్ఞానమునకు మానవుడు అన్నికాలములందును వెదకినాడు. కాని దాని స్వభావమునుబట్టి అది ఎడతెగక పునఃసృష్టి చేసుకొనియో లేదా మరల కనుగొనియో పొందవలసినది మతశిక్షలో అది వ్యక్తిగతముగా సాధించిన దానికి ప్రతినిధి అవుతుంది. కొందరున్నారు - ముఖ్యంగా ప్రొఫెసర్ హెన్రీ ఎన్. వీమన్ నాయకత్వముక్రింద ఉన్న సామాజిక సిద్ధాంతవాదులు.

వీరి "ప్రైవేటు మత జీవితపద్ధతులు" సూటిగా క్రొత్తగావచ్చిన విజ్ఞాన శాస్త్ర తత్వములు ఆధారముగా ఏర్పరుచుకోబడినవి. వీరు కట్టుకథలవంటి లేదా తప్పుదారి పట్టించెడి సాంకేతికతవంటి వానినుండి తమ్ముతాము విడిపించుకొన ప్రయత్నించువారు. కాని వారు కూడ "గుణవిశిష్టమైన అర్థా"న్ని ముఖ్యంగా చెప్పుతారు. మనుష్యుల జీవితాలు "సంఘటనలు, అవకాశాలు మరింతగా చేరిన ఐకమత్యాన్ని సృష్టించుటద్వారా పరస్పరము ఉత్కృష్టములు అగుచు, వింగడించుచు మానసికమైన మద్దతుతో బాంధవ్యమేర్పడి," 31 ఉండునట్లుగా (విజ్ఞానశాస్త్రము, టెక్నాలజీ తెలిపినకొలది) భగవంతునికి తగిన "సజ్జనశీలమైన కార్యముల"కు ఇటువంటి అర్థాలను సాధింపవలెనని వారి ఆశ, ఇట్లు లౌకికమైన జ్ఞానమున[illegible] మత విశ్వాసమునకు మధ్య గుణమునకు సంబంధించిన భేదము ఒకటి ఉన్నది. ఈ రెండవది "మానవ శ్రేయస్సులోని లోతైన మూల స్థానములలో" స్వానుభవపూర్వకముగా పరిశీలించుటకు అవల మనుష్యులకు ఎంతవరకు సహాయ పడలేక పోవుచున్నదో అంతవరకు మొదటిది గూడ మానవ జాతికి ఉపకరించ లేకపోతున్నది. అయితే ఈ వ్యక్తిగతమైన ఊర్ధ్వగమనము గల సూక్ష్మదృష్టిని లేదా దివ్యోత్సాహమును సాధనచేసెడి వారిలో చాలామంది మత సాంప్రదాయములకు సంబంధించిన భాషా సాహిత్యములవైపు మరలి ఆ వానినుండి ఒక శక్తిని సంపాదించుకొన జూచుచున్నారు. వారు కట్టుకథలకు రహస్యానుభవములకు పోవుట నేర్చుకొనుటకు కాదు, ప్రత్యేకముగా "గుణస్ఫోరకమైన" దానిని వానినుండి సంగ్రహించుటకు, అది ఆలోచనారూపమున చెప్పుటకంటె జీవితరూపమున చక్కగా అభివ్యక్తమగునది.

ఇటువంటి లక్షణమైన జ్ఞానమునకు దృష్టాంతముగా దివ్య జ్ఞానవాదము ఆధారముగా మార్చబడిన ఒక కలియగలుపు ధర్మోపన్యాసాన్ని ఇస్తున్నాను. (ఎగ్జిబిట్ XX) ఈ ఉపన్యాసము కాలిఫోర్నియా రాష్ట్రంలోని హాల్ స్యాన్‌లో ఒక లాడ్జిలోకల, ది టెంపుల్ ఆఫ్ ది ప్యూపుల్ అను దాని సభ్యుల మొన్న మొన్నటి వ్రాతలనుండి వచ్చినది. ఈ సంఘము 1898 లో స్థాపింపబడినట్లు సిద్ధాంతరూపముగా, చెప్పుదురు. కాని ఇది మొన్న మొన్ననే వర్ధిల్లినది, దీనికే థార్ స్టీన్ వెబ్లెన్ జీవితమునకుగల సంబంధముద్వారా కొందరు పాఠకులకు ఇది ఎరుకపడియుండ

వచ్చును. కాని, ఇది నిషేధ జ్ఞానమునకు ఆధ్యాత్మికశక్తికి కేంద్రమై గౌరవ పురస్సరముగా కొందరికి మాత్రమే ఎరుకలోనున్నది, ఇటువంటి "జ్ఞానము" (అ) ఒక విశ్వసంబంధమైన మూలస్థానమును, (ఆ) ఒక చారిత్రకవృత్తిని; (ఇ) ఒక శాస్త్రీయమైన అవగాహనత, (కనీసము సాదృశ్యముద్వారానైనను), (ఈ) సామూహికముగా సృష్టించుటలో పాలు పంచుకొనుచుంటి మన్న భావమును చూపించి తన ప్రామాణికతాశక్తిని పొందుచున్నదగుట పాఠకుడు గమనింపవలెను.

ఈ ధర్మోపన్యాసములోనున్న సువార్తకు, చాల తెగలలోనూ మరి ఏ తెగ[illegible]చెందనివారిలోనూ చాల పాఠాంతరములు ఉన్నవి. అయితే, ముఖ్య విషయాలు ఉద్దేశాలు నున్నతరములో "ఆరోగ్యముగా నున్న మనస్సును" పెంపొందింప చేసుకొని, "రోగగ్రస్తమైన ఆత్మ"కు చికిత్స చేయుటకు, చేయబడుతున్న మహా ప్రయత్నమునకు సదృశ్య విలక్షణ ములు, కాని ఇది, నిజంగా "మనస్సు బాగుచేయుట" కాదు. ఇది "దివ్య శాస్త్రము" ఆధ్యాత్మకశక్తి మూలస్థానములను ఒడుచుకొనుట. ఇటు వంటి మతానుభవములోని ప్రధానాభిప్రాయమును ప్రొఫెసర్ చాడ్ వాల్ష్ తన స్టాప్ లుకింగ్ యండ్ విజన్ అను గ్రంథములో సామాన్యులకు అర్థము అగునట్లు చెప్పినాడు. జాషువా లీబ్ మన్ సృష్టించిన "మనశ్శాంతి" అను ఇంకొక జనరంజకమైన నినాదమునకును, దీనికిని సంబంధమున్నది. లక్ష్య మేమనగా కేవలము మనశ్శాంతికాదు. మానసిక శిక్షద్వారా శాంతియుత శక్తిని సంపాదించుట.

రక్షకజ్ఞానమునకు సంబంధించిన ప్రాథమిక పాఠములు వలయువారికి రెవరెండు డాక్టరు నార్మన్ విన్సెంట్ పీల్ సైకియాట్రిస్టుల సహకారముతో కూర్చినదియు "సెర్మన్ పబ్లికేషన్సు ఇన్ కార్పొరేషన్"వారు అమ్మునట్టియు, ఆత్మాభివృద్ధికైన కైపొత్తములను సిఫార్సు చేస్తున్నాను. ఈ పుస్తకాలలో ది ఆర్టు ఆఫ్ రియల్ హాపినెస్, ఎ గైడ్ టు కాన్ఫిడెంట్ లివింగ్, యు కెన్ ఛేంజి యువర్ పర్సనాలిటి డిఫెక్ట్స్, యువర్ ప్రేయర్స్ విల్ గెట్ రిజల్ట్స్, హాపీ ఎండింగ్ టు యువర్ గ్లూమీ ఫీలింగ్స్, ది వండర్ ఫుల్ ఫీలింగ్ ఆఫ్ సెక్యూరిటి వంటి ఆకర్షకమైన శీర్షికలుగల గ్రంథాలున్నవి. ఈ లౌకికముగా వినబడే శీర్షికలుచూచి పాఠకుడు తప్పు

దారిని పడకూడదు. ఎందుకనగా ఈ పుస్తకాలలో క్లుప్తమైన వ్యాఖ్యా గ్రంథములలో ఏ ఒక్కటి చూచిన నీకు నీవు సహాయము చేసుకో జాలవు అని స్పష్టము చేస్తుంది. మీరు క్రీస్తు వైపునకు, ప్రార్థనకు, బైబిల్ వైపునకు, మరి డాక్టర్ పీల్ గారి ప్రచురణలకు మరలవలసి ఉంటుంది. కాని అంత విధి లేకపోతే బహిరంగపూజ లేకుండానైన కనీసము మీరు గడుపుకో గలరుకదా!

మతసంబంధమైన చికిత్స, సలహా అనునవి పూజ. కన్ ఫెషన్ అనువాని మరింత సాంప్రదాయిక రూపములకు అభిముఖముగ పోవుచున్నవా, లేదా, వైయక్తికముగ "రోగులకు" వైద్య వృత్తిలో వానికి స[illegible]మైన మతసంబంధమైన చికిత్సలను సృష్టించుచున్నవా అనునది ఇప్పటిలో చెప్పుటకష్టము ।ప్రాచీన తరములైన చికిత్సావర్గముల అనుభవము అస మగ్రము. క్రిష్టియన్ సైన్సు తొలి దినాలలో "ప్రాక్టీషనర్" దానికి ఫలకారి కేంద్రముగ ఉండును అనిపించినది. మరి ఒక తరముదాక బోస్టన్ లోని మదర్ చర్చి విడిపోయిన ప్రాక్టీషనర్లు మరింత వైయక్తిక మైన నవీన భావోద్యమము చొచ్చుకొని వత్తురేమో అని భయపడినది. అయితే ఇప్పటి పరిస్థితులలో క్రిష్టియను సైన్సువారి పూజా సర్వీసులు ఎక్లీజియాస్టికల్ రూపాలకే ప్రాక్టీషనర్ భావములో చికిత్సకున్న దానికంటే ఎక్కువ ప్రాధాన్యమున్నట్లు కనబడుతున్నది. 1930 దినాలలో అలనాడు ఎప్పుడో ఒక నవీనభావ నాయకురాలు నాతో ఒక వాడియైన మాట చెప్పడం నాకు జ్ఞాపకమున్నది. ఆర్థికమాంద్యము వచ్చినంతవరకు విడి విడి ప్రాక్టీషనర్లు లేదా "ఆధ్యాత్మిక" గురువులు విడిగా తమవద్దకు వచ్చినవారి అక్కఱలను తీర్చగలిగేవారని ఆమె అన్నది. చేసిన సహాయమునకు కొంత డబ్బు ముట్టజెప్పగానే తృప్తిగా పోయేవారు. వైద్య, విద్యావృత్తులు అనుసరింపదగిన మాడల్ గా ఉండేవి. కాని ఆర్థికమాంద్యము తన సోకు చూపినప్పుడు చాలమంది ఉద్యమాన్ని వదలిపెట్టి క్రిష్టియన్ సైన్సుకో మరొక చర్చికో పోయినారు. ఎందుకనగా "ఎందులోనో ఒకచోట చేరవలెనని వాళ్ళ ఉద్దేశ్యము" అన్నదామె. బొత్తిగా భద్రత లేని కాలంలో వ్యక్తులకు "వింగడింపు" వల్ల కంటే ఎందులోనైన "చేరుట" వల్ల భద్రతాభావము వచ్చినట్లు అనుకుంటారు. వ్యవస్థితమతా చారముల చికిత్సాగుణము విలియం జేమ్సు కాలమునందు కంటే ఇప్పుడు

మరింత సార్వత్రికంగా ప్రశంసింప బడుచున్నది, మరొకవైపు ప్రీస్టులకు, పాస్టర్లకు చికాకు ఏర్పడింది. ఎందుకనగా వారు పబ్లిక్కు సర్వీసులు ఆకర్షించని, సహాయపడనివారికి వైయక్తికమైన ప్రాతిపదికమీద సైకియాట్రిష్టులుగా రానురాను ఎక్కువగా సహాయపడవలసి వస్తున్నది.

దీనికి సంబంధించిన గొప్ప మార్పు పాస్టర్ల సైకియాట్రి సలహాఇచ్చుట పెరిగిపోవుటయుగాదు. సాంప్రదాయికమైన కన్ఫెషల్లు పునరుద్ధరింప బడుటయుకాదు. పరస్పరము ఒకరితోఒకరు తమ తప్పులు చెప్పుకొనుటకు, ధైర్యము చెప్పుకొనుటకు సన్నిహితమైన సభ్యత్వాలు ఏర్పరచుకొనుటకు చిన్న చిన్న గుంపులను ప్రోత్సాహపరచునట్టి వర్గోద్యమాల జనరంజకత్వము. విశేషమైనమార్పు. ఇటువంటి గుంపులు జేమ్సు "మతవిషయకంగా కరుగుతున్న సమయము" అని పిలిచిన కౌమార యౌవ్వన దశలలో సహజంగ కొట్టవచ్చినట్లు కనబడుతాయి. అయితే అవి అన్నివయసుల, తరగతుల, జాతుల వర్గాలకు వ్యాపించినవి. ఆక్సఫర్డ్ గ్రూప్ మూవ్మెంట్ లేదా ఫస్ట్ సెన్చ్వరీ ఫేలోషిప్, - ఇదే తర్వాతికాలంలో "మారల్ రి ఆర్మొమెంట్గ" పేరుపడినది - ప్రణాళిక ఈ వర్గాలలో మరింత ముఖ్యమైన వాటిలో ఒకటి. ముఖ్యంగా ఆకర్షణీయమైన ఆర్థిక విజయాలవల్లను ఫాషనబుల్ "హౌస్ పార్టీల" వల్లను ప్రతివాదికి తెలియవచ్చినదైనను నైతిక పునర్నిర్మాణమును గురించిన మన కథనమునకు సంబంధిస్తున్నది. ఎందుకనగా ఎవాంజిలికల్ ఆర్తొడాక్స్ లక్షణములను ఆధునిక మానసిక చికిత్సాపద్ధతులతో కలుపుటకు చతురముగా ప్రయత్నించటమువల్ల దాని స్థాపకుడైన ఫ్రాంక్ బుక్మన్ ఫిలడెల్ఫియా సివార్లలోని పునరావాస కృషినుండి హఠాత్తుగా ఆక్సుఫర్డు కేంబ్రిడ్జిలోని విద్యార్థులను కలుసుకొనవలసి వచ్చుట అను విషయము దీనిలో క్వాకెర్ సెమపద్ధతి ఆంగ్లికన్ అతినాజుకుతనము చిత్రముగా ప్రక్క ప్రక్కన ఉండుటను కొంతవరకే విడమరచి చూపుచున్నది. రెండు యుద్ధాలమధ్య దారితెన్నులేని తమ జీవితాన్ని గడుపజూచిన "త్రాగి తూలెడు కాక్ టైల్ పార్టీ తరము" వారికి ఆక్సుఫర్డు గ్రూప్ మూవ్మెంట్ ఇచ్చిన "ప్రశాంతకాలము" సభ్యత్వమువంటి దానిలో విరామము విడుదల కనబడినవి. దీనిలో మతవిషయికంగ చాలవరకు అక్షరాస్యులు కాక తక్కిన విషయాలలో చక్కగ

చదువుకొని చకచకలాడుచున్నవారు చిన్న చిన్న గుంపులుగ ఒకప్పుడు నిశ్శబ్దముగానూ మరొకప్పుడు పరస్పరము తాము చేసిన దోషములు చెప్పుకొనుటకును పర్యాయ పద్ధతిగా సమావేశ మయ్యేవారు.

ఏకాంతత సన్నిహితత్వము, బహిరంగంగా ఒప్పుకొనుట అను వీని కలయికవల్ల సభ్యులకు, క్లెర్జీగానీ అనలిస్ట్‌గానీ సహాయపడవక్కఱ లేకుండనే తమను తాము ఒకరినొకరు మనోవిశ్లేషణము చేసుకొనుటకు అల్లే ఆధ్యాత్మిక నగ్నతవల్లను దర్శన లేదా మార్గదర్శి భావమువల్లను కలిగెడు సంతోషములను అనుభవించుటకును అవకాశము గల్గినది. సిద్ధాంతమేమో దివ్యోత్సాహమునకు మార్గదర్శకత్వమునకు హోలీ స్పిరిట్‌ను [illegible]దర్శించుట అనెడి క్వేకర్ సిద్ధాంతము ఇంతేకాదు. దీనికి భగవంతుని పూర్తిగ "శరణు జొచ్చు"ట అను ఎవాంజిలికల్ ప్రాధాన్యముకూడ చేర్చవలెను. పద్ధతి ఏమనగా గుంపుగాచేరి వింగడించుకొనుటయు (చాల ఔత్సాహిక పద్ధతిలో) దోష భావములను, కోప తాపములను మరి ఆనందమునకు ఇతర అడ్డంకులను సబ్లిమేట్ చేయుటయు. ఈ సభ్యత్వాలు చాలమందిని మార్చివేసి చర్చి లోపలను, బయటను ఒక విధమైన "ఫామిలిజమ్" (చాలా శతాబ్దాలముందు పిలువబడుచుండినట్లుగ) సృష్టించినవి, సాంప్రదాయికమైన మతసర్వీసులు, ఇవ్వలేకపోయిన సంవాద, దర్శన అనుభవాలను ఇచ్చినవి. ఇటువంటి దైవభక్తి సంబంధమైన సభ్యత్వాలు క్రొత్తవేమీ కావు, కాని ఇవి ఒక ప్రత్యేకమైన నవీనపద్ధతిని సాధించుట గమనింపదగిన విషయం: స్త్రీ పురుష. జాతులూ రెండునూచేరిన చిన్నచిన్న ఆపామాషి వర్గాలు "సుదీర్ఘమైన" సాయంకాలపు సమావేశాలలో వీలైనంతవరకు ఇండ్లలో కలుసుకొంటూ, మత నైతిక సమస్యలను అరలేకుండా పంచుకొంటూ కష్టాలను చిత్తశుద్ధితో చెప్పుకుంటూ ఒకరి స్నేహాన్ని సహాయాన్ని ఒకరు విశ్వసిస్తూ, ఇటువంటి సభ్యత్వాన్ని విశ్వాసముగల వారిమట్టుకే పరిమితంచేస్తూ క్లరికల్ సలహాదారులను లేదా ఆర్గనైజర్లను పూర్తిగా బైట ఉంచిగాని లేకపోతే నేపథ్యంలో ఉంచిగాని నడుస్తూ వచ్చినవి.

ఇటువంటి వర్గ సమావేశాలను, "ప్రశమనసిద్ధాంతము" అనేవారు. క్లెర్జీవారికి ఇవి నచ్చేవికావు. ఈనాడు క్లెర్జీవారు ఇటువంటి ఉద్యమాలలో "లౌకిక నాయకత్వాన్ని" ప్రోత్సహిస్తున్నారు. యువక సభ్యత్వాలు బహుశః ఎక్కువగా కళాశాల విద్యార్థులు సాధనచేస్తున్నారు. కళాశాల

ఆవరణలలో వారు మతసంబంధమైన "అరలు" గా - ఒక్కొక్కప్పుడు కమ్యూనిస్టు అరలకు వారి ఉపాయాలకు తెలిసి విరుద్ధంగా - పనిచేస్తారు. క్రైస్తవ "సెల్ కల్చర్" మీద వాఙ్మయముకూడా ఉంది. ఫండ మెంటు లిస్టు ఇంటర్ వర్ సిటి సభ్యత్వము కూడ ఈ మార్గంలోనే పనిచేస్తుంది. 1929 లో బాప్టిస్టు విద్యార్థులు మాస్టర్స్ మైనారిటి ఉద్యమము ఏర్పాటు చేసినారు. కళాశాలలకు సంబంధించిన ఈ అనేక లక్షణాలను సనాతనత్వ సిద్ధాంత సంఘాలు రాజపెట్టి కాల్చుకవచ్చునంతగా విసరుతున్నప్పటికీ - యూత్ ఫర్ క్రైస్ట్ మూమెంట్ వంటి వానిని - వీటిని ప్రధానంగా సనాతనత్వ సిద్ధాంత స్వభావముకలవిగా వ్యాఖ్యానింపరాదు. ఇల్లినాయిస్‌లోని లీటస్ లోనివీటన్ కళాశాలలో ఈమధ్య విపరీతంగా ఏర్పడిన మాస్ కన్ ఫెషన్ కేవలము చిన్నవారిలో ఒప్పందము, చిత్తశుద్ధి, త్యాగము, విశ్వాసము, సభ్యత్వము అను వానినిగురించి చెప్పినప్పుడు సిద్ధంగాకలిగే ఉద్రేక "ఆదర్శవాదము"లకు ఒక అతిశయోక్తి అయిన ఉదాహరణ. ఈ వర్గాలు సాధరణరీగా సమావేశంలో ఒకభాగాన్ని ప్రార్థనకు శృతిగ్రంథాలు చదవటానికి వినియోగిస్తారు. కాని, ఉద్యమాల ప్రత్యేకమైన లక్షణము, విలువ అనేవి మత సంబంధమైన కారణానికి వ్యక్తిగతమైన భక్తియో లేదా ఒప్పందమో అనునవి, సభ్యత్వములో ఒకరియందు ఒకరికి వ్యక్తిగతమైన శ్రద్ధయో ఒప్పందమో అనుదానితో కలియుట, క్రైస్తవులలో ఇటువంటి వర్గాలను "మొదటి శతాబ్దపు క్రైస్తవము" అని వాఖ్యానం చదవటంకద్దు. సౌభ్రాత్ర స్నేహాలను అతిగా పవిత్రీకరించుటవల్ల కలిగే అపాయాలతో విద్యావేత్తలు చాలకాలము పోరాడినారు. మతసంబంధమైన సౌభ్రాత్రాలు, (వీనిలో కొన్ని గ్రీకు అక్షరాలతో పేరు పెట్టుకొన్నవి.) సభ్యత్వాలు కూడా ప్రత్యేకమైన తెగలవారీ ముఠాలను తయారుచేసే అపాయముంది కాని అటువంటి అపాయాలు తరుచుగా యువకులు ప్రామాణికంగా విశ్వజనీనమై మనుష్య ధర్మంకలదై శాంతియుతమైన ఏదో ఒక ఉమాద్యమానికి తమ్ముతాము త్యాగం చేసుకొనే - తరుచు అయ్యో అనిపించే ఆసక్తులకంటె అంత కొట్టవచ్చినట్లు కనుపింపవు. ప్రొటెస్టెంటు విద్యార్థులలోని ఇటువంటి మత విషయకమైన భక్తిని ఉపయోగకరమైన మార్గాలలోనికి మళ్ళించుకొనుటకు చేసిన ప్రయత్నం నేషనల్ ఏజెన్సీల ఏర్పాటుకు కారణమైనది. నేషనల్ ఇంటర్ కొలిజియేట్

క్రిష్టియన్ కౌన్సిల్ (1934), యునైటెడ్ స్టూడెంట్ క్రిష్టియన్ కౌన్సిల్ (1944), నేషనల్ కమిషన్ ఆన్ చర్చి స్టూడెంట్ వర్క్ (1948) వంటివి ఈ ఏజెన్సీలు. ఇటువంటి సభ్యత్వం సాంఘికంగా అందరికి నచ్చుతుంది. అనేక లౌకికమైన వ్యక్తీకరణలనుకూడ పొందుతుంది. మతసంబంధమైన కమ్యూనియన్‌కు లౌకికమైన కవల్యానియన్‌కు సరిహద్దురేఖమీద నున్న మొన్న మొన్నటి సభ్యత్వాలతో ఆల్కహాలిక్సు, అనానిమస్ ఒకటి.

వర్గోద్యమాలకు సన్నిహితంగా సంబంధించి మత ఏకాంత స్థానాలు ఉన్నవి. ఇవి, సంఖ్యలోనూ జనరంజకత్వంలోనూ శీఘ్రంగా పెరిగిపోతున్నవి. వీటికి మతోద్యోగుల నాయకత్వం సాధారణంగా ఎక్కువ, ఎక్లిసియాస్టికల్, లక్ష్యాలుకూడ ఎక్కువ. కాథలిక్ "తృతీయ [illegible]ణి" సన్యాసిమార్గ లక్షణాలను ఎవాంజలికల్ కాంపు సమావేశాలయు, వై. ఎమ్. సి. ఏ మరియు వై. డబ్ల్యు. సి. ఏ. కాంపులయు లక్షణాలతో కలుపుతారు వీరు, చాల భాగము ఎండాకాలపు శలవులలో, యాత్రా స్థలాలలోనో ఎడంగానున్న ఇండ్లలో అధవా చిన్న చిన్న ఆవరణలలో జరుగుతాయి ఇవి కొన్ని వారాంత దినాల్లో జరిగేవి. మరికొన్ని వారము దినాల్లో అంతకంటె ఎక్కువో జరుగును. కాథలిక్‌లలో లౌకికులకు స్వల్ప కాలపు ఏకాంతవాసాలు సాంప్రదాయికంగా వస్తున్నవే. కాని అమెరికాలో వీటి జనరంజకత్వం ఈ మధ్య చాలా ఎక్కువైంది. పునరుద్ధరణ వాద పతనముతో ఉదారవాది ఫోటోకాప్‌వలె కానున్న కొన్ని పెద్ద ఎవాంజలికల్ కాంప్ సమావేశాలు క్రమంగా ఈ ఏకాంతస్థానం పద్ధతి మీద పునర్ వ్యవస్థీకరింపబడినవి, చాలా సంఘాలు పై దేశాలనుండి తెచ్చుకొనబడినవి. ఆర్థికమాంద్యకాలంలో థర్డ్ ఆర్డర్ ఫ్రాన్సిస్‌కన్‌లలో అతివాద శాఖగా అమెరికాలో ఏర్పడిన కాథలిక్ వర్కర్ మూవ్‌మెంట్ ఫ్రెంచ్ జోసిస్ట్ మువ్‌మెంట్ చేత ఉత్తేజితమైనది. ఉద్యమమంతా సభ్యత్వాన్ని సాధనచేయుటకే వినియోగించే క్వేకర్లకు పెన్సిల్‌వేనియా రాష్ట్రంలో పెండిల్ హిల్ అనుచోట వయోజన మతవిద్యా కేంద్రము ఉంది. వారు చాల కృషి శిబిరాలనుకూడ ఏర్పాటుచేసినారు. మత కృషి శిబిరాలసంస్థ క్వేకర్ అవధులనుదాటి చాలాదూరము వ్యాపించినది, దాని నాయకులలో ఒకరైన అలెగ్జాండర్ మిల్లర్ ఇచ్చిన వివరణనుండి అనువదిస్తున్నాను:

ప్రక్కప్రక్కనే కలిసి పనిచేయడంవల్ల జనులతో కలసినట్లుగా వుండటం, వారిని అర్థము చేసుకోవటం అనే వానికి ప్రాతిపదిక ఏర్పడుతుందన్న మొదటిభావం "పరిశ్రమలో విద్యార్థి" క్యాంపులలో నిలిచివుంది. పనిచేసి నందుకు డబ్బురాక వలంటీర్లు చిన్నవారిని పరిశ్రమల్లో ప్రవేశపెట్టి వారపు జీతాలు యిప్పించి ఖర్చులు పూడ్చుకొనేచోట ఈ మొదటి ప్రాతిపదికనుండి తొలగుతున్నారు ... విద్యార్థులందరూ పూజ, చదువు, సామాన్యమైన ఇంటిపని అనే సాధారణ జీవితాన్ని జీవిస్తారు. ఈ కేంద్రం నుండి మొదటి పని నెదుర్కోడానికి అటు తరువాత ఫాక్టరీల్లో మిల్లుల్లో తమ రోజువారీ పనిచేయటానికి వెడుతారు. ఈ విద్యార్థులు చాలవరకు పై సంవత్సరపు కళాశాల విద్యకు ఎక్కడో ఒకచోట దేహశ్రమో, గుమస్తాగిరియో చేసి డబ్బు సంపాదించుకొన బోయేవారు ... వారు ఒప్పందానికి లోసిన క్రైస్తవ వర్గ జీవితంలో పాలు పంచుకొంటున్నారు...

ఈ రకమైన పరిసరాలలో నిత్యపూజను పాటించుటవల్ల, దైవవాక్కు లోను, సంస్కారాలలోను క్రొత్త అక్కఅలను చూపించే చోట్లను చూడ డమేగాక లౌకిక పారిశ్రామిక జీవితాన్ని దివ్య, మానవ, సాంఘిక అర్థాలు యిముడునట్టి ఒక దృక్పథంలో పెడతాయి ... ప్రతి క్యాంపు లోను ఒక భాగంగావుండే సక్రమమైన చదువుకు - మత విశ్వాసాన్ని పరిశ్రమ సంఘములలోని యదార్థవిషయాలను పరిశీలించడమునకు - సమకాలీన జీవితాన్ని సజీవంగా ఎదుర్కొనుటవల్ల కలిగే ఒక ఊర్జస్వితత వున్నది ... భగవంతునితోను, పన్నివేశంతోను మూడు రకాలుగా పని చేసే ఈ రకమైన వర్గము క్యాంపులోని పరిశుద్ధమైన నిత్యజీవితాన్ని నిర్వ హించుటలో ఒకరిమీద ఒకరు ఆధారపడుట కల సమాజ జీవనంలోని ఒక కలిసికట్టుతనాన్ని కనుగొంటుంది.

స్కాటిష్ అయోనా కమ్యూనిటి చేత ఉత్తేజితులైన అమెరికన్ ప్రిస్బి టీరియన్లు యువకులైన క్లెర్జీవాని లౌకిక వర్గాలకు (కుటుంబాలకు) పెన్సిల్వేనియా రాష్ట్రంలోని కిర్క్‌రిడ్జి వద్ద ఏకాంతావాస శ్రేణులను 1944 లో ఆరంభించారు. ఇది జనరంజకమైన ఇంటర్డినామినేషనల్ ఎకాంతావాస కేంద్రంగా అనతికాలంలో మారిపోయింది. ఎపిస్కోపల్ ఎకాంతవాస కేంద్రాలు చాలవరకు కౌలీఫాదర్స్, ఆర్డర్ ఆఫ్ ది హోలీ క్రాస్, సిస్టర్స్ ఆఫ్ సెయింట్ మార్గరెట్, తదితరములవంటి ఈ మధ్య

పెరిగిన సన్యాసి జనసమాజాల (వీనిలో చాల వానికి ఆంగ్లికన్ పుట్టుక) సంబంధంవుంది. సాంఘికంగా బహుశః మేధావిషయికంగా కూడా ప్రత్యేకంగా కనపడేది ట్రబీకో ఆధ్యాత్మిక జీవనకేంద్రం. ఇది ఆల్డస్ హాక్సలీ, జరాల్డ్ హార్డ్ తదితర సాహిత్యకులు ప్రాచ్యఖండ గూఢమతాలను అనుసరింపగా వారి నాయకత్వంక్రింద దక్షిణ కాలిఫోర్నియాలో వృద్ధి అయింది.

చాలవరకు ఒక ఋతువులో వుండేవి, సర్వ్వవధికంగా నడిచేవి అయిన ఈ రకరకాల రూపాలుగల మత ఏకాంతవాసాలు బౌద్ధులకు సాధారణంగా మఠాలలో వుండే ఏకాంతవాస స్థానాలవలె అన్నీ ఒకే ఉద్దేశాలను పంచుకొనేవికావు. వీటిని గురించి సాధారణీకరించి మాట్లాడటం తప్పు దారి పట్టించడమే అవుతుంది. చాల తేలికైన దృష్టితో చూస్తే ఇది పవిత్రీకరించబడిన వనభోజనాలలాంటివి. జేమ్సు "నైతికమైన సెలవు రోజులు తీసుకొనుట" గా అభివర్ణించిన పలాయన క్రియలు కావచ్చును. దానికి విరుద్ధంగా కూడా తీవ్రమైన కార్యకలాపాలకు సాంఘికసేవకు ఉత్తేజాన్ని కల్గించే కేంద్రాలు కావచ్చును. రూపొందుతున్న చిన్న మత జనసమాజాలు కావచ్చును. ఏమైనా జేమ్సు "ఆరుబయటి గూఢమతము" గా పిలిచినది విరామము, వినోదము; క్రొత్త వాతావరణము, భావ సంబంధముగా తన్నుతాను అంకితము చేసుకొనుట అను అక్కరలలో పాదుకొనివున్న అమెరికన్ సంస్థకావచ్చునని రుజువు చేస్తున్నట్లు కనబడును.

కిర్కరిజిలోని "ప్రొటెస్టంట్ల ఏకాంతస్థలాల" నుండి వచ్చిన ఈక్రింది ప్రకటనలు ఈ ఏకాంతవాస ప్రణాళికల ప్రయోజనములను ఏర్పడవచ్చును. ఇవి ఒక విధమైన ఏకాంతవాస సిద్ధాంతానికి రూపాలు. అయితే ఈ మత సంబంధమైన సమాజానుభవాలలో ఉండే వుద్దేశాలను, కలిగే తృప్తిని చూపేవికావు.

మొట్టమొదటి కిర్కరిడ్జి వుద్దేశము వ్యక్తులు భగవంతుని విషయంలో తాము ఎటుపోతున్నది ఏమిచేయవలసినది తెలుసుకొనునట్లు సహాయ పడుట. విసుగుపుట్టిన పాస్టర్, చకితుడైన డెకాన్, సైకియాట్రిస్ట్ సల హాకు వెళ్లిన ఉపాధ్యాయుడు, గుల్లతో బాధపడేవ్యాపారి, ఎందుకు చేయ వలెనో తెలియకపోతున్న సాంఘికచర్య ప్రోత్సాహికులు, ప్రార్థనలోకూడ మందకొడిగా వుండే గృహిణి, తన మతవిశ్వాసంలో మెత్తబడిన సెమి

ఏకాంతవాస - సభ్యత్వాలకు భిన్నమైన చర్యా - సభ్యత్వాలు అనేకమున్నవి. వీటిభేదము పేరులోనే కాని నిజమైందికాదు. సాంఘిక చర్య వర్గాలవారి సిద్ధాంతాలు మరింత దూకుడుగా వుంటవి. మత "సంఘాల"ను మత "ఉద్యమాలు"గా మార్చడం వీటి లక్ష్యం. 1948 లో బోర్డు ఆఫ్ నేషనల్ మిషన్స్‌కు సంబంధించిన ప్రిస్బిటీరియన్ డిపార్టు మెంట్ ఆఫ్ ఎవాంజలిజంవారు ముఖ్యంగా చిన్నవారిని చర్చివైపు మళ్లించి సమీకరించుటకు ఉద్దేశింపబడిన "నవజీవనోద్యమం"ను ప్రారం భించినారు. నవజీవనవర్గాలు విధ్యుక్తంగా ఇట్లు ప్రమాణం చేస్తున్నవి; "ఓ ప్రభువా నేను ఇష్టంగా చిత్తశుద్ధితో నా హృదయాన్ని నీకి[illegible]స్తు న్నాను." చర్చి విస్తృతి పథకంగా యిది విజయవంతమనుట ఇష్టమే. కాని ఇది చర్చిల కృషిలో ఒక క్రొత్తమత జీవనాన్ని లేదా "ఉద్య మాన్ని" కలిగించి పునరుద్ధరణ ప్రయోజనానికికూడా ఉపకరిస్తున్నది. అసంఖ్యాకమైన ఇతర మతసంస్థలుకూడా ఇటువంటి సక్రమమైన ప్రయ త్నాలు చేస్తున్నవి.

మతాన్ని దూకుడు పరిస్థితిలో పెట్టవలెనను కోరిక ప్రాటస్టెంట్లలోను, కాథలిక్కులలోను, యూదులలోను మరి సామూహికంగా వీరందరిలోను కనబడుతున్నది. సమకాలీన సాంఘిక విలయపరిస్థితిలో ఒక నిర్మాణాత్మక శక్తిగా చేయదగిన రెండు ప్రధాన విధములైన మతానుభవాల తమ కంద రికి సామాన్యముగా ఉన్నవని వీరందరి అభిప్రాయము. భగవంతుని ఎదుర్కొనుట, ఖండితముగా ఒప్పందానికి లోనగుట. ఈ రెండు అనుభ వాలు మతసంబంధమైన దైవభక్తి అను ఏకకార్యములోని భాగాలే కావచ్చు. అయితే వాటికి భిన్నమైన అర్థాలు వున్నవి. భగవంతుని ఎదు ర్కొనుట అనేది దర్శనమును గ్రహించుటకు సూచన ఇప్పుడు వత్తి చెప్పబడుచున్న దర్శనము జేమ్సు సాంప్రదాయిక గూఢ మత ప్రాతి పదికమీద ఊహించుకొన్న "జ్ఞాన ప్రకాశము" వంటిదికాదు: అనుకో కుండా వచ్చెడి, కాదనరాని నిర్ణయం. మనుష్యుడు భగవంతుని "కలుసు కొన్న"ప్పుడు ("క్రీస్తుతో సాహచర్యము" అను ప్రత్యేక క్రైస్తవాను భవముకంటే యిది భిన్నము) వాడు వున్నట్లుండి "నిలిచిపోతున్నాడు." "మరొకటి" ఏదో మానవాతీతమైన యాదార్థ్యము (స్పష్టముగా అర్థము కానిది) వచ్చిపడి అతనికి మనుష్య పరిమితులు తెల్పి, వాని లక్ష్యాలను

నేరియన్, ఉద్దేశాన్ని అర్థాన్ని గ్రహింపలేక తడుములాడే కళాశాల విద్యార్థి - వీరందరి కష్టము - వీరు చేస్తున్న పనివల్ల భగవత్సంకల్పము తీరుటలేదు అను యథార్థ విషయమునుండి పుట్టినదని కిర్క్రిడ్జి భావిస్తున్నది. నిజానికి కిర్క్రిడ్జి ప్రాచీన అధునాతన ప్రవక్తలు అనేకులవలె వివేకులైనవారు నిత్యజీవితంనుండి - గణగణలాడే టెలిఫోనులు, కేకలు పెట్టె పతాకశీర్షికలు, తల దిమ్మెక్కించే టెలివిషన్లనుండి - వెనుకకు మరలకపోతే వారు తమ ఉద్దేశాన్ని మరల పట్టుకోని తాము ఎందుకు పుట్టినారో మెల్లగా తెలుసుకొనుట సాధంకాదు, వైయక్తిక జీవితాలలో ఒక దృక్ప[illegible]న్ని, దైవవిధిని మరల తెచ్చుకొనుట ఒక ముఖ్యమైన క్రైస్తవ కార్యము...

కిర్క్రిడ్జి తన ప్రయోజనాల సాధించుటకొరకు – వివిధములైన క్రైస్తవ సాంప్రదాయములనుండి ఎరువు తెచ్చుకొని - ఒక నిర్దిష్టమైన కృషి ఏకాంతవాస క్రమమును ఏర్పాటుచేసింది. దాని నిత్యక్రమంలో ఈ క్రిందివానిలో చాలాభాగము వుంటాయి. ఒక గుంపు (ఎప్పుడూ 20 కి మించదు) 6 గంటలకు లేచి వారిలో ఒకడు ఉదయప్రార్థనగా చదువుతూ పాడుతూ ఉండగా తక్కినవారు మౌనంగా తొలిభోజనం చేస్తారు. తరువాత 3,4 గంటలపాటు అందరూ కలిసి దేహకష్టం చేస్తారు. (గచ్చు కలపడం, తోటపని, చెట్లు కొట్టుట, కుట్టుపని, ఇటుకలు పేర్చడం,) మధ్యాహ్న భోజనానికి ముందు 1½ గం॥ల కాలం "ఏదైనా చర్చిస్తారు. సాయంకాలము ఐదింటికి మరొకచర్చ వచ్చేవరకు మధ్యాహ్నమంతా తీరిక సమయం. ఒకరు చదువుతుండగా మౌనంగా రాత్రి భోజనముచేసి అస్తమాన సంకీర్తనము చేస్తారు, లేదా 9 గం॥కు కంప్లైన్ వచ్చేవరకు మరల చర్చ వుంటుంది. తరువాత రాత్రంతా గుంపుగానే విశ్రమిస్తారు. మరి ఉదయప్రార్థన. సామాన్యమైన ఈ పద్ధతిలోని ఆ యా మార్పులు వర్గశ్రమాన్ని, దేహకష్టాన్ని, పరస్పర స్నేహపూర్వక సంవాదాన్ని, చర్చను ప్రధానంగా చేస్తుంటవి. రోజూచేసే చర్చలలో సాధారణంగా ఒక్కటైనా శ్రుతిగంధ ప్రాదిపదిక కలదిగా వుంటుంది. పొడవుపాటి తుడిచిన బల్ల చుట్టూ నిరాడంబరంగా ఉషఃకాలంలో సాక్రమెంట్ జరుపడం చాల కృషి - ఏకాంతస్థానాలలో ఒక భాగం. 33

చెడగొట్టి, వాని పద్ధతులను ఖండిస్తుంది: మనుష్యుడు ఇట్లు భగవంతుని ఎదుట పడినప్పుడు తన ఆత్మకు తాను "కెపాను" కాననియు, కొంచె మించు మించు గ్రుడ్డిగా తన లక్ష్యాలవైపు దారి తడువుకుంటూ పోతున్న జీవులలో తాను ఒకడననియు తెలిసికొంటాడు. మానవులైన సలహాదారుల నిష్ప్రయోజకతను, భగవంతుని సన్నిధిలో మానవజాతి పరిస్థితిని అభివర్ణించే ప్రాచీనమైన ఉదాహరణగా "జాబ్" కథను పదేపదే చెబుతుంటారు. ఇటువంటి పరిస్థితులలో "భగవంతుని నిశ్చలమైన సన్నని గొంతు"ను నమ్మక దేవుని పేరుమీదుగా గర్జించే కార్ల్ బార్త్ వంటి సలహాదారు[illegible] అనేకులు వున్నారు. అయితే మనుష్యుడు భగవంతునితో ముఖాముఖ[illegible] వున్న సన్నివేశానికి సంబంధించిన ఆగమశాస్త్ర పాఠరూపాలను, వైపరీత్యాలను లెక్క చేయకపోయినా ఈ విధంగా చెప్పబడిన అనుభవము అన్నిమతాల లౌకికులలోను సామాన్యంగావుంది ఈ "దైవము నెదుర్కొనుట"కు చెందిన కట్టుకథలను ఆత్మ విశ్వాసాన్ని, ధైర్యమును ఛిన్నాభిన్నము చేసెడి సంకట పరిస్థితులలో అర్థవంతముగా, ముఖ్యముగా చేస్తున్నది. ఇటువంటి దర్శనమును జేమ్సు వింగడించి చూచిన రకరకాల చైతన్యములలో ఏదో ఒకటిగా వర్ణించుటకష్టము. అది అచ్చపుభావమూ కాదు. కేవలము జ్ఞానప్రకాశముకాదు. తర్కితమైన నిర్ణయముకాదు. "అస్తిత్వవాద సంబంధమైన వేదన" కాదు. భగవంతునితో తత్క్షణ సంయోగమూకాదు. భగవత్సంకల్పమును గూర్చిన జ్ఞానముకూడాకాదు. జీన్ హేన్స్ హోమ్స్ అన్నట్లు యిది "తర్కము చాలదు" అని మాత్రమే రుజువు చేయుచున్నది. ఆగమ శాస్త్రజ్ఞులు చెప్పునట్లు భగవంతుడు క్రొత్త వివరాలు ఏమీ తెచ్చిపెట్టకుండానే తన ఉనికిని తెలియజేసినాడు.

అయితే భగవంతునితో సంప్రదించుట సాధ్యమా? అవును - అయితే సూటి సమాధానాలురావు. వాడు బైబుల్‌ను ఆశ్రయిస్తాడు. అయితే దాన్ని వ్యాఖ్యానించాలి. జీసస్‌ను ఆశ్రయిస్తాడు. అయితే అతడు ఏదో నీతికథను జీవితంలో ఆచరిస్తున్నట్లు కనపడుతాడు. దాన్ని అర్థం చేసుకోవాలి. అడ్డమువచ్చిన సన్నివేశానికి అనువర్తించే నియమాన్ని చెప్పకుండా ఏదో ఒక సూత్రాన్ని చెప్పినట్లుగా వుంటుంది. వాడు దాన్ని గురించి మననం చేయాలి. దానితో తంటాలు పడాలి. ధ్యానాలు పోవాలి. చదువు

కొని విచారించుకొని, ఆలోచించి పెరగాలి. ద్రష్టలతో ప్రవక్తలతో మత విశ్వాసముకల కవులతో సాహచర్యము నెరిపినప్పుడే అత్యున్నతమైన ఆ రహస్యాన్ని కనుగొంటాడు. భగవంతుని సభాంతరాళంలోకి ప్రవేశిస్తాడు. కుస్తీ పడుతూ, వెదుకుతూ. ధ్యానాలుపోతూవుండే తత్వానికే సమాధానం వస్తుంది. వానికే వెలుగు విరుస్తుంది. వానిలో సత్యము మరల వసించి మనుష్యులమీద తన అధికారాన్ని చలాయిస్తుంది. భగవంతుని సులభంగా గెల్చుకోలేము. ఒక నిశ్చితమైన యాంత్రికమై చలనం వల్లనో పద్ధతితోనో పిలవడానికి అతడు దీపముతీసుకొన్న అల్లావుద్దీన్ కాదు. అతడు కవికి వచ్చునటువంటి చంధోగతి వంటివాడు: గాయకుని ఆత్మలో [illegible]ట్టెడి లయవంటివాడు. మాతృమూర్తి కండ్లలో మెరసెడి ప్రేమవం[illegible]వాడు. కాల్వరిమీది ఒకానొకని శిలువలోని బలమువంటివాడు. 33

ఇదంతా ఏదో ఆగమశాస్త్రంతో వెడిపించినట్లుగా వుంటుంది. చీకట్లు క్రమ్మించుటవంటిది. కాని ఇది యథార్థమైన సర్వ సామాన్యమైన అనుభవాన్ని చెప్పడానికి చిత్తశుద్ధితోచేసిన ప్రయత్నం. ఇటువంటి దర్శనమును కలిగించుకొనుట ఉత్తేజము తెచ్చుకొనుటకంటే భిన్నమైన విషయం. సాధారణంగా ఇది గుండెలు దిగజారజేసే, అవసర్జితముచేసే, బెదరగొట్టే అనుభవము.

ఈనాటి రెండవ సామాన్యానుభవము "ఒప్పందానికి లోబడుట"కు సంబంధించినది. మనుష్యులు ఎన్నిటికో లోబడుతారు. అయితే భగవంతుని విషయంలో ఒక ఒప్పందానికి లోబడుటము తాను చేసుకొనే విషయం కాదు. మనుష్యునికి అది "వస్తుంది". తిరుగుబాటు చేయకపోతే వాడు దాన్ని అంగీకరిస్తాడు. అయితే తాను తెలిసి చేసుకొన్నదాని వంటిదిగా కాదు. ఐచ్ఛికంగా సేవచేస్తున్న పరిస్థితిలో పడుతాడు. మత విషయకమైన దైవభక్తినిగురించి పరిశీలించేవారు 50 ఏండ్లనాడు వ్యాప్తిలో వుండిన "మార్పిడి" కథనాలు - మనుష్యుడు భగవంతునితో ఏదో ఒక ఒప్పందానికి కాంట్రాక్టు పద్ధతిలో స్పష్టమైన నియమాలతో ఏర్పాటు చేసుకుంటున్నట్లు చూపించిన ఈ కథనాలు - ఒక మొదటి మొత్తం ఒప్పందంలో మనము సాంఘికంగా చేయవలసిన కొన్ని కార్యాలు ఉన్నవని చెప్పజూచిన సోషల్ కాంట్రాక్ట్ కట్టుకథవలెనే యివి కూడా నిజానికి చాలా దూరమైనవి. భగవంతుని ఎదుర్కొనుట, భగవంతునితో ఒప్పందం అను ఈ రెండు

కూడా ఒక అనంతశక్తితో సంబంధాలు. యథార్థవిషయాలు అన్నీ తెలిసినప్పుడుకూడా ఈ సంబంధాలు యిటువంటివని నిర్వచించి చెప్పడం కష్టము. అందుచేత జేమ్సు గవేషణను కొనసాగించి ఆధునిక మానవుని మత చైతన్యమును నిర్వచింపచూచుట అర్థములేనిపని. స్వానుభవ దృష్టితో మతాన్ని చూచేవాడు చేయగల్గినదల్లా మానవుని మత సంబంధమైన మనుగడను నిర్వచింపజూచుట. అయితే "మతసంబంధమైన" "మనుగడ" అను ఈ రెండు మాటలతో స్వానుభవ సిద్ధాంతవాదులకు వున్న కష్టం చూస్తే మతానుభవ విజ్ఞానానికి శాస్త్రరూపము వస్తుందన్న ఆశ అంత[illegible]దు.

ఏమైనను ఈ నాటి మతనాయకుల ప్రధాన వ్యగ్రత ఇటువంటి విజ్ఞాన శాస్త్రమునకు సంబంధించినదికాదు, మతవిషయకమైన చర్యను తెచ్చిపెట్టుటకు సంబంధించినవి. వారి సాంఘికచర్యా పథకాలు కేవలం రెండో రకపు మతము, మొదటిరకపు పాఠిక రాజకీయాలు మాత్రమేకావు. తరచుగా అట్లు కూడ ఉండవచ్చును. మతాన్ని క్రియాశక్తులమధ్య ఒక క్రియా శక్తిగచేసి మతానుభవానికి ఒక చురుకైన రూపం ఏర్పరచుట కొరకు వచ్చినవి ఈ పథకాలు. మన దివ్యజ్ఞాన ధర్మోపన్యాసములో ఉన్నట్లుగా ఈ శక్తిని ఆరలేకుండా "రహస్యశక్తి" అనవచ్చునా లేక తక్కిన శక్తులవలె దీనినికూడ దీని ఫలరూపమున వివరించవచ్చునా అన్నది ఒక చిన్న సాంకేతిక విషయము. అవి క్రైస్తవ చర్యకు సంబంధించిన పరిషత్తులుగానీ కాథలిక్కు యువజనోద్యమాలుగానీ జీయానిష్టు క్లబ్బులు కాని పునర్నిర్మాణోద్యమాలుకాని సమన్వయ సభ్యత్వాలుకాని లేదా క్రైస్తవ సామ్యవాదుల సభ్యత్వాలుకాని, ఏవైనను ఈ మతసంబంధమైన ఏజెన్సీల లక్ష్యము సిద్ధముగ చూడదగిన ఒక ప్రత్యేక రూపమైన, సాంఘికమైన నడవడిక. అందుచేత సనాతనత్వ సిద్ధాంతవాదులు, లౌకికతా సిద్ధాంతవాదులు ఇటువంటి "ఉద్యమాలు" మతశక్తులను లౌకిక పథకాలకు వాడుకొనుచున్నవని నిందించినప్పుడు ఈ రకమైన మతానుభవములో మూలభూతమైన విషయము ఏమిటన్నది అర్థము చేసికొనుటలేదు. ఈ ఆధునికమైన ఆదర్శనములు ఒప్పందములో చిక్కుకోవడాలు విధిగా ప్రధానముగా మనుష్యులను చర్యలకు పురికొల్పే మత విశ్వాసానుభవములు. మత సంబంధమైన జ్ఞానమునుగురించి ఎంతగా మనస్తత్వశాస్త్ర

పరిభాషలో మాట్లాడినను ఈ ఉద్యమాలు క్రియలో అర్థమైనట్లుగా మాటలలో అర్థముగావు. మరొక విధముగా చెప్పినచో సంవాదక్రియ సభ్యత్వ చర్యలనుండి వేరుపడునదికాదు. దీనికి నికరమైన కారణ మేమంటే ఇటువంటి సంవాదమును ఇంక ఏ విధముగాను నిర్వచించి చెప్పుటకు వీలులేదు. ఇది భావముకాదు. రహస్యానుభవము కాదు, ఒక ప్రస్థానముకాదు. ఈ కారణముచేత కూడ ఒక ప్రత్యేకపద్ధతి సంస్కృతిగ క్రియాచరణమగుచున్న మతమును చివరకు జేమ్సు మతానుభవాలమ ఫలములనుబట్టి వింగడించిన పద్ధతిలోనే మంచిచెడ్డల నిర్ణయము చేయవలసి యున్నది. జేమ్సు ఋషిత్వమును అభివర్ణింప ప్రయత్నించినట్లు [illegible] దీనిని కూడ భక్తి, శుచిత్వము, మార్దవము, మునివృత్తి, దోషాం[illegible]రము, ప్రార్థన అను వాని పరముగ అభివర్ణింపవచ్చును. అయితే ఈ మాటలు "ఋషిత్వము" అను మాటకంటె నిర్దిష్టమైన అర్థాన్ని చెప్పే మాటలు కావు. ఈ గ్రంథములో చాల భాగము అమెరికన్ సంస్కృతి మారిన కొలది ఈ మాటల అర్థాలు ఎట్లు మారుచు వచ్చినవో వివరించుటకే వినియోగింపబడినది.

ఇంక గూఢానుభవము మాటకు వచ్చినచో దానికథ ఏమైనదో చెప్పుట కష్టము. ఎందుకనగా "గూఢానుభవము" అను ఈమాట అన్నిటికంటె ఎక్కువగ దుర్వినియోగము పాలయినది. జేమ్సే దానిని నికరమైన అర్థములో వాడలేదు. ఇప్పుడు దానిని మరింత లాక్షణికమైన అర్థములో వాడుతున్నారు. రహస్యజ్ఞాన స్వరూపభావనను గురించి హాకింగ్, లిమన్, మాకింటోర్ష్ వంటి తాత్వికులైన అగమజ్ఞులు ఎడతెగకుండ చర్చించినారు. అయితే అమెరికాలో ఆచరణీయ గూఢమతము ఈ శతాబ్దములో మత సంబంధమైన నీతికి, మత చర్యకు అవసరమైన స్థానములో ఉంచబడినది. "స్ఫురణ", "భగవంతునితో సంయోగభావము" వంటి అనుభవాలమీద ఆసక్తి తగ్గిపోయినదని దీని భావము. ప్రొఫెసర్. లిమెన్‌వలె మతసంస్థను సమర్థించుచూ వచ్చినవారుకూడ ఈ పదానికి బెర్గ్‌సన్ ఇచ్చినట్టి ఆచరణ సంబంధమైన మెలికను తెచ్చిపెట్టినారు. దీనితో ఈ మాట క్రియారహిత మైన ధ్యానముతోకంటే నైతికమైన ఆకాంక్షకే ఎక్కువ సంబంధపడినది: తగిన చోట ప్రైవేటుగా అచ్చమైన గూఢ మతానుభవము చాల ఉండ

వచ్చును. కాని ఈ మధ్య వచ్చిన ఈ గూఢ మత వాఙ్మయమునుబట్టి చూచినచో అది "వాగ్గోచరత"ను కల్గింపలేదు. కనీసము ఇప్పటి మూడు రకములైన గూఢ మత సంబంధి రచనలనైనను పేర్కొనవలెను: క్వేకర్ల శ్రమ సిద్ధాంతమును ప్రాచీన గూఢ మత మార్గములతో కలిపిన రూఫస్ ఎమ్. జోన్సుగారి ధర్మోపన్యాసములు, తదితర రచనలు; ట్రాపిస్టు సన్యాసి అయిన థామస్ మెర్టన్ గారి ధ్యానములు. ఈయన వ్రాసిన సత్యావరోహణము అను గ్రంథము మధ్యయుగపు ఏకాంతికుల అడుగు జాడలలో నడచుటకు ప్రాథమికునికి ఉపకరించు రచన. అబ్రాహామ్ జే. హెషెల్ వ్రాసిన మానవుడు ఏకాకి కాదు అను సుందర గ్రంథ[illegible] వైయక్తిక సిద్ధాంతమును, విశ్వజనీనతా వాదమును, ఉదాత్తమైన గూఢ మతానుభవములోని "అనుత్తమ భావస్మృతిని" చాసిడిస్ పద్ధతిలో చెప్పునది. డాక్టర్. హెషెల్ చెప్పెడి ఒకానొక పూర్వకథ ఇప్పటి గూఢ మతంలో బలవత్తరముగా ఉన్న వైఖరిని క్లుప్తముగ తెల్పుచున్నది. చక్కగ చదువుకొని క్రొత్తగా దరిద్రుడైన ఒక యూధుని అతడున్న ప్రార్థన సదస్సువారు తమ బహిరంగ ప్రార్థనలో ముందుండవలసినదని కోరినారు. అయితే అతడు భయపడిపోయి తన రాబీ దగ్గరకు వెళ్ళి తన భయాలను చెప్పుకొన్నాడు. రాబీ సమాధానము చెప్పినాడు గదా "భయపడుతూనే ఉండు ప్రార్థన చెయ్."

దైవభక్తి, ఆధ్యాత్మికత గల మనుష్యుల, వర్గాలలో భయమును గురించి భయపడక ఉండు ఈ సాంప్రదాయిక లక్షణము మన లౌకిక ధీర సంస్థలు అనేకము మారిపోయినట్లుగానే మతము 20వ శతాబ్ది అమెరికన్ సంస్కృతికి చేసిన ఒక గొప్ప దోహదముగా మారవచ్చును. ప్రభువునకు భయపడుచు ప్రార్థించుట అనుదానికి ఊర్జస్వితను, ప్రాముఖ్యమును ఇచ్చుచును పోవచ్చును.

## మత సంబంధమైన అనుభవము, మత విషయకమైన మనుగడ

ఇంతవరకు చేసిన పరిశీలనలో విలియం జేమ్సు నాటినుండి అమెరికన్ రంగంలో వచ్చిన రకరకాల మతానుభవాలలో వైవిధ్యమునకే ప్రాధాన్య

మిచ్చినాము. 19వ శతాబ్దములో అమెరికన్ పరిసరములలో కొట్టవచ్చి నట్లు కన్పించిన "అవసరమైన మార్పులు" ఇప్పటికి అనుకోని చోట్ల అనుకోని విధముగ దండిగ వస్తూనే ఉన్నవి. మతానుభవములో ఆత్మాశ్రేయత, వైయక్తికత, విలియం జేమ్సు దానిని తన సైకలాజికల్ క్లినిక్ లోనికి తీసుకున్నప్పటినుండి తగ్గిపోవుచు వచ్చినప్పటికినీ ఈ నాడు అది అప్పటి కంటె మరింత తక్కువ "రెండోరకము"గానే ఉంటున్నవి. ఇక్కడ ప్రపంచములోని మతాభివృద్ధి భూములలో ఒకటి ఏర్పడి యున్నది. క్రొత్తరకాల వైవిద్యము నిరంతరము తరగతుల వారీగ విభజించుటను, నిర్వచించుటను, ధిక్కరించుచునే ఉన్నది.

మరోకవైపు మన జనసంఖ్యలో సగానికిపైగా ఆవరించుకొ[illegible] పెద్ద తెగలవారి చర్చిలో ఎంతగానో స్థిరపడి మత చరిత్రలో "జల్లెడ పట్టే కాలం"లో జరిగినట్లు తీవ్రంగ వాటి మేథానైతిక బాలలను పరీక్షించిన ఎన్నో తుపానులను ఎదుర్కొని చచ్చునన్నవి చావక, బ్రతికి నిలిచినవి. ఈ శతాబ్దములోని విప్లవాలు మన అన్ని మత సస్థలమీదను, నమ్మకాల మీదను, తమ ముద్రలు వేసినవి. అయితే మొత్తంమీద ఈ విప్లవాత్మక పునర్నిర్మాణాలు బూలివర్సుమెంట్ కంటె రినూవెల్ మెంట్స్ నే తయారు చేసినవి. ఈ పునర్నవీకరణలు "అగ్ని పరిరుద్ధము" అగుటయా అన్నది ఈ పుస్తకమువంటి వింగడింపులో కనబడునది కాదు. ఇది ముఖ్యంగా కథనాత్మకము. మంచి చెడ్డల నిర్ణయముకాదు. ఒక నివేదిక. ధర్మోపన్యాసము కాదు.

ఏమైనను శ్రద్ధగల పాఠకులు ఈ చివరి మూడు ప్రకరణములు చదువుచు మతములోని మూడు పార్శ్వాలు - ఆగమశాస్త్రము, అర్చన, అనుభవము - అనునవి యాభై ఏండ్లకు మునుపటికంటె స్ఫుటత తగినట్లు గమనించి ఉండవచ్చును. విలియం జేమ్సు, రూఫస్ జోన్సు, థియోడోర్ ముంజర్ ల దినాలలో ఒకదానికొకటి సంబంధము లేక పరస్పరము విమర్శించుకొనుచు ఉండిన మత సంబంధమైన మనస్తత్వ, రహస్యానుభవ, ఆగమశాస్త్ర మార్గాలు ఒక సాధారణమైన రాజీ పద్ధతికి లొంగి వచ్చినవి. మతమును ఇప్పుడు సమగ్రముగ చూచుట అంత కష్టముకాదు. ఎందుకనగా దాని సిద్ధాంతము ఆచరణ మరింత చక్కగ ఏకీకరింపబడినవి. మనము ఇప్పుడు మత విశ్వాసమునుండి మత చైతన్యమును విడిగ చూచి

భావింప నక్కరలేదు. ఈ రెంటిని మత సంస్థలనుండి విడిగ భావనచేయ నక్కరలేదు. మతాభినివేశముతో ఉండుట అనగా ఏమో ఈనాడు మరింత స్పష్టముగ తెలియుచున్నది. మన పరిశీలనకు అనుభూతికి కూడా అందుబాటులో ఉన్న ఈ మతజీవన విధానంలో మేధకు, విశ్వాసానికి వ్యక్తికి సంబంధించిన అంశాలు ఒండొంటిని అవగతమయ్యేటట్టు చేయడానికి ఉపకరిస్తున్నవి. కాని, అమెరికన్ మత జీవనంలో వివిధాంశాలకు నానాటికీ అధికమవుతున్న ఈ అనుకూల సంబంధం మతాన్ని లోనించి నిశితం[illegible]రిశీలించడానికి విలియం జేమ్స్ చేసిన ప్రయత్న ప్రయోజన సాఫల్యా[illegible]కి పురస్కారం.

20VA SATABDI AMERICALO MATHAM (Tel.) Rs.
[Religion in 20th Century America]

# 20 వ శతాబ్ది అమెరికాలో మతం

అమెరికా మత చరిత్రలూ, మత సంబంధమైన సాంఘిక మనస్తత్వ మానవజాతిపరిణామాధ్యాత్మిక శాస్త్రాలు పెక్కు ఉన్నవి. ఈ గ్రంథాన్ని ప్రామాణికమైన పరిశోధనలు, విజ్ఞానశాస్త్రాలూ ఆధారంగా వ్రాసినప్పటికీ, ఇ. వాటిలో ప్రత్యేకించి ఏకోవకూ చెందదు. ఇది ముఖ్యంగా ఒక స్మృతిచిహ్నం వంటిది. ఈశతాబ్ది ప్రారంభంలో మతం ఎలా ఉండేదో జ్ఞాపకం పెట్టుకొని, చరిత్రకారులవలె సాహిత్యావశేషాల, తదితరాధారాలదృష్ట్యా కాకుండా, ఆనాటి ప్రజలకు సర్వసామాన్యంగాను, నేటివారికి విపరీతంగాను కనిపించే సంఘటనలను, ఉద్దేశాలనూ, నాటి ప్రజలు ఊహించనట్టి నేటి ప్రజలకు సర్వసామాన్యమైనట్టి సంఘటనలు వివరంగా ఈ గ్రంథములో వివరింప బడ్డాయి.

పబ్లిషర్సు: అద్దేపల్లి అండ్ కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము